# బైబులుభాష్య సంపుటావళి

రెండవ సంపుటం

## బైబులు బోధనలు



# బైబులుభాష్య సంపుటావళి

రెండవ సంపుటం

# బైబులు బోధనలు

ఫాదర్ పి. జోజయ్య, S.J.
ఆంధ్ర లొయోలా కాలేజి
విజయవాడ - 520 008

# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | పాపం | 1 |
| 2. | రక్షణం | 27 |
| 3. | దైవ సాన్నిధ్యం | 55 |
| 4. | సోదరప్రేమ -1 | 74 |
| 5. | సోదర ప్రేమ - 2 | 99 |
| 6. | క్రైస్తవ నాయకత్వం | 116 |
| 7. | సాంఘిక న్యాయం | 137 |
| 8. | సదసదాత్మ విచారం | 161 |
| 9. | పిలుపు | 182 |
| 10. | కుటుంబ జీవితం | 205 |
| 11. | కీర్తనల వివరణం | 223 |

# మనవి మాట

బైబులు భాష్యం సంచికలను 1972లో ప్రారంభించాం. ఇప్పటికి 157 సంచికలు ముగిసాయి. వీటినే యిప్పుడు పది బైబులుభాష్యం సంపుటాలనుగా ముద్రించాం. ఈ సంచికల్లో ఓ 60 మాత్రం ఇదివరకే "బైబులు గ్రంథమాల" అనే పేరుతో పుస్తక రూపాన్ని సంతరించుకొని పలు ముద్రణలు పొందాయి.

ప్రస్తుతం ఈ 157 సంచికలను, వీటిల్లో వచ్చే అంశాలనుబట్టి, ఓ క్రమపద్ధతిలో అమర్చాం. ఈ సంపుటాల్లో వుంది ప్రధానంగా బైబులు వివరణలు, దైవశాస్త్ర విషయాలు, ప్రార్థనాంశాలు. మన క్రైస్తవ భక్తివిశ్వాసాలను బలపరచేది ముఖ్యంగా ఈ యంశాలే. ఎందరో వేదపండితుల భావాలు ఈ పుస్తకాల్లోకి వచ్చాయి. ఆ మహానుభావులందరికీ వందనాలు.

ఈ పుస్తకాలు మన క్రైస్తవమత సత్యాలను లోతుగా అర్థంచేసికోవడానికీ, ప్రార్థన జేసికోవడానికీ, ఇతరులకు బోధించడానికీ గూడ ఎంతో వుపయోగపడతాయి. కనుక మన గురువులు, మఠకన్యలు, ఉపదేశులు, గృహస్థులు మొదలైనవాళ్లు ఎవరైనాసరే వీటిని వినియోగించుకొని ఆధ్యాత్మిక లాభాన్ని పొందవచ్చు.

చాల సంవత్సరాల పొడుగున కొనసాగించిన రచనలు కనుక ఈ గ్రంథాల్లో పునరుక్తులు అనివార్యమయ్యాయి. పాఠకులు మన్నింతురుగాక. మొదటవ్రాసిన సంచికలకు తర్వాత వ్రాసిన వాటికీ శైలిలోకూడ భేదం వుంది.

మన క్యాతలిక్ సమాజంలో పఠనాభ్యాసం లేదు. ఇది మనం అవశ్యం సవరించు కోవలసిన ప్రధానలోపాల్లో వొకటి. ఇందుకే ఈ గ్రంథాలను చౌకధరకే విక్రయిస్తున్నాం. ఈ పుస్తకాలు మన సాహిత్యరాశిని పెంచి మన ప్రజల్లో పఠనాభిరుచిని ప్రోదిచేస్తాయని ఆశిస్తున్నాం. అసలు తెలుగులో మనకున్న క్యాతలిక్ సాహిత్యమే చాల తక్కువ.

ఫాదర్ టి.మర్రెడ్డిగారి ఆర్థిక సహాయంలేందే ఈ సంపుటాలు ఇప్పుడు, ఈ రూపంలో వెలుగు చూచేవి కావు. ప్రభువు ఆ మహనీయుని దీవించి ఆయన కృషిని సఫలీకృతం జేయునుగాక. విజయవాడ మేత్రాసనం తరపుననే ఈ పుస్తకాలను ప్రచురిస్తున్నాం.

ఈ సంపుటాల్లో రచయిత 31 ఏండ్ల పొడుగున కొనసాగించిన అవిరళకృషి దాగివుంది. కరుణామయుడైన ప్రభువు యెరూషలేం దేవాలయంలోని సాయంకాలపు ధాన్యబలినివలె ఈ సాహిత్యబలిని గూడ నెనరుతో స్వీకరించునుగాక.

ఈ పుస్తకాలకు పరిచయవాక్యాలు వ్రాసియిచ్చిన విజయవాడ పీఠాధిపతులు, పూజ్యులు, మహాఘనత వహించిన డాక్టరు ఎం.ప్రకాష్‌గారికి నమస్సుమాంజలులు. వీటిని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ పి.సాంబిరెడ్డిగారికి వారి సిబ్బందికి, ఓపికతో ప్రూఫులు దిద్దిన శ్రీ వి. గోపాలరెడ్డిగారికి మా కృతజ్ఞతలు.

– గ్రంథకర్త

# ముందుమాట

ఫా. జోజయ్య గారు తమ రచనల ద్వారా ఆంధ్ర శ్రీసభకు సుపరిచితులు. వారి అవిరళకృషి, సేవాతత్పరత, తెలుగులో చక్కని సాహిత్యాన్ని రాయాలనే తపన, దానికితగిన అంకితభావం వేనోళ్ల కొనియాడదగింది. వీరు రచించిన చిన్నచిన్న పుస్తకాలను సంకలనం చేయడం అనే ప్రక్రియ వీరి జీవితకాలంలోనే జరగకపోయినట్లైతే, ఈ గొప్ప సాహిత్యాన్ని కోల్పోయే అపాయం వుండేది. అరుదుగా పాఠకులకు తెలుగులో లభ్యమయ్యే బైబులును మరియు కతోలిక వేదాంతమునకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా పరిశోధన జరిపి చక్కని భాషలో ఆంధ్ర కతోలిక సంఘానికి గత ముప్పది సంవత్సరాలపైగా అందించారు ఫా. జోజయ్య గారు.

తెలుగు కతోలిక శ్రీసభకు, బైబులును క్రైస్తవ సిద్ధాంతాలను అర్థం చేసుకోవాలన్న కోరిక గల క్రైస్తవేతరులకు ఫా. జోజయ్య గారు గొప్ప వరమని నేను భావిస్తున్నాను. వీరి రచనలు సత్యాన్ని అన్వేషించడం యెడల ఆయనకున్న పట్టుదలకు, అందరికి జ్ఞానోదయాన్ని కలిగించాలన్న తపనకు, మరియు ఆంధ్ర శ్రీసభ పురోభివృద్ధి యెడల ఆయనకున్న తృష్ణకు నిదర్శనాలు. సరళమైన స్వచ్ఛమైన, సామాన్య ప్రజలకు అర్థమయ్యే తెలుగుభాషలో రచింపబడిన ఈ పుస్తకాలను చదివి, ఆధ్యాత్మిక జీవిత వికాసానికి క్రైస్తవ సిద్ధాంతాలను లోతుగా అర్థం చేసికోవటానికి వీటిని వినియోగించుకోవాలని కోరుతున్నాను. ఎంతో నేర్పుతో, క్రమపద్ధతిలో విభజింపబడిన రచనలను "బైబులు భాష్య సంపుటావళి" అన్న పేరుతో పదిసంపుటాలుగా అచ్చు వేస్తున్నందుకు అభినందిస్తున్నాను. ఈ గ్రంథాల ప్రచురణ బాధ్యతను తన భుజాలపై వేసికొని, సమయాన్ని వెచ్చించి, వలసిన ఆర్థిక వనరులను చేకూర్చినందుకు, ఆంధ్ర శ్రీసభకు ఉపయోగకరమైన ఈ సాహిత్యాన్ని ప్రజలకు అందించాలనే మంచికార్యాన్ని చేపట్టి విజయంతంగా పూర్తి చేసినందుకు ఫా. మర్రెడ్డి గారిని నా హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఆణిముత్యాల్లాంటి ఈ రచనలను ఆధ్యాత్మిక సంపత్తిగా అందరూ గుర్తించాలని, కతోలిక క్రైస్తవ సమాజమంతా ముఖ్యంగా మేత్రాణులు, గురువులు, మఠవాసులు అందరు ఈ కృషిని అభినందించాలని, ఆదరించాలని నా ఆకాంక్ష. మన ప్రజల స్తోమతకు తగినట్లుగా వీటి వెల కూడ చాల తగ్గించడమైనది. కావున ప్రతి ఒక్కరు, గ్రంథాలయాలు, ఆశ్రమాలు, మఠాలు, కతోలిక కేంద్రాలు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని నా మనవి.

ఫా. జోజయ్య గారు చేసిన ఈ కృషిని మరోసారి అభినందిస్తూ, వారు ఇంకా ఆంధ్ర శ్రీసభకు తమ అమూల్యమైన సేవలను రానున్న కాలంలో అందించాలని మనసారా కోరుకుంటూ, ప్రార్థిస్తూ...

ఇట్లు
మీ జ్ఞానతండ్రి
**+ మల్లవరపు ప్రకాష్**
విజయవాడ పీఠాధిపతులు

# 1. పాపం

బైబులు భాష్యం - 5

## మనవి మాట

ప్రస్తుత సంచికలో 1-33 నంబర్లు పాపాన్ని గూర్చి పూర్వవేదం సూచించే భావాలను పేర్కొంటాయి. వీనిలో 1-11 నంబర్లు ఆదికాండలోని భావాలను, 12-32 నంబర్లు ప్రవక్తల ప్రవచన గ్రంథాల్లోని భావాలను వివరిస్తాయి. ఇక 34-61 నంబర్లు పాపాన్ని గూర్చి నూత్నవేదం సూచించే భావాలను పేర్కొంటాయి. వీనిలో 34-42 నంబర్లు మూడు సువార్తల్లోని భావాలను, 43-49 నంబర్లు యోహాను రచనల్లోని భావాలను, 50-61 నంబర్లు పౌలు లేఖల్లోని భావాలను వర్ణిస్తాయి. ఇదీ విషయ విభాగం.

### 1. మీరు ఆ చెట్టు పండు మాత్రం తినకూడదు. ఆది 3,3.

ఆది దంపతులు ఏం పాపం చేసారో మనకు తెలీదు. బహుశ ఆదికాండం వ్రాసిన రచయితకుగూడ తెలీదు. కాని వాళ్ళుమాత్రం దేవుని ఆజ్ఞ మీరారు. దేవునిపట్ల అవిధేయత చూపారు. ఆదామేవలు చూపిన ఈ యవిధేయతను ఆదికాండం వ్రాసిన రచయిత ఓ కథలాగ వర్ణించుకుంటూ పోయాడు. కథలా చెప్తేనేగాని ఆ ప్రాచీన కాలపు హీబ్రూ ప్రజలకు విషయం బోధపడదు.

అన్ని చెట్ల పండ్లూ తినవచ్చుగాని, తోట నడుమనున్న చెట్టు పండ్లు మాత్రం తినకూడదని ప్రభువు ఆది జననీజనకులకు ఆజ్ఞయిచ్చాడు. కాని ఆ చెట్టు పండు ఏవకు యింపుగా కనిపించింది. దాన్ని తింటే తెలివితేటలు కల్గుతాయికాబోలు అనిపించింది. కావున ఆమె స్వయంగా పండు కోసుకొని తింది. భర్త చేత తినిపించింది - ఆది 3,6. ఇది ఆదామేవల అవిధేయత. ఇదే తొలిపాపం. ఇక్కడ, ఆదామేవలు తినకూడని పండు తిన్నారని మనం నమ్మనక్కరలేదు. కాని దేవుని కట్టడమీరి యేదో పాపం చేసారని మాత్రం నమ్మాలి.

నరుడు పాపం చేసినప్పుడెల్ల దేవుని పట్ల అవిధేయత చూపుతుంటాడు. మన పాపాలూ అవిధేయతను చూపుతాయి గనుక, వాటిని తలంచుకొని పశ్చాత్తాపపడదాం.

### 2. దేవునిలాగే మీరూ మంచి చెడ్డలు తెలిసికుంటారు - ఆది 3,5

తినవద్దనిన పండు కోసికొని తినినంత మాత్రాన్నే ఆదామేవలు అంత పెద్ద పాపం చేసారా అని మనం ఆశ్చర్యపోతాం. కాని యిక్కడ పండు తినడంగాదు, ఏ వుద్దేశంతో ఆ పండు తిన్నారు అన్నది ప్రధానం. ఆ పండు తిన్నట్లయితే దేవునిలాగే మీరూ మంచి చెడ్డలు తెలిసికుంటారని పాము చెప్పింది. కనుక మంచి చెడ్డలు తెలిసికోవాలన్న కోర్కెతోనే ఆదామేవలు పండు తిన్నారు.

కాని యిక్కడ మంచిచెడ్డలు తెలిసికోవడమంటే యేమిటి? ఆదామేవలు తమ మంచిచెడ్డ లేమిటో తామే నిర్ణయించుకో గోరారు. ఇక వాళ్ళకు దేవునితో సంబంధం వుండకూడదు. తాము స్వతంత్ర ప్రాణులు గావాలనీ, దేవునిమీద ఆధారపడకుండా వుండాలనీ భావించుకున్నారు. అసలు వాళ్ళు దేవుడంతటివాళ్ళు కావాలనీ, దేవునిలా వుండాలనీ కోరుకున్నారు. ఇలా దేవునికి సరిసమానులు కావాలని కోరుకోవడమే వాళ్ళ పాపంలోని ప్రధానాంశం.

ఇక, దేవునికి తుల్యులు కావాలని కోరుకోవడంలో ఉద్దేశమేమిటి? దేవుని అధికారాన్ని ధిక్కరించడం. దేవునికి లొంగిఉండడం చేతగానితనమనీ, అవమానకరమనీ భావించడం. ఆదిదంపతులు తమ చిన్నరికాన్ని విస్మరించి దేవునిముందు తమ పెద్దరికాన్ని చాటుకోవడం. అతడు సృష్టికర్తయనీ, తాము కేవలం సృజింపబడిన ప్రాణులనీ మరచిపోవడం.

కావున కేవలం పండు తిన్నందుకుగాదు ఆదామేవలు పతనమైపోయింది. సృష్టిప్రాణులై యుండిగూడ సృష్టికర్తతో సమానంగా వుండాలని కోరుకున్నందుకు. వాళ్ళ పాపం విశేషంగా గర్వంతో గూడింది. మనలోని గర్వభావాన్ని గూడ అణచుకునే ప్రయత్నం చేద్దాం, ప్రార్థిద్దాం.

## 3. దేవుడు మీరు చనిపోతారని చెప్పినమాట నిజంకాదు - ఆది 3,4.

నేను తినవద్దనిన పండు తిన్నారో, మీరు చనిపోతారని దేవుడు చెప్పాడు - 3,3. కాని దేవునిమాట నిజంకాదు. మీరు చనిపోరు అంది పాము. వెంటనే యేవకు అనుమానం కలిగింది. అమ్మో ఈ దేవుడెంత మోసగాడు అనుకుంది! తనలాగే మేమూ మంచిచెడ్డలు నిర్ణయించుకొని స్వతంత్రంగా జీవిస్తామని అసూయపడి దేవుడు ఆ చెట్టు పండు తినవద్దన్నాడు కాబోలు అని భావించింది. మేము అతనితో పోటీపడతామని తెలుసుకొని మమ్ము అణగద్రొక్కడానికే ఈ ప్రయత్నమంతా చేసాడు అనుకుంది.

ఇక్కడ యేవ దేవుణ్ణికూడ తమలాంటి నరుణ్ణిగానే భావించుకుంది. తన కుటిలబుద్ధిని ఆయనకీ ఆరోపించింది. కాని ఆమె అపోహ నిజంకాదు. నరుడు దేవునిమీద ఆధారపడతాడుగాని, దేవుడు నరునిమీద ఆధారపడడు. అతడు సర్వశక్తిమంతుడు కావడంచేత, ఇచ్చేవాడేగాని నరునినుండి పుచ్చుకునేవాడు కాడు. అందుచేత దేవుడు ఆదామేవలను గూర్చి అసూయపడడు. పడవలసిన అవసరంలేదు. వాళ్ళను వృద్ధిలోనికి తీసికొని రావాలనేదే అతని కోరిక.

ఈలా యేవ పాము మాటలు విని దేవుణ్ణి అపార్థం చేసికుంది. అతనికి దుష్టత్వాన్ని ఆరోపించింది. ఈ యారోపణ ద్వారా తన దుష్టత్వాన్నే వెల్లడిచేసుకుంది. ఈ దుష్టాలోచనమే ఆదామేవల పాపంలోని ఘోరాంశం. మన హృదయంలోని కుటిల భావాలను తలంచుకొనిగూడ పశ్చాత్తాప పడదాం.

## 4. వారాయన కంటికి కనపడకుండ దాగుకున్నారు - ఆది 3,8

దేవుడు నరుణ్ణి శిక్షింపకముందే పాపం దుష్ఫలితాన్ని ఈయనే ఇచ్చింది. నరునికి దేవునితోగల బాంధవ్యం తెగిపోయింది. అంతకుముందు ఆదామేవలిద్దరూ దిసమొలతోనే వుండేవాళ్ళు. దిసమొలతోనే దేవునిచుట్టూ తిరిగేవాళ్ళు. కాని పాపం కట్టుకున్న వెంటనే ఆదామేవలకు మొండిమొలతో వున్నామని తెలిసిపోయింది. ఇక వాళ్ళకు దేవునితో నడవడానికి సిగ్గు వేసింది. భయం కలిగిందికూడ. కనుకనే దేవుని యెదుటబడలేక చెట్లనడుమ దాగుకున్నారు -2, 8-10.

ఆ పండు తింటే మీకు కనువిప్పు కలుగుతుంది అంది సర్పం - 3,5. నిజమే. వాళ్ళకు కనువిప్పు కలిగింది. కాని ఆదామేవలు కండ్లువిప్పి చూచుకునేప్పటికల్లా తమ గొప్ప తనాన్నిగాదు, దిసమొలను మాత్రమే గుర్తింప గలిగారు! వాళ్ళు తమ అల్పత్వాన్ని తెలిసికున్నారు. అవమానంతో క్రుంగిపోయారు. దేవుడు ఆదిమానవులను శపించాడు. మరణమూ, వనబహిష్కారమూ ఆ శాప ఫలితాలే - 3,23. ఆనాటినుండి నరుడు దేవునికి దూరమయ్యాడు. ఈలాగే మనలను గూడ పాపం దేవుని నుండి దూరం చేస్తుంది.

## 5. మట్టినుండి పుట్టావు కనుక మట్టైపోతావు - ఆది 3, 19.

పాపమే చేయకపోయినట్లైతే ఆదామునకు చావంటూ వుండేదికాదు. పాప ఫలితంగా అతనికి మరణమనే శిక్ష సంక్రమించింది. కాని యేమ్మరణం? శారీరక మరణమా, ఆత్మ మరణమా? రెండూ అని చెప్పాలి. అనగా ఆదాము భౌతికంగా చనిపోయాడు. ఆ మీదట దైవ సాన్నిధ్యాన్ని కూడ కోల్పోయాడు.

జ్ఞానగ్రంథకర్త ఆదాము పాపాన్ని స్మరించుకుంటూ "దేవుడు నరుణ్ణి అక్షయుడుగా వుండడంకోసం సృజించాడు. కాని పిశాచం అసూయవలన మరణం లోకంలోనికి ప్రవేశించింది" అని వ్రాసాడు - జ్ఞాన 2, 24. ఇక్కడ అక్షయుడుగా వుండడమంటే చనిపోకుండా వుండడమూ, శాశ్వతంగా దైవసాన్నిధ్యాన్ని అనుభవించడంగూడ. పాపం వలన ఆదాము ఈ రెండు భాగ్యాలనూ కోల్పోయాడు.

పౌలు కూడ పై ఆదికాండనూ, జ్ఞానగ్రంథాన్నీ మనసులో పెట్టుకొనే "వో మనుష్యుని ద్వారా పాపమూ పాపం ద్వారా మరణమూ లోకంలోకి ప్రవేశించాయి" అని వ్రాసాడు - రోమా 5,12. ఇక్కడ మరణమనగా భౌతిక మరణమూ, ఆ మీదట శాశ్వతమైన ఆత్మమరణమూను. తరువాత పునీత అగస్తీను పై వేదవాక్యాలమీద వ్యాఖ్య వ్రాస్తూ దేవుడు ఆదామునకు ఏమిమరణం విధించాడని ప్రశ్న వేసికొని దేహమరణం, ఆత్మమరణం రెండూనని జవాబిచ్చాడు. అనగా శాశ్వతంగా జీవింపవలసిన ఆదాము దైవ కృపను కోల్పోయాడు గనుక యిక మరణిస్తాడు. మరణించిన పిదప దైవసాన్నిధ్యాన్నీ, దైవదర్శనాన్నీ పొందలేడు. ఆదాము పొందిన యీ శిక్షనే పాపం చేసినప్పుడెల్ల మనమూ పొందుతూంటాం.

## 6. కయీను హేబెలును చంపాడు - ఆది 4,8

ఆదాము పాపంవలని దుష్ఫలితాలను ఆదికాండం సమగ్రంగా వర్ణిస్తుంది. ఆదాము ఏవను చూచి "ఈమె నా యెముకల్లో యెముక. దేహంలో దేహం" అనుకున్నాడు - 2, 23. తనకు దగ్గరి బంధువురాలు, లేక తన ప్రేమకు పాత్రురాలు అని ఈ మాటల భావం. ఈలాంటి ఏవనే అతడు పాపంచేసాక నిందించడం మొదలెట్టాడు. "నాయంతటనేను ఈ పండు తినేవాణ్ణికాదు, ఆమే నా చేత తినిపించింది" అన్నాడు - 3,12. ఆదామేవలిద్దరూ దేవుని దృష్టిలో సరిసమానులే. ఇద్దరూ మానవులే. ఇద్దరూ దేవుని బిడ్డలే. ఇద్దరూ దేవుని చేరవలసినవాళ్ళే. ఐనా పాపం చేసాక స్త్రీ పురుషునికి బానసగా మారిపోయింది. అతడు ఆమె మీద అధికారం చెలాయించడం మొదలెట్టాడు - 3,16. పాప ఫలితం ఈలా వుంటుంది. ఇక, నరులందరూ దేవుని పోలికగా సృజింపబడినవాళ్ళే. ఐనా నరుడు తోడి నరుణ్ణి ద్వేషించడం మొదలెట్టాడు. కయీను తమ్ముడైన హేబెలుమీదపడి అతన్ని సంహరించాడు- 4,8. ఈ ద్వేషభావం మనకూ అనుభవపూర్వకంగా తెలిసిందే!

## 7. దేవుడు వారి భాషను తారుమారు చేసాడు - ఆది 11,9.

లేమెకు తన్ను కొట్టవచ్చిన వానిని పట్టుకొని క్రౌర్యంతో చంపివేసాడు. కయీనును చంపినవానికి ఏడంతలు శిక్షైతే నన్ను చంపబోయినవానికి డెబ్బదియేడంతలుగా శిక్ష విధిస్తా నన్నాడు - 4, 23. ఈ లేమెకు క్రూరవాక్యాలను మనసులో పెట్టుకొనే ప్రభువు తర్వాత, శత్రువులను డెబ్బదియేడుసార్లవరకూ క్షమించాలని బోధించాడు - మత్త 18,22.

పాపఫలితంగా నరుని ఆయుఃప్రమాణంకూడ తగ్గి పోయింది. అతడు నూట యిరువదేండ్లు మాత్రమే బ్రతకగలిగే దుర్బలప్రాణి అయ్యాడు - 6,3. నోవా కాలంలో ఆ పుణ్యపురుషుని కుటుంబంతప్ప మిగిలిన ప్రాణికోటి అంతా నశించిపోయింది - 6,18. ఈ నోవా కట్టిన ఓడ భగవంతుడనుగ్రహింపబోయే రక్షణానికి సంకేతంగా వుంటుంది.

అటుతరువాత నరులు బాబెలు గోపురం కట్టబోయారు. ఆకాశాన్నంటే గోపురాన్నికట్టి పేరు సంపాదించుకుందామనుకున్నారు - 11,4. కాని దేవుడు వాళ్ళ అహంకారానికి క్రుద్ధుడై నేలమీదకు దిగివచ్చాడు. వాళ్ళ భాషను తారుమారు చేసాడు. నరులను నేల నాలుగు చెరగులకు చెదరగొట్టాడు -11,8. ఇవి ఆదాము పాపం తెచ్చిపెట్టిన దుష్ఫలితాలు. మన పాపాలవల్ల కూడ ఈలాంటి దుష్ఫలితాలే సిద్ధిస్తాయి!

## 8. జంతువులన్నిటిలోను పాము జిత్తులమారిది - 3,1.

తొలి తల్లిదండ్రులు పాపం చేసారు. కాని ఈ పాపం వాళ్ళనుండి బయలుదేరలేదు. మూడవ వ్యక్తియైన పిశాచం నుండి బయల్వెడలింది. ఈ పిశాచం ఓ దేవుడూకాదు, దేవుని ప్రతిఘటించి నిలచే ఓ ద్వితీయశక్తీకాదు. అది భగవంతుడు సృజించిన ప్రాణుల్లో వొకటి. ఆదికాండం ఈ ప్రాణిని "పాము" అని పిలుస్తుంది. ఈపాము యావే సృజించిన

జంతువులన్నిటిలోను జిత్తులమారిది - 3,1. పాము రూపంలో వచ్చిన పిశాచం నరుణ్ణిచూచి అసూయపడింది. నరుణ్ణి ద్వేషించింది. అతని పతనానికి పునాదులు త్రవ్వింది - జ్ఞాన 2, 24. దేవుడు నరుణ్ణి ఆదరంతో చూస్తూవున్నాడు. కనుక ఈ నరునికి హాని చేసినట్లయితే దేవునికే హాని చేసినట్లవుతుంది. ఆదామును కూలద్రోయడంలో పిశాచం సంకల్పం ఇదే.

ఆదాము, ఏవ, పిశాచం - ఈ ముగ్గురిలో పిశాచం సంకల్పం చాల దుష్టమైంది. కనుకనే ప్రభువు ఆదామేవల కంటే పిశాచాన్ని అధికంగా శిక్షించాడు. ఈ శిక్షాఫలితంగా స్త్రీకిని స్త్రీ సంతతికిని పిశాచంతో తీరనివైరం కలుగుతుంది. ఈ వైరంలో పిశాచం ఓడిపోయింది. దాని తల చిదికి పోయింది - 3,15. ఈలా వోడిపోవడ మనేది పిశాచానికి ఘోరపరాజయం, సహింపరాని గర్వభంగం. ఇక పిశాచమో స్త్రీసంతతియొక్క మడమలు కరుస్తానే వుంటుంది! ఔను, మనం పాపం చేసినప్పుడెల్ల పిశాచ బాధితులమౌతూనేవుంటాం. (ఇక్కడ మనవాళ్ళు చాలమంది "పిశాచి" అంటూవుంటారు. ఇది పొరపాటు. పిశాచం అనే అనాలి.)

## 9. జ్ఞానం ఆదామును పాపంనుండి విడిపించింది - జ్ఞాన 10,1.

నరుడు పాపం చేసి హతుడై పోయాడు. ఐనా దేవుడు అతన్ని ఉద్ధరించాలనుకున్నాడు. ఈ రక్షణ ప్రణాళికద్వారా దేవుని దయా, మంచితనమూ వ్యక్తమయ్యాయి. దేవుని మంచితనం నరుని దుష్టత్వాన్ని జయించింది. తన మంచితనం చేత నరుని చెడ్డతనాన్నీ, పాపాన్నీ నిర్మూలించాడు ప్రభువు - రోమ 12, 12. అక్కడ ప్రభువు ఆదామేవలను శిక్షించాడంటే అది కేవలం వాళ్ళ మేలుకోసమే. ఇంకా ఘోరమైన పాపంచేయకుండా వుండడం కోసమే.

ప్రభువు పిశాచంతో "ఆ స్త్రీ సంతతివాళ్ళు నీ తల చిదుక గొడతారు" అన్నాడు. ఈలా పిశాచం తల చితకగొట్టడం లేక పిశాచాన్ని ఓడించడ మనేది క్రీస్తు ద్వారా జరిగింది. కనుక ప్రభువు ఆదామును శపించినప్పుడే కరుణతో ఆదాము సంతతివాళ్ళ రక్షణాన్నిగూడ సూచించాడు. కనుకనే పునీత అగస్తీను "ఆదాము పాపం ధన్యమైంది. ఆ పాపంవల్లనే గదా అంతటి రక్షకుణ్ణి పొందగలిగాం" అని వ్రాసాడు. జ్ఞాన గ్రంథకర్తకూడ ఆదాము పాపాన్ని మననం చేసికుంటూ "జ్ఞానం ఆదామును పాపంనుండి విడిపించింది" అని వ్రాసాడు - 10,1. పూర్వ వేదంలోని యీ జ్ఞానమే నూత్న వేదంలోని క్రీస్తు. అనగా తండ్రి అనుగ్రహించిన క్రీస్తువలన ఆదాము పాపం పరిహృతమైంది. ఆదాము సంతతివారలమైన మన పాపాలనుకూడ ఆ ప్రభువు పరిహరిస్తూ వుండాలని అడుగుకుందాం.

## 10. మాకు ఓ దేవతను చేసిపెట్టు - నిర్గ 3 2,1.

ఇంతవరకు ఆదికాండం వర్ణించిన ఆదామేవల పాపాన్ని గూర్చి విచారించాం. ఇక యిస్రాయేలు ప్రజలు ఎడారికాలంలో కట్టుకున్న పాపాలను రెండింటిని చూద్దాం.

యిస్రాయేలు ప్రజల్లో ఏ యోగ్యతా లేకపోయినా ప్రభువు ఆ ప్రజనే యెన్నుకున్నాడు. అందుకు కారణం అతని అవ్యాజ ప్రేమయే - ద్వితీ 7,7-8. ఈ యెన్నిక ద్వారా యిస్రాయేలు ప్రభుప్రజ అయ్యారు - నిర్గ 19,5. అతని ప్రథమ పుత్రుడుగా పరిగణింప బడ్డారు - నిర్గ 4, 22. ప్రభువు యిస్రాయేలును ఫరో దాస్యం నుండి విడిపించి సీనాయి దగ్గిర మోషే ద్వారా వాళ్ళతో ఒడంబడిక చేసుకున్నాడు - నిర్గ 31,8.

కాని ప్రభువు మోషే మధ్యవర్తిగా యిస్రాయేలు ప్రజలతో ఒడంబడిక చేసికుంటూండగానే, వాళ్ళు మాకు ఓ దేవతను చేసిపెట్టమని అహరోనుని కోరారు - నిర్గ 32,1. ఈలా యిస్రాయేలు విశ్వసనీయుడైన దేవునిపట్ల విశ్వాసఘాతకులుగా ప్రవర్తించారు. దేవుడు వాళ్ళను తనతో నడవ మన్నాడు. కాని వాళ్ళు తమతో నడచివచ్చే బంగారు దేవుణ్ణి చేయించుకున్నారు. యావే ప్రభువును నిరాకరించి తమకు అనుకూలమైన దేవుణ్ణి తయారుచేసికున్నారు. ఆదామేవలు ప్రభువుని ధిక్కరించారు, అతన్ని విశ్వసించలేదు అన్నాం. ఇక్కడ యిస్రాయేలు ప్రజల పాపమూ ఆలాంటిదే - ద్వితీ 9,7. మనంకూడ పాపంచేసి నప్పుడెల్ల ఈలాగే దేవుణ్ణి ధిక్కరిస్తూ వుంటాం.

## 11. ఈ మన్నా తప్ప మరేమీ దొరకడంలేదు - సంఖ్యా 11,6.

ప్రభువు యిస్రాయేలు ప్రజలకు అద్భుతంగా మన్నా భోజనం సమకూర్చి పెట్టాడు. కాని వాళ్ళకు ఆ మన్నా రుచింపలేదు. ఈజిప్టులో తాము భుజించిన మాంసాన్ని ఉల్లిపాయలను తలంచుకొని మన్నాతో అసంతృప్తి చెందారు - సంఖ్యా 11,4-6. మోషేమీద గొణిగారు. మోషే ప్రభువూ తమ ప్రభువూ ఐన యావేమీద తిరుగుబాటుచేసి ముందుకు కదలమన్నారు. వాళ్ళ అవిధేయతకు కోపించి ప్రభువు ఆదామేవలను శిక్షించినట్లే యిస్రాయేలును కూడ శిక్షించాడు - సంఖ్య 11.33.1 కొరింతీయులు 10, 5-6 లో పౌలు ఈ సంఘటనను పేర్కొన్నాడు. వారిలాగే మనం కూడ చెడ్డ కోరికలు కోరుకోకుండా వుండేందుకు ఈ సన్నివేశం దృష్టాంతంగా వుంటుందన్నాడు.

## 12. మీ పాపాల వలన ఆయన ముఖం మరుగైంది - యెష 59,2.

పూర్వవేద ప్రవక్తలు పాపాన్ని గూర్చి చాలా అంశాలు బోధించారు. కనుక ఈ ప్రవక్తల బోధనలను అవలోకించి పాపాన్ని కొంతవరకైనా అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం.

ప్రవక్తలు నాటి జనుల పాపాల జాబితాలను పొందుపరచారు. యెషయా ప్రవక్త 59 వ అధ్యాయంలో ఈలాంటి జాబితావొకటి కనిపిస్తుంది. నరహత్య, అబద్ధాలు, మోసపు మాటలు, దౌర్జన్యం, అన్యాయం, వంకరత్రోవలు పట్టడం, చీకటిలో నడవడం, యావేపై తిరుగుబాటు చేయడం - ఈలాంటి పాపాలతో ప్రజలు చెడిపోయారని వ్రాసాడు. ప్రభువు ప్రజలను రక్షింపలేకగాదు. కాని ప్రజల పాపాలు దేవునికీ తమకూ మధ్య ఓ అగాధ

గర్తాన్ని సృజించాయి. కనుకనే వాళ్ళు దేవుని చెంతకు రాలేకపోతున్నారు. ప్రజల పాపాలవల్ల ప్రభువు తన ముఖాన్ని మరుగుచేసికున్నాడు - యెష 59, 1-2. ఇది ప్రవక్త బోధ. ఔను, మనం పాపం చేసినప్పుడుకూడ ప్రభువు కోపంతో ముఖాన్ని మరుగు చేసికుంటాడు - కీర్త 30,8.

## 13. దేవుని యెదుట దుష్కార్యం ఎలా చేయగలను ? - ఆది 39,9.

పూర్వవేద ప్రవక్తలు దేవుడు మన పనులన్నీ గమనిస్తూనే వుంటాడనీ, మనం దుష్కార్యాలు చేసేప్పుడు ఆ ప్రభువు సమక్షంలోనే పాపం చేస్తుంటామనీ భావించారు. అందుకే ప్రవక్త యెషయా ప్రభుదర్శనం కలగగానే "సైన్యములకు అధిపతియైన యావేను కన్నులారా చూచాను. నేను అపవిత్రమైన పెదవులు కలవాణ్ణి. అయ్యో నశించానుగదా" అనుకుంటాడు - 6,5. అనగా పాపినైన నేను దేవుని యెదుట నిలువదగనని ప్రవక్త భావం. పోతీఫరు భార్య తన్ను నిర్బంధింపగా "దేవుని యెదుట ఈ దుష్కార్యాన్ని ఎలా చేయగలను" అన్నాడు యోసేపు - అది 39,9. సూసన్న ఇరువురు వృద్ధులు తన్ను బలాత్కరింపగా "దేవుని యెదుట నే నీ పాపం చేయలేను" అంటుంది - దాని 13,23. ఈలా నరులు భగవంతుని సమక్షంలోనే పాపం చేస్తుంటారనుకోవడం పూర్వవేద ప్రజలకు పరిపాటి. ఈ భక్తుల్లాగే భగవంతుడు సర్వాంతర్యామి, కర్మసాక్షి, అతని సమక్షంలో పాపం చేయడం నరులకు శ్రేయోదాయకం కాదు అనుకునేవాళ్లు ధన్యులు.

## 14. మా యమ్మ నన్ను పాపంలోనే గర్భందాల్చింది - కీర్త 51,5.

ప్రవక్తలు బోధించే మరో భావం, పాపం సర్వత్ర వ్యాపించివుందనడం. వివేకంతో దేవుణ్ణి వెదికే జనమెవ్వరైనా కనిపిస్తారేమోనని యావే ఆకాశం నుండి భూమి మీదకు పరికించి చూచాడు. కాని నరులంతా దారి తొలగివున్నారు - కీర్త 14, 2-3. "పాపం చేయనివాడు ఒకడూ లేడు" అంటుంది మొదటి రాజుల గ్రంథం - 8,46. "తల్లి గర్భంనుండి వెలువడి నప్పటినుండే నరుడు పాపం చేయడం మొదలెడతాడు" అంటుంది కీర్తన 58,3. మరో కీర్తనకారుడు "మాయమ్మ పాపంలోనే నన్ను గర్భం దాల్చింది" అంటాడు - 51,5. అనగా తల్లిగర్భాన బడినప్పటి నుండే నేను పాపిని అని కీర్తనకారుని భావం.

కొంతమంది పాపాన్ని అట్టే లెక్కచేయరు. సులభంగా పాపం కొట్టుకొంటూంటారు. పాపాన్ని తలంచుకొని అట్టే పశ్చాత్తాప పడరుకూడ. కాని ఈ కీర్తనకారునిలాగ బాల్యంనుండీ నేను పాపిని అని అనుకునేవాడు యథార్థమైన భక్తుడు.

## 15. నరుని పాపం భగవంతుణ్ణి బాధిస్తుందా ? - యోబు 35, 6

నరుని పాపం భగవంతుణ్ణి బాధిస్తుందా? భగవంతుణ్ణిగాదు నరుణ్ణే బాధిస్తుంది. అందుకే యోబు గ్రంథం "నీవు పాపం జేసినా ఆయనకేమైన కీడు చేయగల్గితివా?"

అంటుంది. 35,6. కాని నరుని పాపం భగవంతునికి కీడు చేయలేక పోయినా, నరునికి కీడుచేసి తీరుతుంది. ఇక యీ నరుణ్ణి భగవంతుడు ప్రేమిస్తుంటాడు గనుక నరుణ్ణి బాధించడం ద్వారా పరోక్షంగా భగవంతుణ్ణిగూడ బాధిస్తుంది. దావీదు రాజు ఊరియాను చంపి అతని భార్యయైన బత్షెబాను తన భార్యను చేసుకున్నాడు. ఈ ఊరియా యిస్రాయేలీయుడు కూడా కాదు, అన్యజాతివాడు. ఐనా ఊరియా వధవల్ల దావీదు యావేను తృణీకరించాడనీ, ఆయన యెదుట చెడ్డపని చేసాడనీ చెప్పబడింది - సమూ 12,9. ఇదేవిధంగా మన పాపాలుకూడ ప్రత్యక్షంగా మనలనూ పరోక్షంగా దేవుణ్ణీ బాధిస్తాయి. మరికొన్ని తావుల్లో బైబులు నరులపాపం భగవంతునికి కోపం రప్పిస్తుందని చెప్తుంది. యిస్రాయేలు పరిశుద్ధ దేవుణ్ణి కోపానికి పురికొల్పవద్దంటాడు యెషయా-1,4.

## 16. జీవజలాల ఊటనైన నన్ను వదలివేసారు - యిర్మీ 2, 13.

పాపంద్వారా నరుడు భగవంతుడిచ్చే జీవాన్ని నిరాకరిస్తాడు. నరులపాపం దేవునకూ తమకూ మధ్య ఓ అగాధపు గుంటను కలిగిస్తుంది అన్నాడు ప్రవక్త యెషయా - 59,2. అనగా పాపంద్వారా దేవునికీ నరునికీ మధ్యగల సంబంధం తెగిపోతుందని భావం. "నా జనం జీవజలాల ఊటనైన నన్ను విడచి, బ్రద్దలై నీళ్ళు నిలువని తొట్లను తొలిపించుకున్నారు" అంటాడు ప్రవక్త యిర్మీయా - 2,13. జీవజలాలను అనుగ్రహించేవాడు ప్రభువు. మన పాపంద్వారా ఈ జీవజలాన్ని నిరాకరిస్తాం. దానికి మారుగా సృష్టివస్తువులనే జలాన్ని సంపాదించి బ్రద్దలైపోయిన తొట్టిలో యిముడ్చుకోవాలని చూస్తాం. కాని మన ప్రయత్నం నెగ్గదు. ఇక్కడ భగవంతుడిచ్చే జీవజలాన్ని నిరాకరించడమనగా అతని అనుగ్రహాన్ని కాలదన్నడమని భావం. ఈలా పాపంద్వారా నరుడు భగవంతుడు ప్రేమతో ప్రసాదించే జీవాన్ని నిరాకరిస్తుంటాడు.

## 17. వాళ్ళు మూర్ఖచిత్తులూ, విశ్వాసంలేని ప్రజలు - ద్వితీ 32,20.

సీనాయి పర్వతంవద్ద మోషేద్వారా యావేప్రభువు యిస్రాయేలు ప్రజతో ఒడంబడిక చేసికున్నాడు. దాని ద్వారా ఆ ప్రజలు అతన్ని మాత్రమే ఆరాధించాలి. అతడు వారిని తన ప్రజగా చేసికోవాలి. వారికి పాలస్తీనా దేశాన్ని ఈయాలి. కాని ఈ యొడంబడిక ముగిసీముగియకముందే యిస్రాయేలు ప్రజలు దాన్ని మీరడం మొదలెట్టారు. ప్రవక్తలు నరుల పాపాలు సీనాయి ఒడంబడికను భగ్నంచేస్తాయి అని బోధించారు. పూర్వవేదం ప్రకారం పాపంలోని ప్రధానాంశం, ఈలా వొడంబడికనూ, వొడంబడిక చేసికున్న దేవుణ్ణీ ధిక్కరించడమే.

## 18. నిన్ను సృజించిన యావే నీ భర్త - యెష 54,5.

యిస్రాయేలు ప్రజలు ఒడంబడికను మీరారనడానికి పూర్వవేదం తల్లి, తండ్రి, వరుడు అనే ఉపమానాలను వాడింది. ఒడంబడిక ద్వారా యావే ఆ ప్రజకు తండ్రి

యౌతాడు. ఐనా ప్రజలు ఆ తండ్రి మాట మీరారు - ద్వితీ 32,8. అతడు వారికి తల్లి. తల్లి ప్రేవున బుట్టిన బిడ్డను మరచిపోతే మరచిపోతుందేమోగాని ప్రభువు మాత్రం ఆ ప్రజను విస్మరింపడు - యెష. 49, 15. తల్లిపక్షి పిల్లలను తన రెక్కలమీద మోసికొని పోయినట్లే ప్రభువుకూడ ఆ ప్రజలను నడిపించుకొని పోయాడు - ద్వితీ 32,11. ఐనా యిస్రాయేలు ప్రజలు ఈ తల్లి మాట జవదాటారు.

ఒడంబడిక ద్వారా యావే వరుడూ యిస్రాయేలు ప్రజ వధువూ ఔతారు. కాని ఈ వధువు యావేను విడనాడి అన్యులతో పాపం చేసింది. మళ్ళా యావే వద్దకు తిరిగి రావడానికి నిరాకరించింది - యిర్మీ 3, 6-7. అనగా పాపం చేయడం భార్య భర్తను త్యజించి తప్పుత్రోవలు త్రొక్కడంలాంటిదనీ, బిడ్డ తల్లిదండ్రులను ధిక్కరించడం లాంటిదనీ భావం. కనుక ప్రవక్తల దృష్టిలో, పాపమంటే నరుడు భగవంతుని ప్రేమను నిరాకరించడం. భగవంతుడు నరుని ప్రేమను పొందలేక బాధపడ్డం. ఈ భావాలన్నీ నూత్నవేద ప్రజలమైన మనకూ అక్షరాలా వర్తిస్తాయి.

## 19. నీవు మానుండి నీ ముఖాన్ని మరుగుచేసికున్నావు - యెష. 64, 6-12.

యెషయా ప్రవక్త పాపాన్ని చాలా వుపమానాలతో పోల్చి చెప్పాడు. పాపం వల్ల నరులు అపవిత్రుల్లాగ, అనగా కుష్ఠరోగుల్లాగ తయారయ్యారు. వాళ్ళ నీతిక్రియలన్నీ కుష్ఠరోగి ధరించే మురికిబట్టల్లా వున్నాయి. ఎండిన ఆకులు సుడిగాలికి కొట్టుకొని పోయినట్లే నరులు స్వీయ పాపాలవలన కొట్టుకొని పోతున్నారు. ప్రభువు ప్రజలను రోసి, వాళ్ళనుండి ముఖం మరుగుచేసికున్నాడు.

ప్రభువు యిస్రాయేలు ప్రజలను కలిగించినవాడు. వారికి తండ్రి లాంటివాడు. కుమ్మరి కుండలను చేసినట్లే ప్రభువుకూడ తన ప్రజలను కలిగించాడు. వారు అతని సృష్టి, ఆయన చేతి పని. ఐనా ఆ జనులు మూర్ఖులై ప్రభువునకు కోపం తెప్పించారు. కనుక అతడు వారిని విస్మరించాడు. దానితో యెరూషలేం పాడుపడింది. సియోను బీడు వడింది. దేవాలయం మంటగలిసింది. పూర్వవేదం పాపాన్ని వర్ణించే ఆవేదనా ఘట్టాల్లో యిదీ వొకటనాలి!

## 20. నీ కోపంవల్ల మేము క్షీణించిపోతున్నాం - కీర్త 90,7

ప్రవక్తలకు పాపం ఓ మోయలేని బరువులా తోచింది. అపవిత్రుడైన నరుడు పవిత్రుడైన భగవంతుణ్ణి ధిక్కరించి పాపంచేయడమనేది భరింపరాని విషయమనిపించింది. "నా దోషాలు నా తలమీదుగా పొర్లిపారాయి. మోయలేని బరువులాగ నా తలమీద మోపబడ్డాయి" అంటాడు ఓ కీర్తనకారుడు - 38,4. "దివారాత్రాలూ నీ చేయి నామీద బరువుగా వ్రాలింది. వేసవికాలపు మడుగులాగ నా లోని సారం ఒట్టిపోయింది. ప్రభూ నా దోషాన్ని కప్పిపుచ్చుకోకుండా నీ యెదుట ఒప్పుకుంటున్నాను" అంటాడు మరో

కీర్తనకారుడు - 33, 4-5. ఇంకో కీర్తనకారుడు భగవంతుని కోపానికి భయపడి "నీ కోపంవల్ల మేము గడగడలాడుతూన్నాం" అంటాడు-90, 7. ఈలా వ్యక్తిగతంగా, అనుభవ పూర్వకంగా, పాపభారాన్ని తలంచుకొని బాధపడేవాడెవడో వాడే భక్తుడు.

## 21. నీవు మా పాపాలన్నిటినీ ఆగాధసముద్రంలో పడవేస్తావు - మీకా 7, 19

పాపంచేసాక ఆ పాపం అలాగే వుండిపోతుంది. అనగా నరుడు పాపస్థితిలో వుండిపోతాడు. భగవంతుడు కరుణతో పరిహరించేంతవరకూ పాపం అలాగే వుండిపోతుంది. దావీదు నేను పాపంచేసాను అని ప్రవక్త నాతానుతో అన్నాడు. "యావే నీ పాపాన్ని పరిహరించాడు, నీవిక చావవు" అని నాతాను జవాబిచ్చాడు - 2 సమూ 12,13. అనగా ప్రభువు దావీదు పాపాన్ని పరిహరించేంత వరకూ అతడు పాపదశలోనే వుండిపోయాడని భావం. "పడమటికి తూర్పు ఎంతదూరమో, ఆయన మన అతిక్రమాలనూ మననుండి అంతదూరం చేసాడు" అంటుంది కీర్తన 103, 12. అనగా ప్రభువు మన యతిక్రమాలను దూరంచేసేంతవరకూ మనం పాపదశలోనే వుండిపోతామని యర్థం. "నీవు మా దోషాలను తుడిచివేస్తావు. మా పాపాలన్నిటినీ అగాధ సముద్రంలో పడవేస్తావు" అంటుంది మీకా గ్రంథము - 7, 19. అనగా ప్రభువు ఈలా పడవేసేదాకా పాపం పాపితో వుంటుందనే భావం. ఈ వాక్యాలన్నీ పాపిపాపం కట్టుకోవడం మాత్రమే కాదు, భగవంతుడు క్షమించేదాకా పాపదశలోనే వుండిపోతాడని సూచిస్తాయి. ప్రభువు అనుగ్రహిస్తేనే తప్ప పాపి యీ పాపదశనుండి బయటపడలేడు.

## 22. అతడు ప్రాణాలను ధారవోసాడు - యెష 53, 12

యెషయా ప్రవక్త తన ప్రవచనం 53వ అధ్యాయంలో బాధామయసేవకుణ్ణి వర్ణించాడు. ఈ సేవకుడు బాధలనుభవించి మరణించాడనీ, ఇతని మరణం ద్వారా ప్రజలకు పాపవిమోచనం కలుగుతుందనీ చెప్పాడు. నూత్నవేదపు రచయితలు ఈ ప్రవచనాన్ని క్రీస్తునకు అన్వయించారు. నీతిమంతుడైన నా సేవకుడు జనుల దోషాలను భరించి అనేకులను నిర్దోషులను చేస్తాడు అంటాడు ప్రవక్త - 53, 11. "మనుష్య కుమారుడు అనేకుల విమోచన క్రయధనంగా ప్రాణాలు ఈయడానికి వచ్చాడు" అంటుంది మార్కుసువార్త 10.45. "అతడు బాధింపబడినా నోరుతెరవలేదు. వధకు తేబడే గొర్రెపిల్లలాగ మౌనంగా వుండిపోయాడు" అంటాడు ప్రవక్త - 53,7. ప్రధాన యాజకుడు ప్రశ్నించినా గూడ "ఆయన ఉత్తర మీయకుండా మౌనంగా వుండిపోయాడు" అంటుంది మార్కు సువార్త 14,61. "ఆయన అనేకుల పాపాలను భరిస్తూ పాపం చేసినవారికోసం విజ్ఞాపనచేసాడు" అంటాడు ప్రవక్త 53.12. "తండ్రీ! వీళ్ళేమి చేస్తున్నారో వీళ్ళకే తెలీదు కనుక వీళ్ళను క్షమించు" అంటూ క్రీస్తు శత్రువుల తరపున విజ్ఞాపనం చేసాడు అంటుంది లూకాసువార్త 23,34. "అతడు మరణంచెంది ప్రాణాలను ధారవోసాడు" అంటాడు

ప్రవక్త - 53, 12. "ఇది అనేకులకొరకు చిందబడనున్న నా రక్తం" అంటాడు క్రీస్తు - లూకా 14.24. ప్రవక్తలు వర్ణించిన బాధామయ సేవకుడను నేనేనని ఉత్థాన క్రీస్తు ఎమ్మావు త్రోవలో తెలియజేశాడు. లూకా 24, 25-27. ఈ విధంగా నరుల పాపాలు భగవంతుణ్ణి బాధామయ సేవకుణ్ణి చేసాయి.

## 23. నరుల హృదయాల్లోని తలంపులు ఎల్లప్పుడూ చెడ్డవే - ఆది 6,5

ప్రవక్తల భావాల ప్రకారం పాపం నరుని హృదయంలో వుంటుంది. "ఈ ప్రజలు పెదవులతో నన్ను మహిమపరుస్తున్నారు గాని వీళ్ళ హృదయం మాత్రం నాకు దూరంగా వుంది" అంటాడు ప్రభువు యెషయా గ్రంథంలో 29,13. "నరుని హృదయం అన్నిటికంటె మోసకరమైంది. దాని నెవడు అర్థం చేసికోగలడు?" అంటాడు యిర్మీయా ప్రవక్త - 17,9. నరుల హృదయాల్లోని తలంపులు ఎల్లప్పుడూ చెడ్డవిగానే వుంటాయి" అంటుంది ఆదికాండం 6,5.

కావున భగవంతుడు ఈ హృదయాన్ని మారిస్తేనే తప్ప నరుడు పాపాన్ని విసర్జించలేడు. అందుకే ప్రవక్త యెహెజ్కేలు నూత్న హృదయంకోసం ప్రభువును ప్రార్థించాడు. రాతి గుండెను తీసివేసి మాంసపు గుండెను, అనగా విధేయాత్మకమైన గుండెను ఈయమని అడిగాడు - 36, 26. యిర్మీయా ప్రవక్త కూడ ప్రజల్లో సున్నతి పొందిన హృదయం నెలకొనాలని కోరుకున్నాడు - 4,4. ప్రవక్తలు సూచించే ఈ హృదయ పరివర్తనం లేందే పూర్వవేద నరునికిగాని నూత్నవేద నరునికిగాని పాపపరిహారమంటూ లేదు.

## 24. మీ హృదయాలను కఠినం చేసుకోకండి - కీర్త 95,8

భగవంతుని అనుగ్రహాన్ని ధిక్కరించి కొంతమంది తమ హృదయాలను కఠినం జేసికున్నారు. రాయి చేసికున్నారు. ఈజిప్టు ప్రభువైన ఫరో యీలాంటివాడు - నిర్గ 4,21. యిస్రాయేలు ప్రజల తొలిరాజైన సౌలూ యీలాంటి వాడే. ఇది చాల పెద్దపాపం. భగవంతుణ్ణి బుద్ధిపూర్వకంగా నిరాకరించడం. అందుకే కీర్తనకారుడు గూడ "పూర్వం యెడారిలో మెరిబా మాసాల వద్ద మీ పితరులు హృదయాన్ని రాయి చేసుకున్నారు. అలాగే మీరూ హృదయాలను కఠినం జేసికోకండి" అని హెచ్చరించాడు - 95, 8. ఈ హెచ్చరిక నూత్న వేదప్రజలమైన మనకూ అక్షరాల వర్తిస్తుంది.

## 25. మహోన్నతునికి సమానమౌతాను - యెష 14,14.

యెషయాప్రవక్త బాబిలోను ప్రభువైన సన్హెరీబును వర్ణిస్తూ "నేను ఆకాశానికి ఎక్కిపోతాను, మేఘమండలము మీదికి ఎగసిపోతాను, మహోన్నతునికి సమానమౌతాను అని నీ మనస్సులో భావించుకున్నావు. కావున నీవు పాతాళానికి, నరకంలో వో మూలకు

త్రోయబడ్డావు" అని వ్రాసాడు - 14,15. ఈ రాజు యావే ప్రభువును ధిక్కరించి గర్వంతో ఈలా భావించుకున్నాడు. తొలి ఆదాము పాపంకూడా యిదే. ఈ యవిధేయతను మనస్సులో పెట్టుకొనే ద్వితీయోపదేశకాండం "నా యాజ్ఞలన్నిటిని నీవు అనుసరించాలి. లేకుంటే నా శాపాలన్నీ నీకు తగులుతాయి" అని హెచ్చరిస్తుంది - 28,15. ఈలా అవిధేయత లేక గర్వమనే పాపాన్ని పూర్వవేద ప్రవక్తలు సర్వత్రా ఖండిస్తూ వచ్చారు. మానవుని పతనానికి ఇది మూలకందం.

## 26. మా తండ్రుల పాపాలు మేమనుభవిస్తున్నాం - విలాప 5,7

ప్రవక్తల భావాల ప్రకారం, యిస్రాయేలు ప్రజల పాపాలు పాపంచేసిన వ్యక్తులను మాత్రమేగాక యిస్రాయేలు ప్రజానీకాన్నంతటినీ బాధిస్తాయి. ఆకాను పాపంచేయగా ఆ పాపం యిస్రాయేలు సైన్యాలన్నిటినీ బాధించి వాళ్ళకు ఓటమి తెచ్చిపెట్టింది - యోషు 7, 10-12. యోషువాకూడ పాపియైన ఆకాను నొక్కణ్ణే కాకుండా కుటుంబ సమేతంగా కాల్చి చంపించాడు - 7,24. యావే యెవరైనా తన్ను ద్వేషించినట్లయితే నాలుగు తరాలదాకా తండ్రుల దోషాలను కుమారులమీదకు రప్పిస్తాడు - నిర్గ 20,5. కనుకనే బాబిలోను ప్రవాసంలో వెతలనుభవిస్తూవున్న యూదులు "మా తండ్రులు పాపంచేసి గతించిపోయారు. మేము మాత్రం వాళ్ళ పాపాల శిక్షను అనుభవిస్తూనే వున్నాం" అనుకుంటారు - విలాప 5,7. "తండ్రులు పచ్చి ద్రాక్షకాయలు తింటే పిల్లలకు పండ్లు పులుపెక్కాయి" అనుకోవడం యిస్రాయేలు ప్రజలకు సామెత ఐపోయింది - యిర్మీ 31, 29. ఈ వాక్యాలన్నిటిని బట్టి పాపం వ్యక్తిని మాత్రమేగాక సమాజాన్ని కూడ బాధించేట్లు యిస్రాయేలు ప్రజలు భావించారని రుజువౌతుంది. కాని పాపంలో వ్యక్తిగత శిక్ష లేదని కాదు. "పాపం చేసినవాడెవడో వాడే మరణిస్తాడు" అని హెచ్చరిస్తాడు యెహెజ్కేలు - 18.4. అంచేత పాపం వ్యక్తిగత శిక్షతోపాటు సామాజిక శిక్షను కూడ తెచ్చిపెడుతుందనే పై వాక్యాల తాత్పర్యం.

## 27. నేను అసూయాపరుణ్ణయిన దేవుణ్ణి - నిర్గ 20,5.

ప్రభువు మోషేతో "నేను అసూయాపరుణ్ణయిన దేవుణ్ణి" అంటాడు - నిర్గ 20,5. భర్త భార్య విషయంలో అసూయ పడినట్లే ప్రభువు కూడ తన ప్రజలను గూర్చి అసూయపడతాడు. అనగా వాళ్ళు అన్యదైవతాలను ఆరాధించటం సహించలేదని భావం. ప్రభువు తన ప్రజలను ప్రేమిస్తాడు గనుకనే, ఆ ప్రజ మేలు కోరుకుంటాడు గనుకనే, వాళ్ళను గూర్చి అసూయపడతాడు. ప్రభువునకు ప్రజలపట్ల వుండే యీ ప్రేమతోడి అసూయను మనసులో పెట్టుకునే యెషయా "నిన్ను సృజించినవాడే నీ భర్త. పరిత్యక్తయై దుఃఖాక్రాంతురాలైన భార్యను భర్త మళ్లా రప్పించుకున్నట్లే, తృణీకృతయైన యౌవనకాలపు భార్యను పురుషుడు మళ్లా పిలిపించుకున్నట్లే, యావే నిన్నూ పిలుస్తున్నాడు" అని వ్రాసాడు

54, 5-6. అనగా ప్రభువు పాపంచేసిన ప్రజను భర్త దుష్టభార్యను వలె విసర్జించాడు. మళ్లా ఆ ప్రజను తలంచుకొని జాలిపడి భర్త భార్యనువలె చేరబిలచాడు. బైబులు భగవంతుడు తన ప్రజలను ఈలా ప్రేమిస్తాడు.

## 28. నీవు నన్ను స్వస్థుణ్ణి చేసినట్లైతే - యిర్మీ 17,14

నరుడు పాపాన్నుండి బయటపడ్డం కోసం, మళ్ళా తన చెంతకు తిరిగిరావడంకోసం, భగవంతుడు సహాయపడతాడు. ప్రభువు తన పాపపు వధువును ఆకర్షించి అరణ్యంలోనికి తీసికొనిపోయి అక్కడ ఆమెతో ప్రేమతో మాటలాడతాడు - హోషే 2, 14. అనగా ప్రభువు పాపపు ప్రజలను అనుగ్రహించి వారిని తన యొద్దకు రాబట్టుకుంటాడని భావం. యావే అనుగ్రహించందే రక్షణ లేదు అంటాడు కీర్తన కారుడు - 4,8. యిర్మీయా ప్రవక్తకూడా "ప్రభూ, నన్ను స్వస్థుణ్ణి చేసినట్లయితే నేను స్వస్థుణ్ణౌతాను. నవు నన్ను రక్షించినట్లయితే నేను రక్షణ పొందుతాను" అని ప్రార్థిస్తాడు - 18,14. ఈలా భగవంతుని సహాయంపొంది మళ్లా అతని దగ్గరకు తిరిగిపోయే నరుడు ధన్యుడు.

## 29. వాళ్ళ పాపాలను ఇంకెన్నడూ జ్ఞాపకం చేసికోడు - యిర్మీ 31,34.

నరుని పరివర్తనమునేది భగవంతు దనుగ్రహించే ఓ కృపావరం. ఈ సత్యాన్ని గమనించాడు గనుకనే ప్రవక్త విలాపవాక్య గ్రంథంలో "ప్రభూ, నీవు మమ్ము నీ తట్టునకు త్రిప్పుకుంటే మేము నీవైపు తిరుగుతాం" అని ప్రార్థించాడు - 5,21. యెహెజ్కేలు ప్రవచనంలో ప్రభువు "పాపాత్ముడు మరణించడం వలనగాదు, మనసు మార్చుకొని బ్రతకడం వలన నాకు సంతోషం కలుగుతుంది" అని అంటాడు. 33,11. ఈ వాక్యం పూర్వవేదమనే గనిలోని అమూల్య రత్నమనాలి! యిర్మీయా ప్రవచనం ప్రకారం ప్రభువు తన ప్రజలతో క్రొత్త నిబంధనం చేసికుంటాడు. ఈమారు రాతి పలకలమీద కాక, వాళ్ళ హృదయాలమీదనే ధర్మవిధులను వ్రాస్తాడు. అతడు వాళ్ళ దోషాలను క్షమిస్తాడు. వాళ్ళ పాపాలను ఇంకెన్నడూ జ్ఞాపకం చేసికోడు - 31, 31-34. ఈ ప్రవచనం నూత్నవేదపు క్రీస్తు సిలువ బలిద్వారా సిద్ధినందుతుంది. ఈలా ప్రభువు పాపియైన నరుణ్ణి ఆదరించి స్వీకరిస్తాడు. అందుకే ప్రవక్త యెషయాగూడ "ప్రభూ, నీవే మాకు తండ్రివి. అబ్రాహాము మమ్మెరుగకపోయినా యిస్రాయేలు మమ్మంగీకరించకపోయినా, నీవుమాత్రం మా తండ్రివే. అనాదికాలం నుండి మా విమోచకుడవని నీకే పేరు గదా" అని ప్రార్థిస్తాడు - 63, 16. నిజాయితీకీ, భక్తిభావానికీ భక్తుడు ఈ ప్రార్థనను నమూనాగా దీసికోవాలి!

## 30. నాయందు నిర్మలహృదయాన్ని సృజించు - కీర్త 51,10

పాపం దేవునికి వ్యతిరేకంగా పోతుంది. దేవుని కృపమాత్రమే ఈ పాపాన్ని క్షమించగలదు. కాని మొదట నరుని హృదయంలో మార్పునేది కలిగితేనేగాని భగవంతుడు

నరుణ్ణి క్షమించడు. కావుననే ఈ మార్పును అనుగ్రహించమని 51వ కీర్తనను వ్రాసిన భక్తుడు ప్రార్థించాడు. అతడు ఈ మార్పును సూచిస్తూ మూడు ఉత్ప్రేక్షలు వాడాడు. అవి "కడుగు" "శుద్ధిచేయి" "సృజించు" అనే క్రియలు.

"నా దోషాలు పోయేలా నన్ను బాగా కడుగు" అని ప్రార్థించాడు - 51,2. ఇక్కడ, చాకలిబట్టలు ఉతికి వాటిని శుభ్రంగాను, తెల్లగాను తయారుచేసినట్లే నన్నూ శుభ్రం చేయమని భావం.

"నా పాపాలు పోయేలా నన్ను శుద్ధిచేయి" అని వేడుకున్నాడు - 51,2. ఇక్కడ, యాజకుడు కుష్ఠరోగిని శుద్ధిచేసినట్లే నన్నూ శుద్ధిచేయమని భావం.

"నా యందు నిర్మల హృదయాన్ని సృజించు" అని మనవిచేసాడు - 51,10. ఇక్కడ "సృజించు" అనే క్రియ ప్రధానమైంది. "దేవుడు మొట్టమొదట భూమ్యాకాశాలను సృజించాడు" అనే ఆదివేదవాక్యంలోకూడా ఇదే క్రియ వాడబడింది. (హీబ్రూ భాషలో "బారా"). బైబుల్లో ఈ క్రియ ఏక్కడవాడబడినా దాని కర్త సర్వత్ర భగవంతుడే. కనుక పాపపరిహారమనేది భగవంతుని సృష్టిగాని నరునిపని కాదు. ఈ పాపపరిహారం భగవంతుని సృష్టికార్యాలన్నిటి లోను మహోదాత్తమైంది. మహా విచిత్రమైంది కూడ. పాపాన్నిగూర్చి పూర్వవేదం బోధించే భావాలన్నీ యీ 51వ కీర్తనలో దట్టంగా కరుడుగట్టుకొని వున్నాయి. ఈ కీర్తనను నిదానంగా అవధానంగా చదువుకుంటే బైబులు రచయితలు చిత్రించిన పాపం ఎలాంటిదో కొంతవరకైనా బోధపడుతుంది.

## 31. నీ పరిశుద్ధాత్మను నా యొద్ద నుండి తీసివేయకు - 51,11

దేవునిలో ముగ్గురు వ్యక్తులున్నారనీ పరిశుద్ధాత్మ కూడ ఓ దైవవ్యక్తియనీ మనకు తెలిసినట్లుగా పూర్వవేద ప్రజలకు తెలియదు. ఐనా పూర్వవేద రచయితలు చాల తావుల్లో దేవుని యాత్మను గూర్చి మాటలాడారు. వాళ్ళ దృష్టిలో దేవుని యాత్మ యనగా దేవుని శక్తి. ఈ శక్తినే నూత్న వేదం ఓ వ్యక్తిగా, పరిశుద్ధాత్మగా పేర్కొంటుంది.

దేవుని యాత్మ పాపపరిహారం కలిగిస్తుందని ప్రవక్తల బోధ. యావే ఆత్మ జ్ఞానాన్నీ వివేకాన్నీ కలిగిస్తుందంటాడు యెషయా - 11,2. "వారి హృదయంమీద నా ధర్మవిధులను వ్రాస్తాను, వారి దోషాలను క్షమిస్తాను" అంటాడు ప్రభువు యిర్మీయా ప్రవచనంలో - 31, 33-34. ఈ ధర్మవిధులనే యెహెజ్కేలు ప్రవక్త దేవుని ఆత్మ అని పిలుస్తాడు. "నా యాత్మను నీయందుంచుతాను. నా విధులను అనుసరించేవాళ్ళనుగా మిమ్ము తీర్చి దిద్దుతాను. మీ యపవిత్రతను పోగొట్టి మిమ్ము రక్షిస్తాను" అంటాడు యెహెజ్కేలు ప్రవచనంలో ప్రభువు - 36,27-29. ఇలా ఆత్మ పాపపరిహారాన్ని అనుగ్రహిస్తుంది. అందుకే యోహాను సువార్తలో కూడ "మీరు పరిశుద్ధాత్మను పొందండి. మీరు ఎవరి పాపాలను క్షమిస్తారో వారి క్షమాపణం లభిస్తుంది అని చెప్పబడింది. 20, 22-23.

## 32. కుమ్రాను భక్తులు

క్రీస్తునకు రెండువందల యేండ్లకు పూర్వమే యెస్సీను లనబడే యూదులు కొందరు యెరూషలేం దేవాలయ సమర్పణలను గర్హించి మృత సముద్రంతీరంలోని కుమ్రాను కొండల్లోనికి వెళ్ళి అక్కడ ఓ విధమైన మఠజీవితం జీవించడం ప్రారంభించారు. వీళ్ళ భావాల ప్రభావం నూత్నవేదంపై కొంతవరకు సోకింది. ఈ కుమ్రాను భక్తుల రచనల ప్రకారం నరుడు పుట్టుకతోనే రెండాత్మలను పొందుతాడు. ఒకటి సత్యాత్మ, జ్యోతిరాత్మ, న్యాయాత్మ. మరొకటి అంధాత్మ, పాపాత్మ. జ్యోతిరాత్మలు వెలుగులో నడుస్తారు. అంధాత్మలు చీకటిలో నడుస్తారు. వీళ్ళు వినాశపుత్రులు, క్షయాత్మలు, నష్టప్రాణులు, పిశాచంచే నడిపింపబడే భ్రష్టజీవులు. ఈ కుమ్రాను శాఖకుచెందిన భక్తుడొకడు హోదయోత్ అనే గ్రంథంలోఈలా వ్రాసాడు. "ప్రభూ, నీ సహాయం లేందే మానవమాత్రుడైన నరుడు నీతిమంతుడు కాలేడని వింటున్నాం. కనుక నీవు నాలో వుంచిన ఆత్మద్వారానే నిన్ను మనవి చేస్తున్నాను. ఈ దాసులకు కలకాలం నీ కృపను అనుగ్రహిస్తూవుండు. నీ పరిశుద్ధాత్మద్వారా నన్ను శుద్ధిచేయి." ఇవి పాపాన్ని గూర్చిన కుమ్రానుభక్తుల కొన్ని భావాలు.

## 33. రెండు నిబంధనల మధ్యకాలం

పూర్వ నూత్న వేదాల మధ్యకాలంలో గ్రీకు భాషలో నైతేనేం, అరమాయిక్ భాషలో నైతేనేం వందల కొలది గ్రంథాలు వెలువడ్డాయి. కాని యివేవీ భగవత్ప్రేరితాలు కాకపోవడం చేత బైబుల్లో చేరలేదు. ఐనా వీనిలోని భావాలు చాల వుదాత్తంగా వుండడంచేత బైబులు సిద్ధాంతాలను వివరించే వేదవిద్వాంసులు సంధియుగంలోని యీ గ్రంథాలనుకూడ అవలోకిస్తుంటారు. ఇక పాపాన్నిగూర్చి యీ గ్రంథాలు బోధించే భావాలను కొన్నిటిని పరిశీలిద్దాం.

ఆదాము పాపంవలన జనసమూహం మృత్యువువాతబడుతూంది. అగ్ని వారిని కాల్చివేస్తుంది.

ఆదాము హృదయక్షేత్రంలో ఓ దుష్టబీజం నాటుకుంది. కోతకాలం వచ్చిందాకా ఈ బీజం పాపపు పండ్లను ఫలిస్తూనేవుంటుంది.

మనం చావును తెచ్చిపెట్టే దుష్కార్యం చేసినాక, యింక దేవుడు నరులకోసం వో అమృతయుగాన్ని కలిగించివుంటే మాత్రం దానివలన లాభమేమిటి?

మనలో వో దుష్టహృదయం బలపడిపోయింది. దానివల్ల మనకు లయమూ, క్షయమూ, వినాశమూ, మృత్యువూ సిద్ధించాయి.

పాపఫలితాన్ని వర్ణించే యీ వాక్యాలన్నీ చక్కగా మననం చేసికోదగ్గవిగదా!

## 34. మీరు మారుమనస్సు పొందండి - మత్త 4, 17.

ఇంతవరకు పాపాన్నిగూర్చి పూర్వవేదం ఏం బోధిస్తుందో చూచాం. ఇక నూత్న వేదం ఏం బోధిస్తుందో పరిశీలిద్దాం. "పరలోక రాజ్యం మీ సమీపంలో వుంది కనుక మారుమనస్సు పొందండి" అంటూ క్రీస్తు బహిరంగ జీవితం ఆరంభించారు - మత్త 4,17. మారుమనస్సు పొందడం దేనికి? పరలోకరాజ్యంకోసం. క్రీస్తే, అతడనుగ్రహించే రక్షణమే, ఈ పరలోకరాజ్యం. ఈ రక్షణం దేనినుండి? పాపాన్నుండి. క్రీస్తు సొంతపేరైన "యేసు" శబ్దానికిగూడ నరులను పాపాన్నుండి రక్షించేవాడనే అర్థం - మత్త 1,21. హీబ్రూభాషలోని "యెహోషువా" శబ్దానికీ గ్రీకుభాషలోని "యేసుస్" శబ్దానికీ ప్రభువు రక్షిస్తాడనే యర్థం. యీ శబ్దాలే మన భాషలో యేసు (జేసు) రూపాలు పొందాయి. పాపం ద్వారా నరుడు తండ్రియైన దేవుని చెంత నుండి వెళ్ళిపోతాడు. అతడు మళ్ళా తండ్రివద్దకు తిరగివస్తేనేగాని పాపపరిహారం లేదు. ఈలా తిరిగి రావాలంటే పాపి మనస్సు మార్చుకోవాలి. దీన్నే మారుమనస్సు పొందడం లేక పరివర్తనం చెందడం అంటాం. ఈ తిరిగి రావడమనే భావాన్ని "మీరు గొర్రెలవలె దారి తప్పిపోయితిరి. కాని యిప్పుడు మీ యాత్మల కాపరి వద్దకు తిరిగవచ్చితిరి" అనే వాక్యంలో చూడవచ్చు - 1 పేతురు 2,25.

## 35. వ్యాధిగ్రస్తుల కోసంగాని ఆరోగ్యవంతులకోసం గాదు - మార్కు 2, 17.

ఏసు నరుల పాపాలను భరించడానికై వచ్చిన బాధామయ సేవకుడు. అతడు వచ్చింది పాపాత్ములకోసంగాని నీతిమంతులకోసం గాదు. ప్రవక్తల్లాగా, స్నాపక యోహానులాగ యేసు కూడ హృదయం మార్చుకొని పరివర్తనం చెందండని బోధించాడు. నరుడు యిలా హృదయం మార్చుకున్నట్లయితే భగవంతుని అనుగ్రహానికి పాత్రుడౌతాడు - మార్కు 1,15.

## 36. నరుణ్ణి అపవిత్రుణ్ణి చేసేది హృదయంలోని దురాలోచనలే - మార్కు 7,20

పాపాన్ని గూర్చిన క్రీస్తు భావాలను నాటి పరిసయుల భావాలతో పోల్చిచూడ్డం గూడ అవసరం. పరిసయులు బాహ్యంగా మోషేధర్మశాస్త్రాన్ని అనుసరిస్తే చాలు అనుకున్నారు. కాని ఏలాంటి హృదయ భావాలతో యీ ధర్మశాస్త్రాన్ని అనుసరించాలో వాళ్ళు గమనింపలేదు. కాని క్రీస్తు బాహ్యాచరణం కంటె హృదయంలోని భావాలు ముఖ్యమన్నాడు - మార్కు 7, 20-23. బాహ్యాచరణానికి విలువ నిచ్చేది విశేషంగా హృదయంలోని ప్రేమభావం - యోహా 15,12. క్రీస్తు సబ్బతును ఆచరించడంలేదని పరిసయులు గొణుగుకున్నారు. పెద్దల పారంపర్యాచారాలు పాటించడం లేదని సణుగుకున్నారు - మార్కు - 7, 2-5. కాని యూదులు యీ యాచారాలన్నిటినీ

పాటించినా, వారి హృదయంలో ప్రేమభావం లేకపోవడంచేత నిష్ఫలమే ఐంది. కనుక క్రీస్తు బోధల ప్రకారం పాపమూ పుణ్యమూ అనేవి కేవలం బాహ్యాచరణంలోగాదు, హృదయగత భావంలో వున్నాయి. పరిసయుల ప్రకారం హృదయగత భావంలోగాదు, బాహ్యాచరణంలో వున్నాయి. మనంకూడ చాలసార్లు యీ పరిసయుల్లాగే పొరపాటు పడుతున్నా మేమో విచారించి చూచుకుందాం.

## 37. పరిసయల నీతికంటె - మత్త 5,20

పరిసయల నీతికంటె మీ నీతి అధికంగాందే మీరు పరలోక రాజ్యంలో ప్రవేశింపలేరు అన్నాడు ప్రభువు శిష్యులతో - మత్త 5,20. ఏమిటి యీ నీతి? పరిసయల నీతి కేవలం బాహ్యాచరణం. శిష్యుల నీతి హృదయంలోని ప్రేమభావం. మొదటిది చాలదు. ఈ రెండవదికూడ అవసరం. క్రీస్తే మోషే ధర్మశాస్త్రాన్ని రద్దుచేయడానికి గాక, పరిపూర్ణం చేయడానికే వచ్చాడు - మత్త 5,17. హృదయంలోని సద్భావంద్వారాగాని ధర్మశాస్త్రాచరణం పరిపూర్ణంకాదు - మత్త 7,12. వెలుపలికి అన్ని చట్టాలూ అనుసరిస్తున్నా లోపలినుండి మాత్రం దుష్టాలోచనలు పుట్టుక వస్తుంటే నరుడు పవిత్రుడు కాదు, అపవిత్రుడే ఔతాడు - మార్కు 7, 21-23.

## 38. కునికిపాట్లుపడే దీపాన్ని ఆర్పివేయడు - మత్త 12,20.

పాపాత్ములు నాశమై పోవాలనిగాదు, మనసు మార్చుకొని నా సముఖంలో బ్రతకాలని నా కోరిక అన్నాడు యావే ప్రభువు. తన తండ్రిలాగే క్రీస్తుకూడ పాపులను ఆదరంతో చూచాడు. “ఆమె అధికంగా ప్రేమించింది. కనుక ఆమె విస్తార పాపాలుకూడ క్షమింపబడ్డాయి” అన్నాడు, పాపాత్మురాలి నుద్దేశించి - లూకా 7,47. “నేడు ఈ యింటికి రక్షణం లభించిం”దన్నాడు, జక్కయనుద్దేశించి - లూకా 19,9 “తల్లీ యిక వెళ్ళి పాపం చేయకుండా బ్రతుకు” అన్నాడు మరో పాపాత్మురాలి నుద్దేశించి - యోహా 8,11. క్రీస్తు కరుణామయుడు. కనుకనే నాటికి 800 యేండ్లకు పూర్వమే యెషయా పల్కిన ప్రవచనాన్ని అతనికి అన్వయించారు సువార్తాకారులు. “అతడు నలిగిన రెల్లుకాడను త్రుంచి వేయడు. కునికిపాట్లు పడుతూవున్న దీపాన్ని ఆర్పివేయడు.” - మత్త 12,21. యెష 42, 13. ఇక్కడ నలిగిన రెల్లుకాడ, కునికిపాట్లుపడే దీపం పాపాత్ములకు ఉపమానాలు. మెస్సీయాయైన క్రీస్తు ఈ కాడను త్రుంచివేయడు. ఈ దీపాన్ని ఆర్పివేయడు. అనగా పాపాత్ములను శిక్షించి నాశంచేయడు. ఆ రెల్లుకాడ మళ్ళీ యెదిగేలా చూస్తాడు. ఆ దీపం మళ్ళా వెలిగేలా చూస్తాడు. అనగా పాపాత్ములు మళ్ళా బ్రతికేలా చూస్తాడు. పూర్వవేదపు భగవంతుడుగాని నూత్నవేదపు భగవంతుడుగాని పాపాన్ని గర్హిస్తాడేగాని పాపిని గర్హించడు.

## 39. ఆయన పిశాచంచే శోధింపబడుతూ - మార్కు 1, 12.

ప్రభువు శోధనలు పొందుతూ పిశాచాన్ని ఎదుర్కొన్నాడు - మార్కు 1, 12-13. అతడు వచ్చింది పాపాన్ని తొలగించేందుకు. పాపానికి అధికారి పిశాచం. కనుక ప్రభువు బహిరంగ జీవితారంభంలోనే పిశాచాన్ని ఎదుర్కొని జయింపవలసి వచ్చింది.

వ్యాధులను నయం చేయడం ద్వారా, దయ్యాలను వెళ్ళగొట్టడం ద్వారా క్రీస్తు పిశాచాన్ని జయించినట్లు నిరూపించాడు. యూదుల భావాలప్రకారం వ్యాధిబాధలు పిశాచాధికారాన్ని సూచిస్తాయి. కనుకనే ప్రభువు అద్భుతంగా వ్యాధులను మాన్పి పిశాచాన్ని కూలద్రోసాడు - 13,16. పక్షవాతరోగిని గుణపరచిన అద్భుతంలో రోగాన్ని నయంచేయడమూ పాపాన్ని పరిహరించడమూ, అనే రెండంశాలూ కన్పిస్తాయి - మార్కు 2, 10-11.

ఇక, దయ్యాలను వెళ్ళగొట్టడంద్వారా గూడ క్రీస్తు పిశాచాన్ని జయించినట్లు నిరూపితమైంది. కనుకనే యూదులు అతడు దయ్యాల సహాయంతో దయ్యాలను వెళ్ళగొడుతూన్నాడు గాబోలు అని అనుమానపడగా, క్రీస్తు "నేను దేవుని ఆత్మతోనే దయ్యాలను వెళ్ళగొడుతూన్నాను. కనుక దైవరాజ్యం సమీపించిందని నిశ్చితమైంది" అన్నాడు - మత్త 12, 28. ప్రభువు మన తరఫున, మనకోసం, పిశాచాలను జయించాడు.

## 40. పిశాచం ఆకాశంనుండి మెరపులా పడిపోయింది - లూకా 10,18

మత్తయి 12, 29లో ఓ బలవంతుడు ఉండేవాడనీ, అంతకన్నా బలవంతుడొకడువచ్చి వాణ్ణి బంధించి వాడియిల్లు దోచుకొని పోయాడనీ చెప్పబడింది. ఈ తొలి బలవంతుడు పిశాచం. అతన్ని జయించి వాని యిల్లు కొల్లగొట్టిన మహాబలవంతుడు క్రీస్తు. అందుకే శిష్యులు క్రీస్తుతో "దయ్యాలు కూడ నీ నామంమీదుగా మాకు లోబడ్డాయి" అని చెప్పగా అతడు "పిశాచం మెరపులాగ ఆకాశంనుండి జారిపడుతుండగా నేను చూచాను" అంటాడు - లూకా 10,18. ఈలా పిశాచం ప్రభువునకు ఓడిపోయింది. కనుక మనమిక ఈ పిశాచం శరణు పొందకూడదు.

## 41. చిన్న కుమారుడు తన యాస్తితో దూరదేశానికి వెళ్ళాడు - లూకా 15,13

బైబులు ప్రకారం పాపం చేయడమనగా తండ్రివంటి వాడైన దేవుని చెంతనుండి వెళ్ళిపోవడం. పశ్చాత్తాప పడడమనగా మళ్ళా ఆ దేవుని సన్నిధికి తిరిగిరావడం. దుడుకు చిన్నవాని సామెతలో ఈ సత్యం వ్యక్తమౌతూంది. అతడు తనవాటాను పంచుకొని తండ్రిని విడచి దూరదేశానికి వెళ్ళిపోయాడు. అక్కడ దుర్వ్యసనాల్లోచిక్కి ఆస్తిని గోల్పోయి వెతలనుభవించి బుద్ధితెచ్చుకొని తండ్రివద్దకు మరలివచ్చాడు. అలా వచ్చి తండ్రితో " నీకూ

పరలోకానికీ విరోధంగా పాపం చేసాను" అంటాడు - 15, 21. ఇక్కడ పరలోకమంటే దేవుడు. అతడు దేవునికి, తన తండ్రికి విరోధంగా పాపం చేసాడు. కాని యిక్కడ దుడుకు చిన్నవాడు చేసిన పాపం ఏమిటి?

పెద్ద కుమారుడు అన్నట్లు ఆస్తిని దుర్వ్యయం చేయడమా? (15,30). కాదు. దుడుకు చిన్నవాని పాపం తండ్రి సన్నిధిలోనుండి వెళ్ళిపోవడం, తండ్రిని ప్రేమించడానికి నిరాకరించడం, ఆ తండ్రిపట్ల కుమారుళ్ళా ప్రవర్తించకుండా వుండడం. పైగా తండ్రి అధికారాన్ని ధిక్కరించి తాను స్వతంత్రంగా వుండాలని కోరుకోవడం. ఆదాము పాపంకూడ యిదే! అక్కడ ఆదాము, ఇక్కడ దుడుకు చిన్నవాడూ, యిద్దరూ అవిధేయులే.

కావున అతడు తండ్రినివీడి దూరదేశానికి వెళ్ళాడంటే స్వతంత్రంగా వుండాలని కోరుకున్నాడు. తండ్రి అధికారాన్ని ధిక్కరించి తనంతట తాను బ్రతకాలని వాంఛించాడు. కాని ఈ వాంఛే అతన్ని దుర్వ్యసనాలకు మరల్చింది. దిక్కూమొక్కూ లేని దీనుణ్ణిగా తయారు చేసింది. ఐనా తండ్రి అతన్ని వదలిపెట్టలేదు. పితృవాత్సల్యంతో అతని రాకకోసం ఎదురుచూస్తూనే వున్నాడు. అతడు తిరిగిరాగానే ఆదరంతో స్వీకరించాడు. చిన్నవాడు తండ్రి ప్రేమను మరలా చవిచూచాడు. ఆ యింట్లో తాను బానిసగాదు బిడ్డడు అని అనుభవపూర్వకంగా తెలిసికున్నాడు. దేవుడు పాపినిగూడ ఈలాగే చూస్తాడు.

## 42. కారుణ్యపు సామెతలు - లూకా 15.

లూకా 15వ అధ్యాయంలో పాపాత్ములపట్ల భగవంతుడు చూపే కారుణ్యాన్ని చిత్రించే సామెతలు మూడున్నాయి. అవి తప్పిపోయిన గొర్రె, తప్పిపోయిన కుమారుడు, తప్పిపోయిన కాసు అనే సామెతలు. ఈ మూడింటిలోను విషయ మొక్కటే. భగవంతుని జాలి.

భగవంతుణ్ణి విడచిపోయినప్పుడు ఈ ముగ్గురూ బాధలనుభవిస్తారు. గొర్రెమేపరిని విడచిపోయి ముండ్లల్లోచిక్కి బాధపడుతుంది. కుర్రవాడు తండ్రిని విడచిపోయి ఆకటికి చిక్కి అలమటిస్తాడు. నాణెం యజమానురాలిని విడచి చీకట్లో వుండిపోతుంది.

సృష్టికర్తయైన భగవంతునికి దూరమైపోయినప్పుడు సృష్టిప్రాణి అస్తిత్వానికి ఇక అర్థమేలేదు. గొర్రె కాపరిని విడచి పోయినప్పుడు అతనికేమి ఉపయోగం కలిగిస్తుంది? కుర్రవాడు తండ్రిని విడచి పోయినపుడు ఆ తండ్రికెలా వుపకరిస్తాడు ? నాణెం యజమానురాలి వస్త్రంనుండి జారిపడిపోయినప్పుడు ఆమెకెలా అక్కరకు వస్తుంది? భగవంతుణ్ణి విడచిపోయిన నరుడూ ఈలాగే. కాని యీ భగవంతుడు ఓ తండ్రిలాగ తన బిడ్డలు మళ్ళా తిరిగి రావాలనే కోరుకుంటూంటాడు. ఔను. పాపియైన నరుడు ఆ తండ్రివద్దకు తిరిగిపోవాలి, అతనితో సమాధానపడాలి. ఇది బైబులు బోధించే పశ్చాత్తాపం.

## 43. లోకముయొక్క పాపాలను భరించే గొర్రెపిల్ల - యోహా 1, 29.

ఇంతవరకు తొలి మూడు సువార్తలను గాలించి చూచాం. ఇక నాల్గవ సువార్తాకారుడుగూడ పాపాన్ని గూర్చి కొన్ని విశేషభావాలు సూచించాడు. ఈ భావాలను కొన్నింటిని పరిశీలించి చూద్దాం. క్రీస్తు తనవద్దకు రావడం చూచి స్నాపక యోహాను "ఇదిగో లోకముయొక్క పాపాలను భరించే దేవుని గొర్రెపిల్ల" అంటాడు - యోహా 1, 29. ఇక్కడ పాపాలను భరించడమనగా పాపాలను పరిహరించడమని భావం. కాని క్రీస్తు మన పాపాలను ఎలా పరిహరిస్తాడు? క్రీస్తుజ్ఞానస్నాన సమయంలో ఆత్మ అతని మీదకు దాగిరావడం చూచి యోహాను ఇలాగన్నాడు. చనిపోయిన క్రీస్తు పార్శ్వంనుండి, నెత్తురు నీళ్ళు వుబికి వచ్చాయి. ఈ నెత్తురు దివ్యసత్ప్రసాదాన్ని సూచిస్తుంది. ఈ నీళ్ళు జ్ఞానస్నానాన్నీ దానిద్వారా పరిశుద్ధాత్మనూ సూచిస్తాయి - యోహా 7, 38-39. అందుకే మరోతావులో యేసు చనిపోతూ "తలవంచి ఆత్మను అప్పగించాడు" అని చెప్పబడింది. యోహా 19,30. ఇక్కడ ఆత్మను అప్పగించాడనగా చనిపోయాడనీ, తన పరిశుద్ధాత్మను విశ్వాసులకు అనుగ్రహించాడనీ రెండర్థాలు వస్తాయి.

ఇక, అపోస్తులులు క్రీస్తునుండి యీయాత్మను పొందుతారు. జ్ఞానస్నానం ఈయడంద్వారా యీ యాత్మను ఇతరులకు అందిస్తారు. ఈ యాత్మద్వారా ఇతరుల పాపాలను పరిహరిస్తారు. ఎప్పుడూ పరిశుద్ధాత్మద్వారానేగాని మనకు పాపపరిహారం జరగదు. కనుక స్నాపక యోహాను ప్రకారం, క్రీస్తు మన పాపాలను భరిస్తాడు లేక పరిహరిస్తాడు అనగా, అతడు మనకు పరిశుద్ధాత్మద్వారా జ్ఞానస్నానమిస్తాడని భావం - యోహా 1, 33.

## 44. చీకటి వెలుగులు - యోహా 3, 20

యోహాను సువార్తలో చీకటి వెలుగు అనే ద్వంద్వ భావాలు కనిపిస్తాయి. వెలుగనగా క్రీస్తు, లేక క్రీస్తు వరప్రసాదం. చీకటి యనగా పాపం. పాపి వెలుగువద్దకు రావడానికి నిరాకరిస్తాడు - యోహా 3, 19. వెలుగంటే అతనికి భయం. కనుక ఆ వెలుగును ద్వేషిస్తాడు. ఈలా ద్వేషించడం గూడ తెలియకగాదు. తెలిసే, బుద్ధిపూర్వకంగానే. కనుక యీ పాపానికి నిష్కృతి లేదు - 9, 41.

## 45. వాళ్ళు నన్ను నిర్హేతుకంగా ద్వేషించారు - యోహా 15,25

పాపి వెలుగును ద్వేషిస్తాడు అన్నాం. క్రీస్తు అద్భుతాలద్వారా అతడు దైవకుమారుడని తెలిసికునే అవకాశం వుంది. కాని యూదులు క్రీస్తు అద్భుతాలనూ క్రీస్తునూ నిరాకరించారు. ఆ క్రీస్తును ద్వేషించారు కూడ - యోహా 15,23-24. ఇదే వాళ్ల మహా పాపం. తెలిసి చేసిన పాపం గనుక దీనికి పరిహారం లేదు.

క్రీస్తును ద్వేషించినపుడు క్రీస్తు తండ్రిని కూడ ద్వేషించినట్లే. అందుకే ప్రభువు అన్యాయపు తోటకాపులు కుమారుని సంహరించి తండ్రి యాస్తిని దోచుకోవాలని చూస్తున్నారని చెప్పాడు - మత్త 21,33-39. ఈ సందర్భంలోనే పరిశుద్ధాత్మకు విరోధంగా కట్టుకునే పాపాలకు పరిహారం లేదు అనే వాక్యాన్ని గూడ పరిశీలించాలి - మత్త 12, 32. ఇక్కడ పరిశుద్ధాత్మ యనగా మరేమోగాదు, దేవుని ప్రేమ. దేవుని ప్రేమను బుద్ధిపూర్వకంగా ధిక్కరించేవాడికి, బుద్ధిపూర్వకంగా దేవుణ్ణి ద్వేషించేవాడికి పరిహారం లేదని భావం. ఎలా వుంటుంది మరి?

**46. మీరు మీతండ్రియైన పిశాచానికి సంబంధించినవాళ్లు** - యోహా 8, 44.

పాపి పిశాచానికి దాసుడు - యోహా 8,34. అతడు దేవుని పుత్రుడు కాడు. పిశాచం పుత్రుడు - పిశాచ పుత్రుడు కనుకనే పైశాచిక కార్యాలు చేస్తుంటాడు. ఈ పిశాచం అబద్ధాలకోరు, నరహంతకుడు.

అబద్ధాలకోరు - 8,44. ఎందుకంటే అబద్ధాలు చెప్పి ఆదామే వలను మోసపుచ్చాడు. నరహంతకుడు. ఎందుకంటే ఆదామును మరణం పాలు చేసాడు - జ్ఞాన 2,24. కయీను ద్వారా హేబేలును చంపించాడు -1 యోహా 3, 12-15. యూదుల ద్వారా క్రీస్తును కూడ చంపించబోతూన్నాడు - 8, 39-44.

యూదులు పిశాచ ప్రభావానికిలోనై క్రీస్తును ద్వేషిస్తున్నారు - 15,23. ఈ వాక్యంలో "యూదులు" అనగా పిశాచ ప్రభావానికి లోబడిన పాపపులోక మంతా గూడ.

**47. నేను లోకాన్ని జయించాను** - యోహా 16,33.

యోహాను భావాల ప్రకారం లోకం పిశాచం అధీనంలో వుంటుంది. క్రీస్తు ఈ లోకాన్ని జయించాడు. ఎలాగంటే, అతని యందు పాపం లేదు - 8,46. అతడు చీకటి యేమాత్రామూ లేని పూర్తి వెలుగు - 8,12. అబద్ధ మేమాత్రమూలేని పూర్ణసత్యం - 1,14. కనుకనే అతడు లోకాన్ని జయించగలిగాడు - 16, 33. లోకాన్నేగాదు, లోకపు నాయకుడైన పిశాచాన్ని గూడ ప్రభువు స్వీయమరణం ద్వారా జయించాడు - 12,31.

**48. దైవబీజం** - 1 యోహా 3,9.

క్రీస్తుని అంగీకరించేవాడు దేవుని బిడ్డ ఔతాడు - యోహా 1,12. అనగా ఆ క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొంది, అతని ద్వారా, అతని తండ్రికి తానూ దత్తపుత్రుడౌతాడు. ఈలా విశ్వాసి దేవుని పుత్రుడు ఔతాడు గనుక, దేవుని బీజం అతని యందుంటుంది కనుక, పాపం చేయడు - 1 యోహా 3,9. కాని, యేమిటి య దైవబీజం? ఈ బీజం క్రీస్తు వాక్కు లేక బోధ. ఈ బోధను నరుడు స్వీకరించాక, పరిశుద్ధాత్మ అతని హృదయంపై

పనిచేసి అతన్ని క్రీస్తు వైపు నడిపిస్తుంది. ఈలా మన హృదయంలో నెలకొని వున్న క్రీస్తు వాక్కు, యీ వాక్కు కనుకూలంగా పవిత్రాత్మ మన యంతరాత్మలో కలిగించే చైతన్యం - ఇది దైవబీజం. దీన్నే యోహాను మరో తావులో "అభిషేకం" అని కూడ పేర్కొన్నాడు - 1 యోహా 2,27. పౌలైతే దీన్నే "దేవుని ఆత్మచేత నడిపింపబడ్డం" అంటాడు - రోమ 8,14.

## 49. దైవబీజం కలవాడు ఇక పాపం చేయడా?

దైవబీజం కలవాడు ఇక పాపం చేయడు అనే యోహాను వాక్యాన్ని పైన చూచాం. కాని, నరుడు క్రీస్తుబోధ ఆలించి అంగీకరించినంత మాత్రాన, పరిశుద్ధాత్మ హృదయంలో వుండి అతన్ని నడిపించినంత మాత్రాన, ఇకపాపం చేయకుండా వుండగలడా? యోహానే "మనం పాపంలేని వాళ్ళమని చెప్పకుంటే మనలను మనమే మోసం చేసికుంటాం" అని వ్రాసాడు -1 యోహా 1,8. మరి "దేవుని బీజం తనయందుంటుంది కనుక నరుడు పాపం చేయడు" అన్న పై వాక్యాన్ని యీ వాక్యంతో సమన్వయపరచడం ఏలాగ? పాపం చేయడు అన్న వాక్యంలో ఆదర్శం చెప్పబడింది. పాపం లేనివాళ్ళమని చెప్పుకోగూడదు అన్న వాక్యంలో ఆచరణలో నరుడు చూపే బలహీనత పేర్కొనబడింది. దైవబీజాన్ని హృదయంలో వుంచుకున్న నరుడు పాపం చేయకూడదు. ఇది ఆదర్శం. ఐనా అతడు దైనందిన జీవితాచరణలో బలహీనతవల్ల పాపం చేస్తూనే వుంటాడు. ఇది, నరుడు యీ యాదర్శాన్ని పాటించలేక ఆచరణలో తప్పిపోతూ వుండడం. ఇందుచేతనే పాపం చేయలేదు అనుకొని ఆత్మవంచనం చేసుకోగూడదు.

## 50. అతడు మన పాపాలకు శాంతి చేస్తాడు - 1 యోహా 2,2.

మనం పాపం చేయకూడదు. కాని బలహీనతవల్ల చేసామో, యేసుక్రీస్తు మన పాపాలకు శాంతి చేస్తాడు. మన పాపాలను ఆ ప్రభువు జాలితో పరిహరిస్తాడు. ఈలా పరిహరించడం కోసమే ప్రభువు శిష్యులకు తన ఆత్మను అనుగ్రహించాడు - యోహా 20, 22.

ఫలితార్థ మేమిటంటే, దైవబీజం మనలోవుంది కనుక అనగా మనం వినిన క్రీస్తుబోధ ప్రభావంవల్ల నైతేనేం, మన హృదయంలోని పరిశుద్ధాత్మ ప్రభావంవల్ల నైతేనేం మనం పాపం చేయడం మానుకోవాలి. ఒకవేళ యీ బోధను, యీయాత్మ ప్రబోధాన్ని గాదని బలహీనతవల్ల పాపం చేసామో పశ్చాత్తాపపడి ప్రభువు ద్వారా పరిహారం పొందాలి. పరిశుద్ధాత్మ ద్వారా ప్రభువు మన పాపాలను పరిహరిస్తాడు.

## 51. పాపాల జాబితాలు

ఇంతవరకు నాల్గు సువార్తలు పాపాలను గురించి బోధించే భావాలను విచారించి చూచాం. ఇక, పౌలుకూడ తాను వ్రాసిన 14 జాబుల్లో పాపాన్ని గూర్చి విస్పష్టభావాలు వెల్లడిచేసాడు. కనుక అతని భావాలనుకూడ కొన్నింటిని పరిశీలించి చూద్దాం. మొదట, ప్రవక్తల్లాగే పౌలుకూడ పాపాల జాబితాలను పేర్కొన్నాడు. రోమీయుల జాబు 1, 29-31లోను, 2 తిమొతి 3, 2-5లోను, 1 కొరింతీయులు 6,9-10లోను ఈ జాబితాలను చూడవచ్చు. ఈలాంటి పాపాలను చేసేవాళ్ళు దైవరాజ్యంలో ప్రవేశింపలేరన్నాడు పౌలు.

## 52. నేను మేలికార్యాలు చేయక పాడుకార్యాలే చేస్తున్నాను - రోమా 7,19.

పౌలు దృష్టిలో పాపం యెలాంటిది? తొలి మానవుడైన ఆదాము ద్వారా పాపం లోకంలో ప్రవేశించింది - రోమా 5,12. అప్పటినుండి అందరూ పాపం చేస్తూనే వచ్చారు. అందరూ దేవుని యనుగ్రహం ద్వారా నీతిమంతులు కావలసినవాళ్ళే - రోమా 3, 23. అందరూ పాపానికి అమ్ముడుపోయినవాళ్ళే - రోమా 7,14.

పౌలు తన అనుభవాన్ని చెప్పుకున్నాడు. అతనికి మేలికార్యాలు చేయాలనీ పాడుకార్యాలు చేయకుండా వుండాలనీ కోరికవుంది. కాని ఈ కోరిక ప్రకారం నడువలేక పోతున్నాడు. చివరకు మేలికార్యాలు మానివేసి పాడుకార్యాలే చేస్తున్నాడు - రోమా 7, 18-19. ఇది పౌలు పాపానుభవం. నరులందరి అనుభవం కూడాను.

## 53. పాపం నన్ను మోసపుచ్చింది - రోమా 7, 11.

పౌలు చాల తావుల్లో పాపాన్ని ఓ వ్యక్తిగా భావించాడు. పాము ఏవను మోసపుచ్చింది - ఆది 3,13. ఈలాగే పాపం కూడ నరుణ్ణి మోసపుచ్చుతుంది - రోమా 7,11. అనగా పాపం సర్పరూపంలో వున్న పిశాచం లాంటిదని భావం. యూదులు క్రీస్తునకు సిలువ మీద శిక్ష విధించారు. కాని దేవుడు క్రీస్తుని యందు పాపానికి శిక్ష విధించాడు - రోమా 8,3. అనగా యూదులు క్రీస్తును శిక్షించినట్లే దేవుడూ పాపాన్ని శిక్షించాడని భావం. ఈ వాక్యాల్లో పాపం ఓ భావం కాదు, ఓ వ్యక్తి. ఈ వ్యక్తిని గూర్చే యోహాను కూడ "యీ లోకాధికారి శిక్షను పొందాడు" అని వ్రాసాడు - 16,11 ఇతడే పిశాచం.

## 54. శరీరానుసారంగా ప్రవర్తించే వాళ్లు చనిపోతారు - రోమ 8,13.

పౌలు చాల తావుల్లో శరీరాన్ని గూర్చి మాటలాడతాడు. ఈ "శరీర" శబ్దం అతని జాబుల్లో ఓ పారిభాషిక పదం. గల 5,16 శరీరేచ్ఛలను పేర్కొంటుంది. రోమ

6,12 చావునకు లోబడిన శరీరం అంటుంది. ఈ శరీరం దేవునకు విరోధమైంది - రోమ 8,7. మృత్యువునకు దారి తీసేది - రోమ 8,13.

పూర్వవేదంలో "శరీరం" అంటే బలహీనపునరుడు. నాశమయ్యే నరుడు. అందుకే యెషయా "సర్వశరీరులును గడ్డివంటి వాళ్లు, వాళ్ల అందమంతా అడవి పూవు లాంటిది" అన్నాడు - 40,6. పౌలు జాబుల్లో శరీరమంటే పాపం పనిచేసే కార్యరంగం. పాపం శరీరాన్ని సాధనంగా వాడుకొని నరుని చేత పాపం చేయిస్తుంది. అంచేత పాపంలాగే శరీరం కూడ నరునికి శత్రువౌతుంది.

## 55. పాపమిచ్చే జీతం మరణం - రోమా 7,23.

పాపం తనకు పనిచేసే వాళ్లకిచ్చే వేతనం మరణం. అనగా పాపం చేసే నరుడు చనిపోతాడు - రోమా 6,23. ఇక్కడ చనిపోవటమంటే యేమిటి? పాపి యీ భౌతిక జీవితానికీ మరణిస్తాడు, శాశ్వత మోక్షజీవితానికీ మరణిస్తాడు. అనగా అతడు శారీరకంగా చనిపోతాడు. ఆ పిమ్మట మోక్షానికి వెళ్ళడమూ ప్రభుదర్శనం పొందడమంటూ వుండదు. నీతిమంతులు రక్షింపబడుతూవుంటే పాపులు నశిస్తూవుంటారు - 1 కొ 1, 18.

## 56. శత్రువర్గాలు

నరుణ్ణి పాపానికి పురికొల్పే శక్తులు నాల్గున్నాయి. మొదటిశక్తి నరునిలోని ఆశాపాశాలు. ప్రతివాడు స్వీయ దురాశలచేత యీడ్వబడి శోధనలు పొందుతూన్నాడు అంటుంది యాకోబు జాబు 1, 13. రెండవది, లోకం - 1 యోహా 2,16. విశేషంగా లోకంలోని ధనమూ సిరిసంపదలూ నరుణ్ణి శోధిస్తాయి - 1తిమొ 6,9. మూడవది, శరీరం. శరీరం ఆత్మకు విరోధంగా పనిచేస్తుంది - గల 5,17. నాల్గవది, పిశాచం. లోకమంతా పిశాచప్రభావానికి లోనైయుంది -1 యోహా 5,19. యీ నాలుగు శత్రువర్గాలనుండి క్రీస్తు పరిశుద్ధాత్మద్వారా మనలను రక్షిస్తాడు.

## 57. ప్రభువైన యేసునుండి రక్షణం - రోమా 7,25

నరుడు పాపానికి బానిస అయ్యాడు. అతడు మంచికార్యాలు చేయాలనుకున్నా గూడ పాడు కార్యాలే చేస్తున్నాడు. అతనిలో యేదో శక్తివుండి అతన్ని చెరబడుతూ వుంది. సొంతశక్తితో యీ పాపాన్ని జయించలేక అతడు బాధపడుతూ వున్నాడు. ఇక, అతన్ని కాపాడి రక్షించేదెవరు? ప్రభువైన యేసు - రోమ 7, 25.

పాపపు మానవుడు పాపపు ఆదాముతో కలసి పోయినట్లే రక్షితుడైన మానవుడు రక్షకుడైన రెండవ ఆదాముతో కలసిపోతాడు. ఆమీదట అతడు క్రీస్తునందు క్రొత్తప్రాణి ఔతాడు - 2 కొ 5,17. శరీరమందుగాక ఆత్మయందు జీవిస్తాడు - రోమ 8,9. అతడుగాదు, అతనియందు క్రీస్తే జీవిస్తూవుంటాడు - గల 2, 20.

## 58. దైవజ్ఞానం -1 కొ 1,25

తండ్రి క్రీస్తు ద్వారా మన పాపాన్ని పరిహరించాడు, నిర్మూలించాడు. ఈ పాప నిర్మూలనం తండ్రి విజ్ఞానాన్ని చాటుతుంది. క్రీస్తు దేవుని శక్తి, దేవుని జ్ఞానం. నరులు దేవుడు వెర్రివాడనుకున్నారు. కాని దేవుని వెర్రితనం నరుల జ్ఞానంకంటె మించిన జ్ఞానం- 1 కొ 1, 24. దేవుడు తన్ను ప్రేమించేవారికి యెల్లవిషయాలు మేలు కలిగించేలా చేస్తాడు - రోమ 8,28. కనుక పాపంకూడ తన భక్తులకు కీడు కాదు మేలు కలిగించే లాగే చేస్తాడు. ఈలా క్రీస్తు తండ్రి క్రీస్తు ద్వారా నరులను రక్షించి పాపపరిహారం చేయాలి అనుకోవడాన్నే పౌలు చాలా తావుల్లో "రహస్యం" లేక "మర్మం" అని పిలుస్తాడు - ఎఫె 1,9. ఇదే అనాదికాలంనుండి తండ్రి సిద్ధంచేసిన రక్షణప్రణాళిక. యీ ప్రణాళికకు కట్టువడే క్రీస్తు మనలను రక్షించారు.

## 59. మీరు ఖరీదుపెట్టి కొనబడినవాళ్లు - 1కొ 7,23.

ఈలా క్రీస్తుద్వారా రక్షితుడైన నరుడు క్రీస్తునందు జీవిస్తుండాలి. తనకోసంగాక క్రీస్తుకోసం బ్రతుకుతూండాలి. పౌలు కొరింతీయులకు వ్రాస్తూ "మీరు మీ సొత్తుకాదు, ఖరీదుపెట్టి కొనబడినవాళ్ళు" అని హెచ్చరించాడు 1 కొ 7,23. ఏం ఖరీదు? పూర్వవేదంలోని యూదుల్లో ఎవరైనా పేదతనంవల్ల బానిసలుగా అమ్ముడు పోయినట్లయితే, వారి దగ్గరి బంధువులు మూల్యమిచ్చి మళ్ళా ఆ బానిసలను యజమానుల వద్దనుండి కొనేవాళ్ళు. ఈలా వాళ్ళకు విడుదల లభించేది. ఈ మూల్యానికే క్రయధనమనిపేరు. యిస్రాయేలు ప్రజలు ఈజిప్టులో ఫరోరాజులకు బానిసలుగా వున్నపుడు యావే ప్రభువు వాళ్ళను విడుదల చేయించాడు. కాని యిక్కడ యావే ప్రభువు ఫరో రాజులకు క్రయధన మేమీ చెల్లించలేదు. ఇక నూత్నవేదంలోని ప్రజలమైన మనం పాపంద్వారా పిశాచమనే యజమానునికి బానిసలమైపోయాం. క్రీస్తు సిలువ మరణం చెంది మనలను ఈ బానిసాన్నుండి విడిపించాడు. అతడు తన నెత్తుటినే మన తరపున క్రయధనంగా ఒడ్డాడు. కాని ప్రభువు తన నెత్తురును పిశాచానికి క్రయధనంగా సమర్పించలేదు. ఈ నెత్తురే

యిక్కడ "ఖరీదు" అని పేర్కొనబడింది. అనగా క్రీస్తు నెత్తురుచేత రక్షింపబడినవాళ్ళు క్రీస్తు ప్రజల్లాగే మెలగుతూండాలనీ, పాపాన్ని విసర్జించి దివ్యజీవితం జీవిస్తూండాలనీ భావం.

## 60. అతడు మన పాపాలకు శాంతి చేసేవాడు - 1 యోహా 2,2.

ఒకమారు క్రీస్తుబోధ అర్థంచేసికొని, జ్ఞానస్నానం పుచ్చుకొని. పరిశుద్ధాత్మను పొందాక మళ్లా పాపంలో పడిపోయినట్లయితే అలాంటివాళ్ళ మనసు త్రిప్పడం అసాధ్యమంటుంది హెబ్రేయుల పత్రిక - 6, 6. ఇలాంటివాళ్ళు తమపాపంద్వారా క్రీస్తును మళ్ళా సిలువ వేస్తారు. ఈ వాక్యం అలవాటు ప్రకారం చేసే మామూలు పాపాలనుగాక, క్రీస్తును నిరాకరించి క్రైస్తవమతంలో నుండి వైదొలగిపోవడమనే పాపాన్ని పేర్కొంటుంది. మనం ఈలా క్రైస్తవమతం నుండి వైదొలగిపోంగాని, జ్ఞానస్నానం పుచ్చుకొని పరిశుద్ధాత్మను పొందాకగూడ బలహీనతవల్ల మళ్ళామళ్ళా పాపం చేస్తుంటాం. ఇలా చేయకూడదు. కాని బలహీనతవల్ల పాపంచేసామో ఒక్కొటే ఒక్క శరణ్యం. మళ్ళా క్రీస్తే మన పాపాలను పరిహరించాలి. ఆ ప్రభువు దయామయుడు కనుక మన పాపాలకు శాంతి చేయడానికి సిద్ధంగానే వుంటాడు -1 యోహా 2,2. కావున ఆ ప్రభువు నెదుట మన పాపాన్ని ఒప్పుకొని క్షమాపణం పొందుతూండాలి. పైగా, మన నిజాయితీని చూపించడం కోసం రోజురోజూ "తండ్రీ, మా పాపాలను క్షమించు అని ప్రార్థిస్తునే వుండాలి" - లూకా 11,4.

## 61. ఆ కృపాసింహాసనం వద్దకు వెళ్దాం - హెబ్రే 4,16.

హెబ్రేయ పత్రికాకర్త క్రీస్తు దేవదూతల కుటుంబంలో పుట్టివుండవచ్చు గదా, నరుల కుటుంబంలోనే యెందుకు పుట్టాలి అని ప్రశ్న వేసికొని, అన్ని విషయాల్లోను తన సహోదరుల వంటివాడు కావడం కోసం అని జవాబు చెప్పాడు - 2,17. క్రీస్తు అచ్చంగా మనలాంటివాడు. మనలా శోధింపబడ్డాడు, మనలా శ్రమ పొందాడు. కనుక నేడు శోధింపబడే మనకూ సహాయం చేయగలడు, చేస్తాడు - 3,18. అతడు మనలాగే నరుడు గనుక నరులమైన మన బలహీనతలను అర్థం చేసికుంటాడు. మన బలహీనత పట్లా, శోధనలపట్లా, పాపాలపట్లా, కోపాన్నిగాదు కనికరాన్నే చూపుతాడు. ఉత్థాన క్రీస్తు మోక్షంలో తండ్రిచెంత మన తరఫున అమరియున్న కృపాసింహాసనం. మనం చనువుతో యీ కృపాసింహాసనాన్ని సమీపిస్తువుండాలి. నమ్మికతో ఈ యుత్థానక్రీస్తును ప్రార్థించి సమయోచితమైన సహాయాన్ని పొందుతూండాలి. ఆయా యాపదలనూ శోధనలనూ జయించడానికి అవసరమైన వరప్రసాదాన్నీ సహాయాన్నీ ఉత్థాన క్రీస్తు మనకు తప్పకుండా అనుగ్రహిస్తాడు - 4,14-16.

# ౨. రక్షణం



విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| 1. | రక్షణం | నంబర్లు | 1-11 |
| 2. | విమోచనం | ,, | 12 -17 |
| 3. | క్రయధనం | ,, | 18 -22 |
| 4. | ప్రాయశ్చిత్తం | ,, | 23 - 30 |
| 5. | నెత్తురు చిలకరించడం | ,, | 31 - 47 |
| | (1) పాస్క గొర్రెపిల్ల నెత్తురు | | 31 - 34 |
| | (2) నిబంధన రక్తం | | 35 - 40 |
| | (3) ప్రాయశ్చిత్త బలులు | | 41 - 47 |
| 6. | సూచక వ్యక్తులు | | 48 - 56 |
| 7. | క్రీస్తు మనోభావాలు | | 57 - 63 |


## 1. ప్రభువే రక్షణాన్ని ప్రసాదించేవాడు - యెష 12,2

బైబులు చాల తావుల్లో ప్రభుని "రక్షకుడు" అని పిలుస్తుంది. ద్వితీ 32,15 ప్రకారం యిస్రాయేలు ప్రజలు క్రొవ్వి కన్నుగానక యావేను విస్మరించారు. ప్రభువు వారికి రక్షణాన్ని ప్రసాదించేవాడు. రాతిమీద నిలిస్తే యేలా సురక్షితంగా వుంటుందో ఆ ప్రభువుమీద ఆధారపడితే అలా సురక్షితంగా వుంటుంది. యెషయా ప్రవచనం 12,2 ప్రభువే నాకు రక్షణం ప్రసాదించేవాడు అంటుంది. అదే ప్రవచనం బాధామయ సేవకుణ్ణిగూర్చి మాటలాడుతూ "భూదిగంతాలవరకు నా రక్షణం వ్యాపించేలాగ నిన్ను అన్యజాతులకు వెలుగుగా నియమించాను" అంటుంది - 49,6. కనుక ఈ వాక్యాలన్నీ ప్రభుని రక్షకుడు అని పేర్కొంటాయి. ఆ ప్రభువు మనకూ రక్షకుడు కావాలని ప్రార్థిద్దాం.

## 2. రక్షణంలో మూడు దశలు

కాని ప్రభువు రక్షకుడు ఏలా అయ్యాడు? అతడు ప్రజను దేనినుండి రక్షిస్తాడు? యిస్రాయేలీయుల తలంపుల ప్రకారం ప్రభువిచ్చే రక్షణంలో మూడుదశలు కన్పిస్తాయి. మొదటిదశలో ప్రభువు కేవలం శత్రువులనుండి ప్రజను రక్షిస్తాడు. సంసోను ఫిలిస్తీయులను

జయించాడు. న్యాయా 15,18 ప్రకారం అది ప్రభువిచ్చిన రక్షణం. రెండవ దశలో ప్రభువు ప్రజను ఈజిప్టు బానిసాన్నుండి రక్షిస్తాడు. ఐగుప్తీయులు తమ్ము తరుముకుంటూ రావటం జూచి యూదులు భీతిజెందారు. మోషేవారిని హెచ్చరించి "భయపడకండి. యావే మీకు ప్రసాదించబోయే రక్షణాన్ని నేడే కన్నులారజూస్తారు" అంటాడు - నిర్గ 14,13. మూడవదశలో ప్రభువు ప్రజను పాపాన్నుండి రక్షిస్తాడు. యెషయా 33, 22-24 ప్రకారం యావే న్యాయాధిపతి. అతడు ప్రజలను రక్షిస్తాడు. వాళ్ళ పాపాలను పరిహరిస్తాడు. ఈలా బైబుల్లో రక్షణపదం మొదట శత్రువులనుండి తప్పించుకోవడానికి, ఆ పిమ్మట ఈజిప్టునుండి తప్పించుకోవడానికి, అటుపిమ్మట పాపాన్నుండి పరిహారం పొందడానికి వాడబడింది. రానురాను ఈ రక్షణశబ్దం ప్రభువిచ్చే సమస్తభాగ్యాలను సూచిస్తుండేది. మనమూ ప్రతినిత్యం ప్రభురక్షణాన్ని పొందుతుంటాం!

### 3. ఐగుప్తు దాస్యాన్నుండి రక్షణం - నిర్గ 3,10

ప్రభువు మోషే ద్వారా ఐగుప్తులోని తన ప్రజలను రక్షించాలని సంకల్పించుకున్నాడు. ఐగుప్తు పాపపు దేశం. ఎందుకంటె అచటి ప్రజలు ప్రభువును గాక విగ్రహాలను కొలిచేవాళ్ళు. కనుక ప్రజలు ఐగుప్తునుండి దాటివచ్చాక ఆ దేశానికి వెలుపల హోరెబు పర్వతం మీద ప్రభువును ఆరాధించాలి - నిర్గ 3,12. ఐగుప్తు దేశానికి దూరంగా యెడారిలో ఉత్సవం జేసికోవాలి - 5,1. ఐగుప్తు విగ్రహాలను ఆరాధించే పాపపు దేశం - యోషు 24,14. కనుకనే ప్రభువు తన ప్రజలను ఈ దేశాన్నుండి ఆవలకు నడిపించుకొని పోయాడు. ఈలా నడిపించుకొని పోవడమే రక్షణం. పూర్వవేదపు రక్షణాలన్నిటిలోను ఈ ఐగుప్తు రక్షణం ముఖ్యాతి ముఖ్యమైనది. ఇది నూత్న వేదంలో క్రీస్తు సాధించబోయే రక్షణాన్ని సూచిస్తూ వుంటుంది. పూర్వ వేదపు భగవంతుడుగాని నూత్న వేదపు భగవంతుడుగాని ప్రధానంగా "రక్షకుడు". కనుక ఆ ప్రభువు ప్రసాదించే రక్షణానికి మనమూ పాత్రులం గావాలని అడుగుకుందాం.

### 4. బాబిలోను దాస్య విముక్తి - యెహెజ్కేలు 34,23.

క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దిలో నెబుకద్నెసరు అనే రాజు యూదులను బాబిలోను దేశానికి బందీలనుగా గొనిపోయాడు. ఇది రెండవ బందీగ్రహణం. యూదులు ఆ దేశంలో 70 యేండ్లు ప్రవాసబాధ లనుభవించాక ప్రభువు మళ్ళా వాళ్ళను రక్షించడానికి పూనుకున్నాడు. యెహెజ్కేలు ప్రవచనం ప్రకారం యావే తన ప్రతినిధియైన అభిషిక్తుని పంపిస్తాడు. అతడు ప్రజలనే గొర్రెలను కాపరిలా కాచి సంరక్షిస్తాడు - 34, 22-24. ఇతడే మెస్సీయా. కాని ప్రభువిచ్చే యీ రక్షణం బాబిలోను బంధనం నుండి మాత్రమేగాదు, పాపాన్నుండి గూడ ప్రజలను రక్షిస్తుంది. ప్రభువు ప్రజలకు క్రొత్త హృదయాన్ని,క్రొత్త ఆత్మను అనుగ్రహిస్తాడు. వాళ్ళు అతన్ని కొలిచే ప్రజలౌతారు. అతడు వాళ్ళను రక్షించే దేవుడౌతాడు-

36, 25-28. పై ఐగుప్తు దాస్య విమోచనంలాగే ఈ బాబిలోను దాస్యవిమోచనం గూడ నూత్నవేదంలో క్రీస్తు ఆర్జించబోయే పాపవిమోచనాన్ని సూచిస్తుంది. కనుక దాస్య విమోచకుడైన ప్రభువు మనలనూ పాపదాస్యాన్నుండి విమోచించాలని ప్రార్థిద్దాం.

**5. ఆకాశమా రక్షకుని వర్షించు** - యెష 45,8.

చివరినాళ్ళలోని పూర్వవేదప్రజలు గంపెడంత ఆశతో రక్షకుని కోసం ఎదురుచూచారు. "ఆకాశమా రక్షకుని వర్షించు! భూమీ నీతిమంతుని మొలకెత్తించు!" అని ప్రార్థించారు - యెష 45,8. అనగా ఆకాశంనుండి వాన వచ్చినట్లుగానే రక్షకుడూ రావాలనీ, భూమినుండి పైరు మొలకెత్తినట్లుగానే రక్షకుడూ మొలకెత్తాలనీ ఆ ప్రజల కోరిక. యెషయా ప్రవచనం 53,10 ప్రకారం ఈ రక్షణం ఒక్క యూదప్రజలకు మాత్రమేగాక, సమస్త జాతులకూ లభిస్తుంది. భూదిగంతాల వరకూ నివసించే సమస్త జాతి జనులూ ప్రభు రక్షణాన్ని దర్శిస్తారు.

క్రీస్తు రాకముందు రెండు శతాబ్దాల కాలం కుమ్రాను కొండల్లో వసించిన యెస్సీను భక్తులు ఈ రక్షకుని కోసం యెదురు చూచారు. గ్రీకు రోమను తాత్వికులూ ఈ రక్షకుని దర్శింపగోరారు. మన దేశంలోని హైందవ ఋషులూ అవతారవాదాన్ని సృజించి తారకునికోసం ఎదురుచూచారు. ఇన్ని దేశాల్లో ఇన్ని కాలాల్లో ఇందరు మహాభక్తులు యెదురుచూచిన ప్రభువును అంగీకరించి అనుసరించే భాగ్యం మాత్రం మనకు అబ్బింది!

**6. అతనికి రక్షకుడని పేరు** - మత్త 1,21.

పైన నుడివిన మహాభక్తుల ప్రార్థనా ఫలితంగా, యావే ప్రభువు పంపగా వచ్చిన క్రీస్తు మన మంటి మీద అవతరించాడు. అతనికి "రక్షకుడు" అని పేరు. ప్రజలను పాపాన్నుండి రక్షిస్తాడు గనుక ఈ పేరు పెట్టారు. (హీబ్రూ భాషలో రక్షకునకు "యెహోషువా" అని పేరు. ఈ పేరే గ్రీకు అనువాదంలో "యేసుస్" ఐంది. తెలుగు బాషలోకి వచ్చేప్పటికల్లా "యేసు" లేక "జేసు" ఐంది). ఈ శిశువు జన్మింపక ముందే జెకర్యా "ఆయన సేవకుడైన దావీదుని వంశంలో దృఢమైన రక్షణాన్ని నెలకొల్పాడు" అని యీ బిడ్డను గూర్చి ప్రవచనం పల్కాడు - లూకా 1, 69. ఈ శిశువు జన్మించాక సిమ్యోను యీ బిడ్డను జూచి "నీవు సకల ప్రజలకు సిద్ధం చేసిన యీ రక్షణాన్ని నేను కన్నులార జూచాను" అని తండ్రిని స్తుతించాడు - లూకా 2,30. ఔను, సకల ప్రజలకోసమూ మన కోసమూ ఉద్దేశింపబడిన రక్షణం క్రీస్తు!

**7. నేడు ఈ యింటికి రక్షణం లభించింది** - లూకా 19,9.

ఈ ప్రభువు పుట్టిన నాటినుండి చనిపోయేవరకూ రక్షకుడుగానే వ్యవహరించాడు. బహిరంగ జీవితంలో అతడు నిర్వహించిన రక్షణకార్యాలు చాలావున్నాయి. జక్కయలాంటి

పాపులకు రక్షణం అనుగ్రహించాడు - లూకా 19,9. తప్పిపోయి ముండ్లపొదల్లో చిక్కువడిన గొర్రెల్లాంటి పాపులను భుజాలమీద మోసికొని వచ్చాడు -15,5. కుష్ఠరోగుల్లాంటి వ్యాధిగ్రస్తుల బాధలు మాన్పి కాపాడాడు - 17,19. మనపట్ల యీ ప్రభువు రక్షకుళ్ళా వ్యవహరించాలని మనవి చేద్దాం.

## 8. యేసు నామంమీదుగానే రక్షణం - అచ 4,12.

యేసు చనిపోయేప్పుడూ రక్షకుడుగానే వ్యవహరించాడు. ఓమారు అతడు "ప్రాణాన్ని దక్కించుకొనేవాడు పోగొట్టుకుంటాడు, పోగొట్టుకునేవాడు దక్కించుకుంటాడు" అని బోధించాడు - మత్త 10,39. ఈ బోధ ప్రకారమే మనకోసం తన ప్రాణాలను బలిగా అర్పించాడు - యోహా 10,15. ఈ క్రీస్తు ఆత్మార్పణం ద్వారా యావే ప్రభువు మళ్ళా తన ప్రజను రక్షించాడు. నాటి ఐగుప్తురక్షణం లాంటిదే యీ రక్షణం గూడ - యోహా 3,16. కనుకనే క్రీస్తు ఉత్థానానంతరం పేత్రు, యేసు నామంమీదుగా దప్పితే మరి యే నామంమీదుగా గూడ యిక రక్షణం లభించదు అని వుపన్యసించాడు - అచ 4,12. అనగా పిత లోకానికి నిర్ణమించిన యేకైక రక్షణం యేసునామం, యేసు అనేవ్యక్తి. మనమూ నిత్యం ఈ నామాన్ని నమ్ముకొని బ్రతికే భాగ్యంకోసం ప్రార్థిద్దాం.

## 9. అతడు సమస్త దుర్నీతినుండి మనలను విమోచించాడు - తీతు 2, 14

క్రీస్తు మనలను దేన్నుండి రక్షించినట్లు? సమస్త దుర్నీతినుండి. అనగా సమస్త పాపాన్నుండి. పూర్వవేదంలోని ప్రభువు యూదులను ఐగుప్తునుండి, అచటి విగ్రహారాధనమనే పాపాన్నుండి రక్షించాడన్నాం. అదేవిధంగా ఈ నూత్నవేద ప్రభువుగూడ మనలను పాపాన్నుండి రక్షిస్తాడు. అచటి ప్రజలు ఐగుప్తు ప్రభువైన ఫరోకు బానిసలు. మనం పిశాచమనే మరో ప్రభువునకు, అతడు తెచ్చిపెట్టే పాపానికి బానిసలం. క్రీస్తు ఈ పిశాచ దాస్యాన్నుండి మనలను విముక్తి చేసాడు.

ఐగుప్తు విమోచనం తర్వాత యూదప్రజలు యావే సొత్తు అయ్యారు. యావే ప్రజగా పరిగణింపబడ్డారు. క్రీస్తు మరణం తర్వాత మనమూ క్రీస్తు సొత్తుఔతాం. క్రీస్తు ప్రజగా తయారౌతాం. మనం క్రైస్తవులం అని చెప్పుకుంటాం. అనగా క్రీస్తునకు చెందిన ప్రజలం, అతన్ననుసరించే ప్రజలం. ఈ భావాన్ని చక్కగా జీర్ణంజేసికునే భాగ్యం అడుగుకుందాం.

## 10. నోవా ఓడ - 1 పేత్రు 3,20

కాని క్రీస్తు ఆర్జించిన ఈ రక్షణంలో మనమేలా పాలు పొందుతాం? రెండు కార్యాలద్వారా. మొదటిది, ప్రభువునందు విశ్వాస ముంచడం వలన. పౌలు ఫిలిప్పిలోని

జైలు అధికారికి బోధిస్తూ, ప్రభువును విశ్వసించమని చెప్పాడు - అచ 16,31. రెండవది, ఆ ప్రభువులోనికి జ్ఞానస్నానం పొందడం ద్వారా -1 పేత్రు 3,20-22. నోవా కుటుంబం ఓడవలన జలప్రళయం నుండి రక్షింపబడింది. ఈ యోడ నూత్నవేదపు జ్ఞానస్నానాన్ని సూచిస్తుంది. ఓడ నోవా కుటుంబాన్నిమల్లె జ్ఞానస్నానం మనలను రక్షిస్తుంది; క్రీస్తు రక్షణం మనకు సంక్రమించేలా చేస్తుంది. కనుక మన విశ్వాసమూ, జ్ఞానస్నానమూ మనకు యథార్థ రక్షణాన్ని అనుగ్రహించాలని అడుగుకుందాం.

## 11. రక్షణంకోసం నిరీక్షిస్తుండాలి - రోమా 8,24.

ప్రభు రక్షణం మనకు యీవరకే లభించింది - తీతు 3, 4. ఆయన కృపచేత మనం యీవరకే రక్షింపబడ్డాం - ఎఫె 1,5. ఐనా మన రక్షణం ఇంకా పూర్తికాలేదు. కావున యీ రక్షణం కోసం నిరీక్షిస్తుండాలి- రోమ 8,24. రక్షకునికోసం కనిపెట్టుకొని వుండాలి. ఆ ప్రభువు మళ్ళా విజయంచేసి మనకు ఉత్థానం ప్రసాదిస్తాడు; మన యీ భౌతిక శరీరాన్ని మహిమపరుస్తాడు. అప్పుడుగాని మన రక్షణం పూర్తిగాదు. కనుక అప్పటిదాకా మనం వేచివుండాలి - ఫిలి 3, 20-21. ఈ మధ్యకాలంలో మనం భూలోక వస్తువుల మీదగాక పరలోక వస్తువుల మీద మనసు నిల్పి జీవిస్తుండాలి - కొలో 3,1-4. మనమింకా పూర్తి రక్షణాన్ని పొందలేదు అన్న యీ సత్యమే ప్రస్తుతపు మన నైతిక జీవితానికి, పుణ్య జీవితానికి ఆధారం కావాలి. కావున యీ భావిరక్షణం కోసం భక్తిశ్రద్ధలతో కృషిచేసే భాగ్యం అడుగుకుందాం.

## 12. యావే విమోచకుడు

ఇంతవరకు బైబులు భగవంతుడు "రక్షకుడు" అన్న అంశం విచారించాం. ఇక అతడు "విమోచకుడు" అన్న విషయాన్ని విలోకిద్దాం.

బైబులు యావేను విమోచకుడు అని పిలుస్తుంది. ఎందుకు? విమోచకుడనగా విడిపించేవాడు. మోషే ధర్మశాస్త్రం ప్రకారం, యూదులు పేదలై ఆస్తిపాస్తులు కోల్పోయినట్లయితే, దగ్గరి బంధువులు వాళ్ళ ఆస్తిని మళ్ళా సంపాదించి పెట్టాలి - లేవీ 25,25. పేదతనంవల్ల బానిసలుగా అమ్ముడువోయినట్లయితే దగ్గరి బంధువులు వాళ్ళను బానిసాన్నుండి విడిపించాలి - లేవీ 25, 47-49. ఈలాగే ఓ యూదుని యెవరైనా చంపినట్లయితే దగ్గరి బంధువులు శత్రువులమీద పగ తీర్చుకోవాలి - సంఖ్యా 35,19. ఈ అమ్ముడుపోయిన యూదుల ఆస్తిపాస్తుల నైతేనేం బానిసలుగా అమ్ముడుపోయిన యూదజనాన్నైతేనేం విడిపించే దగ్గరి బంధువులూ, హత్యకు ప్రతిహత్యజేసి శత్రువులమీద పగతీర్చుకునే దగ్గరి బంధువులూ పూర్వవేదంలో "విమోచకులు" అని పిలువబడతారు. అనగా వీళ్ళు విడిపించేవాళ్లు లేక రక్షకులు అని భావం. ఇక యూదజనాని కంతటికీ విమోచకుడు, అన్ని అవసరాల్లోనూ వాళ్ళను విమోచించి కాపాడే దగ్గరిబంధువు

యావేప్రభువు. ఈ బైబులు భగవంతుడు మన పట్లా విమోచకుళ్ళా, దగ్గరి బంధువులా మెలగాలని అడుగుకుందాం.

## 13. యావే యిచ్చిన విమోచనం - నిర్గ -19, 5-6.

యావే ప్రభువు యిస్రాయేలు జనానికి యేలా విమోచకుడయ్యాడు? ఆ ప్రజలు ఐగుప్తు రాజులకు బానిస లయ్యారు. ఆ రాజులు పెట్టేబాధలు భరించలేక యావే ప్రభువునకు మొరపెట్టుకున్నారు - నిర్గ 3,7. ప్రభువు ఐగుప్తీయులను అణచివేసి ఆ ప్రజలను బానిసాన్నుండి విడిపించాడు. అంతమాత్రమే గాదు. వాళ్ళతో ఓ వొడంబడిక గూడ చేసికున్నాడు. ఈ నిబంధనం ద్వారా యూదులు యావే సొంత ప్రజలయ్యారు. యావే యెన్నుకున్న జనమయ్యారు. ఈ నిబంధనమే వాళ్ళను పవిత్రప్రజను చేసింది. యావేకు సమర్పించింది. విమోచకుడైన యావేను ఆరాధించి స్తుతించే యాజక ప్రజనుగా తయారుచేసింది -నిర్గ 19, 5,6. ఇక్కడ ప్రభువు ప్రజను దాస్యాన్నుండి విడిపించడం, అటుపిమ్మట వాళ్ళతో నిబంధనం గావించుకొని వాళ్ళను సొంత ప్రజనుగా తయారుచేసికోవడం - ఇవి రెండూ ఒకే కార్యంగా భావించాలి. మనమూ భగవంతుని ప్రజలం అన్న భావాన్ని సంస్మరించుకుందాం.

## 14. యూదులనే యెందుకు ఎన్నుకోవాలి?- ద్వితీ 7, 6-8.

ఆనాడు లోకంలో అన్ని జాతులుంటే ప్రభువు యూదజాతినే యెందుకు ఎన్నుకోవాలి? వాళ్ళు అధిక సంఖ్యాకులనా? కాదు. యోగ్యతములనా? ఎంత మాత్రమూ కాదు. ప్రభువు ఆ జనాన్ని ఆదరించి చల్లని చూపునజూచాడు. ఆ జనాన్ని ప్రేమించాడు, ఆ జాతినే ఎన్నుకున్నాడు. అవ్యాజమైన ప్రేమ ఒక్కటే ఆయన యీ యెన్నికకు కారణం. యూదులు ప్రభువు తమ్మే యెందుకు ఎన్నుకోవాలి అని ప్రశ్న వేసికొని, ప్రభువు అవ్యాజ ప్రేమే తమ యెన్నికకు కారణం అని జవాబు చెప్పారు. ప్రభువు తమ పట్ల చూపిన ప్రేమకు విస్తుపోయారు. భక్తిభావంతో ఆ ప్రేమను మననం చేసికున్నారు. మన యెన్నికకూ, మన క్రైస్తవానికీ దేవుని ప్రేమ వొక్కటే కారణం అనాలిగదా!

## 15. నీ విమోచకుడైన యావే - యెష 54, 5-10.

ప్రభువు ఐగుప్తు దాస్యాన్నుండి మాత్రమే గాదు, బాబిలోను బానిసాన్నుండి గూడ ప్రజలను విడిపించాడు. బాబిలోను ప్రవాసంలో రోజులు సాగిస్తూవున్న యూదులను ఓదారుస్తూ ప్రవక్త యీలా హెచ్చరించాడు : "నిన్ను సృజించిన ప్రభువే నీ భర్త. పరిత్యక్తయై దుఃఖాక్రాంతురాలైన భార్యను భర్త మళ్ళా రప్పించుకున్నట్లే, తృణీకృతయైన యౌవనకాలపు భార్యను పురుషుడు మళ్లా పిలిపించుకున్నట్లే, యావే నిన్ను పిలుస్తున్నాడు. నిమిషమాత్రం

ప్రభువు నిన్ను విసర్జించాడు. మళ్లా నీ విమోచకుడు నిన్ను చేరదీస్తాడు. పర్వతాలు తొలగిపోయినా, కొండలు కదిలి పోయినా ప్రభువు కృపమాత్రం నిన్ను విడనాడదు. అతడు చేసికొని నిబంధనం తొలగిపోదు - యెష 54, 5-10. బైబులు ప్రవక్తలు పల్కిన ఓదార్పు పలుకుల్లో శ్రేష్ఠమైన పలుకులివి! ఈ వాగ్దానం ప్రకారమే ప్రభువు కోరెషు అనే పర్శ్యను రాజును బంపి బాబిలోను రాజులను నాశం జేయించాడు. యిస్రాయేలీయులను మళ్లా రెండవమారు విమోచించి పాలస్తీనాకు తీసుకొనివచ్చాడు. భక్తుడు ప్రతిదిన జీవితసన్నివేశాల్లో గూడ భగవంతుడిచ్చే యీ విమోచనాన్ని గుర్తిస్తూవుండాలి.

## 16. భావి విమోచనం - యిర్మీయా 31, 33-34

యిస్రాయేలు ప్రజలు రెండు ప్రవాసాలు అనుభవించారు. రెండు విమోచనాలు చవిచూచారు. కాని పూర్వవేద ప్రవక్తలు భావిలో రాబోయే మరో విమోచనాన్ని గూడ సూచించారు. ప్రభువు కడపటి రోజుల్లో తన ప్రజతో మరో నిబంధనం చేసికుంటాడనీ, ఈమారు రాతి పలకలమీద గాకుండ ప్రజల హృదయాల మీదనే తన నిబంధనలను లిఖిస్తాడనీ, జనుల దోషాలను పూర్తిగా క్షమిస్తాడనీ చెప్పాడు యిర్మీయా. - 31, 33-34. యెహెజ్కేలు ప్రవచనం ప్రకారంగూడ ప్రభువు ప్రజలతో మళ్లా ఓ ఒడంబడిక చేసికుంటాడు. వాళ్ళలోని రాతి గుండెను దీసివేసి మెత్తని హృదయాన్ని అనుగ్రహిస్తాడు. తన ఆత్మను వాళ్ళపైకి అన్పుతాడు. వాళ్ళు తన కట్టడలు అనుసరించేలా జేస్తాడు - 36, 26-27. ఈ ధోరణిలోనే కీర్తన కారుడుకూడ "యిస్రాయేలూ యావేమీద ఆశపెట్టుకో. ఆయన యొద్దనుండి సంపూర్ణ రక్షణం లభిస్తుంది" అంటాడు - 130,7. ప్రవక్తల ఈ ప్రవచనాలన్నీ క్రీస్తు సాధించే భావి విమోచనాన్ని సూచిస్తాయి. మనం నేడనుభవించేది ఈ విమోచనమే!

## 17. క్రీస్తు విమోచనం - మార్కు 10,45.

పూర్వవేద విమోచనాలు క్రీస్తు విమోచనాన్ని సూచించాయి అన్నాం. ఈ క్రీస్తు మన మంటి మీద అడుగుపెట్టి నూత్నవేద ప్రజలమైన మనలను విమోచించడానికి సంసిద్ధుడై "మనుష్య కుమారుడు తన ప్రాణాన్ని విమోచనం క్రయధనంగా సమర్పించడానికి వచ్చా" డని పల్కాడు. మార్కు 10,45. అనగా క్రీస్తు సిలువపై చనిపోయి మనకు పాపవిమోచనం గలిగిస్తాడు. అతని మరణం ద్వారా మన పాపం పరిహారమౌతుంది. మనమూ అతన్ని ఆరాధించే ప్రజలమౌతాం - తీతు 2,14. అతడు సాధించిన విమోచనం వల్ల మనం నీతిమంతుల మౌతాం - రోమ 3, 24. ఈరీతిగా పూర్వవేద భగవంతుడు ప్రజలను ఐగుప్తు దాస్యాన్నుండి విమోచించాడు. నూత్నవేద భగవంతుడు ప్రజలను

పిశాచదాస్యాన్నుండి విమోచించాడు. మనమూ ఈ విమోచనానికి పాత్రులం కావాలని అడుగుకుందాం.

## 18. స్వకీయ సంపాద్యం - నిర్గ 19,5.

మీదటియంశాల్లో ప్రభువు విమోచకుడని చూచాం. ఇక "క్రయధనం" అనే మాటను చూడాలి. పైన ఉదాహరించిన మార్కు వాక్యంలో క్రయధనం అనే శబ్దాన్ని గుర్తించాం గదా! ఏమిటి ఈ క్రయధనం? కొనడానికి వెచ్చించే డబ్బు క్రయధనం. పేదయూదుల పొలముపుట్ర అమ్ముడుపోతే దగ్గరి బంధువులు ఆ యాస్తిని స్వాధీనం జేసికున్న యజమానునికి ధనమిచ్చి దాన్ని వదలిపెట్టించేవాళ్ళు అన్నాం. ఈలా సమర్పించిన ధనాన్నే క్రయధనమనేవాళ్ళు. అనగా ఆ పొలాన్ని విడిపించడం కోసం చెల్లించిన సొమ్ము అన్నమాట. ఇక, యావేగూడ ఫరో బానిసానికి అమ్ముడుపోయిన తన ప్రజలను విడిపించాడు, తిరిగి కొన్నాడు. అందుచేత ఆ ప్రజలు అతనికి "స్వకీయ సంపాద్యం" అయ్యారు- నిర్గ 19,5. అనగా అతని సొంతసొత్తు అయ్యారు. అంతకు ముందు వారు ఫరోసొత్తు. ఇకమీదట యావే సొత్తుగా మారారు. ప్రభువు ఫరో దాస్యాన్నుండి ప్రజలను విడిపించడం విమోచనం. అలా విడిపించిన ప్రజలను సొంత సొత్తుగా జేసికోవడం సంపాద్యం. ఈ విమోచన సంపాద్యాలు రెండూ ఒకే కార్యంగా భావించాలి.

ఇక, యావేప్రభువు ఫరో చక్రవర్తి దాస్యాన్నుండి ప్రజలను విడిపించినపుడు అతనికి క్రయధనం చెల్లించాడా? యావేప్రభువు ప్రజలను విడిపించాడు లేక కొన్నాడు అంటుంది బైబులు. అంతవరకే పేదవాళ్ళ ఆస్తిని విడిపించడమనే ఆచారంతో ఉపమానం. కాని ఫరో చక్రవర్తికి యావే క్రయధన మిచ్చాడని బైబులు ఎక్కడా చెప్పదు. ఇక్కడ పై యాచారంతో ఉపమానం చెల్లదు.

## 19. మీరు విలువబెట్టి కొనబడినవాళ్లు - 1 కొ 6, 20.

1 కొరింతీయులు 6,20 లోను 7,23 లోను క్రైస్తవులు "విలువ బెట్టి కొనబడినవాళ్ళు" అని చెప్పబడింది. ఏమి విలువ? పూర్వవేద ప్రజలు ఫరో చక్రవర్తికి దాసులైయుండగా యావే ప్రభువు వాళ్ళను విడిపించాడు. అలాగే నూత్న వేద ప్రజలు పిశాచమనే చక్రవర్తికి దాసులమయ్యారు. క్రీస్తు ప్రభువు ఈ ప్రజలను దాస్యానుండి విడిపించాడు. యావే యిస్రాయేలీయులను ఫరో అనే యజమాను నుండి కొన్నట్లే క్రీస్తు కూడ మనలను పిశాచమనే యజమాను నుండి కొన్నాడు. ఈలా కొనడానికి క్రీస్తు అర్పించిన క్రయధనం అతని నెత్తురే! ఈలా క్రీస్తు నెత్తురు ధారవోసి పిశాచం చేతుల్లో నుండి మనలను విడిపించాడు కనుకనే మనం "విలువబెట్టి కొనబడినవాళ్ళం" అయ్యాం. ఇక, క్రీస్తు దయ్యానికి తన నెత్తురును క్రయధనంగా అర్పించాడా? యావే ఫరోకు క్రయధన మర్పించినట్లుగా పూర్వ వేద మెక్కడా చెప్పదన్నాం. ఆలాగే క్రీస్తు దయ్యానికి నెత్తురు

అర్పించినట్లుగా నూత్నవేద మెచ్చటా చెప్పదు. పూర్వ నూత్నవేదాలు ప్రజలు "కొనబడినవాళ్ళు" అంటాయి. కాని యావే ఫరోకుగాని, క్రీస్తు పిశాచానికిగాని సొమ్ము చెల్లించారు అని బైబులెక్కడా వాకొనదు. కొనుగోలు వల్ల మనం ప్రభువుసొత్తు అయ్యాం. కలకాలం ఆ ప్రభువుకే చెందివుండే భాగ్యం ప్రసాదించమని అడుగుకుందాం.

## 20. పరిశుద్ధ ప్రజలు - 1 పేతురు 2,9.

1 పేతురు 2,9లో నిర్గమకాండ 19, 5-6 వాక్యాలు ఉదహరింపబడ్డాయి. ఈ వాక్యంలో చాలా భావాలు ఇమిడి వున్నాయి. 1. నూత్న వేద ప్రజలు పూర్వవేద ప్రజల్లాగే "పరిశుద్ధ జనం". పూర్వవేద ప్రభువూ నూత్నవేద ప్రభువూ ఈ ప్రజను ఎన్నుకొని వీళ్ళతో ఒడంబడిక చేసికున్నారు గనుక వీళ్ళు పరిశుద్ధ ప్రజలయ్యారు. 2. ఈ ప్రజ "రాజులైన యాజక సమూహం". యావేను క్రీస్తును కొలిచి ఆరాధించేవాళ్ళు గనుక ఈ జనులు యాజకులు. భగవంతుని సేవించే వాళ్ళు కావడంచేత వీళ్ళు రాజులు. బైబులు భావాల ప్రకారం భగవంతుణ్ణి సేవించేవాళ్ళు అతని కొలువుకాళ్ళు. కనుక ప్రభువును సేవించడమనగా రాచరికం చేయడమే. 3. ఈ ప్రజ దేవుని "సొత్తు". యావే క్రీస్తు యీ ప్రజను ఫరోనుండి పిశాచాన్నుండి విడిపించి తమ సొంతసొత్తు చేసికున్నారు. ఇకమీదట వీళ్ళు ఈ ప్రభువులకు చెందినవాళ్ళు. ఈలా పూర్వనూత్నవేద ప్రజలు పరిశుద్ధ ప్రజలు, రాజులైన యాజకులు, దేవుని సొత్తు. ఈ మూడు లక్షణాలూ మనపట్లా అక్షరాల వర్తించాలని అడుగుకుందాం.

## 21. నీ రక్తమిచ్చి ప్రజలను కొన్నావు - దర్శ 5,9.

దర్శనగ్రంథం 5,10లో "నీ రక్తమిచ్చి దేవుని కొరకు ప్రజలను కొన్నావు. వారిని మా దేవునికి యాజకులనుగాను, రాజ్యంగాను నియమించావు" అని పెద్దలు క్రీస్తు నుద్దేశించి క్రొత్తపాట పాడతారు. ఇక్కడ క్రీస్తు మన విమోచనం కొరకు స్వీయరక్తాన్నే క్రయధనంగా ఒడ్డాడని చెప్పబడింది. ఈలా విమోచింపబడిన ప్రజలు ఏలా యాజకులూ రాజులూ ఔతారో ముందే వివరించాం. ఇదే గ్రంథం 14,3 లో గూడ మోక్షవాసులను "కొనబడినవాళ్లు" అనిపిలుస్తుంది. క్రీస్తు వీళ్ళను పిశాచ దాస్యాన్నుండి కొన్నాడని పూర్వమే విశదీకరించాం. ప్రభువు నెత్తురు మన విలువ. ఈ యంశాన్ని తలంచుకొని భక్తిభావంతో మననం చేసికుందాం.

## 22. వెండి బంగారాలతో గాదు - 1 పేతురు 1, 18.

1 పేతురు 1,18లో మనం వెండి బంగారంలాంటి క్షుద్ర వస్తువుల చేతగాక, అమూల్యమైన క్రీస్తు రక్తంచేత విమోచింపబడ్డామని చెప్పబడింది. ఈ వాక్యంమీద వ్యాఖ్యవ్రాస్తూ నాల్గవ శతాబ్దికి చెందిన పునీత క్రిసోస్తం ఓ వుపమానం చెప్పాడు. "ఓ

మంచి యజమానునికి చెడ్డసేవకు డొకడుండే వాడు. ఆ యజమానుడు ఈ దుష్టసేవకునికి నీతి గరపడంకోసం అతన్ని మరో యజమానుని వశంజేసాడు. ఈ రెండవ యజమానుడు సేవకుణ్ణి క్రూరంగా శిక్షించాడు. అప్పుడు దుష్టసేవకుడు బుద్ధితెచ్చుకొని, తొలి యజమానుడే మేలు! అతడు నన్ను తండ్రిలా ఆదరించేవాడు. కనుక అతనివద్దకే మళ్లా తిరిగి వెళ్తాను అనుకున్నాడు. ఆ సేవకుని పరివర్తనం జూచి తొలి యజమానుడు జాలిపడి క్రయధనమిచ్చి అతన్ని విమోచించాడు. అతన్ని తన సొంతసొత్తు చేసికొని ఆదరంతో జూచాడు." యావే యిస్రాయేలీయులను గాని క్రీస్తు నూత్న వేద ప్రజలనుగాని విమోచించిన తీరు ఈలాంటిది. దుడుకు చిన్నవాని సామెతను మనసులో బెట్టుకొని క్రిసోస్తం ఈ వుపమానం అల్లాడు. ఆ దుడుకు చిన్నవాని లాగే మనమూ తండ్రియైన దేవుణ్ణి ఆశ్రయిద్దాం.

## 23. కరుణాపీఠం - నిర్గ 25, 17-22

మీది యంశాల్లో క్రయధనాన్ని గూర్చి విచారించి చూచాం. ఇక "ప్రాయశ్చిత్తం" అనే భావాన్ని పరిశీలిద్దాం. ప్రభువు పది యాజ్ఞలను ఓ రాతి పలకపై వ్రాసి మోషేకిచ్చాడు. అతడు ఈ యాజ్ఞలను ఓ పెట్టెలో పదిలపరచాడు. ఈ పెట్టెకే మందసం అనిపేరు. ఎడారికాలాన ఈ మందసం గుడారంలో తెరవెనుక వుండేది. ఈ మందసంమీద ఓ బంగారు ఫలకం వుండేది. దీనికి కరుణాపీఠం లేక కరుణాఫలకం అనిపేరు. ఈ కరుణా పీఠంపై కెరూబులు అనబడే దేవదూతల బొమ్మలు రెండుండేవి. ఈ కెరూబులు విప్పిన రెక్కలతో కరుణాపీఠాన్ని కప్పుతూ ఆ ఫలకంవైపు చూస్తూన్నట్లుగా అమర్చబడి వుండేవి. కరుణాఫలంమీది యీ రెండు కెరూబుల మధ్యగల ఖాళీస్థలంలో నుండి ప్రభువు మోషేతో మాటలాడుతూండేవాడు. నిర్గమకాండ 25, 17-22లో ఈ వివరాలన్నీ చూడవచ్చు. బైబులు భగవంతుడు కరుణ గలవాడు. అతడు మనపట్లా జాలిచూపుతూండాలని అడుగుకుందాం.

## 24. కరుణాపీఠం ఏం చేస్తుంది?

కరుణాపీఠం మూడు పనులు చేసేది. మొదటిది, ఈ పీఠం యావేకు సింహాసనంగా ఉపకరించేది. ప్రభువు దానిపై నెలకొని వుండేవాడు. అందుకే కీర్తన కారుడు "ఆయన కెరూబుల మీద ఆసీనుడై యున్నాడు" అంటాడు - 99,1. మొదటి సమూవేలు గ్రంథ 4,4 కూడ "కెరూబుల మధ్య ఆసీనుడై సైన్యములకు అధిపతిగావుండే ప్రభువు మందసం తెప్పించారు" అంటుంది. ఈలా దైవ సాన్నిధ్యం నెలకొని వుండడంవల్ల గుడారంలో ఈ మందసముండే స్థలం పవిత్రమైంది. అందుకే సామాన్య ప్రజలు ఈ స్థలంలోకి ప్రవేశించేవాళ్ళు కాదు. ప్రధాన యాజకుడు యేడాదికి ఒకతూరి మాత్రమే ఈ పవిత్రస్థలంలో అడుగు పెట్టేవాడు. అతడూ మందస మీది కరుణాపీఠం వైపు చూచేవాడు గాదు. గుడారం లోపలికి వెళ్ళగానే ధూపం అర్పించి ఆ ధూపపుపొగ కరుణాపీఠాన్ని

కప్పివేసేలా చేసేవాడు - లేవీ 16,13. రెండవది, ఆ కరుణాపీఠం మీదనుండి ప్రభువు ప్రజలతో మాటలాడేవాడు - నిర్గ 25,22. మూడవది, ఈ కరుణాపీఠం ప్రజల పాపాలకు ప్రాయశ్చిత్తం చేయడానికి ఉపకరించేది. మన పాపాలనూ ప్రభువు పరిహరిస్తూండాలని అడుగుకుందాం.

## 25. నెత్తురు చిలకరింపు - లేవీ 16, 12-16.

కరుణాపీఠం ప్రాయశ్చిత్తానికి ఏలా వుపకరిస్తుంది? యూదులు ఏడాదొకొకసారి ప్రాయశ్చిత్తదినాన్ని జరుపుకునేవాళ్ళు. ఈ దినానికే కిప్పూర్ అనిపేరు. ఈకిప్పూరు రోజున ప్రధాన యాజకుడు కోడెదూడల నెత్తురు తీసికొని గుడారంలోనికి వెళ్ళేవాడు. తెర వెనుకనున్న మందసాన్ని సమీపించి కరుణాపీఠం పైని ఒకమారు, దాని ముందట నేలమీద ఏడుసారులు ఆ నెత్తురు చిలకరించేవాడు. అలాగే మేకనెత్తురు కూడ తీసికొని వెళ్ళి కరుణాపీఠంపై ఓమారు, దానిముందట ఏడుమార్లు చిలకరించేవాడు. యూదుల భావం ప్రకారం ప్రజల పాపాలవల్ల గుడారం అపవిత్రమౌతుంది. ఈలా నెత్తురు చల్లడంవల్ల మలినమైన పవిత్ర స్థలానికి ప్రాయశ్చిత్తం చేసినట్లు. ఈ నెత్తురు చిలకరింపువల్ల గుడారం మళ్ళా పవిత్రమౌతుంది. ప్రజల పాపాలూ పరిహారమౌతాయి. ఈ తంతంతా లేవీయకాండ 16, 12-16లో వర్ణింపబడింది.

కిప్పూరుదినాన జరుపబడే ప్రాయశ్చిత్త కర్మ మాత్రమే గాక, సంవత్సరం పొడుగునా యూదులు ప్రజల పాపపరిహారం కోసమై మరికొన్ని ప్రాయశ్చిత్తకర్మలు జరిపేవాళ్ళు. వీటికే "పాపపరిహార బలులు" అని పేరు. లేవీయ కాండ 4,1-6 ఈ కర్మకాండను వర్ణిస్తుంది. యాజకుడు కోడెదూడను గుడారపు గుమ్మమువద్దకు తీసికొనివచ్చి దాని మీద చేయి ఉంచుతాడు. ఈ చిహ్నం ద్వారా ప్రజలు ఓ విధంగా ఆ దూడతో ఐక్యమౌతారు. ఆ పిమ్మట దూడను వధించి దాని నెత్తురుతో గుడారంలోనికి ప్రవేశించి తెర యెదుట నిలువబడి ఏడుసార్లు మందసంవైపు ఆ నెత్తురును చిలకరిస్తాడు. యాజకుడు ఈలా నెత్తురును చిలకరింపగా కరుణా ఫలకంమీది ప్రభువు ప్రజల పాపాలను పరిహరిస్తాడు. కనుక ఈ ప్రాయశ్చిత్త బలులన్నిటిలోను నెత్తురు చిలకరింపు ప్రధానం. బైబులు భగవంతుడు పాపాన్ని సహింపనివాడు. ఆ ప్రభువు మన పాపాన్ని గూడ పరిహరించాలని అడుగుకుందాం.

## 26. ప్రాయశ్చిత్తం - విజ్ఞాపన ప్రార్థనం -సంఖ్యా 16,47

పూర్వవేదంలో "ప్రాయశ్చిత్తం" చేయడమనగా సాధారణంగా నెత్తురు చిలకరించడమని భావం. అనగా కరుణా ఫలకంపై నెత్తురు చిలకరించి పాపపరిహారం చేయడమని అర్థం. కాని కొన్ని తావుల్లో ప్రాయశ్చిత్తం చేయడమనగా ప్రజల తరపున విజ్ఞాపన ప్రార్థనం చేయడమని గూడ అర్థం. నిర్గమకాండ 32,30లో మోషే, బంగారు

దూడను ఆరాధించి చెడిపోయిన ప్రజలకోసం ప్రాయశ్చిత్తం చేయడానికి కొండమీదికెక్కి పోతాడు. ఈ ప్రాయశ్చిత్తం ప్రజల తరపున అతడు చేసిన ప్రార్థనమేగాని నెత్తురు చిలకరించడం గాదు. సంఖ్యాకాండ 16,47లో అహరోను గుడారంలో ప్రవేశించి ధూపంవేసి ప్రజలకోసం ప్రాయశ్చిత్తం చేస్తాడు. ఈ ప్రాయశ్చిత్తంగూడ విజ్ఞాపన ప్రార్థనమేగాని నెత్తురు చిలకరించడంగాదు. అందుకే తరువాత వచ్చిన జ్ఞానగ్రంథకర్త ఈ వాక్యాన్ని స్మరించుకుంటూ "అహరోను ధూపం ప్రార్థన అనే సేవాసాధనాలనువాడి ప్రజలకోసం ప్రాయశ్చిత్తం చేసాడు" అని నుడివాడు - జ్ఞాన 19,21 ప్రాయశ్చిత్తానికి విజ్ఞాపన ప్రార్థనమనే అర్థాన్నిచ్చే పట్టులు ఈలాంటివే మరికొన్ని ఉన్నాయి. ప్రభువు మన తప్పిదాలను క్షమించాలని ప్రార్థిద్దాం. వేరేవాళ్ళ తప్పిదాలను గూడ క్షమించాలని విజ్ఞాపనం చేద్దాం.

## 27. క్రీస్తు కరుణాపీఠం - రోమా 3,25.

పూర్వవేదంలో కరుణా పీఠం అంటే ఏమిటో చూచాం. నూత్న వేద రచయితలు క్రీస్తు మన కరుణా పీఠం అన్నారు. పౌలు రోమీయుల జాబు 3,25లో పిత క్రీస్తును కరుణా ఫలకంగా జేసి ప్రజలకు చూపించాడని వ్రాసాడు. పూర్వవేదంలోని కరుణాపీఠంపై నెత్తురు చిలకరించడం ద్వారా పాపానికి ప్రాయశ్చిత్తం జరిగిందన్నాం. ఇక నూత్నవేదంలో మన కరుణా ఫలకం క్రీస్తు. సిలువమీద వ్రేలాడుతూ నెత్తురులతో తడిసిన క్రీస్తుదేహం, రక్తసిక్తమైన ఆ కరుణాపీఠం లాంటిది. ఆ కరుణా పీఠంమీదలాగే ఈ సిలువమీద వ్రేలాడే క్రీస్తునందుగూడ యావేప్రభువు నెలకొని వున్నాడు. కనుకనే అతడు క్రీస్తుద్వారా ప్రపంచాన్ని తనతో సమాధానపరచుకోగల్గాడు - 2 కొ 5,19.

అయినా యిక్కడ కరుణాఫలకానికీ, సిలువ మీద వ్రేలాడే క్రీస్తు ఒడలికీ కొన్ని భేదాలు గుర్తించాలి. కరుణాఫలకంమీద జంతువుల నెత్తురు చిలకరించేవాళ్ళు. కాని క్రీస్తు తన యొడలి నుండి సొంత నెత్తురే ఒలికించాడు. కరుణాపీఠం గుడారంలో వుండేది. ఎవ్వరికీ కనుపించేది గాదు. ప్రధాన యాజకుడు తప్పితే మరెవ్వరూ దాని చెంతకు వెళ్ళేవాళ్ళుగాదు. కాని సిలువపై వ్రేలాడే క్రీస్తును పిత అందరకూ చూపించాడు. దేవాలయపు తెర చినిగిపోవడంతో లోపలి గర్భాగారం అందరకూ కనుపించింది - మత్త 27,51. ఈ తెర చినగక ముందు అనగా పూర్వవేదవిధానం చెల్లుబడి అయ్యేప్పుడు, దైవ సాన్నిధ్యంలోనికి అందరూ వెళ్ళేవాళ్ళుగాదు. కాని ఓమారు అది చినిగిపోయాక, అనగా పూర్వవేద విధానం అడుగంటాక నూత్న దైవసాన్నిధ్యమైన క్రీస్తు దగ్గరకు అందరూ వెళ్ళవచ్చు. ఈ ప్రభువు నేడు మనపట్ల గూడ కరుణా ఫలకంలా మెలగుతూండాలని అడుగుకుందాం.

## 28. ప్రాయశ్చిత్తం చేయడానికై - హెబ్రే 2,17.

హెబ్రేయ పత్రిక 2,17 క్రీస్తు ప్రజల పాపాలకొరకు ప్రాయశ్చిత్తం చేయడానికై ప్రధాన యాజకుడయ్యాడు అని చెప్తుంది. ఈ ప్రాయశ్చిత్తం క్రీస్తు విజ్ఞాపన ప్రార్థనమే

పూర్వవేదంలోనే ప్రాయశ్చిత్తం అనే పదానికి విజ్ఞాపన ప్రార్థనమనే అర్థంవుంది అన్నాం. హెబ్రేయ పత్రికాకారుడూ ఈ యర్థాన్నే స్వీకరించాడు. కావుననే ఇదేపత్రిక 5,7 లో "అతడు నరుడై యున్నపుడు మహా రోదనంతో కన్నీళ్ళతో దేవునకు ప్రార్థనలు, యాచనలు సమర్పించాడు" అని చెపుతుంది. ఈ వాక్యాలు క్రీస్తు ఒలివేతు తోపులోను సిలువమీదను బాధలనుభవిస్తూ మన కోసం చేసిన ప్రార్థనలను సూచిస్తాయి. క్రీస్తు ఉత్థాన మయ్యాక గూడ పిత యెదుట మన కోసం విజ్ఞాపనం చేస్తూంటాడు - 7, 25. క్రీస్తు చిందించిన రక్తం ఆనాడు హేబెలు చిందించిన రక్తంకంటే అధికంగా మన తరపున మొరవెడుతుంది - 12,25. ఈ చివరి వాక్యంలో గూడ నెత్తురు చిందించిన ప్రాయశ్చిత్తం చేయడమంటే విజ్ఞాపన ప్రార్థనం చేయడమనే భావం. మోక్ష క్రీస్తు విజ్ఞాపనం మనలను పాపాన్నుండి రక్షిస్తూండాలని అడుగుకుందాం.

## 29. అతడే మన పాపాలకు ప్రాయశ్చిత్తం - 1 యోహా 2,2.

"ఎవరైన బలహీనతవల్ల పాపంచేస్తే నీతిమంతుడైన యేసుక్రీస్తు అనే ఉత్తరవాది మోక్షంలో తండ్రిచెంత వుండనే వున్నాడు. అతడే మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసేవాడు" అంటుంది 1 యోహాను 2,2. ఈ వాక్యంలో చాలా భావాలున్నాయి. (1) యేసుక్రీస్తు "నీతిమంతుడు". ఇక్కడ నీతిమంతుడంటే మన పాపాలను క్షమించేవాడు. మనకు రక్షణమనే నీతిని అనుగ్రహించేవాడు. ఈ పత్రిక 1,9 లో గూడ ఇదే భావం కన్పిస్తుంది. (2) ఈ యేసుక్రీస్తు "ఉత్తరవాది". శత్రువులు న్యాయస్థానంలో మనపై నేరం ఆరోపించినపుడు మన తరపున వాదించేవాడు ఉత్తరవాది. అతడు శత్రువు తెచ్చిన అభియోగంనుండి మనలను కాపాడతాడు. ఇక్కడ మన శత్రువెవరు? దర్శన గ్రంథం 12,10 "రేయింబవళ్ళు మన సోదరులమీద నేరం మోపే సైతానుని కూలద్రోసారు" అంటుంది. ఈ దర్శన గ్రంథకర్త జకర్యా 3,1 నుండి ఈ భావాన్ని గ్రహించాడు. మన మీద నేరం మోపే శత్రువు పిశాచమే. ఈ పిశాచాన్నుండి, అతడు మోపే నేరాన్నుండి క్రీస్తు మనలను రక్షిస్తాడు. అందుకే 1 యోహా 3,8 కూడ "పిశాచం క్రియలను నాశం చేయడానికే క్రీస్తు ప్రత్యక్ష మయ్యాడు" అని చెప్తుంది. (3) క్రీస్తు మోక్షంలో మనకొరకు తండ్రి యెదుట ప్రాయశ్చిత్తం చేస్తాడు. ఎలా ప్రాయశ్చిత్తం చేస్తాడు? మన పాపాలను శుద్ధిచేయడం ద్వారా. మోక్ష క్రీస్తుచేసే ఈ శుద్ధి, ప్రాయశ్చిత్తం, మరేమోకాదు, అతని విజ్ఞాపన ప్రార్థనమే! కిప్పూరు రోజున నెత్తుర్ను చిలకరించడం ద్వారా పూర్వవేదప్రజలు శుద్ధి పొందుతారు. కనుక పిశాచం వాళ్ళపై ఇక నేరం మోపలేకపోయింది. ఇదేవిధంగా నూత్న వేదప్రజలూ మోక్షక్రీస్తు విజ్ఞాపన ప్రార్థన ద్వారా శుద్ధిపొందుతారు. కనుక ఇక వీళ్ళనూ పిశాచం అధిక్షేపించలేదు. మోక్షక్రీస్తు మనలనూ పిశాచంనుండి కాపాడుతూండాలని అడుగుకుందాం.

**30. మన పాపాలకు ప్రాయశ్చిత్తంగా** - 1 యోహా 4,10.

"మనం దేవుణ్ణి ప్రేమించలేదు. దేవుడే మొదట మనలను ప్రేమించి మన పాపాలకు ప్రాయశ్చిత్తంగా వుండడం కోసం తన కుమారుణ్ణి పంపాడు. దీని ద్వారా ఆ దేవుని ప్రేమ యెంత గొప్పదో తెలిసిపోతుంది" అంటుంది 1 యోహాను 4,10. క్రీస్తు మరణంద్వారా పిత తన ప్రేమప్రణాళికను సాధించాడు. క్రీస్తు మన పాపాలకు ప్రాయశ్చిత్తం చేసి అనగా మనకోసం నెత్తురుచిందించి మన తరఫున విజ్ఞాపన ప్రార్థనం జేసి - ఆ పాపాలను క్షమించాడు. ఇకమీదట మనలను పరిపాలించేది పిశాచంగాదు, ప్రభువే. ఇక మనం దుష్టుని అధీనంలోగాదు, నీతిమంతుని అధీనంలో వుంటాం-1 యోహా 5,19. పిశాచం బిడ్డలంగాదు దేవుని బిడ్డలమౌతాం - 1 యోహా 3,10. ఈ దేవుడు క్రీస్తుద్వారా తన జీవాన్ని మనకు అనుగ్రహిస్తూ వుంటాడు. ప్రభుజీవాన్ని బడసి దివ్య జీవితం జీవించే భాగ్యంకోసం వేడుకుందాం.

**31. పాస్క గొర్రెపిల్ల** - నిర్గ 12, 21-27.

పైన ప్రాయశ్చిత్తాన్ని గూర్చి వివరించాం. ఇక "నెత్తురును" గూర్చి ఆలోచిద్దాం. నెత్తురు ఏం చేస్తుంది? పూర్వ వేదంలో మూడు సందర్భాల్లో నెత్తురును వాడారు అవి, 1 పాస్క గొర్రెపిల్ల వధ. 2. సీనాయి నిబంధనం 3. ప్రాయశ్చిత్త బలులు. నూత్న వేదంలో క్రీస్తు చిందించిన రక్తం గూడ ఈ మూడు సందర్భాలను స్మరణకు తెస్తూంటుంది. కనుక నెత్తురును వాడిన యీ మూడు సందర్భాలను గూర్చి విపులంగా తెలుసుకుందాం. మొదట పాస్క గొర్రెపిల్ల వధతో ప్రారంభిద్దాం.

పాస్క గొర్రెపిల్ల వధ నిర్గమకాండ 12, 21-27 లో వర్ణింపబడింది. ఐగుప్తులోని యూదులు గొర్రెపిల్లను వధించి దాని నెత్తురును వారు నివసించే ఇండ్ల వాకిలి కమ్ములకు పూసుకోవాలి. యావే ఐగుప్తీయులను నాశం చేయడానికి వస్తాడు. అతడు వాకిలి కమ్ములమీది నెత్తురును చూచి ఆ ఇండ్లను దాటిపోతాడు. అనగా ఆ ఇండ్లలోని ప్రజలను చంపడు. "పేసా" అనే హిబ్రూ పదానికి దాటిపోవడం అని అర్థం. ఈ శబ్దంనుండే "పాస్క" అనే గ్రీకుపదం కల్పించారు.

తరువాత యూదులు వాగ్దత్త భూమిలో పాదుకున్నాక గూడ యేటేట గొర్రె పిల్లను వధించి పాస్కను జరుపుకుంటూనే వుండాలి. "ప్రభువు ఐగుప్తీయులను హతం చేసాడు. కాని మన ఇండ్లను కాపాడాడు. కనుకనే యీ పండుగను చేసికొంటున్నాం" అని యూదులు తమ పిల్లలకు నేర్పించాలి. ఇలా తరతరాల వరకూ యీ యాచారం యిస్రాయేలు కుటుంబాల్లో కొనసాగిపోతూండాలి. ప్రభువు నాటి ఐగుప్తు ప్రజలను కాపాడినట్లే మనలనూ కాపాడుతూండాలని అడుగుకుందాం.

## 32. గొర్రెపిల్ల నెత్తురు ఏం సాధించింది?

యిస్రాయేలీయులు నెత్తురును తమ ఇండ్ల తలుపు కమ్ములకు పూసారు అన్నాం. ఇది ఓ గుర్తు. ఈ గుర్తును జూచి ప్రభువు ఆ ఇండ్లలోని వారిని చంపకుండా వదిలి వేసాడు. పైగా యీ గుర్తుగల ఇండ్లు యావేకు అంకితమయ్యాయి. అనగా నెత్తురు ఆ ఇండ్లలోని ప్రజలను యావేకు సమర్పించింది. ఇంకా, ఈ పాస్కబలి ద్వారా యిస్రాయేలీయులు పాపపు ఐగుప్తు నుండి వెడలి వచ్చారు. అనగా నెత్తురు పాపం నుండి వారికి విమోచనం కలిగించింది. గొర్రెపిల్ల వధ అనే యీ తంతును తర్వాత వాగ్దత్త భూమిలో కొనసాగించేప్పుడు అది "పాస్క బలి" అని పిలువబడుతుంది. ఆ ప్రజలు ఈ బలి ద్వారా తమ పాపాలు పరిహారమౌతాయనే విశ్వసించారు - నిర్గ 12. 27. కనుక పాస్క గొర్రెపిల్ల వధ సందర్భంలో నెత్తురు యిస్రాయేలీయులను చావు నుండి కాపాడింది. వాళ్ళను యావేకు అంకితం చేసింది. పాపాన్నుండి రక్షించింది. ఈలాగే ప్రభువు మనలను నిత్యం రక్షించి కాపాడుతూండాలని అడుగుకుందాం.

## 33. లోకపు పాపాలను భరించే గొర్రెపిల్ల - యోహా 1, 29

పై పాస్క గొర్రెపిల్ల ఉదంతాన్ని, క్రీస్తుకు అన్వయిస్తుంది నూత్నవేదం. స్నాపక యోహాను క్రీస్తును జూచి "ఇతడు లోకపు పాపాలను భరించే గొర్రెపిల్ల" అంటాడు. ఈ వాక్యంలో క్రీస్తు పాస్క గొర్రెపిల్లతో పోల్చబడ్డాడు. వధింపబడిన పాస్క గొర్రెపిల్ల ఐగుప్తులోని విగ్రహారాధన మనే పాపనుండి యిస్రాయేలీయులను విడిపించింది. తర్వాత పాలస్తీనా దేశంలో ఈ తంతును కొనసాగించినప్పుడు గూడ బలిరూపంగా ప్రజల పాపాలు పరిహరించింది. అదేవిధంగా ఈ క్రీస్తు అనే గొర్రెపిల్లగూడ ప్రజల పాపాలను భరిస్తాడు, పరిహరిస్తాడు అని భావం. ఇంకో విషయం. పాస్క పండుగను చేసికోవడం కోసం శుక్రవారం సాయంత్రం మూడు గంటలకు యెరూషలేం దేవాలయంలో గొర్రెపిల్లలు వధించేవాళ్ళు. ఈలా దేవాలయంలో గొర్రెపిల్లలు వధింపబడుతూండగా క్రీస్తుకూడా అదేకాలంలో యెరూషలేం వెలుపల సిలువమీద జీవం విడిచాడు. ఈ సంఘటన వలన గూడ అతడు నూత్న వేదపు పాస్క గొర్రెపిల్ల అని వ్యక్తమౌతుంది. ఈ గొర్రెపిల్ల మన పాపాలనుగూడ పరిహరించాలని వేడుకుందాం.

## 34. గొర్రెపిల్ల రక్తంతో వస్త్రాలను ఉదుకు కున్నారు - దర్శ 7, 14-17

దర్శన గ్రంథం మోక్షంలోని పుణ్యమూర్తులను వర్ణిస్తూ వాళ్ళు గొర్రెపిల్ల రక్తంలో తమ వస్త్రాలను ఉదుకుకున్నారని చెప్తుతుంది. అనగా వాళ్లు భూమిమీద శ్రమలనుభవించి నెత్తురోడ్చారు. క్రీస్తు రక్తంలో వస్త్రాలను ఉదుకుకోగా అవి యెర్రబళ్ళేదు గదా, తెల్లబడ్డాయి. అనగా ప్రభురక్తం వాళ్ళ పాపాలను పరిహరించి నిర్మలంగాను, పరిశుభ్రంగాను వుండేలా

చేసిందని భావం. ఈ పుణ్యమూర్తులు నిత్యం ప్రభుసన్నిధిలో నిలుస్తారు. ఆయనను సేవిస్తారు. వారికిక వ్యాధిబాధలంటూ వుండవు. గొర్రెపిల్ల తానే కాపరీ నాయకుడూ ఐ వాళ్ళను జీవజలా లుబికే బుగ్గ దగ్గరకు నడిపించుకొని పోతుంది. ఈలా మోక్షం, పాపం చేయకముందు ఆదిదంపతులు నివసించిన మరో ఏదెను లాంటిది ఔతుంది. కనుక దర్శన గ్రంథం వెలువరించే ఈ భావం ప్రకారంకూడ క్రీస్తు పాస్క గొర్రెపిల్లలాగా మన పాపాలను పరిహరిస్తాడని స్పష్టమౌతుంది. ప్రభువు మనకూ కాపరీ నాయకుడూ గావాలని అడుగుకుందాం.

## 35. నిబంధన రక్తం - నిర్గ 24, 2-8.

మీద పాస్క గొర్రెపిల్లను గూర్చి వివరించాం. ఇక నిబంధన రక్తాన్నిగూర్చి ఆలోచిద్దాం. క్రీస్తు చిందించిన రక్తం యీ నిబంధన రక్తాన్ని గూడ తలపిస్తూవుంటుంది. ఈ నిబంధన రక్తం నిర్గమకాండ 24, 3-8 వాక్యాల్లో వర్ణింపబడింది. యిస్రాయేలీయులంతా సీనాయి కొండవద్ద గుమిగూడారు. యావేమాట పాటిస్తామని ప్రమాణం చేసారు. అంతట పరిచారకులు కోడెలను వధించి నెత్తురు ప్రోగుచేసారు. మోషే ఆ నెత్తురులో సగబాలు బలిపీఠంమీద చిలకరించాడు. మిగతా సగం ప్రజలమీద చల్లాడు. ప్రభువు నేడు మీతో చేసుకున్న నిబంధనకు సంబంధించిన రక్తం యిదేనని వాళ్ళతో చెప్పాడు. ఇక్కడ ఓ విషయం గమనించాలి. కనానీయులు మొదలైన యిస్రాయేలీయులనాటి అన్యజాతి ప్రజలు అర్పించే బలుల్లో బలిపశువును వధించి దేవునికి సమర్పిండం ముఖ్యాంశం. కాని యిస్రాయేలీయులు అర్పించే బలుల్లో బలిపశువు నెత్తురును చిలకరించడం ప్రధానాంశం. క్రీస్తుప్రభువు చిందించిన నెత్తురు మనలనూ దేవుని చెంతకు చేర్చాలని అడుగుకుందాం.

## 36. నిబంధనరక్త భావం

మోషే నెత్తురును ప్రజలమీద పీఠంమీద చిలకరించాడన్నాం. ఇక్కడ పీఠం దేవునికి నిదర్శనంగా వుంటుంది. కనుక అతడు దేవునిమీద, ప్రజలమీద నెత్తురు చిలకరించాడు అనాలి. దేవుడు - ప్రజలు అనే యీ రెండు పక్షాలను నెత్తురు ఐక్యం చేస్తుంది. ఆనాడు వివిధ జాతిప్రజలు స్నేహసంబంధాలను కుదుర్చుకునేప్పుడు ఇరు పక్షాలవాళ్ళు తమ నెత్తురు తీసి కలిపివేసేవాళ్ళు. ఆ నెత్తురు నుండి యికమీదట ఏక ప్రాణం ఏర్పడుతుందని వాళ్ళభావం. అనగా వాళ్ళు పరస్పర ప్రేమభావంతో ఏకవ్యక్తిలా జీవిస్తారని అర్థం. నెత్తురులో ప్రాణముంటుంది. ప్రాణంతో గూడిన యీ నెత్తురును మోషే దేవునిమీద ప్రజల మీద చల్లాడు. ఈ నెత్తురులో వున్న ప్రాణం ద్వారా ఆ రెండు

పక్షాలవాళ్లూ ఇకమీదట ఏకప్రాణంతో జీవిస్తారని భావం. అనగా ఈ నెత్తురు దేవుని ప్రాణాన్ని, ప్రజల ప్రాణాన్ని ఐక్యంజేస్తుంది. వాళ్ళిద్దరకూ కలయికా, పొత్తూ ఏర్పడేలా చేస్తుంది. ఈ విధంగా నిబంధన రక్తం ఐక్యతను సూచిస్తుంది. దేవునితో మనం కూడ ఐక్యమయ్యే భాగ్యం కోసం మనవిచేద్దాం.

## 37. దివ్య భోజన వాక్యాలు

క్రీస్తు చిందించిన రక్తం గూడ పై నిబంధనరక్తం లాంటిది అంటుంది నూత్నవేదం. కనుక యీ నూత్నవేద వాక్యాలను విలోకిద్దాం. ప్రభువు దివ్య భోజనాన్ని నెలకొల్పినప్పటి వాక్యాలు నాలుగున్నాయి అవి మత్త 26, 28. మార్కు 14,24. లూకా 22, 19-20. 1 కొ 11, 25-27. ఈ నాల్గు వాక్యాల్లోను "ఇది నిబంధనరక్తం" అనే పలుకులు విన్పిస్తాయి. మోషే నెత్తురు ప్రజల మీద చల్లి "ఇది యావే మీతో చేసుకొన్న నిబంధన రక్తం" అన్నాడు గదా! నిర్గ - 24, 8. అక్కడ జంతువుల నెత్తురును చిలకరించడం ద్వారా సీనాయి నిబంధనం యేర్పడింది. ఇక్కడ మళ్ళా క్రీస్తు నెత్తురును చిందించడంద్వారా నూత్న వేదపు నిబంధనం యేర్పడింది. అక్కడ సీనాయి నిబంధన ద్వారా ప్రజలు యావేతో ఐక్యమయ్యారు. యావే ప్రజలయ్యారు. ఇక్కడ కల్వరి నిబంధనం ద్వారా మనమూ క్రీస్తుతో ఐక్యమౌతాం. క్రీస్తు ప్రజలమౌతాం. నిబంధనం ఎప్పుడూ రెండు పక్షాలవారిని ఐక్యపరుస్తుంది. క్రీస్తు చేసుకొనిన ఈ రెండవ నిబంధనను గూర్చి మననం చేసికుందాం.

## 38. క్రీస్తు రక్తం మనలను కొంది - దర్శ 5,9.

సీనాయి కొండవద్ద చిలకరింపబడిన నెత్తురు ద్వారా యిస్రాయేలీయులు యావే ప్రజలయ్యారన్నాం. అలాగే క్రీస్తు చిందించిన రక్తంద్వారా మనం క్రీస్తుప్రజల మౌతాం. అంచేతను నూత్న వేదంలోని చాలా వాక్యాలు క్రీస్తు రక్తం మనలను కొందనీ, మనం క్రీస్తు సొత్తయ్యామనీ చెప్తాయి. 1 పేత్రు 2, 9 మనం దేవుని సొత్తయిన ప్రజలం అంటుంది. అ.చ. 20,28లో క్రైస్తవులు క్రీస్తు స్వీయరక్త మిచ్చి సంపాదించిన సమాజమని చెప్పబడింది. దర్శనగ్రంథం 5,9లో క్రీస్తును గూర్చి "నీవు వధింపబడిన వాడవు. నీ రక్తమిచ్చి ప్రతిజనమునుండి మా దేవుని కొరకు ప్రజలను కొన్నావు" అని చెప్పబడింది. 1 కొరి 6, 20 మరియు 7, 23 మనం విలువపెట్టి కొనబడినవాళ్లం అని చెప్తాయి. ఈ వాక్యాలన్నిటిలోను సీనాయిరక్తం ఏం చేస్తుందో క్రీస్తు రక్తమూ అదే చేస్తుంది అనేభావం ఇమిడివుంది. అనగా మనలను దేవుని ప్రజలనుగా, దేవుని ఆస్తినిగా చేస్తుంది క్రీస్తు నెత్తురు. కనుక ఆ ప్రభువు ప్రజల్లా జీవించే భాగ్యం అడుగుకుందాం.

## 39. గొర్రెల కాపరియైన యేసు - హెబ్రే 13,20

క్రీస్తు మనకు కాపరి. మనం అతడు మేపే గొర్రెల్లాంటి వాళ్ళం. బైబుల్లో కాపరి అంటే నాయకుడని అర్థం. కనుక క్రీస్తు మనకు నాయకుడు. నిబంధన సంబంధమైన తన నెత్తురుద్వారా మనలను ఆర్జించినవాడు. మనం అతని ప్రజలం. జకర్యా 9, 11

యావే చేసిన నిబంధనపు నెత్తురు ద్వారా యిస్రాయేలు ప్రజలు చెరనుండి విడిపింపబడతారు అని చెప్తుంది. ఆలాగే క్రీస్తు నెలకొల్పిన నూత్ననిబంధనరక్తం వలన మనమూ పాపపు చెరనుండి విడిపింపబడతాం. ఆ ప్రభువు ప్రజలమౌతాం. ప్రభువు మనలనూ కాపరి చూచే చూపున చూస్తూఉండాలని ప్రార్థిద్దాం.

## 40. క్రీస్తు రక్తం మేలైంది - హెబ్రే 9, 12-14

హెబ్రేయపత్రికాకారుడు 9, 19-20లో నిర్గమ కాండలోని నిబంధనరక్తాన్ని గూర్చిన వాక్యాలను ఉదాహరించాడు. కాని జంతురక్తాన్ని పీఠంమీద చిలకరించారు అనడానికి మారుగ నిబంధనపుస్తకంమీద చిలకరించారు అని చెప్పాడు. పీఠంలాగే ఈ పుస్తకంగూడ దేవుణ్ణి సూచిస్తుంది. ఇక మేకల నెత్తురు, ఎడ్ల నెత్తురు ప్రజల పాపాలు పరిహరిస్తే క్రీస్తురక్తం మనలను ఎంతగా శుద్ధిచేస్తుందో ఊహింప మన్నాడు - 9, 12-14. 1 పేత్రు 1,18లో గూడ వెండిబంగారాలు జంతువుల నెత్తురులు మొదలైన విలువలేని వస్తువులచేతగాదు, మరి అమ్యూలము నిర్దోషము నిష్కళంకమునైన గొర్రెపిల్ల రక్తంచేత క్రైస్తవులు విమోచింపబడ్డారని చెప్పబడింది. ఈలాంటి వాక్యాలన్నిటిలో క్రీస్తురక్తం సీనాయి నెత్తురుకంటె మేలైందని భావం. ఈలాంటి రక్తాన్ని చిందించడానికి క్రీస్తు ఎంతగా శ్రమపడ్డాడో ఊహించమనీ భావం.

## 41. రెండు రకాల ప్రాయశ్చిత్తబలులు

పై యంశాల్లో పాస్క గొర్రెపిల్ల రక్తాన్ని గూర్చి నిబంధనరక్తాన్ని గూర్చి విచారించాం. ఇక ప్రాయశ్చిత్తబలులకు సంబంధించిన రక్తాన్నిగూర్చి ఆలోచించాలి. ఈ ప్రాయశ్చిత్తబలులు రెండు రకాలు. మొదటిది, కిప్పూరు రోజున సమర్పించే బలి. ఈ బలిలో కోడెదూడ నెత్తురును కరుణాపీఠంమీద ఓమారు, దానిముందు ఏడుసార్లు చిలకరించేవాళ్ళు. ఆలాగే మేకనెత్తురు గూడ తీసికొని కరుణాపీఠంమీద ఓమారు, దానిముందు ఏడుసార్లు చిలకరించేవాళ్ళు - లేవీ 16. 14-16. ఈ బలిని ఏడాది కొకసారి ప్రధానయాజకుడు మాత్రమే సమర్పించేవాడు. ఇక రెండవది, పాపపరిహారబలి. ఈ బలిలో మందసమందలి తెరవద్ద నిలుచుండి కోడెనెత్తురును ఏడుసారులు మందసం వైపు చల్లారు. మందసంమీదగల కరుణాపీఠంపై వసించియున్న ప్రభువు ఆలా చల్లబడిన నెత్తురును జూచి ప్రజల పాపాలు పరిహరిస్తాడు. ప్రభువు మన పాపాలను గూడ క్షమిస్తూండాలని ప్రార్థిద్దాం.

## 42. దేనినుండి ప్రాయశ్చిత్తం?

ప్రజల పాపం పవిత్రస్థలాన్ని అపవిత్రం జేస్తుంది. కనుక ప్రభుసాన్నిధ్యం ఆ స్థలాన్ని విడచి వెళ్ళిపోతుంది - యెహె. 10,18. ప్రాయశ్చిత్త కర్మద్వారా ప్రజల పాపాలు పరిహారమౌతాయి. వాళ్ళ పరిశుద్ధస్థలమూ పవిత్రమౌతుంది. దైవసాన్నిధ్యం మళ్ళా ఆ

స్థలంలో నెలకొంటుంది - యెహె 43,2. ఆ ప్రజలూ మళ్ళా దేవునితో ఐక్యమౌతారు. దేవుని ప్రజలౌతారు. ఈ విధంగా ప్రజలను, దేవాలయాన్ని, గూడారాన్ని, పీఠాన్ని పాపం నుండి శుద్ధిచేసి పవిత్రపరచడం కోసం పూర్వవేద ప్రజలు ప్రాయశ్చిత్త కర్మలను జరిపేవాళ్లు. ప్రభువు మనలనూ నిత్యం పాపాన్నుండి శుద్ధి చేస్తుండాలని మనవి చేద్దాం.

## 43. నెత్తురు ఏలా ప్రాయశ్చిత్తం చేస్తుంది?

"రక్తంలో ప్రాణం వుంటుంది. కనుక అది ప్రాయశ్చిత్తం చేయడానికి ఉపయోగపడుతుంది" అంటుంది లేవీ 17,11. ప్రాణి ప్రాణం నెత్తురులో వుంటుంది. అందుచేత నెత్తురు ప్రాణం. ప్రాణం దేవునిదగ్గర నుండి వస్తుంది. కనుక నెత్తురులో ఒక విధంగా దేవుడు నెలకొనివుంటాడు. అది దివ్యమైంది. కనుక నెత్తురు నరుణ్ణిగాని, మందిరాన్ని గాని, వేదికను గాని పవిత్రపరచగలదు. ఏ నెత్తురుబడితే ఆ నెత్తురుగాదు. బలిగా సమర్పించబడిన నెత్తురు మాత్రమే ఈలా పవిత్రపరుస్తుంది. దేవుడే యీ నెత్తురును ప్రాయశ్చిత్తం చేయడం కోసం పీఠంపై చిలకరించమని ఆదేశించాడు - లేవీ 17,11. అందుకే యాజకులు దీన్ని పీఠం దగ్గరకు తీసికొని వెళ్ళేవాళ్ళు. పీఠంమీద పీఠం ముందూ చిలకరించేవాళ్ళు. పీఠం కొమ్ములకు పూసేవాళ్లు. నెత్తురులో రెండు గుణాలుంటాయి. పవిత్రీకరణ గుణం, ఐక్యతా గుణం. కావున అది ప్రజల పాపాలను పరిహరిస్తుంది. ఆ మీదట ప్రజలను దేవునితో ఐక్యపరుస్తుంది. ప్రభురక్తం మన పట్ల ఈ రెండంశాలను సాధించాలని భక్తితో మనవి చేద్దాం.

## 44. మూడు రకాల బలులు

పూర్వవేదం మూడు రకాల బలులను అర్పించిందన్నాం. అవి పాస్క గొర్రెపిల్ల బలి, నిబంధన బలి, ప్రయాశ్చిత్తబలులు. ఈ మూడు రకాల బలులూ క్రీస్తు సిలువ బలిని సూచిస్తాయి. అనగా క్రీస్తు సిలువబలి ఈ మూడు రకాల బలులనూ సార్థకం జేస్తుంది. 1. క్రీస్తు శుక్రవారం సాయంత్రం మూడు గంటలకు యెరూషలేం వెలుపల సిలువమ్రానిపై అసువులర్పించాడు. అదే సమయంలో యెరూషలేం దేవాలయంలో పాస్క గొర్రెపిల్లను వధించారు. ఈ సంఘటనవల్ల క్రీస్తు నూత్న వేదపు పాస్క గొర్రెపిల్లయని ప్రస్ఫుటమైంది. (2) మోషే కోడెదూడనెత్తురు ప్రజలమీద చల్లి "ఇది యావే మీతో చేసుకున్న నిబంధనరక్తం" అన్నాడు. అదేవిధంగా క్రీస్తుకూడ కడపటి విందు సమయంలో పాత్ర నందుకొని "ఇది నిబంధనరక్తం" అన్నాడు. కనుక సీనాయి నిబంధనం కల్వరి నిబంధనను సూచిస్తుంది. (3) పూర్వవేద ప్రాయశ్చిత్త బలుల్లో నెత్తురు చిలకరించడం వల్ల పాపం పరిహారమైంది అన్నాం. అలాగే క్రీస్తు చిందించిన నెత్తురువల్లగూడ పాపంపరిహారమైంది. అందుకే ప్రభువు "ఇది పాపపరిహారంకోసం చిందబడే నిబంధన రక్తం" అంది - మత్త 26,28. కనుక ఈ ప్రాయశ్చిత్త బలులూ సిలువబలిని సూచిస్తాయి.

ఈ విధంగా క్రీస్తు సిలువబలి పూర్వవేదంలోని బలులన్నిటినీ సార్థకంజేస్తుంది. ఈ బలిద్వారానే ఆ ప్రాచీన బలులన్నీ ఫలితాన్ని ఈయగలిగాయి. క్రీస్తు సిలువబలి మనకూ రక్షణాన్ని చేకూర్చిపెట్టాలని ప్రార్థిద్దాం.

## 45. పాపికి బదులుగా జంతువు

ప్రాయశ్చిత్తబలుల్లో జంతువు బలిగా సమర్పింపబడిందన్నాం. కాని యీ తంతునుజూచి కొందరు పాపికి బదులుగా బలిపశువు సమర్పింపబడింది కాబోలు అనుకున్నారు. నరుడు పాపంజేసి శిక్షకు పాత్రుడయ్యాడు. పాపఫలితంగా అతడు చావాలి. కాని అతడు చావకుండ తనకు బదులుగా, కోడెలు, మేకలు మొదలగు బలిపశువులను దేవుని కర్పించాడు. దేవుడు నరునికి బదులుగా, నరుని తావులో ఆ పశువులను స్వీకరించి అతన్ని చంపకుండా వదలివేసాడు - ఇది కొందరివాదం. కాని ఈ వాదం నిలువజాలదు. బైబులు భగవంతుడు జంతుమరణానికి సంతోషించేవాడు గాదు. యెహెజ్కేలు చెప్పినట్లు, అతడు ప్రాణి జీవించాలని కోరుకుంటాడే గాని నశించాలని కోరుకోడు - 33,11 ప్రవక్త పల్కిన యీ వాక్యంమీద వ్యాఖ్యజెబుతూ జ్ఞానగ్రంథకర్త "మరణం దేవునివలన కలిగిందికాదు. జీవులు నాశంగావడం చూచి ఆయన సంతోషించడు" అని వ్రాసాడు- 1, 13 కనుక మరణానికి పాత్రుడైన నరుడు జంతువు నర్పించి తాను తప్పించుకోవడంగాదు ఇక్కడ విషయం. ఆ జంతువు నెత్తురులోనున్న ప్రాణం దేవుని దగ్గరనుండి వచ్చిందిగాన, ఆ నెత్తురును దేవుని సన్నిధిలో చిలకరించడం ద్వారా నరుడు పాపవిమోచనం పొందాడు, అంతే.

## 46. పాపికి బదులుగా క్రీస్తు చనిపోయాడా?

పూర్వవేదంలో పాపికి బదులుగా బలిపశువు అర్పింపబడింది అని వాదించేవాళ్ళు నూత్న వేదంలో పాపికి బదులుగా క్రీస్తు చనిపోయాడు అని వాదిస్తారు. పాపంవల్ల మనమే మరణశిక్ష పొందాల్సింది. కాని మన తరపున, మనకు బదులుగా, మన స్థానంలో, క్రీస్తు చనిపోయాడు. కనుక అతని మరణం మన మరణాన్ని తప్పించింది. అతని చావు మన పాపాలను పరిహరించదు, కప్పివేస్తుంది. - ఇది వీళ్ళ వాదం. కాని ఈ వాదం గూడ నిలువజాలదు.

క్రీస్తు మనకు బదులుగా చనిపోలేదు. మరి మనతో ఐక్యమై, మనలను తనయం దిముడ్చుకొని చనిపోయాడు. కనుక అతని మరణం ఒకరీతిగా మన మరణం కూడ. ఈ భావాన్ని హెబ్రేయ పత్రికాకర్త చక్కగా వ్యక్తంచేసాడు. పరిశుద్ధపరచేవాడు క్రీస్తు. పరిశుద్ధపరచబడేవారు నరులు. వీళ్ళిద్దరూ ఒకే మానుషకుటుంబానికి చెందినవాళ్ళు. కనుక అతడు వారిని సోదరులు అని పిలుస్తాడు. అందుకే అతడు దేవదూతల కుటుంబంలో

పుట్టలేదు. మనుజకుటుంబంలో జన్మించాడు. ఈలా జన్మించి అన్ని విషయాల్లోనూ తన సోదరులవంటి వాడయ్యాడు. వాళ్ళ పాపాలకు పరిహారం చేసాడు. అతడు నాడు శోధనలకు గురియై శ్రమలను భరించాడు గనుక, ఈనాడు శోధనలు పొందుతూ శ్రమ లనుభవిస్తున్న మనకు సహాయం చేయగలడు - 2, 11. 16-18. ఈ భావాల ప్రకారం క్రీస్తు కేవలం మనకు బదులుగా మన తావులో చనిపోలేదు. అతడూ, మనం పరస్పర సంబంధంలేని వేరువేరు వ్యక్తులంగాము. అతడు మన మానుషకుటుంబంలో పుట్టి, మనలను తనతో ఐక్యం జేసికొని, మనలను తనలో ఇముడ్చుకొని చనిపోయాడు. అందువల్లనే అతని రక్షణం మనకు లభించింది. క్రీస్తు మనకు బదులుగా కాదు, మనకొరకు చనిపోయాడు. అనేభావాన్ని అర్థంచేసుకొని మననం జేసుకుందాం.

## 47. సాముదాయక వ్యక్తులు

పూర్వవేదంలోని తొలి ఆదాము నూత్నవేదంలోని మలిఆదాము (క్రీస్తు) కేవలం వ్యక్తులు మాత్రమేగాదు, సాముదాయక వ్యక్తులు గూడ. అనగా ఆ తొలి ఆదాము ఏవ భర్తయైన ఓ ప్రత్యేకవ్యక్తి మాత్రమేగాదు. మానవ సముదాయాన్నంతటినీ తనలో ఇముడ్చుకున్న సాముదాయక వ్యక్తి. ఉదాహరణకు ఆదికాండ 1,27లో దేవుడు "మన పోలిక ప్రకారం ఆదామును చేద్దాం" అనుకుంటాడు. ఈ యాదాము ఏవభర్తయైన ఆదాముమాత్రమే గాదు. నరజాతికూడ. కనుకనే తొలిఆదాము సాంఘికవ్యక్తి అన్నాం. ఆ యాదాము పాపం జేసినప్పుడు మనల నందరినీ తనలో ఇముడ్చుకొనే వున్నాడు. మనమూ అతనిలో వుండి పాపం చేసాం. కనుకనే అతని పాపం మనకు సంక్రమించింది.

ఇక, రెండవ ఆదామైన క్రీస్తుకూడ నరజాతిని తనలో ఇముడ్చుకున్న సాముదాయకవ్యక్తి. అతడు శ్రమలనుభవించి చనిపోయినపుడు మనమూ అతనిలో ఇమిడివున్నాం; అతనిలో నెలకొనివుండి అతనియందు శ్రమలనుభవించి చనిపోయాం. కనుకనే అతని రక్షణం మనకూ లభించింది. ఎఫెసీయులు 4,13 లో "క్రీస్తు శరీరం" అంటే తలయైన క్రీస్తూ, అవయవాలైన క్రైస్తవ ప్రజలూను. కావుననే క్రీస్తుకూడ సాంఘికవ్యక్తి. కనుక ఇద్దరాదాములు సాముదాయకవ్యక్తులనే ఈ భావంకూడ, క్రీస్తు కేవలం మనకు బదులుగా చనిపోలేదు, మనలను తనలో ఇముడ్చుకొని మన ప్రతినిధిగా చనిపోయాడనే రుజువుచేస్తుంది. లూథరు అతని యనుయాయులు బోధించినట్లు క్రీస్తు మన పాపాలను కప్పివేసాడని చెప్పగూడదు. పరిహరించాడని చెప్పాలి.

## 48. బాధామయ సేవకుడు - యెష 53.

పూర్వాంశాల్లో పూర్వవేద బలులను గూర్చి విచారించాం. పూర్వవేదబలులు క్రీస్తు బలని సూచించాయన్నాం. అలాగే పూర్వవేదంలోని కొందరు వ్యక్తులుగూడ తమ

బాధలద్వారా భావిలోని క్రీస్తును సూచించారు. వీళ్ళకే సూచకవ్యక్తులని పేరు. బాధామయ సేవకుడు, మొదలైనవాళ్ళు ఈ సూచకవ్యక్తులు.

మొదట బాధామయ సేవకుణ్ణి గూర్చి విచారిద్దాం. యెషయాప్రవక్త 53వ అధ్యాయమంతటా ఈ సేవకుణ్ణి వర్ణించుకుంటూ బోయాడు. మన దోషాలవలన అతన్ని నలుగగొట్టారు. మన శిక్ష అతనిమీద పడింది. అతని దెబ్బల వలన మనకు స్వస్థత చేకూరింది. అన్యాయపు తీర్పునకు లోనుజేసి అతన్ని కొనిపోయారు. ప్రజల అతిక్రమాల వలన అతన్ని మోదారు. సజీవుల భూమిమీద నుండి చంపివేసారు. అతడు తన ప్రాణాలను ధారవోసాడు. అనేకుల పాపాలను భరించి తిరుగుబాటు చేసినవాళ్ళకోసం విజ్ఞాపనం చేసాడు- 53, 5.6.8.12. ఈ సేవకుని బాధలద్వారా భావిలో బాధ అనుభవించబోయే క్రీస్తును కన్నులకు గట్టినట్లుగా చిత్రించాడు ప్రవక్త.

కాని యీ బాధామయ సేవకుడు ఎవరు? ఇతడు ఓ సాముదాయక వ్యక్తి. యావే సేవకుల నందరినీ తనలో ఇముడ్చుకొనిన మహా సేవకుడు. తాను ఎవరి పాపాలను భరించాడో వాళ్ళను తనతో ఐక్యం జేసికొనిన మహానుభావుడు. క్రీస్తుకు ప్రతిరూపమైన వ్యక్తి. క్రీస్తు దెబ్బల వలన మనకు స్వస్థత చేకూరిందనే సత్యాన్ని స్మరించుకొని ప్రార్థనం చేసుకుందాం.

## 49. క్రీస్తు పోలికలు

యెషయా 53, 9-11 లో సేవకుణ్ణి ఈలా వర్ణించాడు :

1. నిశ్చయంగా అతడు అన్యాయమేమీ చేయలేదు. 2. అతడు తన్ను పాపపరిహారబలిగా సమర్పించుకున్నాడు. 3. నీతిమంతుడైన సేవకుడు అనేకులను నిర్దోషులను జేస్తాడు.

పౌలుకూడ అచ్చంగా ఈ వాక్యాలనే మనసులో పెట్టుకొని క్రీస్తును ఈలా వర్ణించాడు - 2కొ 5,21:(1. క్రీస్తు యేపాపమూ యెరుగడు. 2. అతడు మనకోసం పాపపరిహార బలి అయ్యాడు, 3. అతని ద్వారా మనం దేవుని నీతిని (రక్షణాన్ని) పొందుతాం.

ఈ వాక్యాలనుబట్టి పౌలు బాధామయ సేవకఘట్టాన్ని యెంత మక్కువతో మననంజేసికున్నాడో వ్యక్తమౌతుంది. క్రీస్తు ఆర్జించిన నీతి ద్వారా మనం కూడా నిర్దోషులమూ నీతిమంతులమూ గావాలని అడుగుకుందాం.

## 50. అనేకుల కొరకు - మార్కు 14, 24.

దివ్యభోజన వాక్యాల్లో ప్రభువు "ఇది అనేకులకొరకు చిందబడనున్న నా రక్తం" అంటాడు. మరో తావులోగూడ "మనుష్యకుమారుడు అనేకుల కొరకు తన ప్రాణాన్ని ఈయడానికి వచ్చాడు" అని చెప్పబడింది - మార్కు 10,45. పై బాధామయ సేవకుడు గూడ అనేకులను నిర్దోషులను చేస్తాడనీ అనేకుల పాపాలను భరిస్తాడని చెప్పబడింది - యెష 53, 11-12. కనుక నూత్నవేదరచయితలు ఈ "అనేకులు" అనే శబ్దాన్ని యెషయా

ప్రవచనంలోని బాధామయ సేవక ఘట్టాన్నుండి గ్రహించారు. ఆ సేవకుడు క్రీస్తునకు ప్రతిరూపం అన్నాం. కాని యీ సేవకుడు అతడు సూచించే క్రీస్తు "అనేకుల" పాపాలు మాత్రమే భరిస్తారా? అందరి పాపాలను భరించారా? హీబ్రూ భాషామర్యాద చొప్పున "అనేకులు" అంటే అందరూ అనే అర్థం. కనుక ఈ సేవకులు అందరి పాపాలను భరించారనే చెప్పాలి.

ఇంకో విషయం. ప్రవక్త 53,7 లో "వధించడానికై తోలుకొనిపోయే గొర్రెపిల్లలా అతడు మౌనంగా వుండి పోయాడు" అంటాడు. స్నాపకయోహాను క్రీస్తును చూచి "ఇదిగో లోకముయొక్క పాపాలను భరించే గొర్రెపిల్ల" అన్నపుడు బహుశః పై ప్రవక్త వాక్యంలోని "గొర్రెపిల్ల" శబ్దాన్ని సూచించి వుండవచ్చు - యోహా 1,29.

## 51. శ్రమ లనుభవించాక మహిమ - లూకా 24,26 - 27

క్రీస్తు ఉత్థానానంతరం ఇద్దరు శిష్యులు ఎమ్మావు గ్రామానికి వెళ్తూన్నారు. క్రీస్తుకూడ వాళ్ళతో ప్రయాణం చేసాడు. కాని వాళ్ళు క్రీస్తును గుర్తుపట్టలేదు. తాము అనుసరించిన క్రీస్తు రోమను బానిసాన్నుండి పాలస్తీనా దేశానికి దాస్యవిముక్తి కలిగిస్తాడనుకున్నారు. కాని క్రీస్తు అదేమీ చేయకుండానే చనిపోవడంవల్ల నిరుత్సాహం చెందారు. వాళ్లు త్రోవలో ప్రయాణం చేస్తూండగా ప్రభువు, క్రీస్తు శ్రమ లనుభవించి అటుపిమ్మటల మహిమలో ప్రవేశించాలని ప్రవక్తలు వచించారనీ ఆ వచనం ప్రకారమే క్రీస్తు శ్రమలనుభవించి చనిపోయాడనీ వివరించాడు. ఇక్కడ క్రీస్తు పేర్కొనిన ప్రవక్తలు యెవరు? విశేషంగా యెషయా 53. కనుక ప్రవక్త వర్ణించిన బాధామయసేవకుడను నేనేనని క్రీస్తు శిష్యులకు వివరించాడు. క్రీస్తు మన బాధామయసేవకుడనే యీ సత్యాన్ని జీర్ణం చేసికుందాం.

## 52. ఈసాకు బంధనం - ఆది 22,10.

బాధామయ సేవకునితో పాటు ఈసాకు గూడ క్రీస్తుకు సూచనంగా వుంటాడన్నాం. అబ్రాహాము మోరీయా పర్వతంమీద ఈసాకును బంధించి దేవునికి బలీయడానికి సంసిద్ధుడయ్యాడు. ఈ ఈసాకు బంధనాన్ని యూదులు ఓ బలిగానే భావించారు. యావే ఈసాకు బంధనాన్ని స్మరించుకొని యూదులను రక్షిస్తానని అబ్రాహాముతో వాగ్దానం చేసాడు - లేవీ 26,42. కనుక తరువాత వచ్చిన యూదులు కష్టాల్లో యావేను మనవిచేసి, ప్రభూ! ఈసాకు బంధనాన్ని స్మరించుకొని మమ్ము కాపాడమని ప్రార్థించేవాళ్లు. ఇక, అంత్యభోజన సందర్భంలో ప్రభువు "దీన్ని నాజ్ఞాపకార్థం చేస్తుండండి" అన్నాడు. - లూకా 22, 19. తొలిరోజుల్లోని యూద క్రైస్తవులకు ఈ వాక్యంలోని "జ్ఞాపకార్థం" అనే శబ్దం తప్పకుండ ఈసాకు బలిని స్మరణకు తెచ్చివుండాలి. యావే ప్రభువు ఈసాకు బలిని స్మరించుకొని యూదులను కాపాడినట్లే, క్రీస్తు బలిని స్మరించుకొని మనలను కాపాడతాడు. ఈ భాగ్యంకోసం ప్రార్థిద్దాం.

## 53. ఈసాకు సందర్భాలు

నూత్నవేదం మూడుతావుల్లో ఈసాకు- క్రీస్తు పోలికలను సూచిస్తుంది. (1) హెబ్రేయులపత్రిక 11,17-19 ప్రభువు అబ్రాహాము విశ్వాసాన్ని పరీక్షించాడని చెప్తుంది. యావే ప్రభువు ఈసాకుని మళ్ళా బ్రతికిస్తాడనీ, అతని ద్వారా తన సంతానాన్ని కొనసాగిస్తాడనీ అబ్రాహాము నమ్మాడు. నమ్మి కుమారుని సమర్పించాడు. అతడు నమ్మినట్లే ప్రభువు ఈసాకును బ్రతికించాడు. ఇక్కడ ఈసాకు మళ్ళా బ్రతకడం, క్రీస్తు చనిపోయి మళ్ళా బ్రతకడాన్ని సూచిస్తుంది. (2) హెబ్రే 11,17. ఈసాకు అబ్రాహామునకు ఏకైక కుమారుడు లేక ప్రియకుమారుడు అంటుంది. ఆదికాండ 22,2 కూడ ఈలాగే పిలుస్తుంది. క్రీస్తుకూడ పరలోకపితకు ఏకైక కుమారుడు లేక ప్రియకుమారుడు - మార్కు 1,11. ఇక్కడ ఈసాకునకు వాడబడిన పదమే క్రీస్తునకు గూడ వాడబడ్డంచేత అతడు ఇతన్ని సూచిస్తుంటాడు. (3) రోమీయులు 8,32. దేవుడు తనసొంత కుమారుని మనకొరకు అప్పగించాడు అంటుంది. ఈ తండ్రి సొంతకుమారుని అప్పగించినట్లుగానే పూర్వం అబ్రాహాము గూడ సొంతకొడుకుని అప్పగించాడు. కనుక ఇక్కడగూడ ఈసాకు సందర్భం సూచింపబడింది. పితకు ప్రియకుమారుడైన ఈ క్రీస్తును విశ్వసించి తరిద్దాం.

## 54. ఈసాకు బలి

బలిగా సమర్పింపబడిన వ్యక్తి దేవునిదగ్గరకు వెళ్తాడు. దేవునికి అర్పింపబడతాడు. కనుకనే యోహాను 13,1 "యేసు ఈ లోకం నుండి తండ్రి యొద్దకు వెళ్ళవలసిన గడియ వచ్చిందని యెరిగి" అంటుంది. ఈసాకూ ఈలాగే బలిరూపంలో దేవుణ్ణి చేరుకునేవాడే. అతడు బలిజంతువేదీ అని తండ్రిని అడిగాడు. అందుకు అబ్రాహాము "దేవుడే సమకూరుస్తాడు. నేను నిన్ను దేవునికి సమర్పించబోతున్నాను. నాకంటే ముందుగా నిన్ను దేవునియొద్దకు బలిగా పంపిస్తాను. ఈ ప్రార్థనలతో, ఈ పవిత్రమైన కర్మకాండతో దేవుడు నిన్ను స్వీకరిస్తాడు. నీ యాత్మను తన యెదుట నిలుపుకుంటాడు అని చెప్పాడు. ఈసాకు తండ్రి మాటలకు సరేనని చనిపోవడానికి తయారై బలిపీఠం దగ్గరకు వచ్చాడు. అప్పుడు దేవదూత అడ్డుపడబట్టి ఈసాకు మరణం తప్పిపోయింది" - ఇది యోసీఫసు అనే యూదచరిత్రకారుడు వ్రాసిన అంశం. ఈ వ్రాతనుబట్టికూడ ఈసాకు క్రీస్తును సూచిస్తూంటాడని వ్యక్తమౌతుంది.

## 55. తండ్రి అనురాగం, కుమారుని విధేయత

పై ఈసాకు వృత్తాంతం ప్రజలు క్రీస్తుబలిని చక్కగా అర్థం చేసుకునేలా సాయపడింది. అబ్రాహాము లాగా తండ్రి అనురాగంతో కుమారుని సమర్పించాడు. ఈసాకులాగా క్రీస్తు విధేయతతో తండ్రి ఆజ్ఞను పాటించాడు. కొందరు భావించినట్లు దేవుని కోపాన్ని పోగొట్టడానికిగాదు క్రీస్తు బలిఅయింది. అతడు మనకుబదులుగా

బలికాలేదు. తండ్రిప్రేమతో ఆ కుమారుణ్ణి అర్పించాడు. ఆ కుమారుడు మన కొరకు, మన ప్రతినిధిగా బలి అయ్యాడు. ఔను, ఈసాకు బలిని అర్థం చేసికున్న వాళ్ళకు క్రీస్తుబలి చక్కగా అర్థమౌతుంది.

## 56. పూర్వవేదవ్యక్తులూ, బలులూ

బాధామయ సేవకుడూ, ఈసాకూ క్రీస్తుకు సూచక వ్యక్తులన్నాం. ఈ సూచకవ్యక్తులు ఇంకా చాల మంది వున్నారు. నీతిమంతుడైన హెబేలు నందు క్రీస్తు వధింప బడ్డాడు. యోసేపునందు అన్నదమ్ములు అతన్ని ద్వేషించారు. గోతిలో కూలద్రోసి చంపడానికి సిద్ధమయ్యారు. చివరకు అన్యులకు అమ్మివేసారు. యిర్మీయా యందు అతన్ని ముప్పుతిప్పలు పెట్టారు. ముగ్గురు బాలకులందు అతన్ని నిప్పుల కొలిమిలోనికి త్రోసారు. దానియేలు నందు సింహముల గుంటలో పడద్రోసారు. యూదులు ప్రతిబలిలోను అతన్నే సమర్పించారు. ఓడ నుండి వెలుపలకు రాగానే నోవా సమర్పించిన సమాధానబలిలో, పితరులు కొండమీద సమర్పించిన బలుల్లో, మోషే గుడారంలో సమర్పించిన బలుల్లో, అతని అనుయాయులు దేవాలయంలో సమర్పించిన బలుల్లో క్రీస్తు నెలకొని వున్నాడు. ఈ రీతిగా అనాది నుండి ఆయా వ్యక్తుల్లో ఆయాబలుల్లో సాంకేతికంగా సమర్పింపబడి కాలం పరిపూర్ణంకాగా మానసికంగా చారిత్రికంగా సమర్పింపబడ్డాడు క్రీస్తు. అతని సమర్పణం ద్వారామనకు రక్షణం సిద్ధించింది. బలిమూర్తియైన క్రీస్తును మననంచేసికొని ధ్యానిద్దాం.

## 57. క్రీస్తు విధేయత

క్రీస్తును సూచించిన పూర్వవేద వ్యక్తులను తిలకించాం. ఇక, క్రీస్తు మనోభావాలను పరిశీలిద్దాం. అతడు కేవలం సిలువమీద చనిపోవడం ద్వారానే మనలను రక్షించలేదు. ఈసాకులాగా ప్రేమతో విధేయతతో చనిపోయి మనలను రక్షించాడు. కనుక క్రీస్తు మానసికభావాలు గూడా చాలా ముఖ్యం.

మొదట క్రీస్తు విధేయతను పరిశీలిద్దాం. ఆదాము అతివిధేయత లోకాన్ని పాపంలో ముంచివేసింది. కాని క్రీస్తు విధేయత ఈ పాపాత్ములను మళ్ళా నీతిమంతులను చేసింది. అనగా వీళ్ళకు రక్షణం ఆర్జించిపెట్టింది. ఆదాము మంచి సెబ్బరలు తెలియజేసే పండు తిని దేవునితో సమానం కావాలనుకున్నాడు. అది అతని మిడిసిపాటు. కాని క్రీస్తు విధేయుడై మరణానికి - నీచాతి నీచమైన సిలువ మరణానికి లోబడ్డాడు. అది అతని అణకువ - ఫిలి 2,8. ఈ యణకువ లేందే క్రీస్తు సిలువబలి తండ్రికి ప్రియ పడేదిగాదు. ప్రభు విధేయత మనలను పునీతులను జేయాలని ప్రార్థిద్దాం.

## 58. ప్రేమ

క్రీస్తు మనలను ప్రేమించి మనకోసం తన్ను తాను దేవునికి బలిగా అర్పించుకున్నాడు - ఎఫే 5,2. అతడు శ్రీసభను ప్రేమించి ఆ సభకోసం తన ప్రాణాలర్పించాడు- ఎఫే 5, 27. అపోస్తలుల కార్యాల్లోనూ, సువార్తల్లోను క్రీస్తు ద్వేషులైన యూదులు-యూదా, పిలాతు మొదలైన వాళ్ళు - అతన్ని అప్పగించారు అని చెప్పబడింది. కాని పౌలు లేఖలు తండ్రే క్రీస్తుని "అప్పగించాడు" అని చెప్తాయి - రోమా 8, 32. ఈ తండ్రి ద్వేషంచేగాదు, మనపట్లగల ప్రేమచే తనే కుమారుణ్ణి అర్పించాడు. క్రీస్తు ప్రేమతోనే మనకోసం తన్ను తాను సమర్పించుకున్నాడు. కనుకనే పౌలుతో పాటు మన మందరమూ "దేవుని కుమారుడు నా కొరకు తన్ను తాను అప్పగించుకున్నాడు" అని చెప్పగల్గుతూన్నాం - గల 2, 20. క్రీస్తు విధేయతలాగే, అతని యీ ప్రేమభావం గూడ మనలను రక్షించిందనాలి. ప్రభుప్రేమను అర్థంజేసికునే భాగ్యంకోసం వేడుకుందాం.

## 59. ప్రాణా లొడ్డడం - యోహా 15,13.

క్రీస్తు ప్రేమభావంతోనే చనిపోయాడన్నాం. దీన్నే నాల్గవ సువార్త "ప్రాణాలొడ్డడం" అంటుంది. నా గొర్రెల కోసం ప్రాణాలొడ్డుతున్నాను." అంటాడు ప్రభువు - యోహా 10,15. మరోతావులో ప్రభువు "స్నేహితులకొరకు ప్రాణాలొడ్డేవానికంటె ఎక్కువ ప్రేమగల వాడెవడూ లేడు" అంటాడు ప్రభువు - 15, 13. "ఆయన మన నిమిత్తం ప్రాణాలొడ్డాడుగనుక దీనివలన ప్రేమ యేలాంటిదో తెలిసికోగల్గుతున్నాం" అంటుంది 1 యోహా 3,16. ఈ వాక్యాలను బట్టి క్రీస్తు నరులను ప్రేమించాడనీ, ప్రేమతోనే వాళ్ళకోసం స్వీయప్రాణాలు అర్పించాడనీ విశదమౌతూంది గదా!

## 60. పరిమళవాసన లొలికే బలిగా - ఎఫె, 5,2.

క్రీస్తు ప్రేమతోను విధేయతతోను మనకోసం ప్రాణాలర్పించాడన్నాం. ఈ ప్రేమ విధేయతాభావాలను ఓ బలిగా భావించాలి. ఎఫేసీయులు 5,2 క్రీస్తు మనలను ప్రేమించి పరిమళవాసన లొలికే బలిగా తన్ను తాను పితకు అర్పించుకున్నాడు అంటుంది. పూర్వ వేదంలోని దహనబలిని పరిమళ వాసనలొలికే బలి అనేవాళ్లు - నిర్గ. 29,18. క్రీస్తు సిలువ బలిగూడ ఈ దహనబలిలాంటిదే. బలిజంతువును పీఠంమీద కాల్చి వేయగా పొగగా మారిపోయి దేవుని సింహాసనం వైపునకు ఎగసిపోతుంది. అబ్రాహాము ఈసాకును వధించలేదు గాని వధించి బలిగా అర్పించినట్లయితే అతడూ ఈలాగే పొగగా మారిపోయి దేవుని సన్నిధికి ఎగసిపోయేవాడే. ఈలా ఎగసిపోవడాన్నే నరుడు దేవుణ్ణి చేరడం అంటాం. ఇక సిలువ వేయబడిన క్రీస్తుకూడ తన ప్రేమ విధేయతల ద్వారా తండ్రి వైపునకు ఎగసిపోయాడు. ఈ యంశాన్నే నాల్గవ సువార్త "యేసు ఈలోకాన్ని వీడి తండ్రి యొద్దకు మరలిపోవలసిన గడియ వచ్చెనని యెరిగి" అన్న మాటల్లో సూచించింది - 13,1.

బలి దేవుని కర్పించే కానుక. కాని క్రీస్తు దేవునికి ఏమర్పించాడు? తన నెత్తురునా? దాన్ని మాత్రమే కాదు. ఆ నెత్తురు సూచించే ప్రేమ విధేయతలనా? అంత మాత్రమేకాదు. క్రీస్తు తన్ను తానే పితకు అర్పించుకున్నాడు. ఇక, క్రీస్తు తన్నుతానే పితకు అర్పించుకున్నాడన్నా లేక తాను పితయొద్దకు మరలిపోయాడన్నా ఒకటే. ఎందుకంటే, ఆత్మార్పణంద్వారా అతడు పితను చేరుకున్నాడు గదా! కనుక క్రీస్తు అర్పణం అంటే అతడు పితను చేరుకోవడం, అంతే. ఆ క్రీస్తులాగే మనమూ పితను చేరుకునే భాగ్యంకోసం ప్రార్థిద్దాం.

## 61. మనకోసం - ఎఫె 5,2.

క్రీస్తు మనలను ప్రేమించి మనకోసం తన్నుతాను బలిగా అర్పించుకున్నాడు అంటాడు పౌలు. ఇక్కడ మనకోసమంటే మన పాపాల నిమిత్తమని భావం - 1 కొ. 15,3. మన పాపాల నిమిత్తమంటే పాపక్షమాపణం కొరకని అర్థం - మత్త 26,28. మార్కు సువార్తకూడ "మనుష్య కుమారుడు అనేకుల కొరకు క్రయధనంగా తన ప్రాణాలు ఈయడానికి వచ్చాడు" అంటుంది - 10, 45. అనగా బాధామయసేవకుళ్ళాగే క్రీస్తు అనేకులకోసం, అంటే సమాజంకోసం, సమాజానికి ఉపకారం చేయడంకోసం ప్రాణాలర్పిస్తాడనిభావం. క్రీస్తు చనిపోయింది మనకు బదులుగా గాదు, మనకొరకు. మనస్థానంలోగాదు, మనలను తనలో ఇముడ్చుకొని, మన ప్రతినిధిగా చనిపోయాడు. -తి మొ 2,6. ప్రభు మరణఫలితంగా మనం పూర్తి పాపక్షమాపణం పొందాలని ప్రార్థిద్దాం.

## 62. నరుడు దేవుణ్ణి చేరుకుంటాడు

పాపం ద్వారా నరుడు నాశమైపోయాడు. భౌతికంగా ఆధ్యాత్మికంగాగూడ చనిపోయి, దైవజీవాన్ని కోల్పోయాడు. పాపం ద్వారా అతడు దేవుని మీద తిరుగుబాటు చేసాడు. దేవునికి దూరమైపోయాడు. ఐనా దేవుడతన్ని మరచిపోలేదు. అతడు మళ్ళా తన చెంతకు తిరిగిరావాలనే ఆ తండ్రి వుబలాటం. ఐనా దేవుడతన్ని బలాత్కారంగా తన చెంతకు లాగుకొనరాదు. అలా చేయడం నరుని స్వాతంత్ర్యాన్ని భంగపరచడమే ఔతుంది. కనుక దేవుడు నరుని స్వాతంత్ర్యానికి దెబ్బ తగులకుండానే అతన్ని రక్షించే మార్గ మొకటి కనిపెట్టాడు. నరుడై జన్మించిన దేవునిద్వారా నరుణ్ణి నరుడే రక్షించుకోవడమే ఈ మార్గం. ఈ విధానాన్ననుసరించి దేవుడు నరుడై జన్మించాడు. అతడు దేవుడైనా గూడ, అచ్చంగా మనలాగే మానిసి. పాపం ద్వారా మానవుడు దేవునిమీద తిరుగుబాటు చేసాడన్నాం. కాని యీ దైవమానవుడు తన విధేయతద్వారా నరుని తిరుగుబాటుకు ప్రతీకారం చేసాడు. నరుణ్ణి మళ్ళా దేవుని యింటికి చేర్చి దేవునితో రాజీపరచాడు. అతని ద్వారా నరుడు దుడుకు చిన్నవాడిలా తనకోసం కాచుకొనివున్న తండ్రి యింటికి తిరిగివచ్చాడు. ఓ

తప్పిపోయిన గొర్రెలాగ భుజాల మీద మోసికొని రాబడ్డాడు. దుడుకు చిన్నవాని సామెతలో భగవంతుని చేరడానికి నరుడు చేసే ప్రయత్నం వ్యక్తమౌతుంది. తప్పిపోయిన గొర్రెసామెతలో నరుణ్ణి చేరదీసికోడానికి భగవంతుడు చేసేప్రయత్నం ద్యోతకమౌతుంది. స్వీయప్రయత్నంవల్ల నైతేనేం, భగవత్ప్రయత్నంవల్ల నైతేనేం, మనమూ ప్రభువును చేరుకోవాలని వేడుకుందాం.

## 63. క్రీస్తు ద్వారా నరుడు దేవుణ్ణి చేరుకుంటాడు

క్రీస్తు మన పాపాలను భరించాడు. కాని మన పాపాలను భరించడంవల్ల క్రీస్తు పాపాత్ముడు కాలేదు. అతడు మన పాపాలు తెచ్చిపెట్టిన దుష్ఫలితాన్ని మాత్రం స్వీకరించాడు. పాపపు నరుని ఆకృతిని పొంది, పాపపు దుష్ఫలితమైన మరణాన్ని అనుభవించాడు. నరుని మళ్ళా దేవుని యొద్దకు చేర్చాలంటే అతడు నరుని పాప ఫలితమైన మరణాన్ని అనుభవించి తీరాలి. కాని క్రీస్తు ప్రేమకొద్దీ కేవలం మరణాన్నేగాదు, నీచాతినీచమైన సిలువ మరణాన్ని ఎన్నుకున్నాడు.

ఈలా మరణించి క్రీస్తు ఉత్థానమయ్యాడు. తండ్రి వద్దకు మరలిపోయాడు. తాను పాపానికి చనిపోయి దైవ జీవితానికి ఉత్థానమయ్యాడు - రోమ 6,10. ఉత్థానం ద్వారాతాను ఆత్మను పొందాడు. నరులకూ ఆ యాత్మను అందించాడు - 1కొ 15, 45. అయితే యీ క్రీస్తు ఉత్థాన మయ్యేవాళ్ళకందరకూ ప్రథమఫలం - 1 కొ 15,20. అనగా అతని ఉత్థానం మన ఉత్థానాన్ని సూచిస్తుంది, సాధించి పెడుతూందిగూడ.

ఈ క్రీస్తుద్వారా, ఈ క్రీస్తుతోపాటు, మనమూ తండ్రివద్దకు మరలిపోతాం. ఈలా మరలిపోవడమనేది, మనం క్రీస్తును విశ్వసించినప్పుడూ, క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినప్పుడూ ప్రారంభమౌతుంది. క్రీస్తును విశ్వసించడం ద్వారా మనమందరం కుమారునియందు కుమారులమౌతాం-గల 3, 26. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందడంద్వారా ఆ ప్రభు మరణాన్ని పునరుత్థానాన్ని మనమూ అనుభవిస్తాం; అతనికి సదృశుల మౌతాం - రోమా 6, 3-5. ఈవిధంగా క్రీస్తు ద్వారా తండ్రివద్దకు మరలిపోవడమనే మహాకార్యం ఈ జీవితంలో ప్రారంభమౌతుంది. మనం ఉత్థానమయ్యాక మరు జీవితంలో సంపూర్ణమౌతుంది.

క్రీస్తు మనఉత్థానాన్ని సూచిస్తూ ప్రథమ ఫలంగా తాను ఉత్థానమయ్యాడన్నాం. తండ్రివద్దకు సాగిపోయాడన్నాం. ఇది క్రీస్తు రక్షణం - 1 కొ 15,20. ఇక, అతన్ని విశ్వసించి అతనిలోనికి జ్ఞానస్నానం పొందినట్లయితే అతని ద్వారా మనమూ ఉత్థానమై తండ్రివద్దకు మరలిపోతామన్నాం. ఇది మన రక్షణం - రోమ 6, 3-4. కనుక ఈ రక్షణం క్రీస్తు రక్షణమని, క్రీస్తునందు మన రక్షణమనీ రెండు రూపాలుగా వుంటుంది.

# 3. దైవసాన్నిధ్యం

బైబులు భాష్యం - 66

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | దేవుడు అంతటా వుంటాడు | 55 |
| 2. | అంతటా వుండే దేవుణ్ణి మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి | 56 |
| 3. | అంతటా వుండే దేవుణ్ణి గౌరవించాలి | 57 |
| 4. | అంతటా వుండే దేవుణ్ణి ప్రేమించాలి | 58 |
| 5. | దైవసాన్నిధ్యాన్ని పాటించడం అంటే యేమిటి? | 59 |
| 6. | సాన్నిధ్యభక్తివల్ల ప్రయోజనాలు | 61 |
| 7. | సాన్నిధ్యభక్తిని కాదనే వాళ్ళకి జవాబు | 64 |
| 8. | దైవసాన్నిధ్యాన్ని పాటించడానికి పది సూత్రాలు | 66 |
| 9. | దైవసాన్నిధ్యాన్ని పాటించడంలో ఎదురయ్యే అవరోధాలు | 71 |


## 1. దేవుడు అంతటా వుంటాడు

దేవుడు అంతటా వుంటాడు. అతడు మోక్షంలో వుంటాడు. అది అతనికి సింహాసనం. భూమి మీద వుంటాడు. అది అతనికి పాదపీఠం - యెష 66,1. అచ 7,49. భగవంతుడు సర్వాంతర్యామి అని మనం చిన్నప్పుడే నేర్చుకొంటాం. ఐనా ఈ సత్యాన్ని అట్టే అర్థంచేసికోం. అట్టే గుర్తించంకూడ.

ప్రభువు అంతటా వుంటాడు కనుక అన్ని వస్తువులూ అతనియందుంటాయి. అతడు అన్ని వస్తువుల్లోను వుంటాడు. కాని అతడు విశేషంగా నరుల్లో వుంటాడు. "దేవుడు మనలో ఏ వొక్కరికీ దూరంగా లేడు. మనం అతనిలో జీవిస్తాం, చలిస్తాం, ఉనికిని కలిగివుంటాం. మనం అతని సంతానానిమే" - అచ 17,28. ఐనా ఈ సత్యాన్ని మనమట్టే అర్థంచేసికోం. పూర్వం స్నాపక యోహాను యూదులను చూచి "మీ మధ్య వున్న వ్యక్తిని మీరెరుగరు" అన్నాడు - యోహా 1,26. ఔను, మన మధ్య నిరంతరమూ నెలకొనివుండే దేవుణ్ణి మనం ఎరుగం. అతన్ని ఆరాధించి గౌరవించం. ఇది పెద్ద దౌర్భాగ్యం.

కనుక సువిశేషం పేర్కొన్న ఆ గ్రుడ్డివానిలాగే మనంకూడ వినయ విశ్వాసాలతో "ప్రభూ! నాకు దృష్టి దానం దయచేయి" అని అడుగుకోవాలి - లూకా 18,41. మనం ఆ ప్రభువుని భౌతికంగా కాకపోయినా ఆధ్యాత్మికంగానయినా దర్శించాలి. కావున ఆ కీర్తనకారునిలాగే మనంకూడ

“నేను నిన్ను తప్పించుకొని యెక్కడికి పోగలను?
నీ సన్నిధినుండి పారిపోయి యెక్కడికి వెళ్ళగలను?
నేను ఆకాశానికి వెళ్తే నీవు అక్కడ వుంటావు.
పాతాళానికి వెళ్తే అక్కడా వుంటావు”

అని చెప్పాలి - కీర్త 139, 7-8. పక్షులు ఎక్కడి కెగిరిపోయినా గాలిని తప్పించుకోలేవు. చేపలు ఎక్కడికి ఈదుకొనిపోయినా నీటిని తప్పించుకోలేవు. అలాగే మనంకూడ ఎక్కడికి వెళ్ళినా దేవుణ్ణి తప్పించుకోలేం. అతని సాన్నిధ్యంనుండి వైదొలగలేం. అతడు మనలోనే, మన అంతరంగంలోనే వుంటాడు. అగస్టీను భక్తుడు చెప్పినట్లుగా, మనలో మనమున్నదానికంటెగూడ అధికంగానే ఆ భగవంతుడు మనలో వుంటాడు. అలాంటి ప్రభువుని విస్మరించడం గొప్ప అనర్థం కదా!

## 2. అంతటావుండే దేవుణ్ణి మనం జ్ఞప్తికి తెచ్చుకోవాలి

అంతటావుండే దేవుణ్ణి మనం ఎల్లవేళలా, ఎల్లతావుల్లోను జ్ఞప్తికి తెచ్చుకోవాలి. గొప్పవాళ్ళు మన దృష్టి నాకర్షిస్తారు. మన హృదయాన్ని వారినుండి మరల్చుకోలేం. ఐనా అందరికంటె గొప్పవాడైన భగవంతుణ్ణిమాత్రం మనం విస్మరిస్తాం. మోక్షంలో అర్చ్యశిష్టులు సదా ఆ ప్రభువునిచూచి ఆనందిస్తూంటారు. మనం మాత్రం అతన్ని తలంచుకోలేం, ఎందుకు? మనం ఈ సృష్టివస్తువులకు అంటిపెట్టుకొని వుంటాం. కనుకనే సృష్టికర్తను జ్ఞప్తికి తెచ్చుకోలేం. అతడు మనకు దగ్గరలోవున్నా మనం అతన్ని గుర్తించలేం. మన స్వీయశక్తితోనే మనం జీవిస్తున్నామో అన్నట్లు అతన్ని ఉపేక్షిస్తాం. గ్రుడ్డితనమంటే యిది కాదా?

పూర్వం యిస్రాయేలు ప్రజలు పండ్రెండు రొట్టెలను దేవుని సన్నిధిలో పెట్టివుంచేవాళ్ళు. ఆ పండ్రెండు రొట్టెలనుచూచి దేవుడు పండ్రెండు గోత్రాల యిస్రాయేలు ప్రజలను స్మరించుకొనేవాడు - లేవీ 24, 5-9. ఆలా తమ్ము స్మరించుకొనే దేవుణ్ణి ఆ ప్రజలుకూడ భక్తిభావంతో జ్ఞప్తియందుంచుకొనేవాళ్ళు. నూత్నవేదంలో మనలనుకూడ దేవుడు నిరంతరం స్మరించుకొంటూంటాడు. అతడు మన మధ్యలో వసిస్తూంటాడు - యోహా 1,14. మన తరపున మనంకూడ అతన్ని యెల్లపుడూ జ్ఞాపకానికి తెచ్చుకొంటూండాలి.

పెద్ద తెరేసమ్మగారు “నేనొకమారు దేవుణ్ణి అనుభవానికి తెచ్చుకొన్నాక ఈ లోకంలోని వస్తువులన్నీ నాకు అణువుల్లా కన్పించాయి. కాని నా మనసింకా వాటి మీదికే పోతున్నందుకు నేను సిగ్గుపడుతున్నాను” అని చెప్పుకొన్నారు. ఔను మరి, నరుల్లో అధిక సంఖ్యాకులు కూడూగుడ్డా యిల్లూవాకిలీ అనే తాపత్రయాలతో సతమత

మౌతూంటాయి. అగస్టీను నుడివినట్లు, నరుడు శరీరాన్నేగాని ఆత్మను పట్టించుకోడు. అతడు ఇంద్రియాలచే తెలిసికోదగిన భౌతిక వస్తువులనేగాని, ఆధ్యాత్మిక వస్తువులను ఆశింపడు. దేవుణ్ణి స్మరింపడు. భగవంతుడు నరుణ్ణి దేవుణ్ణి చేయగోరుతూంటే, నరుడు తన మట్టుకు తాను మృగమైపోవాలని కోరుకొంటూంటాడు.

కనుకనే కొందరు పుణ్యపురుషులు ఈ ప్రపంచాన్ని త్యజించి, ఈ సంసారాన్నిరోసి, అడవుల్లో కొండల్లో ఏకాంత జీవితం గడిపారు. అక్కడ తమకు సహచరులుగా వుండే నరులెవ్వరూ లేకపోయినా దేవుణ్ణే సహచరుణ్ణి చేసికొని ఆ ప్రభువుని ధ్యానించుకొన్నారు. అతన్ని అనుభవానికి తెచ్చుకొని పరమానందం చెందారు. ఔను, దైవసాన్నిధ్యం మనకెంతో ఆనందాన్ని కలిగిస్తుంది. ఆ యానందాన్ని దేవుడీయవలసిందే గాని ఈ యిహలోకవస్తువు లీయలేవు.

మనం లోకవస్తువులకు అంటిపెట్టుకొని వుంటాం గనుకనే దేవుణ్ణి గుర్తించలేకపోతుంటాం. మన ఆత్మకు పాపపు పొరలు కమ్మివుంటాయి. కనుకనే అది ఆ దివ్యజ్యోతిని దర్శించలేక పోతూంటుంది. "నిర్మల హృదయులు ధన్యులు, వాళ్ళు దేవుణ్ణి దర్శిస్తారు" అన్నాడు ప్రభువు - మత్త 5,8. దేవుణ్ణి దర్శించడానికి మొదటి షరతు హృదయ నైర్మల్యం. ఇక్కడ నిర్మల హృదయమంటే ఏకాగ్రతతో దేవుని మీదనే లగ్నమైయుండే హృదయం. ఇద్దరు యజమానులను సేవించని హృదయం. అనగా లోకవస్తువులను విడనాడి భగవంతుణ్ణి మాత్రమే సేవించే హృదయం - మత్త 6,24. కనుక సృష్టి వస్తువులను విడనాడి సృష్టికర్తను వెదకే మహానుభావులు ఆ పరమాత్ముణ్ణి దర్శిస్తారు.

## 3. అంతటా వుండే దేవుణ్ణి గౌరవించాలి

పెద్ద అధికారులముందూ, ఉద్యోగులముందూ మనం భయభక్తులు ప్రదర్శిస్తాం. కాని అధికారులందరికి పై యధికారి దేవుడు. అతడు నిరంతరమూ మనకు దాపులోనే వుంటాడు. అలాంటి దేవునిపట్ల మనమెంతగానో వినయవిధేయతలూ గౌరవమర్యాదలూ ప్రదర్శించాలికదా! ఫ్రాన్సిస్ డిసేల్స్ గొప్పభక్తుడూ, బిషప్పూ. ఓమారు మరో బిషప్పు ఫ్రాన్సిస్ ఏకాంతంగా వున్నప్పుడు ఏలా ప్రవర్తిస్తాడో చూద్దామను కొన్నాడు. కనుక ఫ్రాన్సిస్ వంటరిగా తన గదిలో వున్నపుడు అయన్ని నిశితంగా పరిశీలించి చూచాడు. కాని ఫ్రాన్సిస్ ఎల్లపుడు నేను దేవుని సన్నిధిలో వుంటానని భావించుకొనేవాడు. కనుక అతడు ఎల్లవేళలా మేరమర్యాదలతో భక్తిశ్రద్ధలతో మెలిగేవాడు. అందువల్ల ఆ భక్తుణ్ణి దర్శించేవాళ్ళకి కూడ భక్తి పుట్టేది. మనంకూడ ఈ పుణ్యాత్మునిలాగ నడచుకోవాలి.

"మీరు వెలుగునకు సంబంధించిన ప్రజల్లాగ జీవించండి" అని హెచ్చరించాడు పౌలు - ఎఫె 5,8. పాపాత్ములు చీకటికి సంబంధించినవాళ్ళు. వాళ్ళకు దేవుడూ తెలియదు,

దైవసాన్నిధ్యమూ తెలియదు. కాని మనం దేవుణ్ణి తెలిసికొని అతని సన్నిధిలో మెదలేవాళ్ళం. ఇంకా ప్రభువు "దుష్క్రియలు చేసేవాడు వెలుగును ద్వేషిస్తాడు. తన దుష్క్రియలు బయటపడతాయి కనుక అతడు వెలుగుని సమీపింపడు" అన్నాడు - యోహా 8,20. మనం దుష్క్రియలు మాని వెలుగుని సమీపించేవాళ్ళం కావాలి. ఇక్కడ వెలుగంటే క్రీస్తే. కనుక ఆ ప్రభువు సన్నిధిలో జీవించేవాళ్ళం కావాలి.

మనం దైవసాన్నిధ్యాన్ని తలంచుకొని పాపం మానుకోవాలి. అతడు మహాపవిత్రుడైన ప్రభువు. పాపాన్ని ఏ మాత్రం సహించనివాడు. అంత పవిత్రుడైన ప్రభువు సమక్షంలో మనం పాపం చేయడానికి ఏలా సాహసిస్తాం? పూర్వం పోతీఫరు భార్య యోసేపుని పాపానికి పూరికొల్పింది. ఆ భక్తుడు నే నీ దుష్కార్యానికి పాల్పడిదేవునికి ఏలా ద్రోహం చేసేది అన్నాడు - ఆది 39,9. దేవుని సన్నిధిలో నడచే నరునికిగూడ శోధనలు వస్తాయి. కాని దైవబలంతో అతడు శోధనలను జయిస్తాడు. దేవునిపట్లగల భయభక్తులతో పాపంనుండి తప్పుకొంటాడు.

ప్రభువు మనలోని ప్రతివాణ్ణి ఈ లోకంలో మన మొక్కరమే ఉన్నామో అన్నట్లుగా నిశితంగా పరిశీలిస్తాడు. మన చేతలూ ఆలోచనలూ పనులూ అన్నీ జాగ్రత్తగా గమనిస్తాడు. కనుకనే కీర్తనకారుడు

"దేవుడు ఆకాశంనుండి నరులను పరీక్షించి చూస్తుంటాడు
ఎవరైనా జ్ఞానం కలిగి తన్ను పూజిస్తున్నారా అని
పరిశీలించి చూస్తుంటాడు"

అన్నాడు -53,2. ఆలాంటి దేవునిపట్ల మనం ఎంతో జాగ్రత్తతో మెలగాలికదా? పెద్దతెరేసమ్మగారు ఓ పర్యాయం దేవుని ముందట నిల్చియున్న ఓ పాపి ఆత్మను చూచారు. ఆ యాత్మ ఎంతో వికృతంగావుండి ఆమెకు భయమూ రోతా పుట్టించింది. అలాంటి జుగుప్సాకరమైన దృశ్యాన్ని చూడలేక ఆమె మూర్ఛపోయినట్లయింది. పాపంపట్ల ఆ పవిత్రురాలికి కల్గిన ఏవగింపు మనకుకూడ కలిగితే ఎంత బాగుంటుంది!

## 4. అంతటావుండే దేవుణ్ణి ప్రేమించాలి

దేవుడు ప్రేమస్వరూపుడు - 1యోహా 4,16. ప్రేమమయుడైన ఆ దేవుడు మన హృదయాల్లో వసిస్తూంటాడు. మన యెదదలనుగూడ ప్రేమతో నింపుతూంటాడు. ఆ ప్రభువు మనకు దయచేసిన ప్రేమతోనే మనం అతన్ని ప్రేమించాలి. ఐనా దేవుణ్ణి ప్రేమించే నరులు కొద్దిమందే. భగవంతుణ్ణీ అతని సాన్నిధ్యాన్నీ అనుభవానికి తెచ్చుకొన్న మహానుభావులు మాత్రం అన్నివస్తువుల్లోను ఆ ప్రభువుని దర్శిస్తారు. అన్ని వస్తువులనూ అతనియందు దర్శిస్తారు. అలాగే అన్నివస్తువుల్లోను అతన్ని ప్రేమిస్తారు. అన్నిటినీ అతనియందు ప్రేమిస్తారు.

దేవుని ప్రేమించేవాళ్ళకి ఆ ప్రభువు దక్కుతాడు. అతన్ని దక్కించుకోవడమంటే గొప్పనిధిని దక్కించుకోవడమే. మన యాత్మలు దేవునియందే ఆనందిస్తాయి. అవి ఆ ప్రభువు నుండి బయలుదేరుతాయి. ఆ ప్రభువు దగ్గరికే తిరిగిపోజూస్తాయి. చేపను నీటినుండి బయటికితీసి బంగారు పాత్రలో పెట్టినా అది చస్తుంది. ఆలాగే మన ఆత్మను భగవంతునినుండి వైదొలగించి లోకవస్తువుల్లో పెడితే అది చస్తుంది. లోకవస్తువులు ఎంత విలువగలవైనాసరే దాన్ని సంతృప్తిపరచలేవు. కనుక మనం దేవునివైపు మళ్ళాలి. అతని కంకితులమై అతన్ని ప్రేమించాలి. "నీ సన్నిధిలో నేను మహానందం చెందుతాను" అన్నాడు కీర్తనకారుడు - 16,11. ఆ భక్తునికిలాగే మనకుకూడ దైవసాన్నిధ్యం ఆనందాన్ని కలిగిస్తే మన జీవితం ధన్యమౌతుంది.

## 5. దైవసాన్నిధ్యాన్ని పాటించడమంటే యేమిటి?

భక్తుడు దైవసాన్నిధ్యాన్ని పాటించాలని పూర్వాధ్యాయాల భావం. దైవసాన్నిధ్యాన్ని పాటించడమంటే మన హృదయంలో వసించే దేవుణ్ణి ప్రేమభావంతో జ్ఞప్తికి తెచ్చుకోవడమే. ఇక్కడ రెండంశాలు ముఖ్యం. మొదటిది, ఓ నాన్ననో స్నేహితుణ్ణో జ్ఞప్తికి తెచ్చుకొన్నట్లుగా భగవంతుణ్ణి కూడ జ్ఞప్తికి తెచ్చుకొంటాం. ఈలా చేయడంలో కష్టమేమీ వుండకూడదు. రెండవది, అతన్ని ప్రేమభావంతో జ్ఞప్తికి తెచ్చుకొంటాం. నాన్నలాంటివాడూ స్నేహితుని లాంటివాడూ ఐన దేవునితో ప్రేమతో ఐక్యంకాగోరుతాం. ఇక దేవుణ్ణి జ్ఞప్తికి తెచ్చుకోడానికి కొన్ని మార్గాలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. భగవంతుడు అంతటా వుంటాడు. కాని యిక్కడ అతన్ని మన హృదయంలో వున్నవాణ్ణిగా భావించుకోవాలి. అతడు మన యెదలోనే వున్నాడు అనుకొంటే మనకు భక్తీ అవధానతా పెరుగుతాయి. ఆ ప్రభువు నా హృదయంలోనే వుండగా నేనతనికోసం అనవసరంగా వెలుపల గాలించాను అన్నాడు అగస్టీను భక్తుడు. ఆ పరమాత్మ ఓ మునిలాగ మన హృదయగుహలో మననం చేసికొంటూవుంటాడని చెప్తాయి ఉపనిషత్తులు.

2. దేవుణ్ణి జ్ఞప్తికి తెచ్చుకొంటే ఓ విధమైన ప్రశాంతభావం కలుగుతుంది. హృదయంలో ఏదో తీయదనంగూడ గోచరిస్తుంది. చిన్నబిడ్డ తల్లి సన్నిధిలో వున్నప్పుళ్లాగ ఓ విధమైన నమ్మకం కలుగుతుంది. సాన్నిధ్యభావానికి ఈ నమ్మకమనేది చాల ముఖ్యం. ఈ యభ్యాసాన్ని కలిగించుకోవడానికి మనం బ్రహ్మాండమైన కృషియేమీ చేయనక్కరలేదు. మనలను మనం శ్రమపెట్టుకోనక్కరలేదు. నిర్బంధపరచుకోనక్కరలేదు. ఇది అతిసులువుగా సిద్ధించే అభ్యాసం. పౌలు "మనం పరలోక పౌరులం" అన్నాడు - ఎఫె 3,20. అనగా మనం ఈ లోకానికి గాక పరలోకానికి చెందినవాళ్ళం. కనుక పరలోక భావాలూ ఆధ్యాత్మిక చింతనమూ మనకు సహజంగానే కలగాలి.

3. దైవసాన్నిధ్యాన్ని పాటించడమంటే నిరంతరమూ దేవుని సహాయాన్ని అడుగుకోవడం. అతని సహాయంలేందే మనమేమీ చేయలేం. "నేను లేక మీరు ఏమీ చేయలేరు" అన్నాడు క్రీస్తు - యోహా 15,5. ఆ ప్రభువు మన త్రోవలోని చీకటిని తొలగించి వెలుగుని ప్రసాదించేవాడు. మన బలహీనతలను తొలగించి బలాన్ని దయచేసేవాడు. మన దుఃఖాన్ని తొలగించి ఆనందాన్ని చేకూర్చిపెట్టేవాడు. ఆలాంటి ప్రభువుని మనం నిరంతరమూ అర్థిస్తుండాలి. కీర్తనకారునిలాగే "ప్రభూ! నన్నాదుకో, నాకు సాయం చేయడానికి శీఘ్రమే రా" అని అడుగుకొంటూండాలి - 71,12.

4. మనం ఆ దేవుని సమక్షంలో మేరమర్యాదలతో మౌనంగా వుండిపోవాలి.

"దేవుని ముందట నెమ్మదిగా నిల్చివుండు
అతని అనుగ్రహం కొరకు ఓపికతో వేచివుండు"

అన్నాడు కీర్తనకారుడు - 37, 7. దేవుని సన్నిధిలో మౌనంగా వుండిపోవడమంటే ఆ మహాప్రభువుని స్తుతించడమేనని వాకొన్నాడు దయనీష్యస్ భక్తుడు. అందుకే పునీతులు చాలమంది పర్వతం సన్నిధిలో పరమాణువులాగ భగవంతుని సమక్షంలో నిమ్మళంగా వుండిపోయారు.

చాలమంది దేవుని సన్నిధిలో వుండడమంటే ఏవేవో ప్రార్థనలు చెప్పుకోవడమని భావిస్తారు. కాని ఇది పొరపాటు. ఈలా ప్రార్థనలు చెప్పేవాళ్ళు తామేవేవో జపాల వల్లెవేస్తుంటారేగాని, ఆ దేవుడు మన హృదయంలో ఏమి మాట్లాడుతున్నాడా అని విన్పించుకోనే విన్పించుకోరు. పెద్ద తెరేసమ్మగారు "మనం ప్రార్థనంలో దేవునికి అవీ యివీ చెప్పబోతాం. కాని ఆ దేవుడు మనతో ఏమి చెప్తున్నాడో వినం. ప్రార్థనంలో మనం దేవునితో మాట్లాడతాం. కాని మనం దేవునితో మాట్లాడుతూంటే అతడు కూడ మన హృదయంలో మాట్లాడుతూంటాడు. అతని సంభాషణాన్ని మనం మౌనంగా వినాలి" అని హెచ్చరించారు. అగస్టీను భక్తుడు కూడ "దేవుడూ మన ఆత్మా ఓ ప్రత్యేకమైన భాషలో మాట్లాడుకొంటారు. దేవుడు దయతో మన ఆత్మతో సంభాషించడానికి పూనుకొంటాడు. మన ఆత్మకూడ ఆ ప్రభువుతో సంభాషించడానికి వుబలాటపడుతుంది" అని నుడివాడు. కనుక మనం మౌనంగా, నిమ్మళంగా వుండి మాటలు లేకుండానే దేవునితో సంభాషిస్తుండాలి.

5. దైవసాన్నిధ్యాన్ని పాటించడమంటే మనలను మనం దేవుని చేతుల్లోకి అర్పించుకోవడంగూడ. "నే నెల్లప్పుడు నీ యండదండల్లోనే వున్నాను" అన్నాడు కీర్తనకారుడు - 31,15 ఇంకా అతడే "నన్ను నేను నీ చేతుల్లోకి అర్పించుకొంటున్నాను" అని కూడ పల్కాడు - 31,5. మనం ఈలాంటి ప్రభువుని నమ్మకపోతే మరెవ్వరిని నమ్ముతాం? అతని అనుమతి లేనిదే మన తల వెంట్రుక ఒక్కటి వూడదు - లూకా 21,18. కనుక

మనం అతన్ని నమ్మాలి. ఆ ప్రభువు మన హృదయంలో ఒక్క పలుకు పలికితే చాలు మన దౌర్భాగ్యాలన్నీ తొలగిపోయి పరమానందం చెందుతాం. కనుక చిన్నబిడ్డ తల్లి నిలాగ మనం అతన్ని ఆశ్రయించాలి.

6. దైవసాన్నిధ్యాన్ని పాటించడమంటే ఆ ప్రభువు చిత్తానికి లొంగడంకూడ. విశేషంగా కష్టాలు దాపురించినపుడు అతడు నిర్ణయించిన మార్గంలో నడవాలి. నీ చిత్తం పరలోకంలోలాగే భూలోకంలోను నెరవేరునుగాక అని పల్కాలి - లూకా 22,42. కొందరు తెలియక దేవుణ్ణి తమ చిత్తానికి లొంగదీసికోబోతారు. కాని ఆ ప్రభువు మనకు లొంగడు. మనమే అతనికి లొంగాలి. యోబు అష్టకష్టాల్లో వున్నపుడు కూడ నేలపై బోరగిలపడి దేవునికి దండం పెట్టి

"నేను దిగంబరుణ్ణిగా తల్లి కడుపు నుండి వెలువడ్డాను
దిగంబరుడనుగానే యిక్కడి నుండి వెళ్ళిపోతాను
ప్రభువు దయచేసిన వానినెల్ల మరల తానే తీసికొన్నాడు
అతని నామానికి స్తుతి కల్గునుగాక"

అని పల్కాడు - యోబు 1,21. ఈలా కష్టాల్లో దేవునికి లొంగడంలోనే వుంది భక్తి.

7. మోక్షంలో పునీతులు దేవుణ్ణి ముఖాముఖి దర్శిస్తారు. మోక్షంలోని వాళ్ళకు ఆ ప్రత్యక్ష దర్శన మేలాంటిదో భూలోకంలో మనకు భగవత్సాన్నిధ్యం ఆలాంటిది. ఐతే వాళ్ళకు ప్రత్యక్ష దర్శనమైంది మనకు పరోక్ష దర్శనమౌతుంది. పాపాత్ములు కయీనులాగ దేవుని సన్నిధిలోనుండి వెళ్ళిపోతారు - ఆది 4,16. కాని భక్తులను దేవుని సన్నిధిలోకి వస్తారు. ప్రభువు పూర్వం అబ్రాహాముకి సెలవిచ్చినట్లే తన భక్తులకు గూడ "మీరు నా సన్నిధిలో నడుస్తూ పరిపూర్ణులై ఉండండి" అని ఆదేశిస్తాడు - ఆది 17,1.

ఇవన్నీ కూడ దేవుని సాన్నిధ్యాన్ని పాటించే మార్గాలు. భక్తులు ఈ మార్గాల్లో ఒకప్పుడు ఒకదాన్నీ మరొకప్పుడు మరొకదాన్నీ యెన్నుకొని దేవుణ్ణి అనుభవానికి తెచ్చుకోవాలి. భగవత్సాన్నిధ్యాన్ని పాటించడం మొదటలో కష్టంగానే ఉండవచ్చు. కాని యిక్కడ పేర్కొన్న మార్గాలను పాటిస్తే అది క్రమేణ సులభమౌతుంది.

## 6. సాన్నిధ్యభక్తివల్ల ప్రయోజనాలు

దైవ సాన్నిధ్యాన్ని పాటించడంవల్ల చాల లాభాలు కల్గుతాయి. ప్రస్తుతానికి కొన్నిటిని పరిశీలిద్దాం.

1. ఈ విధానంవల్ల పాపాన్ని పరిత్యజిస్తాం. దేవుడు నన్ను చూస్తుంటాడు అనుకొనేవాడికి పాపం చేయడానికి ఎన్నిగుండెలు? "ఓ ప్రభూ! నా క్రియలూ ఆలోచనలూ

కోరికలూ నీవు గమనిస్తూంటావని తెలిసికొనినపుడు నేను సిగ్గుతోను భయంతోను కంపించిపోతాను" అని పల్కాడు అగస్టీను.

2. నేను దేవుని సన్నిధిలో నడుస్తున్నాను అని భావించేవాడు శోధనలను గూడ జయిస్తాడు. బాబిలోనులో వసిస్తూన్న యొవాకిం భార్య సూసన్నను ఇద్దరు వృద్ధులు కామించారు. వాళ్ళు నీవు మాతో పాపం చేయకపోతే మేము నీ మీద నేరంమోపి నిన్ను శిక్షకు గురిచేస్తామని బెదిరించారు. సూసన్న నేను మీ చేతికి చిక్కి మీరు పెట్టే శిక్షనైనా అనుభవిస్తానుగాని దేవుని యెదుట పాపం చేయలేను అని పల్కింది - దాని 13,23. సాన్నిధ్య బలం వలన భక్తులు శోధనలను జయించే తీరు యిది.

అగస్టీను భక్తుడు ఓ ఉపమానం చెప్పాడు. "యుద్ధభూమిలో సైన్యాధిపతి సైనికులను గమనిస్తూన్నట్లే ఈ లోకమనే యుద్ధభూమిలో పోరాడే మనలను గూడ దేవుడు గమనిస్తూంటాడు. అతడు ఒక చేతిలో వరప్రసాదాలనూ మరొక చేతిలో కిరీటాలనూ పట్టుకొని ఉంటాడు. ఆ వరప్రసాదాలు తన్ను అడుగుకొనే వాళ్ళకి. ఆ కిరీటాలు ఈ జీవితంలో చక్కగా పోరాడేవాళ్ళకి". కనుక మనం ఆపదల్లోను శోధనల్లోను అక్కరల్లోను ఆ ప్రభుని మనకు తోడ్పడమని అడుగుకోవాలి. దేవుని హృదయంలో నిల్పుకొని అతని సన్నిధిలో నడచేవాడు మహాబలాన్ని పొందుతాడు. ఆలాంటివాడు తనహృదయంలోకి ప్రవేశించగోరే పిశాచాన్నీ దాని రాజ్యాన్నీ కూడ సమూలంగా నిర్మూలించగల్గుతాడు. క్రీస్తు అనుసరణం చెప్పినట్లు, దేవుణ్ణి హృదయంలో నిల్పుకొన్నవాడూ, సృష్టివస్తువులకు హృదయాన్ని అర్పించనివాడూ నిజంగా ఆధ్యాత్మిక మానవుడు.

3. ఈ యభ్యాసాన్ని పాటించేవాళ్ళు అనతి కాలంలోనే ఆధ్యాత్మిక పరిపూర్ణతను సాధిస్తారు. దేవుడు అన్ని సృష్టివస్తువుల్లోను ఉంటాడు. మనం అన్ని వస్తువుల్లోను అతన్ని దర్శించవచ్చు. కాని అతడు ప్రధానంగా మన అంతరంగంలో ఉంటాడు. కనుక భక్తి భావంతో తమ అంతరంగంలోకి తొంగి చూచుకొనేవాళ్ళకి అతడు సులభంగా లభ్యమౌతాడు. ఈలా అంతరంగంలోనే దైవసాన్నిధ్యాన్ని గుర్తించి ఆ ప్రభువు ఆజ్ఞలను పాటిస్తూ జీవించేవాళ్ళు పరిపూర్ణ మానవులౌతారు.

ఈ సందర్భంలో క్రీస్తు అనుసరణం ఈలా నుడువుతుంది. "నన్ను ప్రేమించేవాడు నా మాట పాటిస్తాడు, అప్పుడు నేనూ నా తండ్రీ విచ్చేసి అతని హృదయంలో వసిస్తాం అని ప్రభువు మాట యిచ్చాడు. కనుక క్రీస్తుకి నీ హృదయాన్ని తెరువు. ఇతరులకు దానిలోకి ప్రవేశం నిరాకరించు. నీకు అతడు చాలు. అతడు నీ యక్కరలన్నీ తీరుస్తాడు. నీ పట్ల విశ్వసనీయుడైన స్నేహితుడుగా మెలగుతూ నిన్ను జాగ్రత్తగా కాపాడతాడు. ఇక నీవు ఎవరిమీద ఆధారపడనక్కరలేదు. అసలు దేవుడు అనుగ్రహించందే ఇతరులు నిన్ను

కాపాడలేరు కూడ". కనుక మనం క్రీస్తుని హృదయంలో నిల్పుకొని అతని మాట పాటిస్తే చాలు, అతని సన్నిధిలో నడిస్తేచాలు, తప్పక పరిపూర్ణుల మౌతాం.

4. ఈ యభ్యాసంవల్ల విశ్వాసం, నిరీక్షణం, దైవప్రేమ అనే పుణ్యాలు పెరుగుతాయి. దేవుణ్ణి తరచుగా గుర్తుకి తెచ్చుకొనేవాడికి విశ్వాసం వృద్ధి చెందుతుంది. అతన్ని స్మరించుకొనేవాళ్లకి నిరీక్షణం పెరుగుతుంది. అతన్ని అనురాగంతో ధ్యానించుకొనే వాళ్లకి దైవప్రేమ పెరుగుతుంది.

5. ఈ యభ్యాసాన్ని పాటించే భక్తుడు ఇతర పుణ్యాలను కూడ ఆర్జిస్తాడు అతడు దేవుణ్ణి పూజిస్తాడు. ఆ ప్రభువుకి హృదయార్పణం కావించుకొంటాడు. ఆ మహారాజు సన్నిధిలో అణకువ కలిగి వుంటాడు. అతనికోసం తోడినరులను ఆదరిస్తాడు. ఈలా అన్ని సద్గుణాలూ అలవర్చుకొంటాడు. కనుకనే బాసిల్ భక్తుడు "నీవు చేసేపనులను చక్కగా చేయాలనుకొంటే దేవుడు నిన్ను గమనిస్తున్నాడని భావించుకో" అని వాకొన్నాడు.

6. ఇది అన్నిటికంటె ఉత్తమమైన అభ్యాసం అనడంలో సందేహం ఏమీ లేదు. దేవుడు అబ్రాహాముకి దర్శనమిచ్చి "నీవు నా సన్నిధిలో నడుస్తూ పరిపూర్ణుడవై యుండు" అని ఆజ్ఞాపించాడు - ఆది 17,1. అనగా అబ్రాహాము దేవుని సన్నిధిలో నడిస్తే చాలు, పునీతు డౌతాడన్నమాట. కనుక ఈ యభ్యాసాన్ని పాటించే భక్తుడు దేవునితోనూ, దేవునియందూ, దేవునిద్వారా జీవిస్తాడు. పరిపూర్ణత అంటే యిదే. ఆ భక్తుడు నిరంతరమూ దేవునితో సంభాషిస్తుంటాడు కనుక దేవునితో కలసి జీవిస్తాడు. దేవునియందే విశ్రాంతిని అనుభవిస్తాడు కనుక అతనియందు జీవిస్తాడు. ఆ భగవంతుణ్ణే ఆహారంగాను జీవంగాను చేసికొంటాడు కనుక అతని ద్వారా జీవిస్తాడు. ఇది యెనలేని భాగ్యం.

అద్దం ఎదుట నిలబడితే మన ఆకారం దానిలో ప్రతిబింబిస్తుంది. దేవుని సన్నిధిలో నడచే సత్పురుషుడు కూడ ఆ దేవుడనే అద్దంలో ప్రతిబింబిస్తాడు. ఆ దివ్య ముకురంలో ప్రతిబింబించినపుడు మనలోని మురికీ వికృతత్వమూ స్పష్టంగా కన్పిస్తాయి. ఆ ప్రభువు అనుగ్రహంతోనే మనం మన వికృతత్వాన్ని సవరించుకొంటాం.

దేవుని సన్నిధిలో నడచేవాళ్లు ఇక యీ సృష్టి వస్తువులకు అంటిపెట్టుకోరు. దేవుడుకాని ప్రతివస్తువుకూడ వాళ్లకు నిస్సారంగా కన్పిస్తుంది. క్రీస్తుతో పోల్చిచూస్తే ఈ లోకంలోని వస్తువులన్నీ చెత్తాచెదారం లాంటివి అన్నాడు పౌలు - ఫిలి 3,8. దైవసాన్నిధ్యాన్ని అనుభవానికి తెచ్చుకొన్న భక్తులంతా ఈలాగే భావిస్తారు. వాళ్లు దేవుడొక్కడున్నాడు, ఈ లోకవస్తువుల్లో ఏముంది అని ప్రశ్నిస్తారు.

దేవుని సన్నిధిలో నడచే విశుద్ధాత్ముడు క్రమేణ దివ్యత్వాన్ని పొందుతాడు. నిత్యజీవితంలో మనం ఎవరితో తిరుగాడుతూంటామో వాళ్ళలాంటివాళ్ళ మైపోతాం.

చిత్రకారుడు మూలచిత్రంమీద దృష్టిని నిల్పి అలాంటి చిత్రాన్నే గీస్తాడు. ఆలాగే దేవుణ్ణి ధ్యానించుకొనే నరుడు దేవునిలాంటివా డౌతాడు. నిప్పులో పెట్టిన ఇనుము నిప్పులా తయారౌతుంది. పరిమళాల మధ్య నిల్చినవాడు కూడ పరిమళాలు గుబాళిస్తాడు. అలాగే దేవుని సన్నిధిలో నడచేవాడు కూడ దేవునిలాంటివా డౌతాడు.

భగవంతుణ్ణి హృదయంలో నిల్పుకోడానికి అలవాటుపడిన సజ్జనుడు భగవంతుణ్ణి విడచి వుండలేడు. దేహంలో స్థానంతప్పిన ఎముక ఏమౌతుంది? నీటిలో నుండి వెలికితీసిన చేప ఏమౌతుంది? భగవంతుని సాన్నిధ్యానికి అలవాటుపడిన భక్తుడు ఆ ప్రభువుని కోల్పోతే ఇక అతనికి పట్టేగతికూడ ఆలాగే వుంటుంది.

కావుననే అగస్టీను భక్తుడు "ప్రభూ! మా హృదయాన్ని నీ కొరకే చేసావు. నీయందు విశ్రమించిందాకా దానికి విశ్రాంతిలేదు" అని అనుభవపూర్వకంగా చెప్పగలిగాడు. కనుక నరుడు దేవుని సన్నిధిలో నడుస్తూ ఆ ప్రభువుని అనుభవానికి తెచ్చుకొంటూండాలి.

## 7. సాన్నిధ్యభక్తిని కాదనేవాళ్ళకు జవాబు

1. కొందరు ఈ యభ్యాసం ఎవరో భక్తిమంతులకుగాని మాబోటివాళ్ళకు కాదు అని అనవచ్చు. ఇది పొరపాటు. ఈ యభ్యాసం అందరికీ అవసరమే. మనం ఈ లోకంలో ఎందుకున్నాం? దేవుణ్ణి తెలిసికొని ప్రేమించి సేవించడానికేగదా? ఆ ప్రభువు సాన్నిధ్యాన్ని గుర్తుకితెచ్చుకోకపోతే అతన్నేలా ప్రేమిస్తాం? లోకంలోని నరులు దేవుణ్ణి ఎందుకు మర్చిపోతున్నారు? తమ హృదయంలోనే వసించే ఆ ప్రభువుని ఎందుకు గుర్తుకు తెచ్చుకోలేకపోతున్నారు? అతని సాన్నిధ్యాన్ని మర్చిపోవడంవల్లనేకదా? కనుక అతని సాన్నిధ్యాన్ని గుర్తించే ఈ యభ్యాసం మనకందరికీ అవసరమే ఔతుంది.

దేవుడు అందరి సన్నిధిలోను వుంటాడు కనుక మన మందరమూ ఆ దేవుని సన్నిధిని గుర్తించి అతనికి నమస్కరించాలి. అతన్ని ప్రేమించి స్తుతించి కీర్తించాలి. పూర్వం యూదులు ఆరాధన సమయంలో ప్రధాన యాజకుడు ధరించే పవిత్రవస్త్రంమీద 12మణులు పొదిగివుంచేవాళ్ళు. ఆపండ్రెండు మణులను చూచి యావేప్రభువు పండ్రెండు తెగల యిస్రాయేలు ప్రజలను జ్ఞప్తికి తెచ్చుకొనేవాడు. ఆ ప్రజలుకూడ నిరంతరమూ అతన్ని గుర్తుకితెచ్చుకొనేవాళ్ళు. ఈలాగే మనంకూడ ఆ దేవుణ్ణి సదా జ్ఞప్తికి తెచ్చుకొంటూండాలి. నిర్గమ 28,21

2. ఇంకా కొందరు ఈ యభ్యాసం చాల కష్టమైంది, మేమీకార్యాన్ని చేయలేము అని అనవచ్చు. దేవుడు మనకు తండ్రిలాంటివాడు, తల్లిలాంటివాడు, స్నేహితుని లాంటివాడు. తన అమ్మనీ నాన్ననీ జ్ఞప్తికి తెచ్చుకోడానికి ఇష్టపడని బిడ్డడెవడైనా వుంటాడా? అసలీ అమ్మనీ నాన్ననీ మర్చిపోవడం కంటె జ్ఞప్తికి తెచ్చుకోవడమే సులభంకాదా? దేవుని

విషయమూ ఇంతేకదా? మనం దేవుణ్ణి 24 గంటలూ గుర్తుంచుకో లేకపోవచ్చు. కాని రోజులో కొన్నిసార్లు అతన్ని భక్తిభావంతో జ్ఞప్తికి తెచ్చుకోవడం కష్టమౌతుందా? ఈపాటి తేలికపనిగూడ చేయనివాడు మోక్షానికి గాక నరకానికి అర్హుడుకాడా?

3. మరికొందరు ఈ యభ్యాసంవల్ల మాకు సోమరితనం పెరుగుతుందనీ, మా బాధ్యతలను మేము చక్కగా నిర్వర్తించలేమనీ సాకులు చెప్పవచ్చు. కాని దేవుని సేవలో కాలం గడపడం సోమరితన మౌతుందా? ఆ ప్రభువుని ధ్యానించుకోవడంవల్ల మన బాధ్యతలను విస్మరిస్తామా? ఈలా తలంచడం పొరపాటు కాదా? దేవుని సన్నిధిలో నడచేవాళ్ళు చక్కగా ప్రార్థనం చేసికొంటారు. ఆ దేవునిపట్ల గల భక్తిభావంతో తమ పనిని చిత్తశుద్ధితో చేస్తారు. ఇరుగుపొరుగువారితో ప్రేమభావంతో సంచరిస్తారు. ఇక్కడ మన పనులన్నీ మానివేసి దేవుణ్ణి స్మరించుకొంటూ కూర్చోం. దేవుణ్ణి ధ్యానించుకొంటూ మన పనులు మనం చేసికొంటాం.

4. వేరు కొందరు ఈ యభ్యాసంవల్ల జనుల తామే భక్తిమంతులమనుకొని విఱ్ఱవీగుతారు అని వాదించవచ్చు. పూజలో పాల్గొని సత్ప్రసాదం పుచ్చుకొనేవాళ్లుకూడ ఈలాగే పొగరుబోతు తనంతో విఱ్ఱవీగవచ్చుకదా? అందుకని పూజనీ సత్ప్రసాదాన్ని మానివేయంకదా? అలాగే ఈ యభ్యాసాన్ని కూడ మానివేయకూడదు. పైగా దైవసాన్నిధ్యాన్ని పాటించేవాడు గర్వాన్ని గాక వినయాన్ని అలవర్చుకొంటాడు. దేవుని ముందట నేనంతటివాణ్ణి ఇంతటివాణ్ణి అని అనుకోవడానికి ఎవడు సాహసిస్తాడు?

5. మాకిన్ని పనులుంటే దైవసాన్నిధ్యంలో కూర్చోవడానికి వ్యవధి యెక్కడిది అనికూడ ఎవరైనా అడుగవచ్చు. కాని మన పనులను మన స్వీయశక్తితోనే చేస్తామా? దైవబలంవల్ల కాదా? దైవబలాన్ని గుర్తుకితెచ్చుకొంటే ఆ ప్రభువు తన వరప్రసాదంతో మనకు సాయంజేయడా? అప్పుడు మన పనులు సులువుగా నెరవేరవా? దేవుడు మనం మన పనులన్నీ మానివేసి తన యెదుట వట్టినే చేతులు ముడుచుకొని కూర్చోవాలని కోరుకోడు. మన పనుల్లో మనం తన్ను స్మరించుకోవాలని మాత్రమే కోరుకొంటాడు. ఆలా చేస్తే మనకే లాభం.

మతజీవితంలోగాని సంసారజీవితంలోగాని దేవుణ్ణి చిత్తశుద్ధితో పూజించే భక్తిమంతులు కొందరుంటారు. వాళ్ళల్లో చేరడం మనకు శ్రేయస్కరం. అసలు మనలను చేసింది ఆ దేవుడు. మనకు ఈ పనులన్నీ అప్పగించిందీ ఆ దేవుడే. అతన్ని స్మరించుకొంటే మన జన్మ సార్థకమౌతుంది. అతడు మనకిచ్చిన పనులనుకూడ దివ్యంగా చేస్తాం. కనుక దైవసాన్నిధ్యాన్ని పాటించకపోతే నష్టంగాని పాటిస్తే నష్టమేమీలేదు. ఇంకా బోలెడంత లాభమే కలుగుతుంది.

## 8. దైవసాన్నిధ్యాన్ని పాటించడానికి పది సూత్రాలు

దైవసాన్నిధ్యాన్ని పాటించడానికి ఉపయోగపడే మార్గాలుకొన్ని వున్నాయి. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

1. మనం దేవునికి చెందినవాళ్ళం, అతడు మనకు చెందినవాడు అనుకోవాలి. ఆ ప్రభువుని పొందడానికి విశ్వప్రయత్నాలు చేయాలి. భగవంతుణ్ణి పొందాలని గాఢంగా కోరుకొనేవాడు అతన్ని ఏలాగైనాసరే పొందితీరుతాడు. తీవ్రమైన ఉత్కంఠ పనులు సాధించిపెడుతుంది.

2. మనం చేసే పనులన్నీ దేవుని సన్నిధిలో చేస్తున్నామని భావించుకొని వాటిని మనకు చేతనైనంత బాగాచేయాలి. కాని దేవుడు మనలను చూస్తున్నాడు అని భావించుకోవడంవల్ల మనమేమీ ఆందోళనం చెందకూడదు. తొందర పాటునకు గురికాకూడదు. గగ్గోలుపడకూడదు. నిదానంగా, ప్రశాంతంగా, నమ్మకంతో, వినయంతో మన పనులను మనం చేసికొంటూ పోవాలి. ఈ పద్ధతివల్ల దేవుడు మన చుట్టూ వున్నాడనే భావం మన మనసులో బలపడుతుంది.

3. ఒకోసారి మనం పొరపాట్లుచేస్తాం. పాపంలో కూడ పడిపోవచ్చు. అలాంటప్పుడు మనం తప్పకుండా పశ్చాత్తాపపడాలి. కాని దిగులుపడకూడదు. మనమీద మనం కోపం తెచ్చుకొని చిత్తశాంతిని కోల్పోకూడదు. అనగా మనం దేవుణ్ణీ దైవసాన్నిధ్యాన్నీ నమ్మాలి. దైవబలం వలన క్రమేణ పరిపూర్ణుల మౌతామని విశ్వసించాలి. చిన్నబిడ్డడు అడుగులు వేస్తూ పడిపోతాడు. కాని ఓసారి పడిపోయాక తల్లి చేతిని మరింత గట్టిగా పట్టుకొంటాడు. దేవుని సన్నిధిలో మన ప్రవర్తనంకూడ ఈలాగే వుండాలి.

4. దేవుడు మన హృదయంలోనే వున్నాడు అనుకోవాలి. ఈ సందర్భంలో అగస్టీను భక్తుడు ఈలా చెప్పాడు. "నీవు కొంతకాలంపాటు లోక వస్తువులనుండి వైదొలగు. నీ మనస్సులోని ఆలోచనలనుకూడ నిరోధించు. నెమ్మదిగా నీ హృదయమనే గదిలోకి ప్రవేశించు. నీ హృదయంలోనుండి అన్ని వ్యామోహాలనూ, అన్ని కోరికలనూ ప్రక్కకు నెట్టివేయి. నీ దేవుణ్ణి మాత్రం నీ హృదయ సింహాసనంమీద ఆసీనుణ్ణిచేసికో. ఆ మహా ప్రభువుతో "దేవా! నీవు నన్ను నీ సన్నిధిలోకి రమ్మని పిల్చావు. ఇదిగో నేను నీ సమక్షంలోకి వచ్చాను. నీ దివ్యముఖాన్ని నాకు మరుగుజేయకు" అని విన్నవించుకో - కీర్త 27,8. ఆ ప్రభువునిచూచి దేవా! నేను నిన్ను ఏలా గుర్తుకి తెచ్చుకోవాలో నీవే నాకు నేర్పించు అని అడుగుకో". ఈలా మన హృదయంలోనేవున్న దేవుణ్ణి మనం ధ్యానించుకోవడం నేర్చుకోవాలి.

పెద్ద తెరేసమ్మగారు తన యాత్మమే తనకు ఆంతరంగికమైన స్వర్గమని భావించేవారు. ఆ స్వర్గంలో క్రీస్తుప్రభువు ఆనందంతో వసిస్తూంటాడని యెంచేవారు. ఆ ప్రభువుకి భక్తిభావంతో ప్రణమిల్లేవారు. ఈ యభ్యాసంవల్ల మనం అనతికాలంలోనే దైవసాన్నిధ్యాన్ని గుర్తిస్తామని చెప్పేవారు. హృదయంలో దేవుణ్ణి గుర్తించే భక్తులు జీవజలపు ఊటనుండి నీళ్ళు క్రోలుతారని వాకొనేవారు. ఈ యభ్యాసం నచ్చినవాళ్లు దీన్ని పాటించవచ్చు.

సియన్నాపురి కత్తరీన అనే భక్తురాలు తన హృదయం ఓ దేవాలయం అనుకొనేది. ఆ హృదయంలో దేవుడు నెలకొని వున్నాడని భావించేది. తాను ఆ హృదయ దేవాలయంలోనికి ప్రవేశించి రణగొణధ్వనుల నుండి వైదొలగి దేవుని సన్నిధిలో నిమ్మళంగా వుండిపోయేది. ఆ ప్రభువుకి చేయెత్తి మ్రొక్కేది. ఈ పద్ధతి కొందరికి నచ్చవచ్చు. జ్ఞానస్నాన సమయంనుండే పవిత్రాత్ముడు మన హృదయంలో ఓ ఆలయంలోలాగ వసిస్తూంటాడు. దేవుడెక్కడవుంటే అదే దేవాలయం. అతడు మన యెదదలో వుంటే అదే దేవాలయమౌతుంది. కనుక మన హృదయమే దేవాలయం అనుకోవడం మంచి భావమే - 1కొరి 6,19.

బెతనీ మరియ ప్రభువు పాదాలచెంత కూర్చుండి అతని వాక్యాలను భక్తిభావంతో ఆలించిందని వింటున్నాం - లూకా 10,39. ఆమె మాటలాడలేదు. విలపించలేదు. ప్రార్థించలేదు. ఏమీ చేయలేదు. మౌనంగా ప్రభువు పాదాలచెంత కూర్చుండి అతని బోధను మాత్రం ఆలించింది. ఆమె అక్క మార్త ఆమెకు అంతరాయం కలిగించబోయింది. మరియ అక్కడ నుండి లేచివచ్చి వంటపనిలో తనకు సహాయం చేస్తే బాగుంటుందని సూచించింది. కాని ప్రభువు మార్తను మందలించి మరియను సమర్థించాడు. మరియ ఉత్తమమైన కార్యం ఎన్నుకొంది అని చెప్పాడు - 10, 42. ఈ మరియలాగే మనం కూడ మన హృదయంలోనే వసించే ప్రభువు పాదాలచెంత నిమ్మళంగా కూర్చోవాలి. అతని పలుకులు భక్తిభావంతో ఆలించాలి. అతడు తన భక్తులందరికీ వాళ్ళ హృదయాలలోనే నిరంతరమూ బోధ చేస్తూంటాడు.

5. మనం ఉదయాన నిద్ర మేల్కొనగానే దైవసాన్నిధ్యాన్ని గుర్తుకి తెచ్చుకోవాలి. మన దేహం కండ్లు తెరవగానే మన ఆత్మకూడ కండ్లు తెరవడం మంచిది. మనం మన హృదయంలోనే వున్న దేవుణ్ణి సాష్టాంగపడి ఆరాధించాలి. అతనితో "ప్రభూ! నీవు నా కండ్లు తెరిపించావు. ఆలాగే నా ఆధ్యాత్మిక నేత్రాలను కూడ తెరిపించు. వాటితో నేను నీ దివ్యముఖాన్ని దర్శిస్తాను. నీవు నన్ను చల్లని చూపునచూడు. నీ దృష్టికి పాత్రుణ్ణయితే చాలు నేను బ్రతికిపోతాను. దేవా! ఈ దినమంతా నేను నిన్ను స్మరించుకొనేలాచేయి. నీ

సన్నిధిలో నడచే భాగ్యం ప్రసాదించు" అని మనవి చేసికోవాలి. ఈలా ఉదయాన్నే ప్రారంభించిన సాన్నిధ్యపుటభ్యాసాన్ని సాధ్యమైనంత వరకు దినమంతా కొనసాగించుకోవాలి.

6. దైవసాన్నిధ్యాన్ని గుర్తుకి తెచ్చుకోకుండా మన ప్రార్థనను ఎప్పుడూ ప్రారంభించగూడదు. ప్రార్థనకు ముందు మనం దేవుని సన్నిధిలో వున్నామనుకోవాలి. ఆ ప్రభువుకి వినయవిధేయతలతో నమస్కరించాలి. యాకోబులాగే "ఈ ప్రదేశం ఎంత భయంకరమైంది! ఈ తావు దైవనిలయం. ఇది స్వర్గద్వారం" అనుకోవాలి - ఆది 28,17. అబ్రాహాములాగే "దుమ్మూ బూడిదా ఐన నేను దేవరవారితో మాట్లాడ్డానికి సాహసిస్తున్నాను" అని చెప్పాలి - ఆది 18,27. బాలుడైన సమూవేలులాగే "ప్రభూ! నీ దాసుడు ఆలించడానికి సిద్ధంగానే వున్నాడు. సెలవీయి" అనాలి - 1 సమూ 3,10. సుంకరిలాగే "దేవా! పాపినైన నన్ను కరుణించు" అని అడుగుకోవాలి - లూకా 18,13. ఈలా దైవసాన్నిధ్యాన్ని గుర్తుకి తెచ్చుకొని ప్రార్థనను ప్రారంభించేవాళ్ళు పరాకులకు గురికాకుండా భక్తితో ప్రార్థిస్తారు.

జాన్ క్లిమాకస్ అను పునీతుడు ఈలా వ్రాసాడు. "మా మఠంలో సన్యాసులంతా ఉమ్మడి ప్రార్థనలు చెప్పుకొనేపుడు నేను ఒక సన్యాసి అధిక భక్తితో ప్రార్థించడం గమనించాను. అతడు తన్మయంతో ఎవరో అదృశ్య వ్యక్తితో మాట్లాడుతున్నట్లుగా కన్పించాడు. నేనతన్ని నీకీలాంటి భక్తి ఏలా ఆలవడిందో చెప్పమని అడగ్గా అతడు నాతో "నా పద్ధతి యిది. ప్రార్థనను ప్రారంభించేపుడెల్లా నేను నా హృదయాన్నీ మనస్సునీ ఆలోచనలనూ హెచ్చరిస్తాను.

రండి మన దేవునికి నమస్కారంచేసి
అతని ముందు చాగిలపడదాం
మనలను సృజించిన ప్రభువు సన్నిధిని మోకరిల్లుదాం
అతడే మన దేవుడు
మనం అతడు పాలించే ప్రజలం
అతడు మేపే గొర్రెలం

అని వాటితో జెప్తాను - కీర్త 95, 6-7. దీనివల్ల నాకు ఎంతో భక్తి పుడుతుంది అని చెప్పాడు". కనుక మనం కూడ ఈ పుణ్యాత్మునిలాగే దైవసాన్నిధ్యాన్ని గుర్తుకి తెచ్చుకొనిగాని ప్రార్థనం చేయకూడదు.

ఇంకా క్రిసోస్తం భక్తుడు ఈలా పలికాడు. "మనం ప్రార్థనం చేసికొనేపుడు మోక్షంలో సింహాసనంమీద వైభవంగా ఆసీనుడైయున్న ప్రభువు ముందట

ఉన్నామనుకోవాలి. అతనికి కొలువు చేస్తున్న దేవదూతలు మనవైపు చూస్తున్నారనుకోవాలి. ఆలా భావించి భక్తితో జపం చేసికోవాలి".

బెర్నార్డు భక్తుడు కూడ ఈలా నుడివాడు. "మనంగుడిలోనికి వెళ్ళినపుడుగాని లేదా మన గదిలోనే జపం చేసికోవడం ప్రారంభించినపుడు గానీ మనలను మనం హెచ్చరించుకొని ఈలా చెప్పుకోవాలి. ఓ దుష్ట ఆలోచనల్లారా! పాపపు వ్యామోహాల్లారా! మీరు బయటనే వుండిపొండి. నా యాత్మమా! నీవు మాత్రం దేవుని సన్నిధిలోనికి ప్రవేశించు. అతని చిత్తాన్ని తెలిసికొని అతని ఆజ్ఞలను పాటించు. ఈలా మనలను మనం హెచ్చరించుకోవడంవల్ల అవధానంతో జపం జేసికోగల్గుతాం".

ఈ భక్తులు సూచించిన అభ్యాసాలను వినియోగించుకొని మనంకూడ ప్రార్థనకు ముందు దైవసాన్నిధ్యం కలిగించుకోవాలి. దీనివల్ల శ్రద్ధతో ప్రార్థనం చేసికొంటాం, దేవుణ్ణి కూడ అనుభవానికి తెచ్చుకొంటాం.

7. మనం ప్రార్థనం చేసికొనేపుడు క్రీస్తుకూడ మనతో ప్రార్థనం చేస్తుంటాడు. మనం అతనితో కలసి భక్తితో ప్రార్థనం చేసికోవాలి. ఈలా క్రీస్తుతో కలసి పరలోక జపం చెప్పుకోవచ్చు. అది ఆ ప్రభువు స్వయంగా శిష్యులకు నేర్పిన జపం. ఇంకా కీర్తనలూ ఇతర జపాలూకూడ ఈ పద్ధతిలో చెప్పుకోవచ్చు. పెద్దతేరేసమ్మ ఈ పద్ధతిలో జపించేది. ఆమె యితరులకు కూడ ఈ పద్ధతిని సిఫార్సు చేసింది. క్రీస్తు మోక్షంలో తండ్రి సమక్షంలో వుండి నిరంతరమూ మన కొరకు విజ్ఞానం చేస్తూంటాడని చెప్తుంది హెబ్రేయుల జాబు - 7,25. కనుక మనం ఆ ప్రభువుతో కలసి జపం చేసికోవడంలో ఇబ్బంది ఏమీ లేదు. దీనివల్ల మనహృదయంలో సాన్నిధ్యభావం మరింత బలపడుతుంది.

8. దైవసాన్నిధ్యాన్ని గుర్తుకి తెచ్చుకోవడం సులభమే. కాని కొంతసేపయ్యాక ఆ సాన్నిధ్యాన్ని పూర్తిగా మర్చిపోతాం. లోక వ్యాపారాల్లో పడిపోతాం. ఈలా మర్చిపోకుండా వుండడానికి భక్తులు అనాది కాలంనుండి గూడ భక్తితీక్షణ జపాలు చెప్పుకొంటూండేవాళ్ళు. ఇవి చిన్నజపాలు. తరచుగా బైబులు వాక్యాలు. కాని యివి చిన్నవైనా అపారమైన భక్తిని కలిగిస్తాయి. వీటిద్వారా మన హృదయాన్ని దేవుని మీదికి త్రిప్పుకోవచ్చు. మర్చిపోయిన దేవుణ్ణి మరల గుర్తుకి తెచ్చుకోవచ్చు. వీటిని వాడుకోవడం ద్వారా శతాబ్దాల పొడుగునా చాలమంది భక్తులు అశేష లాభాన్ని సాధించారు. కనుక మనంకూడ వీటిని వాడుకోవాలి. ఉదాహరణకు ఈ క్రింది జపాలు వినియోగించుకోవచ్చు.

ఏలినవారా! దయచూపండి.

నా దేవా! నా ప్రభువా!

నా మధురమైన యేసూ! నాకు న్యాయాధిపతివి కాక,

రక్షకుడవుగా వుండు.

దేవా! నన్నాదుకోడానికి శీఘ్రమే రా.

నా చిత్తంగాదు, నీ చిత్తమే నెరవేరాలి.

ఉన్నతమందు సర్వేశ్వరునికి మహిమ.

పితకును సుతునకును పవిత్రాత్మకును మహిమ కలుగునుగాక.

ప్రభూ! నీకే ద్రోహంగా నేను పాపం చేసాను.

నీ వాక్యం నా త్రోవకు వెలుగు లాంటిది.

ప్రభువు పవిత్రుడు, పవిత్రుడు, పవిత్రుడు.

ప్రభువే నాకు కాపరి, యిక యే కొదవా లేదు.

దేవా! నాలో నిర్మల హృదయాన్ని సృజించు.

ప్రభువే నాకు శైలము, కోట, రక్షణదుర్గము.

నన్ను నేను నీచేతుల్లోనికి అర్పించుకొంటున్నాను.

నీ ముఖ కాంతిని నా మీద ప్రకాశింపనీయి.

నీ వద్ద జీవధార వుంది.

మనం ప్రతిదినం చదువుకొనే బైబులు వాక్యాలను వేటినైనా భక్తితీక్షణ జపాలుగా వాడుకోవచ్చు. బోనవెంచరు భక్తుడు వాకొన్నట్లు, ఈ ప్రార్థనలద్వారా మన ఆత్మ పక్షిలా దేవుని చెంతకు ఎగిరిపోతుంది. మనకు తెలియకుండానే మనం గాలి పీల్చుకొంటుంటాం. ఆలాగే కొంతకాలం అభ్యాసం చేసాక మనకు తెలియకుండానే మన ఆత్మ ఈ జపాలను చెప్పుకపోతూంటుంది.

9. రాత్రి పండుకొనేపుడు మన హృదయాన్నీ ఆలోచనలనూ సృష్టివస్తువులనుండి తొలగించి దేవుని చేతుల్లోకి ఒప్పగించుకోవాలి. అనగా మనలను మనం ప్రభువుకి అర్పించుకోవాలి. ఆ కీర్తనకారునిలాగే "నేను పండుకోగానే ప్రశాంతంగా నిద్రిస్తాను. ప్రభూ! నేను సురక్షితంగా మనేలా చేసేవాడివి నీవే" అని చెప్పుకోవాలి – 4,8. "దేవా! నన్ను నేను నీ చేతుల్లోకి అర్పించుకొంటున్నాను. నీ రెక్కల మాటున నన్ను సురక్షితంగా దాచివుంచుకో" అని మనవి చేసికోవాలి. ఈలాంటి భావాలతో దైవసాన్నిధ్యంలో ప్రశాంతంగా నిద్రపోవాలి.

10. కడన మనం అన్నివస్తువుల్లోను, అన్ని సంఘటనల్లోను, అందరు వ్యక్తుల్లోను దైవసాన్నిధ్యం గుర్తించాలి.

అన్ని వస్తువుల్లోను దైవసాన్నిధ్యాన్ని గుర్తించాలి. వస్తువులన్నిటికీ ఉనికినీ మనికినీ దయచేసేది ఆ ప్రభువే. కనుక మనం గాలి, నీరు, కొండలు నదులు, పైరుపంటలు, చెట్టుచేమలు మొదలైన ప్రకృతి వస్తువులను జూచినప్పుడు వాటిల్లో దేవుని సాన్నిధ్యాన్ని గుర్తించాలి. "ప్రపంచమూ దానిలోని సమస్త వస్తువులూ ప్రభువ్వే" నని చెప్తుంది కీర్తన 50, 12.

అన్ని సంఘటనల్లోను దైవసాన్నిధ్యాన్ని దర్శించాలి. ప్రియమైన సంఘటనల్లోను అప్రియమైన సంఘటనల్లోను గూడ దేవుని హస్తం వుంటుంది. మనకు జరిగే ప్రతి కార్యమూ ప్రభువుకి తెలుసు. అతని అనుమతి లేనిదే మన తల వెంద్రుక ఒక్కటి వూడదు - లూకా 12,7. ఇంకా దేవుడు తన్ను ప్రేమించేవాళ్లకి అన్ని కార్యాలూ అనుకూలంగానే జరిగేలా చూస్తాడు - రోమా 8, 28.

అందరు వ్యక్తుల్లోను దైవసాన్నిధ్యాన్ని చూడాలి. భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు - ఆది 1, 28. ఈలోకంలో నరుళ్ళాగ భగవంతుణ్ణి తలపించే ప్రాణి మరొకటి లేదు. కనుక మనం అందరు నరుల్లోను సృష్టికర్తను చూడాలి. మనం ఆయా వ్యక్తులను కలసికొనేపుడు వాళ్ళ దేవదూతలకు నమస్కారం చేయడం మంచిపద్ధతి. అన్యుల దేవదూతలు మన మా యన్యుల్లో దేవుణ్ణి చూడగలిగేలా చేస్తారు. వాళ్ళవల్ల మనకీ మనవల్ల వాళ్ళకీ వుపకారమేగాని అపకారం జరగకుండా ఉండేలా చేస్తారు.

ఈ సందర్భంలో "దేవుని సన్నిధిలో నడవడం" అనే భావాన్ని గుర్తుకి తెచ్చుకోవాలి. బైబులు భక్తులు భగవంతుని సన్నిధిలో నడచారు. హనోకు దేవుని సన్నిధిలో నడచాడు - ఆది 5,22. అలాగే నోవా - 6 9. అలాగే యెలీషాకూడ - 1 రాజు 17,1. ఈపుణ్య పురుషుల్లాగే మనంకూడ నిరంతరం దేవుని సన్నిధిలో నడుస్తూండాలి.

ఈ పదవది చాల విస్తృతమైన అభ్యాసం. ఇది ఆధ్యాత్మిక జీవితంలో పరిణతి చెందినవాళ్ళకేగాని అలవడదు. అన్నిటిలోను దేవుణ్ణీ, దేవుణ్ణి అన్నిటిలోను చూడ్డం మహా భక్తుల లక్షణం.

## 9. దైవసాన్నిధ్యాన్ని పాటించడంలో ఎదురయ్యే అవరోధాలు

మనలోని కొన్ని దుర్గుణాల వలన మనం దైవసాన్నిధ్యాన్ని గుర్తించలేక పోతూంటాం. ఇక్కడ వీటినిగూర్చి విచారిద్దాం.

1. గర్వాత్ములు దేవుణ్ణి చూడలేరు. గర్వంవల్లనే ఆదిమానవుడు దేవునిమీద తిరుగుబాటు చేసాడు. ఆదిపిత సంతానమైన మనంకూడ తరచుగా పొగరువల్ల దైవదర్శనాన్ని కోల్పొతూంటాం. గర్వం మన హృదయానికీ మనస్సుకీ ఒక విధమైన చీకటి తెరలు

కప్పుతుంది. అందువల్ల మనం ఆ పరంజ్యోతిని చూడలేకపోతూంటాం. దేవుడు గర్వాత్ముల్ని ఎదిరించి వినయాత్ములకు తన కృపను అనుగ్రహిస్తాడని చెప్తుంది యాకోబు జాబు - 4,6. కనుక గర్వాన్ని అణచుకొని వినయాన్ని అలవర్చుకొంటే దైవసాన్నిధ్యంలో నడవగల్గుతాం.

2. స్వార్థంవల్లకూడ దేవుని సాన్నిధ్యాన్ని కోల్పోతాం. స్వీయ ప్రీతికలవాడు ప్రతికార్యంలోను తన్నుతాను సంతోషపెట్టుకోజూస్తాడు. అన్నిటిలోను తన ప్రీతినే కోరుకొంటాడు. అలాంటివాడు భగవంతుణ్ణిగాని తోడినరుణ్ణికాని అట్టే పట్టించుకోడు. తన్ను వెదకనివాడికి, తన్ను కోరుకోనివాడికి ఆ భగవంతుడు ఏలా దర్శనమిస్తాడు? కనుక భగవంతుణ్ణి పొందగోరేవాడు తన్నుతాను సంతోషపెట్టుకోవడం మానుకోవాలి. దేవుణ్ణి సంతోషపెట్టడానికి పూనుకోవాలి. తన్నుతాను వెదకేవాడికి తాను దొరుకుతాడు. కాని అది తన వినాశానికే. అలా కాకుండ భగవంతుణ్ణి వెదకేవాడికి ఆ ప్రభువు దొరుకుతాడు. అది అతని సౌభాగ్యానికి దారితీస్తుంది.

3. ఇహలోక వస్తువ్యామోహంకూడ మనం దైవసాన్నిధ్యాన్ని గుర్తించకుండా వుండేలా చేస్తుంది. పక్షిని త్రాటితో కట్టివేస్తే ఇక అది పైకి యెగరలేదు. అలాగే మన ఆత్మనుకూడ లోకవస్తు మమకారంతో బంధిస్తే ఇక అది దేవుని వద్దకు ఎగిరిపోలేదు. ఒకోసారి చంద్రబింబానికి మబ్బు అడ్డుపడుతుంది. ఇక చందమామ కన్పించదు. అలాగే సృష్టివస్తు వ్యామోహంవలన నేత్రాలకు దట్టమైన తెరలు అడ్డుపడతాయి. ఇక భగవంతుణ్ణి చూడలేం. ప్రభువు ఇద్దరు యజమానులను సేవించవద్దన్నాడు. ఇద్దరు యజామానులూ దేవుడూ లోకవస్తువులూనూ - మత్త 6,24. వలలో చేపలాగ లోకవస్తువుల్లో తగులుకొన్నవాడికి దేవుడు దొరకడు. నిరంతరమూ లోకంలోని భౌతిక వస్తువులతో సతమతమై పోయేవాడు పరలోకంలోని ఆధ్యాత్మిక వస్తువులమీదికి మనసు త్రిప్పలేడు.

4. పై వస్తువ్యామోహంలాంటిదే యింద్రియ ప్రీతికూడాను. పాపపుమానవుడు లోకవస్తువులను అనుభవించి ఇంద్రియాలకు ప్రీతి కలిగించుకోవాలని చూస్తుంటాడు. నిరంతరమూ ముక్కూ, నాలుక, కన్ను, చెవి, స్పర్శ మొదలైన కర్మేంద్రియాలను సంతోషపెట్టుకోవాలని కోరుకొంటాడు. దేహ వాంఛలను దాటిపోనివాడికి ఆత్మస్వరూపుడైన భగవంతుడు ఏలా దొరుకుతాడు? పౌలు చెప్పినట్లుగా, మన శరీరం మన ఆత్మ కోరుకొనే దివ్యమైన కోరికలకు విరుద్ధంగా పాపపు కోరికలు కోరుకొంటుంది - గల 5,17. కనుక క్రీస్తు యేసునకు చెందినవాళ్ళు వ్యామోహాలతోను కోరికలతోనుగూడిన తమ శరీరాన్ని సిలువవేసికోవాలి - 5,24. అలాంటి వాళ్ళకే గాని దైవదర్శనం లేదు.

5. ఒకోసారి వదరుబోతుతనం వల్లగూడ దైవసాన్నిధ్యాన్ని కోల్పోతాం. మనం మాట్లాడేపుడు లోకవస్తువులను గూర్చి - అనగా మనం కన్నవాటినీ విన్నవాటినీగూర్చి - మాట్లాడతాం. కనుక ఘన మనసు లోకవస్తువులమీదనే లగ్నమౌతుంది. ఇక పరలోక

వస్తువులనుగూర్చి తలంచుకోడానికి వ్యవధియేది? కుంట అడుగునవున్న మట్టిని కదలిస్తే కుంటలోని నీళ్ళన్నీ మురికియౌతాయి గదా? అలాగే ఒకసారి మన నాలుకను మాటలతో కదిలిస్తే ఇక మన మనసూ హృదయమూ కూడ ఇహలోక భావాలతో మలినమైపోతాయి.

భగవత్సాన్నిధ్యాన్ని అభిలషించేవాడు తరచుగా మౌనాన్ని పాటించాలి. ఏకాంతాన్ని గూడ అభిలషించాలి. ఏకాంతంలో, మౌనంలో హృదయం ఆలోచనకు పూనుకొంటుంది. కంటికి కనుపించని భగవంతుణ్ణి ధ్యానించుకొంటుంది. ఆ పరమాత్మను దర్శిస్తుంది. కనుక దేవుడు అనుభవానికి రావాలంటే మనం వాగుడుకాయతనాన్ని తగ్గించుకొని మౌనం అలవర్చుకోవాలి.

6. కొందరికి లోకంలో జరిగే ఆయా సంగతులనూ, వాళ్లనూ వీళ్లనూ గూర్చిన రహస్యాలనూ తెలిసికోవాలనే కోరిక మిక్కుటంగా వుంటుంది. ఈ మనస్తత్వం వల్ల గూడ మనం దైవసాన్నిధ్యాన్ని గుర్తించలేకపోతూంటాం. ఈలాంటి బుద్ధి కలవాళ్లు తమ మంచి చెడ్డలు తాము అట్టే ఆలోచించి చూచుకోరు. తాము దేవుని దృష్టిలో ఏలా వున్నామా అని విచారించుకోరు. వాళ్లనీ వీళ్లనీ గూర్చి తెలిసికోగోరుతుంటారు. దీనివల్ల ఆధ్యాత్మికంగా కలిగే లాభమేమీ లేదు. మనలోని వ్యర్థ కుతూహలం మాత్రం కొంతవరకు సంతృప్తి చెందుతుంది. ఈలాగంటే మనకు లోకజ్ఞానం అవసరం లేదని కాదు. మన యిరుగుపొరుగు వాళ్లేలా వున్నారో, లోకంలో ఏమి జరుగుతుందో మనకు తప్పకుండా తెలిసివుండాలి. ఐతే మన కాలమంతా లోకవిషయాలకే వినియోగించకూడదు. అన్నింటికంటే భగవంతుడు ముఖ్యం. కనుక సజ్జనుడు సమయం దొరకినపుడుడల్లా పాపపు లోకంనుండి వైదొలగి దేవుని సన్నిధిలోకి వస్తూండాలి.

ఈ చివరి అధ్యాయంలో దైవసాన్నిధ్యాన్ని పాటించడంలో ఎదురయ్యే అవరోధాలను కొన్నిటిని పరిశీలించి చూచాం. ఈ యాటంకాలను జయిస్తే మనం దేవుణ్ణి అనుభవానికి తెచ్చుకోవచ్చు.

## ఉపసంహారం

ప్రభువు "నేను మహోన్నతమైన పరిశుద్ధ స్థలంలో వసిస్తూంటాను. ఐనా వినయాత్ములూ పశ్చాత్తాప మనస్కులూ ఐన నరులతో గూడ వసిస్తూంటాను" అన్నాడు - యెష 57,15. కనుక మనం మన పొగరుబోతుతనాన్ని అణచుకొని వినయంతో జీవించాలి. మన పాపాలకు పశ్చాత్తాపపడుతూ మనను నిర్మలంచేసికోవాలి. ఈలా ప్రవర్తిస్తే దైవభక్తి నలవర్చుకొని దేవుని సాన్నిధ్యాన్ని పొందుతాం. హానోకు, నోవా, అబ్రాహాము, యెలీషా లాంటి పుణ్యపురుషుల్లాగ దేవుని సన్నిధిలో నడుస్తాం. "ప్రభువు జ్ఞానం ప్రతి తరానా కొందరుభక్తుల నావేశించి వాళ్లను దేవుని స్నేహితులనుగాను ప్రవక్తలనుగాను మారుస్తుంది" అని చెప్తుంది సొలోమోను జ్ఞానగ్రంథం - 7, 27. దైవసాన్నిధ్య భాగ్యంవల్ల మనంకూడ ఈలాంటి భక్తులమైతే ఎంత బాగుంటుంది!

# 4. సోదర ప్రేమ - 1

బైబులు భాష్యం - 12

విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | సోదరప్రేమ విలువ | 74 |
| 2. | తలపుల్లో సోదరప్రేమ | 80 |
| 3. | మాటల్లో సోదరప్రేమ | 83 |
| 4. | చేతల్లో సోదరప్రేమ | 86 |
| 5. | క్షమాపణ గుణం | 89 |
| 6. | పౌలు బోధ | 91 |
| | - ఉపసంహారం | |


## 1. సోదర ప్రేమ విలువ

### 1. క్రీస్తు రెండాజ్ఞలను బోధించాడు

ఓమారు ధర్మశాస్త్రజ్ఞుడొకడు క్రీస్తుని సమీపించి ఆజ్ఞలన్నిటిలో ప్రధానమైన ఆజ్ఞ ఏదని ప్రశ్నించాడు. క్రీస్తు సమాధానం మార్కు 12, 28-34 వచనాల్లో చూడవచ్చు. ఈ వచనాలు పలుసారులు చదువుకోదగ్గవి. ఈ సమాధానంలో నాలుగంశాలను గుర్తించాలి. 1. ధర్మశాస్త్రజ్ఞుడు ప్రధానమైన కట్టడను ఒక్కదానిని పేర్కొనమనగా క్రీస్తు, ఒకటిగాదు రెండు కట్టడలను పేర్కొన్నాడు. మొదటిది, దేవుని పూర్ణ హృదయంతో ప్రేమించమన్నాడు. రెండవది, నీవలె నీ పొరుగువానిని ప్రేమించమన్నాడు. క్రీస్తు ఈలా రెండు కట్టడలను పేర్కొనడం దేనికంటే ఇవి రెండూ చాలా దగ్గర సంబంధం కలవి. దైవప్రేమకు తుల్యమైనది మానవప్రేమ. (2) మొదటి ఆజ్ఞకు సమానమై రెండవ ఆజ్ఞ సోదర ప్రేమ అంటాడు క్రీస్తు. దైవప్రేమ ముఖ్యాతి ముఖ్యమైంది. దానికి తుల్యమైంది సోదరప్రేమ. (3) వీటికి మించిన ఆజ్ఞలు మరేమీ లేవు. మోషే ధర్మశాస్త్రంలోని ఆజ్ఞలన్నీ ఒంకెమీద గుడ్డలు వ్రేలాడినట్లుగా, ఈ రెండాజ్ఞలమీద వ్రేలాడుతూంటాయి - మత్త 22,40. (4) ఈ రెండాజ్ఞలను పాటించడం దహన బలులను సమాధాన బలులను సమర్పించడం కంటె యోగ్యమైన కార్యం.

ఈ క్రీస్తు సమాధానాన్నిబట్టి దైవప్రేమ సోదరప్రేమ రెండూ సమానమైన కట్టడలని భావించాలి. అసలు ఇవి రెండూ ఒకే కట్టడ. రెండు విధాలుగా చెప్పబడ్డాయి. ఒకే చెట్టు నుండి చీలిన రెండు కొమ్మల్లాగ, ఒకే కాడపై పూచిన రెండు గులాబీ పూవుల్లాగ, ఒకే నీటి బుగ్గ నుండి వెలువడిన రెండు పాయల్లాగ ఈ రెండాజ్ఞలూ ఒకే ప్రేమాజ్ఞ నుండి పుట్టాయి.

నరుడు చనిపోయేపుడు పలికే తుది పలుకులు చాలా ముఖ్యమైనవి. అతని కోరికలూ ఆశయాలూ ఆ తుది పలుకుల్లో స్పష్టంగా గోచరిస్తాయి. క్రీస్తు కడపటి ప్రసంగమే అతని తుది పలుకులు. ఈ కడపటి ప్రసంగంలో ప్రభువు సోదరప్రేమను గూర్చి గూడా ప్రస్తావించాడు. అనగా ప్రభువు సోదర ప్రేమను ముఖ్యాతి ముఖ్యాంశంగా భావించాడని చెప్పాలి. ప్రస్తుతం ఈ కడపటి ప్రసంగంలోని సోదర ప్రేమను గూర్చిన వాక్యాలను కొన్నింటిని పరిశీలిద్దాం. క్రీస్తు కడపటి ప్రసంగం యోహాను 13-17 అధ్యాయాల్లో వర్ణింపబడింది.

1. ప్రభువు సోదర ప్రేమను గూర్చి మాటాడుతూ "నేను మీకు క్రొత్త ఆజ్ఞ నిస్తున్నాను" అన్నాడు - 13, 34. సోదరప్రేమ క్రొత్త ఆజ్ఞ ఎలా ఔతుంది? పూర్వవేదంలోని లేవీయకాండ "నీవలె నీ పొరుగు వారిని ప్రేమించు" మని చెప్తుంది - 19,18. మరి క్రీస్తు దీనిని "క్రొత్త ఆజ్ఞ" అనడం దేనికి? పూర్వవేదం సోదరప్రేమను గూర్చి బోధించినా సోదర ప్రేమను ఎందుకు పాటించాలో ఎక్కడా చెప్పలేదు. కాని నూత్నవేదంలో క్రీస్తు తన ప్రేమే సోదర ప్రేమకు ఆదర్శమన్నాడు. "నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించాలి" అని క్రీస్తుబోధ - 15,12. క్రీస్తు మనలను ప్రేమించాడు కనుక, ఆ క్రీస్తు ప్రేమను ఆదర్శంగా పెట్టుకొని మనం తోడి ప్రజలను ప్రేమించాలి. ఈ యాదర్శమే సోదర ప్రేమకు కారణం. ఈ కారణాన్ని పూర్వవేదమెక్కడా పేర్కొనదు. యావే ప్రభువు కొరకు తోడినరులను ప్రేమించమని పూర్వవేద మెక్కడా చెప్పదు. కాని క్రీస్తు కొరకు తోడి ప్రజలను ప్రేమించమని నూత్నవేదం చెప్తుంది. ఈలా క్రీస్తు క్రొత్తగా ఓ ఆదర్శాన్ని, ఓ కారణాన్నీ ప్రవేశపెట్టాడు. ఈ కట్టడలోని క్రొత్తతనం ఇదే.

2. "మీరు పరస్పర ప్రేమతో జీవిస్తే లోకం మిమ్ము నా శిష్యులనుగా గుర్తిస్తుంది" అన్నాడు ప్రభువు - 13,35. అనగా లోకంలోని జనులు పరస్పర ప్రేమతో జీవించరు. ఒకరంటే ఒకరికి గిట్టదు. ఒకరినొకరు అణగద్రొక్కాలని చూస్తుంటారు. "నరునికి నరుడు తోడేలు" అంటుంది ఓ రోమను సామెత. కాని క్రీస్తు శిష్యులు అలా ప్రవర్తించకుండ, ఒకరినొకరు ఆదుకుంటూ పరస్పర ప్రేమభావంతో జీవించాలి. ఈ సోదరప్రేమే క్రైస్తవ ప్రజలకు ప్రధాన లక్షణం. క్రీస్తు తనపేర అద్భుతాలు చేసేవాళ్ళు, గొప్ప సాంఘికసేవ చేసేవాళ్ళూ, తన్నుగూర్చి చక్కగా ఉపన్యసించేవాళ్ళూ, రచనలు చేసేవాళ్ళూ తన శిష్యులు అనలేదు. మరి తనకొరకు తోడి ప్రజలను ప్రేమించేవాళ్ళు తన శిష్యులుగా గుర్తింపబడతారు అన్నాడు. ప్రాచీన క్రైస్తవ రచయిత టెర్టూలియన్ నాటి రోమను ప్రజలు క్రైస్తవులను గూర్చి మాటలాడుకొనే తీరును వర్ణిస్తూ "ఈ క్రైస్తవులు ఒకరినొకరు ఎంత చక్కగా ప్రేమించుకుంటున్నారో చూడండి" అని అనుకొనేవాళ్ళని వ్రాసాడు. అపోస్తలుల చర్యలు కూడ యెరూషలేములోని తొలినాటి

క్రైస్తవ సమాజాన్ని వర్ణిస్తూ "వాళ్ళు ఒకే ఆత్మ ఒకే హృదయం కలిగి వుండేవాళ్లని చెప్తుంది- 4,32. ఈ వాక్యాలను బట్టి క్రైస్తవ మతంలోని సారం సోదరప్రేమ అని అర్థం చేసికోవాలిగదా!

3. క్రీస్తు "నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరి నొకరు ప్రేమించాలి. ఇది నా యాజ్ఞ" అన్నాడు - 15,12 సువార్తలోని ఆజ్ఞలన్నీ క్రీస్తువే కదా! ఈ సోదర ప్రేమనే ప్రభువు ప్రత్యేకంగా "నా ఆజ్ఞ" అని పేర్కొనడం దేనికి? తోడి ప్రజలను ప్రేమించడమంటే ఏమిటో క్రీస్తుకు బాగా తెలుసు. "స్నేహితుల కొరకు ప్రాణాన్ని సమర్పించడం కంటె మేలైన ప్రేమ ఏముంది" అన్నాడు ప్రభువు. 15,13. ఆలాంటి ప్రేమమూర్తి సోదర ప్రేమను "నా ఆజ్ఞ" అని పేర్కొన్నాడు. కనుక యీ సోదరప్రేమ ఎంత ముఖ్యమైందో ఊహించవచ్చు గదా!

4. "తండ్రీ! నాతో నీవు, నీతో నేను ఐక్యమైయున్నట్లే వీరూ మనతో ఏకమై వుండాలి" అని శిష్యులను గూర్చిన క్రీస్తు ప్రార్థన -17,21. శిష్యుల ఐక్యతకు పోలిక తండ్రి కుమారుల ఐక్యత. తండ్రి కుమారుల ఐక్యత నిజమైంది. గాఢమైంది. ప్రేమపూరితమైంది. అలాగే క్రైస్తవ ప్రజలు కూడ ప్రేమభావంతో ఐక్యం గావాలి. ఇక్కడ దైవజీవితాన్ని దైవప్రేమను సోదరజీవితానికి సోదరప్రేమకు ఉపమానంగా చెప్పాడు ప్రభువు. అనగా సోదర ప్రేమ అంతశ్రేష్ఠమైంది.

కడపటి ప్రసంగంలోని పై నాలుగు వాక్యాలనుబట్టి సోదరప్రేమ ఎంత ప్రాముఖ్యమైందో ఊహించవచ్చుగదా! ఇక ఈ సోదరప్రేమను లక్ష్య పెట్టకుండ జీవించే వాళ్ళను యధార్థ క్రైస్తవులనగలమా?

## 2. సోదర ప్రేమకు ఆధారం దైవప్రేమే

సోదరప్రేమ చాలా ముఖ్యమైంది అన్నాం. కాని సోదర ప్రేమను మనం ఎందుకు పాటించాలి? దేవుడు ప్రతినరుణ్ణి వ్యక్తిగతంగా ప్రేమిస్తుంటాడు. దేవునికి ప్రీతిపాత్రుడైన నరుణ్ణి మనంకూడా ప్రేమించాలి. మనం తోడి నరునికి కీడుచేస్తే క్రీస్తు ఆ కీడు తనకు చేసినట్లే భావిస్తాడు.సువిశేష వాక్యాలే ఇందుకు సాక్ష్యం. మత్తయి సువిశేషం 25వ అధ్యాయం కడపటి భాగం ఓ సామెతను వర్ణిస్తుంది. ఈ సామెత ప్రకారం కొందరు క్రీస్తు శిష్యులను ఆదరించారు - 25,40. మరి కొందరు అనాదరం చేసారు - 25,45. కాని క్రీస్తు ఈ యాదరాన్నీ అనాదరాన్నీ తనకు చూపినట్లే భావించాడు. ఆ ప్రభువు తన ప్రజలమధ్య నెలకొని వుండేవాడు. తన ప్రజలతో ఐక్యమై వుండేవాడు. అతడు నూత్న వేదపు ఇమ్మానువేలు- మత్త 1,23. కనుక అతని కోసము అతని ప్రజలను ప్రేమించాలి. సోదర ప్రేమలోని రహస్యమంతా ఇదే. దాని విలువ కూడ ఇదే.

మరో తావులో ప్రభువు క్రీస్తుపేర శిష్యులకు గ్రుక్కెడు మంచి నీళ్ళిచ్చినవాడు కూడ ప్రతిఫలం పొందుతాడనీ, దుర్మాతృక ద్వారా ఆ శిష్యులకు హానిచేసినవాళ్ళు ఘోర శిక్షననుభవిస్తారని బోధించాడు - మార్కు 9, 40-42. ఈ వాక్యాలనుబట్టి కూడా క్రీస్తు తన ప్రజలతో ఐక్యమైవుంటాడనీ వాళ్ళకు చేసిన మేలుకీడులను తనకు చేసినట్లే భావిస్తాడనీ అర్థంచేసికోవచ్చు గదా! సౌలు క్రైస్తవులను హింసించాడు. కాని క్రీస్తు ఆ హింస తనదిగానే భావించి "సౌలూ సౌలూ! నన్నెందుకు హింసిస్తున్నావు?" అని అడిగాడు - అచ 9,4. క్రీస్తు సోదరజనంలో జీవిస్తుంటాడనడానికి ఇంతకంటె ప్రబల తార్కాణం ఏం కావాలి?

ఇందుకే యోహాను మొదటిజాబు" ఎవరైనా నేను దేవుణ్ణి ప్రేమిస్తున్నాని చెప్పుకొంటూ తోడిజనులను ద్వేషించినట్లయితే అతడు వట్టి అబద్ధాలకోరు" అంటుంది. - "కంటికగుపించే తోడి జనులను ప్రేమించలేనివాడు కంటి కగుపించని భగవంతుణ్ణి ఎలా ప్రేమిస్తాడు" అని ప్రశ్నిస్తుంది- 4,20. ఇవి చాల గొప్ప వాక్యాలు. దేవుడు మనకు కన్పింపడు. అతడు మనకంటె చాల గొప్పవాడు. పరిపూర్ణుడు. కనుక ఆ దేవుని సన్నిధిలోనికి వెళ్ళి మ్రొక్కుకోవడం చాల సులభం. అతన్ని ఆరాధిస్తున్నాము, ప్రేమిస్తున్నాము అనుకొని భ్రాంతిపడ్డం కూడా సులభమే. కాని తోడి నరులు మన కంటికి కన్పించేవాళ్ళు. వాళ్ళ బలహీనతలూ, వాళ్ళు చేసే ఏబ్రాసి పనులూ మనకు బాగా తెలుసు. ఈలాంటి తోడినరులను మనం సులభంగా ఆదరించలేం. ప్రేమించలేం. ఐనా ఈ నరుల్లో ఈ దేవుడు నెలకొని వుంటాడు. అతని కోసం వీళ్ళను ఆదరించాలి. అలా ఆదరించనపుడు అతన్నే అనాదరం చేసినట్లు. కనుక ఈ సోదరప్రేమ లేనికాడ దైవప్రేమ కూడా లేదు. ఉందనుకొని భ్రాంతిపడితే మనలను మనం మోసంచేసుకున్నట్లే. అందుకే సోదరప్రేమను పాటించకుండ దైవప్రేమను సాధిస్తున్నాననేవాడు వట్టి అబద్ధాలకోరు అంటుంది పై వేదవాక్యం.

## 3. యోహాను వాడిన ఉపమానాలు

యోహాను తాను వ్రాసిన మొదటి జాబులో సోదరప్రేమ కలిమినీ, సోదర ప్రేమ లేమినీ సూచిస్తూ చక్కని ఉపమానాలు వాడాడు. ఉపమానం ఎప్పుడూ మనం చెప్పదలచుకున్న సత్యాన్ని ప్రస్ఫుటం చేస్తుందిగదా! అలాగే ఇక్కడ కూడాను.

సోదర ప్రేమ వెలుగు. అది లేమి చీకటి. కనుక ప్రేమగల మానవులు వెలుగులోను, ప్రేమలేని మానవులు చీకటిలోను సంచరిస్తూంటారు - 2,10. సోదరప్రేమగల మానవులు దేవుని బిడ్డలు. అది లేనివాళ్లు పిశాచ సంతానం - 8,10. సోదరప్రేమ జీవం. దాన్ని విడనాడ్డం మరణం - 3,14. సోదరప్రేమను పాటించడం సత్యాన్ని పాటించడమే. దాన్ని మీరడం అబద్ధ మాడ్డమే - 4,20. పైగా సోదరులను

ద్వేషించడ మనగా నరహత్యకు పూనుకోవడమే - 3,15 సోదరప్రేమను పాటించడమనగా దేవుని ఎరుగడం. దానిని పాటింపమి యనగా దేవుని ఎరుగక పోవడం - 4, 7-8. సోదరప్రేమతో జీవించేవానిలో దేవుడు నెలకొని వుంటాడు. కనుక దైవనివాసమే సోదరప్రేమకు బహుమానం - 4,12. దేవుడే మొదట నరులను ప్రేమించి వాళ్ళకొరకుతన క్రీస్తును పంపాడు. దేవుని ఈ ప్రేమను ఆదర్శంగా బెట్టుకొని, అతని బిడ్డల్లా మెలుగుతూ, మనం కూడ తోడి ప్రజలను ప్రేమిస్తూండాలి - 4, 9-11.

కనుక సోదరప్రేమ సోదరద్వేషాలు చీకటివెలుగుల లాంటివి. చావుబ్రతుకుల లాంటివి, సత్యాసత్యాల లాంటివి, దైవసంతాన పిశాచసంతానాల లాంటివి. ఈలాంటప్పుడు మనం సోదరప్రేమను శ్రద్ధతో పాటించడం ఎంత అవసరమో వేరుగా చెప్పాలా?

## 4. సోదర ప్రేమను అలవరచుకోవడం ఎలా?

సోదరప్రేమను అలవరచుకోవడం అంత సులభం కాదు. భగవంతుడు పరిపూర్ణుడు. గాని నరుడు దౌర్బల్యుడు. నరుని దుర్గుణాలు మనకు ఏవగింపును కలిగిస్తాయి. అతనితోడి నిరంతర పరిచయంవల్ల అతన్ని చిన్నచూపు చూస్తుంటాం. "అతి పరిచయాత్ అవజ్ఞా" అన్నారు పెద్దలు. పైగా "నరునికి నరుడు తోడేలు" అనే స్వభావం మనందరిలోను కొద్దోగొప్పో వుండనే వుంటుంది. ఈలాంటి పరిస్థితుల్లో ప్రయత్నపూర్వకంగా కృషి చేస్తేనేగాని తోడి మానవుణ్ణి అంగీకరించి ప్రేమించలేం.

సోదర ప్రేమ పాటించాలంటే మొదట మనకు ప్రేమతోకూడిన కోరికలుండాలి. మన హృదయం తోడి ప్రజలకు సుముఖంగా వుండాలి. అనగా మనం ముమ్మందుగా హృదయాన్ని తోడి ప్రజలను గూర్చిన మంచి కోరికలతో నింపుకోవాలి. మనకు తెలిసినా తెలియకపోయినా, మన మందరమూ ఏలాంటి తలపులు తలుస్తుంటామో ఆలాంటి చేతలకు పూనుకుంటూంటాం.

మనం తోడి ప్రజలలో వున్నదివ్య లక్షణాలను జూచి ఆ ప్రజలను ఆదరించి ప్రేమించడం నేర్చుకోవాలి. సోదరప్రేమ కూడ దైవ ప్రేమ లాంటిదే. అనగా తోడి ప్రజల్లో వున్న దివ్యలక్షణాలను జూచి దేవుణ్ణి ప్రేమించినట్లే ఆ ప్రజలనూ ప్రేమిస్తున్నామనుట. ఇక, ఈ దివ్యలక్షణాలు ఏమిటివి?

1. వర ప్రసాదం ద్వారా యీ వ్యక్తి దేవునిలాంటివాడు ఔతాడు - 2 పేత్రు 1,4.
2. పరిశుద్ధాత్మ ఈ వ్యక్తి హృదయంలో ఓ దేవాలయంలోలాగ నెలకొని వుంటుంది - 1 కొ 3, 16.
3. జ్ఞానస్నానంద్వారా ఈ వ్యక్తి క్రీస్తుదేహంలో ఓ అవయవం - 1 కొ 12, 27.

4. ఈ వ్యక్తి క్రీస్తు చిందించిన పవిత్ర రక్తం ద్వారా రక్షణం పొందినవాడు.
5. ఈ వ్యక్తి క్రీస్తు శరీరాన్నే ఆహారంగా పుచ్చుకొనేవాడు.
6. ఇతడు పాపాత్ముడైనా దేవుడు ఇతని పరివర్తనం కోసం ఎదురు చూస్తుంటాడు.
7. ఉత్థాన క్రీస్తు ఇతనిలోను ప్రత్యక్షమై వుంటాడు. కనుక నే నితన్ని ఆదరించినపుడు క్రీస్తునే ఆదరించునట్లు, ఇతన్ని అనాదరం చేసినపుడు క్రీస్తునే అనాదరం చేసినట్లు.
8. ఇతడు దేవునికి పోలికగా కలిగింపబడినవాడు. భగవద్రూపమైన ఈ నరుణ్ణి నేను అనాదరం చేయవచ్చా?
9. నరులందరూ దేవుని బిడ్డలే. కనుక దేవుడు ఇతన్నికూడా తన సొంత బిడ్డనులా ఆదరిస్తుంటాడు.
10. ఈ నరుడు ఓనాడు దేవుని చేరి దేవుని సముఖంలో నిలుస్తాడు - గల 4,7.

నరునిలోని దివ్య లక్షణాలను చూపడానికి ఈలాంటి కారణాలను ఎన్నిటినైనా ఉదాహరించవచ్చు. ఇచ్చట మచ్చునకు కొన్నిటిని ఉదాహరించాం. ఈ లక్షణాలను మననం చేసికొని తోడి నరులపట్ల ఆదరమూ, ప్రేమా, గౌరవమూ పెంపొందించుకుందాం. పై జాబితాలోని చివరి మూడు లక్షణాలూ క్రైస్తవేతరులకు గూడ వర్తిస్తాయి. ప్రేమ విశ్వతోముఖమైంది. కనుక క్రైస్తవేతరులను గూడ మనం ప్రేమభావంతో ఆదరిస్తుండాలి.

పైన చెప్పిన అంశాలు అంతరంగికంగా హృదయంలో పెంపొందించుకోవలసిన భావాలు. కాని సోదరప్రేమను పాటించాలంటే యీ యాంతరంగిక భావాలు మాత్రమే చాలవు. బాహ్యాచరణం కూడ వుండాలి. ఓమారు ఓ ధర్మశాస్త్రోపదేశకుడు క్రీస్తును కలసికొని "నీవలె నీ పొరుగు వారిని గూడ ప్రేమించు" అన్న కట్టడను ఉదాహరించి "నా పొరుగు వాడెవడు?" అని ప్రశ్నించాడు. క్రీస్తు అతనికి మంచి సమరయుని సామెతను జెప్పి అక్కరలోనున్న వారిని ఆదుకోవడమే పొరుగు వారిని ప్రేమించడమని విశదం చేసాడు. నీవు కూడా అక్కరలో నున్న వారికి నీ శక్తికొలది సహాయం చేయమన్నాడు. - లూకా 10,37 కనుక మనం సోదర ప్రేమను ఆచరణ పూర్వకంగా చూపాలి. మన చుట్టుపట్లనున్న వారిని చేతనైన రీతిగా ఆదరించాలి. ఇదిగాని క్రియాత్మకమైన సోదర ప్రేమకాదు. తలపుల్లో చేతల్లో సోదర ప్రేమను ఎలా చూపాలో మీదటి అధ్యాయాల్లో స్పష్టమౌతుంది.

సోదర ప్రేమ మన మనుకున్నంత సులభమైంది కాదన్నాం. గాఢమైన విశ్వాసం లేందే సోదర ప్రేమ అలవడదు. మనకు బయటకు కన్పించేది, తోడి ప్రజల బలహీనతలూ, ఏబ్రాసి పనులూ మాత్రమే. ఐనా మనం వాళ్ళల్లోని దివ్యలక్షణాలను చూస్తుండాలి. ఈ

లక్షణాలు వాళ్ళ నొసటి మీద వ్రాసిలేవు. అవి మనకంటికి అగుపింపవు. ఐనా విశ్వాసంతో వాటిని నమ్ముతూండాలి. ఓ వికారమైన పూజాపీఠం. అది మన కంటికి ఇంపుగా వుండదు. కాని దానిమీది దైవసాన్నిధ్యాన్ని తప్పక ఆరాధిస్తాం. అలాగే తోడినరుడూ బలహీనపు ప్రాణి. అతని మాటలూ చేతలూ అసందర్భంగా వుంటాయి. ఐనా పీఠంమీదలాగే అతనిలోనూ దైవసాన్నిధ్యం నెలకొనివుంది. అంచేత అతన్ని అంగీకరింపక తప్పదు. బలహీనుడని తెలిసికూడ దేవుడే అతన్ని ఆదరిస్తూంటాడు, ప్రేమిస్తుంటాడు. మరి మనం అన్యథా ప్రవర్తించ వచ్చా? కనుక మనం తోడి నరులను గౌరవించాలి, ప్రేమించాలి. వినయ భావంతో అతడు మనకంటె యోగ్యుడేమో అనుకుంటూండాలి. భక్తుడు ఫ్రాన్సిస్‌డి సేల్సు తోడినరుణ్ణి సువిశేషకారుడైన యోహానుకు మల్లె క్రీస్తు హృదయంమీద ఆనుకొని వున్నట్లుగా భావించమన్నాడు. ఈలాంటి వినయభావం వల్ల రెండు ఫలితాలు సిద్ధిస్తాయి (1) ఇతరులు మనకంటె యోగ్యులై వుండవచ్చుగదా అనుకొని వాళ్ళను భూషిస్తాం. పౌలు కూడా ఫిలిప్పీయులకు వ్రాస్తూ "వినయంతో తోడిప్రజలు మీకంటె యోగ్యులనిభావిస్తుండండి" అని హెచ్చరించాడు - 2,3 (2) దేవుని దృష్టిలో తోడి ప్రజలే మన కంటె యోగ్యులై వుండవచ్చును గనుక వాళ్ళను గౌరవిస్తాం. పౌలుకూడ రోమీయులకు వ్రాస్తూ "సోదర ప్రేమతో ఒకరి నొకరు ప్రేమించుకుంటూ, గౌరవభావంతో ఒకరినొకరు గొప్పగా ఎంచుకుంటూండండి" అని చెప్పాడు - 12, 10. ఈ వినయభావం, ఈ గౌరవభావం సోదర ప్రేమను పెంపునకు గొనివస్తాయని పేరుగా చెప్పనక్కరలేదు కదా!

ఫలితార్థమేమిటంటే, క్యూరేడార్సు చెప్పినట్లు, దేవునితో నరునితోలాగ సంభాషించడం విశ్వాసం. తోడి నరుణ్ణి యేసుక్రీస్తును చూచిన చూపున జూచి ఆదరించడం సోదరప్రేమ.

## 2. తలపుల్లో సోదర ప్రేమ

సోదరప్రేమ మొదట తలపుల్లో వుంటుంది. భావాత్మకంగా వుంటుంది. అనగా మనం ఇతరులను గూర్చి ప్రేమపూరితమైన భావాలు కలిగి వుండాలి. ఇతరులనుగూర్చి చెడ్డగా గాక, మంచిగా భావిస్తూండాలి. ఈ సందర్భంలో ప్రస్తుతానికి రెండంశాలు చూద్దాం. ఇతరులగూర్చి మంచిగా భావిస్తూండడమంటే ఇతరులు వృద్ధిలోనికి వచ్చినపుడు వాళ్ళను అభినందిస్తూండడం, ఇతరుల కలిమినిగూర్చి అసూయ పడకుండా వుండడం.

### 1. ఇతరులను అభినందిస్తూండడం

ఇతరులు వృద్ధిలోనికి ప్రసిద్ధిలోనికి వచ్చినప్పుడూ, విజయం సాధించినప్పుడూ, సంతోషచిత్తులుగా వున్నప్పుడూ వాళ్ళతోపాటు మనమూ సంతోషించాలి. వాళ్ళ సంతోషంలో మనమూ పాల్గొనాలి. ఎలిసబేత్తు చాలకాలం గొడ్రాలైయుండి, వృద్ధాప్యంలో బిడ్డను కంది.

యూద స్త్రీలు బిడ్డను కనడం మహా భాగ్యంగా భావించుకునేవాళ్ళు. కనుక ఇరుగు పొరుగువాళ్ళంతా ప్రభువు ఎలిసబేతును కనికరించాడు గదా అని ఆమెతో పాటు సంతోషించారు. - లూకా 1,58. ఇది యథార్థ సోదర ప్రేమ. మామూలుగా ఇతరులు కష్టాలనుభవించేపుడు సానుభూతి చూపడం సులభమౌతుందిగాని వాళ్ళు పచ్చగా వున్నప్పుడు ఓర్చుకోవడమూ, వాళ్ళతో పాటు సంతోషించడమూ కష్ట మనిపిస్తుంది. ఐనా సంతోషించే వాళ్ళతో సంతోషించడ మనేసద్గుణాన్ని మనం ప్రయత్న పూర్వకంగానైనా అలవరచుకోవాలి.

## 2. అసూయ

తరచుగా యితరుల వృద్ధిని జూచి సంతోషించడానికి మారుగా అసూయకు లొంగిపోతూంటాం. అసూయ అంటే యితరులు పచ్చగా వుండడం జూచి మనసు నొచ్చుకోవడం, బాధపడ్డం. యూదులు అసూయ వలన క్రీస్తును పిలాతున కప్పగించారు - మత్త 27,18. క్రీస్తు ప్రసిద్ధినీ, జనమంతా అతన్ని వెంబడించడాన్నీ చూచి సహించలేకపోయారు. జన్మ పాపఫలితంగా నరులందరిలోను దుష్టగుణాలు నిండుకొని పోయాయి. ప్రతి నరునిలోను దేహాత్మలు పరస్పర వైరంతో పోరాటం ప్రారంభించాయి - గల 5,17. దీని ఫలితంగా నరుడు అనేక అవలక్షణాలతో నిండిపోయాడు. ఈ యవలక్షణాల్లో ఒకటి అసూయ. ఈ అసూయవలన తరచుగా సోదరప్రేమను ఉల్లంఘిస్తుంటాం. ఎదుటి వాడంటే గిట్టని తలంపులు తలుస్తూంటాం. మనలోని ఈ యసూయా గుణాన్ని గ్రహించకుండా వుండటం పరమ మూర్ఖత్వం.

ఆదిలో అసూయవలన పిశాచం ఆదామేవలకు పతనం తెచ్చిపెట్టింది. "పిశాచం అసూయ వలననే మరణం లోకంలోనికి ప్రవేశించింది" అంటుంది సొలోమోను జ్ఞాన గ్రంథం - 2, 24. అసూయవలన కయీను హేబెలును పొలానికి తీసికొనివెళ్ళి చంపివేసాడు - ఆది 4. 8. యోసేపు సోదరులు అసూయవలన యోసేపును గోతిలోనికి త్రోసివేసి యిష్మాయేలు బేహారులకు అమ్మివేసారు - ఆది 37, 28. ఓ మారు దావీదు ఫిలిస్తీయులను గెలిచి విజయంతో తిరిగిరాగా స్త్రీలు "సౌలు వేయిమందిని వధించగా దావీదు పదివేల మందిని వధించాడు" అని నాట్యంచేస్తూ పాట పాడారు. ఆ పాటవిని సౌలు అసూయతో క్రుగ్గిపోయాడు. దావీదును చంపాలని విశ్వప్రయత్నాలు చేసాడు - 1 సమూ 18,7.యూదులు అసూయతో క్రీస్తును చంపించారు. అసూయ ఈలాంటి ఘాతుక కార్యాలను ఎన్నిటినైనా చేయిస్తుంది. దానికి వశంగానినరులు చాల అరుదు. మహానుభావులే దానికి లొంగిపోయారు. ఇక అల్పమానవులమైన మనం దైనందిన జీవితంలో రోజురోజు పెద్ద విషయాల్లోనో, చిన్న విషయాల్లోనో అసూయకు గురౌతూనే వుంటాం. దీని ద్వారా

ప్రేమతో జూడవలసిన తోడిమానవుని ద్వేషభావంతో చూస్తూంటాం. కనుక క్రైస్తవ సాధకుడు ఈ యంశాన్ని గూర్చి చక్కగా ఆత్మశోధనం చేసికొంటూండాలి.

అసూయవలన జనించే మరో దుర్గుణం ఇతరులనుగూర్చి చెడ్డగా మాటలాడుతూండడం. ప్రతినరుడూ పేరుప్రతిష్ఠలతో జీవించాలనే కోరుకుంటూంటాడు. తాను మంచివాడుగా, సమర్థుడుగా పరిగణింపబడాలనే అభిలషిస్తూంటాడు. మనం అతన్నిగూర్చి చెడ్డగా మాట్లాడి అతని పరువు కాస్త తీసివేస్తాం. ఇది నరహత్య కాదుగాని, నరుని కీర్తిహత్య. కనుక సోదరప్రేమనుగూర్చి విచారించేపుడు ఈ యంశాన్నిగూడా జాగ్రత్తగా గమనించాలి. మోషే అన్నా అక్కా అయిన అహరోనూ మిర్యామూ మోషేనుగూర్చి అసూయపడ్డాడు. ప్రభువు మోషేద్వారా మాత్రమే మాటలాడాడా, మాతో మాత్రం మాటలాడలేదా అని అతన్ని కించపరిచారు. అందుకే ప్రభువు మిర్యామును శిక్షించి ఆమెకు కుష్ఠరోగం గలిగించాడు - సంఖ్యా 12,10.

అసూయకు గురైన నరుడు ఇతరుల కలిమిని జూచి నొచ్చుకుంటాడు. దీనివలన వ్యాధిలేకుండానే బాధపడతాడు. తెలుగుకవి తిక్కన

ఒరుల ధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియగ నసహ్యపడు న
న్నరుడు తెవులులేని వేదనంబడు నధిపా!

అని చెప్పాడు. ఈ "తెవులు లేని వేదన" ఎలా వుంటుందో మన కందరకూ అనుభవపూర్వకంగా తెలుసు!

గ్రీకు తాత్వికుడు అరిస్టోటలు అసూయను గూర్చి చెప్తూ "దేశ కాల ప్రాయ వృత్తి ప్రసిద్ధి బంధుత్వాల్లో మనకు దగ్గరివాళ్ళెవరో వాళ్ళను జూచి అసూయ పడుతూంటాం" అని వ్రాసాడు. మన దేశంలోను, మన కాలంలోను ఉన్నవాళ్ళను గూర్చి అసూయపడతాం. మనకంటె పెద్ద ప్రాయంలోను చిన్న ప్రాయంలోను వున్న వాళ్ళను జూచి అంతగా అసూయపడం. మన వృత్తి కంటె భిన్నమైన వృత్తిలో వున్న వాళ్ళను జూచి అసూయడం. బిచ్చగాడు ధనికునిజూచిగాదు, మరో బిచ్చగానిని జూచి అసూయపడతాడు. మనం చేసేపనినే చేస్తూన్నా, ప్రసిద్ధిలోనికి రానివాళ్ళను జూచి అసూయపడం. మన కుటుంబానికి చెందిన వాళ్లను జూచి మొట్టమొదట అసూయపడతాం. అందుకే అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూ ఒకరిని జూచి ఒకరు అంతగా అసూయపడేది. అరిస్టోటలు చెప్పిన ఈ యారు అసూయాకారణాలు జ్ఞాపకముంచుకోవడం మంచిది.

# 3. మాటల్లో సోదర ప్రేమ

మాటల్లో సోదరప్రేమను పాటించడమనేది విశేషంగా మన నాలుకమీద ఆధారపడి వుంటుంది. కనుక సోదరప్రేమనుగూర్చి మాటలాడేటప్పుడు ఈ నాలుకను మరచిపోలేం. జ్ఞానస్నానం ఇచ్చేప్పుడు గురువు శిశువు నాలుకమీద ఉప్పునుబెట్టి "ఈ జ్ఞానపుఉప్పును పొందు" అంటాడు. ఇక్కడ ఉప్పు దేవుని జ్ఞానమైన క్రీస్తును సూచిస్తుంది. ఇక మీదట ఈ నాలుకనుండి జ్ఞానంతో గూడిన పలుకులేగాని తెలివిలేని మాటలు వెలువడగూడదని ఈ క్రియ భావం. కాని శిశువు పెరిగి పెద్దవాడైన కొలది ఆ నాలుకనుండి ఏబ్రాసి పలుకులుగూడ వెలువడతాయి!

## 1. నాలుక మన హృదయాన్ని సూచిస్తుంది

జంతువులో కొన్నిటికి నరులకంటె శ్రవణశక్తి అధికంగా వుంటుంది. కొన్నిటికి స్పర్శశక్తి అధికంగా వుంటుంది. కొన్నిటికి నేత్రశక్తి అధికంగావుంటుంది. కాని మాటాడేశక్తి ఏ జంతువుకీలేదు. నరుడొక్కడే మాటలాడేవాడు. జంతువులలో లేని బుద్ధిశక్తి నరుల్లో వుంది. ఈ బుద్ధిశక్తిని అతడు తన నాలుకద్వారా వ్యక్తం చేస్తూంటాడు. నాలుకద్వారా తన లోని భావాలను ఇతరులకు తెలియజేస్తూంటాడు. ఇతరులలో కూడ తన భావాలలాంటి భావాలను రేకెత్తిస్తూంటాడు. గురువు శిష్యునికి పాఠం చెప్పడం ఈలాంటుదే. ఇది ఓ సృజన శక్తి. ఈ శక్తికి సాధనం నాలుకే.

కొందరు చాల కలుపుగోలు తనంతో స్నేహభావంతో మాటలాడుతూంటారు. హృదయంలోని ప్రేమభావాన్ని వాళ్ళ నాలుక మాటలద్వారా వ్యక్తం చేస్తుంది. ఈలాగే ఇతర మానసిక భావాలు కూడ. హృదయంలో నిండివుండే భావాలనుబట్టి నోరు మాటలాడుతుంది - మత్త 12,34. కనుక నాలుక మనహృదయాన్ని సూచిస్తుంది. మన మేలాంటి వ్యక్తులమో తెలియజేస్తుంది. భక్తుడు ఫ్రాన్సిస్ డిసేల్సు ఓ చక్కని ఉపమానం చెప్పాడు. వైద్యుడు రోగి నాలుకను జూచి అతని ఆరోగ్యస్థితిని తెలిసికుంటాడు. అలాగే మనమూ ఓ వ్యక్తి మాటలాడే తీరును జూచి అతని ఆత్మస్థితిని తెలిసికోవచ్చు. అతడేలాంటివాడో గ్రహించవచ్చు.

## 2. నాలుక మంచి పనికి ఉపకరిస్తుంది.

నాలుకతో బోలెడన్ని మంచిపనులు చేస్తుంటాం. ఎవరినోటినుండో ఒక ప్రేమ గల మంచి మాట వినివుంటాం. ఆ మాటను జీవితాంతం వరకూ మరచిపోలేం. మనం బాధల్లో వున్నపుడు ఎవరో ఓ దయగల పలుకు పలికారు. ఆ వ్యక్తినీ, అతని పలుకునీ పూజ్యభావంతో స్మరించుకుంటూంటాం.

నాలుక చేసే ఈ మేల్లన్నీ ప్రాకృతిక జీవితంలో. ఇక ఆధ్యాత్మిక జీవితంలో నాలుక ఎన్నో ఉపకారాలు చేస్తుంది. నాలుక ద్వారా బోధకుడు క్రీస్తును బోధించినప్పుడేగాని

మన హృదయంలో విశ్వాసం జనించదు - రో 10,7. అందుకే పరిశుద్ధాత్మ కూడ నాలుక రూపంలో శిష్యుల మీదికి దిగివచ్చింది - అచ 2,3. ఈ యాత్మ శక్తిని పొంది శిష్యులు నలుమూలల క్రీస్తును బోధించారు. అతని రక్షణాన్ని ప్రకటించారు. మనం కొన్ని వడకాలైనా చేసివుంటాం. గురువు నుండి కొన్ని సార్లయినా ఉపదేశం పొందివుంటాం. దీనికంతటికీ నాలుకే సాధనం.

ప్రతి క్రైస్తవ సంస్కారంలోను (దేవద్రవ్యానుమానం) రెండంశా లుంటాయి - ఓ మాట, ఓ క్రియ. ఉదాహరణకు జ్ఞానస్నానంలో "పితపుత్ర పవిత్రాత్మల పేరు మీదుగా నీకు జ్ఞాన స్నానమిస్తున్నాను" అనేవి మాటలు. నీళ్లు పోయడం క్రియ. ఇలాగే యితర సంస్కారాల్లో గూడ. ఈ సంస్కారాల్లోని మాటలన్నీ నాలుకనుండే వెలువడతాయి.

దివ్య పూజలోని ప్రార్థనలన్నీ నాలుకతో ఉచ్చరిస్తాం. పూజలోని ప్రధాన వాక్యాలైన "ఇది నా శరీరం, ఇది నా రక్తం" అనే ప్రభు పలుకులుకూడ నాలుకతోనే ఉచ్చరిస్తాం. అందుకే భక్తుడు గ్రెగోరీ "దివ్యబలిలోని బలిపశువు వాక్యమనే ఖడ్గంవలన ఆధ్యాత్మికంగా వధింపబడుతుంది" అని చెప్పాడు. ఇక, ఈ బలియొక్క నైవేద్యమైన దివ్య సత్ప్రసాదంగూడ మన నాలుక మీదనే నిలుస్తుంది.

పాఠకుడు దివ్య గ్రంథాన్ని చదువుతూ తన నాలుకతో వాక్యాలను ఉచ్చరింపగా మనం వింటూంటాం. నాలుక ఇన్ని విధాలుగా ఆధ్యాత్మిక జీవితంలో మనకు మేలు చేస్తుంది. ఆలాంటి ఈ యవయవాన్ని అనుగ్రహించినందులకు దేవునికి కృతజ్ఞులమై యుండాలి. ఈ యవయవాన్ని చక్కగా వాడుకొని ఆ దేవునికి సంతోషాన్ని చేకూర్చాలి.

## 3. నాలుక చెడ్డపనికీ ఉపకరిస్తుంది

నాలుక మంచికి ఉపకరిస్తుందన్నాం. కాని దురదృష్టవశాత్తు చెడ్డకు గూడ ఉపకరిస్తుంది. "జీవమూ మరణమూ నాలుక అధీనంలోవున్నాయి" అంటుంది సామెతల గ్రంథం - 8,21. దాన్ని చక్కగా వాడుకొంటే జీవమూ, చెడ్డగా వాడుకొంటే మరణమూ లభిస్తాయి. యాకోయి జాబు నాలుకను ఓ నిప్పు రవ్వతో పోలుస్తుంది. చిన్న నిప్పురవ్వ పెద్ద అడవిని కాల్చివేస్తుంది. అలాగే నాలుకకూడ చిన్న అవయవమైనా మనదేహాన్నంతటినీ భస్మం చేస్తుంది - 3,5. తెలుగుకవి నన్నయభట్టు ఓతావులో "వాక్పారుష్యము చన్నె మహాదారుణమది విషయముకంటెను దహనము కంటెన్" అన్నాడు.

జీవితంలో ఎవరో వొకరు ఎప్పుడో వొకప్పుడు మనల నుద్దేశించి చాలా నిర్దయగా మాటలాడి వుంటారు. ఆ మాటలు మన హృదయాన్ని కత్తితో పొడిచినట్లుగా బాధించి వుంటాయి. వేరొకరు కోపంతో మనమీద మండపడివుంటారు. చెడబడ తిట్టి వుంటారు. ఆ పలుకులు మనలను కత్తితో పొడిచినట్లుగా వేధించి వుంటాయి. కొంతమంది పాడుమాటలు చెప్పి కలిసిమెలిసి వుండే కుటుంబాలను వేరుచేయిస్తుంటారు. పండంటి

సంసారాలనూ కూలద్రోస్తుంటారు. నాలుక చేసే ఈ దుష్కార్యాలన్నీ ప్రాకృతిక జీవితంలో. కాని ఆధ్యాత్మిక జీవితంలో నాలుక చేసే పాడుపనులు ఇంకా ఘోరంగా వుంటాయి. చీటికిమాటికి నోరుజేసికొని ఇతరులను దుర్భాషలాడి సోదరప్రేమను భగ్నం చేస్తుంటాం.

ఇతరులమీద చాడీలు చెప్పి అపదూరులు మోపి వదంతులు పుట్టించి పాపం మూటగట్టుకుంటూంటాం. కామసల్లాపాలకు దిగి మోహేచ్ఛలను రెచ్చగొట్టి ఇతరులను బురద త్రొక్కిస్తాం. ఈలా నాలుకతో చేయగూడని పనులన్నీ చేస్తూంటాం.

ఇతర అవయావాలతో చేసే పాపాలకంటె నాలుకతో చేసే పాపాలలో కొన్ని విశిష్ట లక్షణాలు గోచరిస్తాయి. (1) ఒక గంటలోనే నాలుకతో ఎన్ని పాపపు మాటలైనా మాటలాడవచ్చు. ఇంత స్వల్పకాలంలో మరో అవయవంతో ఇన్ని పాపాలు చేయలేం. (2) పైగా మనం నాలుకతో పలికే పలుకులు ఆ క్షణంలో ఎవరికి ఎంత బాధ కలిగించాయో ఊహించనైనా ఊహించలేం. మన పలుకులు ఇతరుల మనసు నొప్పించాయని కొన్ని రోజులు లేక వారాలు గడచిన తరువాతగాని గ్రహించలేం. మనం పలికే మాటల మాలిన్యం మనకే తెలియకుండా వుంటుంది. (3) ఒకోమారు నాలుక జారినాక ఇకేమీ చేయలేం. మన నోటివెంట వెలువడరాని మాట వెలువడింది. ఎదుటి మనిషి మనసు చివుక్కుమంది. ఇంకేమి చేయగలం? ఎంత ప్రయత్నం చేసినా అతని బాధను తొలగించలేం గదా!

ఈ గుణాలను బట్టి నాలుక పదునైన కత్తి లాంటిదని తెలిసికోవాలి. దాన్ని ఏమాత్రం అజాగ్రత్తగా వాడామో, యితరుల హృదయాన్ని తెగనరికి తీరుతుంది. విశేషంగా సోదరప్రేమను హతం జేసే మారణ సాధనాల్లో తాను మొదటిదై కూర్చుంటుంది.

## 4. నాలుకను అదువులో పెట్టుకోవడం ఎలా?

నాలుకతో తరచుగా సోదర ప్రేమకు వ్యతిరేకంగా పాపంచేస్తుంటాం అన్నాం. కనుక ఈనాలుకను ఎలాగైనా అదుపులో పెట్టుకొనే ప్రయత్నం చేయాలి. "మనుష్యులు వ్యర్థంగా పలికే ప్రతిమాటికీ న్యాయనిర్ణయ దినాన లెక్క చెప్పాలి" అన్నాడు ప్రభువు - మత్తయి 12, 36. మనం ఎన్నిసారులు వ్యర్థంగా మాటలాడి ఎంత పాపం మూటగట్టుకున్నామో!

నాలుకను అదుపులో పెట్టుకోవడం చాల కష్టం. యాకోబు జాబు 3, 3-12 వాక్యాలు నాలుకను గూర్చే. బైబుల్లోని అతి ప్రశస్తవాక్యాల్లో ఇవీ కొన్ని. కనుక పాఠకులు ఈ వాక్యాలను శ్రద్ధతో చదివి భక్తితో మననం చేసికోవాలి. నరులు గుర్రాల నోటిలో కళ్ళెంబెట్టి వాటిని వశం జేసికుంటారు. పెద్దపెద్ద ఓడలను కీలుతో అటూ యిటూ త్రిప్పుతూంటారు. ఈలా మృగ పక్షి సర్ప మత్స్యాది సమస్తజంతుజాతులన్నీ నరునికి స్వాధీనమయ్యాయి. కాని నాలుక మాత్రం ఎవరికీ స్వాధీనం కాదు. అది రవ్వలాగ చిన్న అవయం గాని, పెద్ద చిచ్చు. నాలుక మన దేహంలో వుండి, ఆ దేహాన్నంతటినీ తగలబెడుతుంది. అది నరకపు చిచ్చువలననే రగులుకొంటుంది. నాలుక మరణాంతక

విషపూరితం. దాని తోనే దేవుని స్తుతిస్తాం. దానితోనే దేవునికి పోలికగా వుండే నరుణ్ణి శపిస్తాం. ఒకే జలధారనుండి ఉప్పునీళ్ళూ, తీయని నీళ్ళూ వెలువడతాయా? ఐనా ఈ నాలుకనుండే ఆశీర్వచనాలూ, శాపవచనాలూ వెలువడతాయి. ఇది చాలా చోద్యం - ఇవి యాకోబు భావాలు. ఈలాంటి నాలుకను బుద్ధిమంతులు ప్రయత్నంచేసికూడ స్వాధీనం చేసికోలేక పోతున్నారనగా, ఇక ఏ ప్రయత్నమూ చేయని మూర్ఖులకు అది లోబడుతుందా?

నాలుకను స్వాధీనం చేసికోవాలి అన్నాం. పై యాకోబు జాబే "ఎవడైనా నోటిని అదుపులో పెట్టుకోకుండా నేను భగవద్భక్తి కలవాణ్ణి అనుకొంటే వాని భక్తి వ్యర్థమే ఔతుంది. అతడు తన్నుతానె మోసగించుకుంటున్నాడు" అని చెప్తుంది - 1,26. కాని ఈ నాలుకను స్వాధీనం చేసికోవడం ఎలా? మొదటిది, నాలుక గుణం చక్కగా తెలిసికొని వుండాలి. దాన్ని అదుపులోనికి తీసుకురావాలనే కోరికా వుండాలి. ఆమీదట, ఎటూ మనంతట మనం దాన్ని జయించలేంగనుక, వినయంతో దైవసహాయం అడుగుకోవాలి. అందుకే కీర్తనకారుడు కూడ "ప్రభూ! నానోటికి తలుపులు బిగించి, నా పెదవులకు తాళము వేయి" అని మనవిచేసాడు - 14,3. సీరా జ్ఞాన గ్రంథకర్త "నా నోటికి తలుపులుబిగించి నాపెదవులకు తాళం వేయగలవా డెవడు? ఈ నాలుక వలన నేను నాశమై పోకుండేలాగ, ఈ నాలుక వలన నేను కూలిపోకుండేలాగ నన్ను కాపాడగలవా డెవడు" అని మొర్ర పెట్టుకున్నాడు - 22,33. ఈ భక్తుల్లాగే మనంకూడా భగవత్సహాయం అడుగుకోవాలి. మన శక్తి కొరతవడిన కాడ భగవచ్ఛక్తి పని చేస్తుంది.

ఇంకా, దివ్య సత్ప్రసాదం పుచ్చుకొన్నపుడు ప్రభువు మన జిహ్వాగ్రంమీద విశ్రమిస్తాడు. ఆ దుష్టజిహ్వను అదుపులో పెట్టుకొనే భాగ్యం ప్రసాదించమని కూడ ఆ సమయంలో ప్రభువునే మనవి చేసుకోవాలి. దేవుడేగాని నరుడు నాలుకను సాధువుగా జేయలేడు.

# 4. చేతల్లో సోదర ప్రేమ

మన తలపుల్లో మాటల్లో సోదర ప్రేమను ఏలా పాటించాలో పూర్వాధ్యాయాల్లో విచారించి చూచాం. ఈ యధ్యాయంలో చేతల్లో సోదర ప్రేమను ఏలా పాటించాలో విచారించి చూద్దాం.

## 1. ఇతరులకు మేలు చేయడం

ప్రేమను మాటల్లో కాదు, చేతల్లో చూపించాలి. సోదరప్రేమ కూడ అలాగే. ఈలా సోదరప్రేమను క్రియాత్మకంగా చూపించడం ద్వారా ఇతరులకు మేలుచేస్తాం. ఇక, సోదర ప్రేమ క్రియాత్మకంగా చూపించే మార్గాలు చాలా వున్నాయి.

మొట్టమొదట మన జీవితమే ఉత్తమంగా, నిర్మలంగా వుండాలి. లోకమంతటా మహానుభావులు తమ బోధలకంటే గూడ జీవితం ద్వారానే అధికంగా బోధించారు.

"మాటలు శ్రోతలను ఉగ్రూతలూగిస్తాయి. కాని చేతలు కార్యాచరణకు పురికొల్పుతాయి" అంటుంది ఓ లాటిను సామెత. అంచేత మన మాటలకంటే చేతలు మేలు. ఇక సోదర ప్రేమను పాటించాలన్నా గూడ, మొట్టమొదట మన ఉదాత్త జీవితం ద్వారానే ఆ పనికి పూనుకోవాలి. ప్రభువు పర్వత ప్రసంగంలో "మీ వెలుగును ఇతరుల యెదుట ప్రకాశింపనీయండి. అప్పుడు నరులు మీ సత్క్రియలను చూచి పరలోకంలో వున్న మీ తండ్రిని కొనియాడుతారు" అన్నాడు- మత్త 4, 16.

కూడు, గుడ్డ, ఇల్లు, నరుని ప్రాథమికావసరాలు. ఈ మూడూ లేక అలమటిస్తూ అధమ జీవితం జీవించేవాళ్ళు మన చుట్టుపక్కల చాలామంది కన్పిస్తూంటాడు. ఈలాంటి వాళ్ళకు చేతనైనంత వరుకు సాయపడ్డం ఉత్తమ సోదరప్రేమ. విశేషంగా ఇండియాలో ప్రస్తుత పరిస్థితుల్లో పేదప్రజలు ఈలాంటి సహాయాన్ని ఎంతైనా మెచ్చుకుంటారు. ఈ ప్రాథమికావసరాలతోపాటు విద్యా వైద్య సేవలను కూడ చేరుస్తుండాలి. కాని ఈ రెండిటినీ సమర్థంగా నిర్వహించాలంటే వ్యక్తులు చాలరు. సమాజాలవసరం.

ఇతరులకు భగవంతుణ్ణి గూర్చి తెలియజెప్పడంగూడ గొప్ప సోదరప్రేమ. బహుప్రాచీన కాలంలోనే ఉపనిషత్తులు విద్య లన్నిటికంటె బ్రహ్మవిద్య గొప్ప విద్య అన్నాయి. వైదిక కాలమునాటి యాజ్ఞవల్క్యునిభార్య గార్గికి "బ్రహ్మవాదిని" అని బిరుదు. ఈనాడు మనం ఈ బోధనా సేవలో వెనుకంజ వేయకూడదు. బైబులుభగవంతుడు ఓ తండ్రిలాంటివాడు. అతని కుమారుడు క్రీస్తు. ఈ క్రీస్తు మనలను రక్షించి మనకు పెద్దన్న అయ్యాడు. అతని సహాయం వలన మనం రక్షణం పొందుతాం! ఈ యంశాలను క్రైస్తవులకూ, క్రైస్తవేతరులకూ వివరించవచ్చు. ఉత్తమ క్రైస్తవ సాహిత్యాన్ని చదవవచ్చు. ఇతరులకు అందజేయవచ్చు. క్రైస్తవమతం విశేషంగా ప్రేషితమతం.

ప్రార్థనా సేవ గూడ చాల గొప్పది. అన్నదాన భూదాన శ్రమదాన ధనదానాదులకంటే ప్రార్థనాదానం శ్రేష్ఠమైంది. ప్రార్థన ద్వారా నరుణ్ణి దేవునితో జోడిస్తాం. ఇంతకన్న శ్రేష్ఠమైన సోదరప్రేమ ఏముంటుంది? ప్రార్థనా సేవకు బాధాసేవను కూడ చేర్చాలి. అనగా మన బాధలను ఓర్పుతో సహించి తోడిప్రజల శ్రేయస్సుకొరకు సమర్పించడం.

పైన నుడివిన రీతిగా సోదరప్రేమను రకరకాల సేవల ద్వారా రకరకాల విధానాలలో చూపవచ్చు. తామున్న పరిస్థితులను బట్ట ఎవరు ఏలాంటి సోదర ప్రేమను చూపించగలరో ఎవరికి వాళ్ళే నిర్ణయించుకోవాలి. జనుల అభిరుచులూ, అవకాశాలూ చుట్టుపట్ల వున్న జనుల అవసరాలూ భిన్నభిన్నంగా వుంటాయి. వీటిని పురస్కరించుకొని ప్రతి క్రైస్తవ భక్తుడూ తనకు చేతనయిన ప్రేమ మార్గాన్ని ఎన్నుకోవాలి. గొప్ప విషయాల్లోనో, స్వల్ప విషయాల్లోనో సోదరప్రేమను సాధించాలి.

## 2. ఇతరులకు కీడు చేయడం

ఇతరులకు మేలు చేసి సోదరప్రేమను పెంపొందించుకోవాలి అన్నాం. కాని దౌర్బల్యం వలన తరచుగా యితరులకు కీడుచేసి సోదరప్రేమను భంగపరుస్తూంటాం. ఇతరులకు హాని కలిగించే దుష్కార్యాలు బోలెడన్ని చేస్తూంటాం. వీటిల్లో ప్రస్తుతానికి ఒక్కదానిని గూర్చి మాత్రం విచారిద్దాం. అది దుర్మాతృక. దుర్మాతృక అంటే, మనం చేసే పాడుపని ద్వారా ఇతరులను కూడా పాపానికి పురికొల్పడం.

మనం రకరకాలుగా దుర్మాతృక చూపుతూంటాం. ఎదుటి వ్యక్తి మూడవ వ్యక్తిని గూర్చి మనతో చెప్పిన సంగతులను ఆ మూడవ వ్యక్తికి తెలియజేస్తూంటాం. దానివలన ఎదుటి వ్యక్తికీ, మూడవ వ్యక్తికీ వైరం కలిగిస్తుంటాం. ఇంకా, మనం మోసాలూ దొంగతనాలూ దుర్విమర్శలూ చేస్తుంటాం. ఇతరులనుకూడ ఈ పాడు పనులకు ప్రోత్సహిస్తూంటాం. మన మతాన్ని గురించీ, మతాధికారుల గురించీ, గుడికి వెళ్ళడం దేవద్రవ్యానుమానాలను స్వీకరించడం మొదలైన క్రైస్తవాచరణలను గూర్చి తేలికగా మాటలాడుతుంటాం. దీనిద్వారా మన యిరుగుపొరుగువాళ్ళ భక్తినిగూడ చెడగొడుతూంటాం. చెడు పుస్తకాలను చదివి ఇతరులకు అందీయడం ద్వారా నైతేనేం. చెడు జాబులను చేరుస్తూండడం వల్ల నైతేనేం, చెడు సల్లాపాలవల్ల నైతేనేం, చెడ్డ వస్త్రధారణవల్లనైతేనేం ఇతరుల పారిశుద్ధ్యాన్ని కూడా చెడగొడుతూంటాం. ఈ విధంగా రోజురోజు మనం చేసే రకరకాల చెడు పనుల ద్వారా ఇతరులను పాపానికి పురికొల్పుతూంటాం. అందుకే ప్రభువు "ఇతరులకు దుర్మాతృక చూపడం కంటె మెడకు తిరుగలి రాయి కట్టుకొని సముద్రంలో దూకడం మేలు" అన్నాడు - మత్త 18,6. విశేషంగా పై స్థానంలో వున్నవాళ్లు ఈ దుర్మాతృకను గూర్చి నిశితంగా ఆత్మశోధనం చేసికోవాలి. తల్లి దండ్రులు, ఉపాధ్యాయులు, పెద్దలు, గురువులు, మఠశ్రేష్ఠులు మొదలైనవాళ్లు తమ పెద్దరికంవల్ల పిన్నలను మంచికిగాని చెడ్డకుగాని పురికొల్పగలరు. వాళ్ళు చేసే చెడ్డపనులను పిన్నలు సులభంగా అనుకరిస్తారు. ఆవు చేలో మేస్తూంటే దూడ గట్టున మేస్తుందా?

"లోకం బోలెడన్ని దుర్మాతృక లిస్తుంది" అన్నాడు ప్రభువు - మత్త 18,17. పత్రికలు, గ్రంథాలు, సినిమాలు, రేడియోలు, నాటకాలు నవనాగరికుల వేషభాషలు, పెద్ద ఉద్యోగుల లంచాలు మోసాలు, రాజకీయ పక్షాల దౌర్జన్యాలు కుతంత్రాలు - ఈ విధంగా లోకం నారారూపాల్లో ప్రతిక్షణం దుర్మాతృక నిస్తూనే వుంటుంది. లోకం పోకడ ఓ మహా ప్రవాహం లాంటిది. విచక్షణాజ్ఞానం లేని సామాన్య జనమంతా ఈ ప్రవాహంలో బడి కొట్టుకొని పోతూంటారు.

ఐనా మనం ఈ చెడ్డతనానికి లొంగిపోకూడదు. దాన్ని ఎదుర్కొంటూండాలి. "నీ కుడికన్నుగాని కుడికాలుగాని దుర్మాతృకనిస్తే వాటిని పెరికివేయ" మన్నాడు ప్రభువు - మత్త 5,29-30. కనుక దుర్మాతృక ఎవరిదగ్గరినుండి వచ్చినా దాన్ని నిరోధించాలేగాని

దానికి లొంగి పోకూడదు. ధైర్యంతో చెడ్డతనాన్ని ఎదిరించే శక్తిని జ్ఞానస్నానంలోనే పొందుతాం. అది పరిశుద్ధాత్మ ఇచ్చేవరం. ఈ వరబలంతో దుర్మాతృకను ఎదుర్కొంటుండాలి ఇక, మనంతట మనం ఇతరులకు దుర్మాతృక నీయకుండా శతవిధాల జాగ్రత్తపడుతుండాలి.

భక్తుడు విన్సెంటుడపాల్ "చావైన పాపం చేయడం అంత అరుదైన కార్యంగాదు. న్యాయనిర్ణయ దినాన భయపడవలసిన ముఖ్యాంశాల్లో, ఈ లోకంలో వున్నపుడు మన మిచ్చిన దుర్మాతృక కూడ ఒకటి" అని వ్రాసాడు. ఈ భక్తుని వాక్యాలను మననం చేసికొని మనంగూడ ఈ దోషానికి గురౌతూన్నామో లేదో ఆత్మవిచారం చేసి చూచుకుందాం.

# 5. క్షమాపణ గుణం

సోదర ప్రేమకు సంబంధించిన ఓ ముఖ్య విషయం ఇతరులను క్షమిస్తుండడం. ఈ క్షమాపణ గుణం మన సోదరప్రేమ యదార్థమైందో కాదో పరీక్షించి చూచే గీటురాయి. క్షమాగుణం అలవరచుకోవడం అంత సులభంకాదు. అంచేత ఈ అంశాన్ని కొంచెం విపులంగా విచారించి చూద్దాం.

## 1. క్షమాపణం క్రీస్తు ఆజ్ఞ

పరలోక జపంలో మొత్తం ఏడు విన్నపాలున్నాయి. వీటిల్లో ఒక్కటి మాత్రం మిగతా వాటికంటే భిన్నంగా వుంటుంది. అది ఐదవది. ఈ యైదవ విన్నపంలో మాత్రం ఓ షరతు చేర్చబడింది. "మా యొద్ద అప్పుపడినవారిని మేము మన్నించినట్లు మా యప్పులను మీరు మన్నించండి." ఈ వాక్యంలో "మా యొద్ద అప్పుపడినవారిని మేము మన్నించునట్లు" అనే భాగం షరతు. అనగా మాకు అప్పుపడిన వాళ్ళని (మాకు ద్రోహం చేసిన వాళ్ళని) మేము మన్నిస్తున్నాం గనుక, మా యప్పులను ( మా ద్రోహాలను) మీరు మన్నించండి అనిభావం. అంటే మనం తోడి ప్రజలను క్షమించందే దేవుడు మనలను క్షమించడని ఫలితార్థం. ఈ సందర్భంలో క్రీస్తు పలికిన ఇతర వాక్యాలు కూడ ఈ యర్థాన్నే సమర్థిస్తాయి. "మీరు ఇతరుల అపరాధాలను క్షమిస్తే పరలోకంలోని మీ తండ్రి మీ యపరాధాలను కూడ క్షమిస్తాడు. మీరు ఇతరుల అపరాధాలను క్షమించకపోతే పరలోకంలోని తండ్రి మీ యపరాధాలను గూడ క్షమించడు - మత్త 6,14. కనుక క్షమాపణం క్రీస్తు ఆజ్ఞ. దీన్ని పాటించడమూ పాటించక పోవడమూ అనే ప్రశ్న లేనేలేదు, ఇది నిత్యవిధి.

## 2. క్రీస్తు క్షమాపణం

క్షమాపణ గుణం అలవరచుకోవడం చాల కష్టమన్నాం. అందుకే క్రీస్తు ఈ పుణ్యాన్ని ఆచరణ పూర్వకంగా బోధించాడు. ప్రభువు సిలువ మీద వ్రేలాడుతూ తన శత్రువుల నుద్దేశించి "తండ్రీ వీళ్ళేం చేస్తున్నారో వీళ్ళకే తెలీదు. కనుక వీళ్ళను క్షమించు" అని

ప్రార్థించాడు - లూకా 23-34. తన్ను ఎరుగనని ముమ్మారు బొంకిన పేత్రుని గూడా క్షమించి "నా గొర్రెలను మేపు" అని ఆదేశించాడు - యోహా 21-18. అనగా పేత్రు తన సమాజానికి అధిపతి కావాలని భావం - యోహా 21,18. క్రీస్తు క్షమాపణ గుణాన్ని చక్కగా అర్థం చేసుకున్న తొలి వేదసాక్షి స్తెఫను కూడ తాను చనిపోయే సమయంలో శత్రువులను క్షమిస్తూ "ప్రభూ! ఈ పాపాన్ని వీళ్ళమీద మోపవద్దు" అని ప్రార్థించాడు - అచ 7,60.

నరుడు దేవునికి పోలికగా కలిగింపబడినవాడు. అనగా అతడు దేవుని లాగ వుండాలి, దేవుని లాగ మెలగాలి. కాని ఈ దేవుడు క్షమాపరుడు. కనుక దేవుని పోలిన నరుడు కూడ ఇతరులను క్షమిస్తుండాలి. అందుకే లూకా సువార్త 6,36 "మీ తండ్రి లాగే మీరూ కనికరం చూపుతూండండి" అంటుంది. ఏమి కనికరం? ఇతరుల పట్ల దయ చూపడం. ఇతరుల అపరాధాలను క్షమిస్తుండడం. ఈ వాక్యాన్నే మత్తయిసువార్త "పరలోకంలోని మీ తండ్రి లాగే మీరూ పరిపూర్ణులై యుండండి" అని నుడువుతుంది - 5,48. ఏమి పరిపూర్ణత్వం? కనికరం చూపడం, క్షమించడం.

## 3. క్షమాపణ గుణాన్ని పాటించడం ఎలా?

మనం మూడుసార్లు క్షమాపణ గుణాన్నిగూర్చి ఆత్మ శోధనం చేసికొంటూండాలి. మొదటిది, రోజు రాత్రి నిద్రింపకముందు మన హృదయంలో ఎవరిపట్లనైన ద్వేషభావం వుందేమోనని పరీక్షించి చూచుకోవాలి. నిద్ర మరణాన్ని సూచిస్తుంది. ద్వేషభావంతో చనిపోవడం మేలుకాదు - ఎఫె 4,26. రెండవది, క్రైస్తవ సంస్కారాలు పొందక ముందు, విశేషంగా దివ్యపూజకు ముందు గూడ - మత్త 5,23-24. అందుకే మనం పూజారంభంలో పాపాలు తలంచుకొని పశ్చాత్తాప పడేది. మూడవది, ప్రార్థనకు ముందు - మార్కు 11,25. ద్వేషంతో కూడిన హృదయం నుండి వెలువడే ప్రార్థన దేవునికి ప్రియపడదు. ప్రభువు ఎప్పుడైనా మన ప్రార్థనను ఆలించకపోయినట్లైతే, అందుకు కారణం ఈ క్షమాగుణం లేకపోవడమే కావచ్చు.

ఇతరులను సులభంగా క్షమించడానికి ఉపకరించే భావాలు కూడా మూడున్నాయి. మొదటిది, లోకంలోని చెడు కార్యాలన్నీ దేవుని అనుమతి వల్లనే జరుగుతూంటాయి. క్రీస్తు "నా తండ్రి యిచ్చిన పాత్రను నేను త్రాగవలదా?" అన్నాడు. ఈ పాత్ర యథార్థంగా ఎవరిద్వారా వచ్చిందో, అనగా ఏ యూదప్రజలు తన్ను యథార్థంగా బాధించబోతూన్నారో క్రీస్తు అట్టే గణింపలేదు. మనకు ద్రోహంచేసే వాళ్ళపట్లగూడ మనం ఈలాంటి భావమే కలిగించుకోవడం మంచిది. రెండవది, మనకు ద్రోహంచేసిన నరుడు కూడ దేవుని బిడ్డే. అతన్ని మనసులో పెట్టుకొనిగూడ దేవుడు లోకాన్ని ప్రేమించాడు, తన ఏకైక కుమారుని పంపించాడు. దేవుడు అతని నాశాన్నిగాక పరివర్తనాన్ని కోరుకుంటూంటాడు. మనం కూడ అతన్ని దేవుడు చూచే చూపుననే చూస్తూండాలి. కనుక అతనిపట్ల ద్వేషం కూడదు.

మూడవది, మనం క్రీస్తు కోసం తోడి నరుణ్ణి క్షమించాలి, క్రీస్తు మన వద్దనుండి ఈ విషయాన్ని అడుగుతూంటాడు. "నాకోసం నీ విరోధిని క్షమించ" మంటూంటాడు. మనం క్రీస్తును కాదనగలమా? పౌలు ఎఫెసీయులకు వ్రాస్తూ "ఒకరి యెడల ఒకరు దయచూపుతూ కరుణా హృదయులై వుండండి. దేవుడు క్రీస్తు నందు మిమ్ము క్షమించాడు. అలాగే మీరూ ఒకరి నొకరు క్షమిస్తూండండి" అని హెచ్చరించాడు - 4,32 ఈ యాజ్ఞ నేడు మనకూ అక్షరాలా వర్తిస్తుంది.

ఓ జరుగకూడని పని జరిగినప్పుడు మంచివాళ్ళు, ఇక్కడ తప్పు నాదా కాదా అని కూడ విచారించకుండా, వెంటనే క్షమాపణం అడుగుతుంటారు. ఇది ఉత్తముల పద్ధతి. మనం క్షమాపణం అడిగినంత మాత్రాన తప్పు మనదే అని రుజువుకాదు. ఎదుటి వ్యక్తి హృదయం మాత్రం చల్లబడుతుంది. అంచేత దైనిక జీవితంలో ఈ పద్ధతి ననుసరించడం మంచిది.

క్షమాపణ గుణం అంత సులభంకాదని చాలాసార్లు చెప్పాం. విశేషంగా ఖండితమైన స్వభావంగల వాళ్లకు క్షమాపణం చాల కష్టమనిపిస్తుంది. ఐనా క్రైస్తవులు దీన్ని సాధించాలి. ఈ గుణాన్ని అలవరచుకొననివాళ్ళు తాము క్రీస్తు శిష్యులమని చెప్పుకోడానికి అర్హులుకారు.

# 6. పౌలు బోధ

## ప్రేమగీతం

మొదటి కొరింతీయుల జాబు 13వ అధ్యాయంలో పౌలు సోదరప్రేమను సవిస్తరంగా వర్ణించాడు. గ్రీకు మూలంలో ఈ యధ్యాయం వచనంలోనే వుంది. ఐనా ఓ గీతంలా నడుస్తుంది. నూత్నవేదం సోదరప్రేమనుగూర్చి చెప్పే ఘట్టాలన్నిటిలోను ఇది శ్రేష్ఠమైనది. కనుక క్రైస్తవభక్తుడు ఈ ప్రేమ గీతాన్ని జాగ్రత్తగా అవగాహనం చేసికొని భక్తితో మననం చేసికోవాలి.

సొలోమోను విజ్ఞాన గ్రంథం ఓతావులో విజ్ఞానాన్ని గూర్చి హృద్యంగా వర్ణించింది - 7, 22-30. పై విజ్ఞానగ్రంథ వాక్యాలు సోదర ప్రేమనుగూర్చి చెప్పడానికి పౌలుకి ప్రేరణం కలిగించి వుండవచ్చు. ప్రవచనంలో విజ్ఞానవాక్యం కూడ ఒకటి. పౌలుగీతం ఈలాంటి విజ్ఞానవాక్యమే. ఆ రోజుల్లో ఉల్లాసానికి, విందులు ఏర్పాటుచేసేవాళ్లు. ఆ విందులకు హాజరైన తాత్వికులు విజ్ఞానవంతమైన సంభాషణలు జరిపేవాళ్ళు. ఉదాహరణకు ప్రపంచంలోకల్లా గొప్పదియేది, మంచిది యేది అని ఒకరు ప్రశ్నింపగా, మరొకరు జవాబు చెప్పేవాళ్ళు. పౌలు గీతం కూడ ఈలాంటి విజ్ఞాన సంభాషణంలాగే నడిచింది.

1 కొ 13వ అధ్యాయాన్ని మూడు భాగాలుగా విభజించవచ్చు.

1) 1-3 సోదరప్రేమ విలువ

2) 4-7 సోదరప్రేమలోని 14 గుణాలు

3) 8-13 సోదరప్రేమ శాశ్వతమైంది.

## మొదటి భాగం

## సోదరప్రేమ విలువ -13,1-3

ప్రజల దృష్టి నాకర్షించే వరాలు మూడున్నాయి. మొదటిది, భాషల్లో మాటలాడ్డం. ఇది దేవుని స్తుతించే వరం. ఆనాటి కొరింతుక్రైస్తవులు ఈ వరాన్ని ఘనంగా యెంచారు. కాని ప్రేమ లేకపోతే ఈ స్తుతివరానికి ఏ విలువా వుండదు. అది ఓ గంట శబ్దంలాగో లేక తాళాల శబ్దంలాగో రణగొణధ్వని మాత్రమే ఔతుంది.

రెండవది - ప్రవచనం, రహస్యాలు తెలసికొనడం, జ్ఞానం, అద్భుతాలుచేసే విశ్వాసం మొదలైన వరాలు కలిగి వుండడం. హృదయంలో సోదరప్రేమ లేకపోతే ఈ వరాలు కూడ పెద్దగా ఉపయోగపడవు.

మూడవది, ఆస్తిని పేదలకు పంచి యీయడం, శరీరత్యాగం మొదలైన సేవాకార్యాలు. కాని యీ సేవలను కేవలం కీర్తిప్రతిష్ఠల కొరకే చేయవచ్చు. సోదరప్రేమలేనికాడ ఈలాంటి సేవలు ఏమీ సాధించలేవు. కనుక పై భాషలకంటె, వరాలకంటె, సేవాకార్యాలకంటె సోదరప్రేమ గొప్పది.

## రెండవ భాగం

## సోదరప్రేమలోని 14 గుణాలు - 13, 4-7

పౌలు సోదరప్రేమలో కన్పించే లక్షణాలు 14 పేర్కొన్నాడు. వీటిని మూడు భాగాలు చేయవచ్చు. తొలి రెండు లక్షణాలు ప్రేమ ఏంచేస్తుందో చెప్తాయి. తరువాతి ఎన్మిది లక్షణాలు ప్రేమ ఏమి చేయదో చెప్తాయి. కడపటి నాల్గు లక్షణాలు మళ్లా ప్రేమ ఏంచేస్తుందో చెప్తాయి. ఇక వీటిని క్రమంగా పరిశీలిద్దాం.

మొదట ప్రేమలో కన్పించే రెండు లక్షణాలు చెప్పాడు. దానిలో సహనమూ, దయా వుంటాయి - 13,4.

1. ప్రేమలో సహనం వుంటుంది. ఏమి సహనం? ప్రేమగల నరుడు విరోధిమీద పగతీర్చుకో కలిగిగూడ తీర్చుకోడు. భగవంతునిలోను ఈ గుణమేవుంటుంది. అతడు తన శత్రువులమీద ఆగ్రహం తెచ్చుకొని వాళ్ళను నాశం చేయాలి అనుకొంటాడు. కాని మళ్ళా ఓర్పుతో ఆయాగ్రహాన్ని అణచుకొంటాడు - రోమా 9,22. ప్రేమకల మానవుడుకూడ ఈ ప్రభువులాగే ప్రవర్తిస్తాడు. శత్రువులు తనకు కీడు చేసినా, బాధలు కలిగించినా,

తాను వారిని శిక్షింపడు. సహనంతో వుంటాడు. ఇది చేతగాని సహనం కాదు. మంచితనం వల్ల పుట్టే సహనం. ఇక ప్రేమలేనివారిలో ఈ ఓర్పు అనేది వుండదు.

2. ప్రేమలో దయ వుంటుంది. ఇది ఇరుగుపొరుగువాళ్ళతో ఆప్యాయంగా మెలిగే గుణం. దయాపరుడైన నరుడు ఇతరులను ఆప్యాయంగా ఆహ్వానిస్తాడు. వాళ్ళకు సహాయం చేస్తాడు. తన కాలాన్నీ వస్తువులనూ డబ్బునూ తన్నుకూడ వాళ్ళ కొరకు వ్యయం చేస్తాడు. క్రీస్తు ఈలాంటివాడు. కనుకనే పౌలు "అతడు నన్ను ప్రేమించి నాకోసం ప్రాణత్యాగం చేసికొన్నాడు" అని చెప్పాడు - గల 2,20.

తరువాత సోదరప్రేమలో కన్పించని లక్షణాలు ఎన్మిది చెప్పాడు - 13,4-6. ప్రేమ మత్సరపడదు, డప్పాలు కొట్టదు, ఉబ్బిపోదు, అసభ్యంగా ప్రవర్తించదు, తన స్వార్థాన్నితాను చూచుకోదు, కోపపడదు, అపకారాలను మనస్సులో పెట్టుకోదు, కీడునుగూర్చి కాదు గాని మేలును గూర్చి సంతోషిస్తుంది. ఇక ఈ గుణాలను క్రమంగా పరిశీలిద్దాం.

1. ప్రేమ మత్సరపడదు. ఆనాటి కొరింతు క్రైస్తవుల్లో ముఠాలు వుండేవి. ఒక ముఠాను జూచి మరో ముఠా అసూయపడేది. నిజమైన ప్రేమకలవాడు ఇతరుల కార్యక్రమాలనూ వృద్ధినీ చూచి సంతోషిస్తాడు. తానూ వాళ్ళతో కలుస్తాడు. ఈ ప్రేమ లేనివాళ్ళు ఇతరుల మంచిపనులనూ విజయాలనూ చూచి అసూయ చెందుతారు. తాము వాళ్ళతో కలియరు. ఈలా ఒకోమారు మనంచేసే మంచిపనులుకూడ క్రైస్తవ సమాజాల్లో విభజనను తెచ్చిపెడతాయి. అందుకే యాకోబు జాబు ఈర్ష్యాద్వేషాలను అణచుకోవాలని చెప్తుంది - 3,11 ఇతరుల కార్యాలను జూచి అసూయ చెందితే మనలో ప్రేమగుణం లోపించిందనే చెప్పాలి.

2. ప్రేమ డప్పాలు కొట్టదు. ఆనాటి కొరింతీయుల్లో కొందరు మాకు బోలెడంత మతజ్ఞానం వుందని డప్పాలు కొట్టేవాళ్ళు - 1 కొ 8,1. తమకు కృపావరాలున్నాయని మిడిసిపడేవాళ్ళు. డప్పాలు కొట్టేవాడిలో గంభీర గుణం వుండదు. నోటికి వచ్చినట్లల్లా వదరుతాడు. కాని సోదరప్రేమ కలవాడు ఈలా చేయడు. అతడు వినయంగా మేరమర్యాదలతో మెలుగుతాడు.

3. ప్రేమ ఉబ్బిపోదు. కొలిమి తిత్తుల్లోకి గాలి ఊదగానే అవి ఉబ్బిపోతాయి. ఆలాగే ప్రేమలేని మానవుడుకూడ ఉబ్బిపోతాడు. అతనికి పొగరెక్కుతుంది. ఆలాగే కొరింతీయులు కూడ తమ భాషల వరాన్ని జూచి ఉబ్బిపోయారు. అనగా గర్వపడ్డారు. కాని ప్రేమగల మానవుడు ఈలాచేయడు. అతడు తనకు లేనిపోని గొప్పలు ఆపాదించుకోడు. సవినయంగా వుంటాడు.

4. ప్రేమ అసభ్యంగా ప్రవర్తించదు. ఇక్కడ అసభ్యమంటే మర్యాదను మీరిపోవడం. వెధవపనులు చేయడంగూడ. కొరింతీయులు ఈలాంటి అసభ్యపు పనులకు పాల్పడ్డారు. క్రైస్తవుల తగాలదాను క్రైస్తవేతరులు అధికారులుగా వున్న న్యాయస్థానాలకు తీసికొనివెళ్ళారు - 1 కొ 6, 1-7. ఆరాధన సమయంలో తప్పత్రాగారు - 11. 21-22. ఒకడు తన పినతల్లిని పెండ్లియాడాడు కూడ - 5,1-6. ఈలాంటి వెధవ పనులకు పౌలు వాళ్ళను చీవాట్లు పెట్టాడు. సోదరప్రేమ కలమానవుడు ఈలాంటి అసభ్యపు పనులకు పాల్పడదు. సభ్యతగా మర్యాదగా మెలుగుతాడు.

5. ప్రేమ తన స్వార్థాన్ని తాను చూచుకోదు. స్వార్థమానవుడు ఇతరుల వలన తనకేమి ఉపయోగం కలుగుతుందా అని ఆలోచిస్తాడు. పరార్థమానవుడు ఇతరులకు తానేలా ఉపయోగపడగలనా అని ఆలోచిస్తాడు. పౌలు సువిశేష సేవ చేసికూడ తన విశ్వాసులనుండి డబ్బు పుచ్చుకోలేదు - 1 తెస్స 2, 9. అతడు ప్రతివాడూ ఇతరుల కార్యాలుకూడ చేసిపెట్టాలని చెప్పాడు - ఫిలి 2,4 ప్రతీవాడూ ఎదుటివాని మేలు తలపెట్టాలన్నాడు -1 కొ 10,24. క్రీస్తు తన్నుతాను సుఖపెట్టుకోకుండా మనకోసం ప్రాణాలర్పించాడు - రోమా 15,3. ఈలా నిస్వార్థజీవితం జీవించేవాడే ఉత్తమ క్రైస్తవుడు.

6. ప్రేమ సులభంగా కోపపడదు. కొరింతులో కక్షలున్నాయి. ఒకరంటే ఒకరికి గిట్టదు. పరస్పరవైరాలూ, వల్లమాలిన కోపతాపాలూను - 1కొ 1, 11-12. కాని ప్రేమగలవాడు ఈలా వుండడు. ఆవేశకావేషాలకు గురికాడు. నెమ్మదిగా శాంతచిత్తుడుగా వుంటాడు.

7. ప్రేమ అపకారాలను మనసులో పెట్టుకోదు. షావుకార్లు ఖాతాదారుల బాకీలన్నీ భద్రంగా పద్దుల పుస్తకంలో వ్రాసిపెట్టుకొంటారు. ఈలాగే కొందరు ఇతరులు తమకు చేసిన అపకారాలను గూడ జాగ్రత్తగా తమ మనసులో వ్రాసిపెట్టుకొంటారు. ఇక వాటిని మరచిపోరు. కాని ప్రేమకల నరుడు ఈలా చేయడు. అపకారులు తమకు చేసిన కీడులను వెంటనే మరచిపోతాడు. వారిని పూర్తిగా క్షమిస్తాడు. పూర్వవేదంలో ప్రభువు కూడ ఈలాగే చేసాడు. అతడు తన భక్తుల అపరాధాలను పూర్తిగా క్షమిస్తాడు-యెష 38, 17. నూత్నవేదంలో క్రీస్తుకూడ ఈలాగే తన శత్రువులను పూర్తిగా క్షమించాడు. కనుక సమయం దొరికినపుడు పగవాణ్ణి నొక్కివేయాలి అనుకోవడం, ప్రతీకారచర్యకు పూనుకోవడం, నిష్ఠురాలు పల్కడం, ఇతరుల అపరాధాలను స్మరించుకొని తనలో తాను ఉడికిపోవడం - ఈలాంటివన్నీ ప్రేమగలమానవుని లక్షణాలు కావు.

8. ప్రేమ ఇతరులకు కలిగిన కీడును గూర్చి సంతోషించదు, వారికి జరిగిన మేలును గూర్చి ఆనందిస్తుంది. ప్రేమలేని మానవుడు తన విరోధులకు ఏదైనా కీడు

జరిగితే ఆనందిస్తాడు. ఎవరైనా వాళ్ళను గూర్చి చెడ్డగా మాట్లాడితే విని సంతోషిస్తాడు. వాళ్ళకేదైనా మంచి జరిగితే సహించలేడు. కాని ఇది పద్ధతి కాదు. ఓమారు క్రీస్తు శిష్యుడు కానివాడొకడు క్రీస్తు పేరుమీదగా దయ్యాలను వెళ్ళగొట్టాడు. శిష్యులకది నచ్చలేదు. అతని విజయం వలన వాళ్ళకు కన్నుకుట్టింది. వాళ్ళు అతన్ని తమ విరోధిగా భావించారు. కాని ప్రభువు శిష్యులను మందలించి ఆవ్యక్తిని తమ మిత్రునిగా భావించమన్నాడు - లూకా 9, 49-50. ఎలిసబెత్తు ప్రభువు అనుగ్రహానికి నోచుకొంది. ముసలితనంలో మగబిడ్డను కంది. ఆ సంఘటనకు ఇరుగుపొరుగువాళ్ళంతా ఆమెతో ఆనందించారు - లూకా 1,57-58. కనుక ఇతరుల కీడునకు ఆనందింపనివాడు, వారి మేలునకు సంతసించేవాడు ప్రేమగలవాడు.

కడన, మళ్ళా ప్రేమలో కన్పించే నాల్గు లక్షణాలను చెప్పాడు - 13,7. అవి అపకారాలను భరించడం, నమ్మడం, నిరీక్షించడం, అన్నిటినీ సహించడం. ఈ గుణాలను క్రమంగా పరిశీలిద్దాం.

1. ప్రేమ ఇతరులు తనకు చేసిన అపకారాలను భరిస్తుంది. వాళ్ళమీద సుమ్మర్లు పడదు. ఇతరుల దోషాలను ప్రచారం చేయదు. తల్లి బిడ్డ దోషాలను దాచివుంచినట్లే ప్రేమగల మానవుడు తోడినరుల దోషాలను దాచివుంచుతాడు. వాళ్ళు తనకు అపకారం చేసినా తాను వాళ్ళ తప్పిదాలను బయటికి పొక్కనీయడు. ఈలా ప్రేమ అన్ని అపకారాలనూ భరిస్తుంది.

2. ప్రేమ అన్నిటినీ నమ్ముతుంది. ప్రేమగల మానవుడు ఇతరులను అనవసరంగా శంకింపడు. వారి మాటలనూ చేతలనూ నమ్ముతాడు. వారిపట్ల సదభిప్రాయం కలిగివుంటాడు. మనం ఎవరినైనా నమ్మకంతో చూస్తే వాళ్ళమీద వాళ్ళకే నమ్మకం కలుగుతుంది. పైగా వాళ్ళు మనకు నమ్మకంతో పనిచేసి పెడతారుకూడ. కనుకనే ఇతరులను నమ్మడమూ, వారిమీద వారికే నమ్మకం కలిగేలా చేయడమూ ప్రేమకుండే లక్షణం.

3. ప్రేమ అన్నిటినీ నిరీక్షిస్తుంది. ఒకోమారు ఇతరులు నమ్మదగనివాళ్ళుగా వుంటారు. వాళ్ళవల్ల పనులుకావు. మోసం జరుగుతుంది. అలాంటప్పుడు గూడ ప్రేమగల నరుడు నిరుత్సాహపడడు. భగవంతుని కరుణవల్ల చివరికి అన్ని కార్యాలూ మనకు మేలునే చేకూర్చి పెడతాయని నమ్ముతాడు - రోమా 8,28. ఈలా ప్రేమమానవుడు అన్ని కార్యాల్లోను మంచి జరుగుతుందని ఆశిస్తాడు.

4. ప్రేమ అన్నిటినీ సహిస్తుంది. ఒకోమారు మనం నమ్మినవాళ్ళే మనలను గోతిలో దోస్తారు. ఐనా అన్ని ఆశలూ వమ్మయి పోయినపుడు కూడ ప్రేమగల నరుడు క్రుంగిపోడు. మనసును కష్టపెట్టుకోడు. అతడు ధైర్యంతో అన్ని అపకారాలూ సహిస్తాడు.

భగవంతుణ్ణి నమ్మి ఆ ప్రభువు ఏలాగైనా తనకు సహాయపడతాడని భావిస్తాడు. ఇతరులు తనకు తీరని వ్యధ తెచ్చిపెట్టినపుడుకూడ తాను ఆ బాధలను సహిస్తాడు. అన్ని కష్టాలనూ భరించేగుణం ప్రేమలోవుంది.

## మూడవ భాగం

### సోదరప్రేమ శాశ్వతమైంది - 13, 8-13

ప్రేమ శాశ్వతంగా నిలుస్తుంది. ప్రవచనంలాంటి కృపావరాలు నశిస్తాయికాని ప్రేమ నశించదు. అది యిాలోకంలో లాగే పరలోకంలో కూడ వుంటుంది. ఇక్కడ అపరిపూర్ణంగా వుంటుంది, అక్కడ పరిపూర్ణంగా వుంటుంది - అంతే భేదం. ఇక్కడ దేవుణ్ణి పరోక్షంగా దర్శిస్తాం. ఆదర్శనం అద్దంలోని బొమ్మ మసకగా కన్పించినట్లుగా వుంటుంది. కాని అక్కడ దేవుణ్ణి ప్రత్యక్షంగా దర్శిస్తాం. ఆ దర్శనం వ్యక్తిని ముఖాముఖి చూచినట్లుగా వుంటుంది. ఈలాంటి వ్యత్యాసాలు కొన్ని వున్నా ఇక్కడి ప్రేమే మోక్షంలో కూడ వుండేది.

ఆ మోక్షంలో ప్రభువుకి మనపట్ల గల ప్రేమ పరిపూర్ణమౌతుంది. ఆ పరిపూర్ణ ప్రేమ ద్వారా మనం కూడ అతన్ని పూర్ణంగా ప్రేమిస్తాం.

ఇక్కడ మనం దేవుణ్ణి చూడకుండనే విశ్వసిస్తాం. కాని స్వర్గంలో దేవుణ్ణి యథార్థంగా చూస్తాం. కనుక ఇక్కడి విశ్వాసం అక్కడ అవసరంలేదు, వుండదుకూడ. ఈ విశ్వాస ఫలితం మాత్రమే అక్కడ వుంటుంది. ఆలాగే ఈ లోకంలో దేవుడు మనకు మోక్షం దయచేస్తాడని నిరీక్షిస్తాం, ఆలోకంలో మనకు మోక్షం యథార్థంగా లభిస్తుంది. కనుక ఇక్కడి నిరీక్షణం అక్కడ అవసరం లేదు. ఈ నిరీక్షణం ఫలితం మాత్రం అక్కడ వుంటుంది.

ఇక ప్రేమసంగతి అలా కాదు. మనం ఇక్కడా అక్కడాగూడ ప్రేమించవలసిందే. కనుక ఇక్కడి ప్రేమె అక్కడకూడ వుంటుంది. అక్కడ అది పరిపూర్ణమౌతుందేగాని తగ్గిపోదు. కనుక ప్రేమ శాశ్వతమైంది. విశ్వాసనిరీక్షణలకు ఈ శాశ్వతత్వంలేదు. ప్రవచనాది కృపావరాలకు శాశ్వతత్వం అసలేలేదు. కనుక అన్నిటికంటే ప్రేమ శ్రేష్ఠమైంది. అందుకే బుద్ధిమంతుడు అన్నిటికంటే దీన్ని ఘనంగా యెంచాలి. అన్నిటికంటే అధికంగా దీన్ని సాధించాలి.

## ఉపసంహారం

ముందటి అధ్యాయాల్లో సోదర ప్రేమను గూర్చి ఆయా అంశాలు విచారించి చూచాం. కట్టకడన ముగింపు వాక్యాలుగా ఈ యారంశాలను గుర్తిద్దాం.

## 1. సోదరప్రేమ ఆత్మ యిచ్చేవరం

సోదరప్రేమను మనకు ప్రసాదించేది పరిశుద్ధాత్మే. "ఆ యాత్మద్వారా దేవుని ప్రేమ మన హృదయాల్లోనికి క్రుమ్మరింపబడుతుంది." – రోమా 5,5. ఇది జ్ఞానస్నానంలోనే జరుగుతుంది. సోదర ప్రేమను ప్రసాదించే శక్తి పరిశుద్ధాత్మ కనుక, ఈ పుణ్యంలో కొరత కలిగినప్పుడెల్లా ఆ యాత్మనే అడుగుకుంటూండాలి. దేహంలోని అవయవాలన్నిటినీ ఆత్మ ఒక్కటిగా బంధించినట్లే క్రైస్తవ ప్రజలనందరినీ పరిశుద్ధాత్మ ఒక్క సమాజంగా ఐక్య పరుస్తుంది. కనుక ఆ యాత్మ అనుగ్రహం లేందే మనం ప్రేమజీవితం జీవింపలేం.

## 2. సోదర ప్రేమకు ఆదర్శం క్రీస్తే

"నేను మిమ్మల్ని ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించండి" అన్న క్రీస్తు వాక్యాన్ని ఆదర్శంగా బెట్టుకొని సోదర ప్రేమను పాటించాలి – యోహా 13,34. కాని క్రీస్తు మనలను ఏ విధంగా ప్రేమించాడు? అతడు దిక్కూ మొక్కూ లేక కాపరిలేని మందలా వున్న జనసమూహాలను జూచి కనికరపడ్డాడు. వాళ్ళ కుంటిగ్రుడ్డి చెవిటి తనాన్ని తొలగించాడు. వాళ్ళ వ్యాధిబాధలను పాపాడు. పాపాత్ముల పట్ల ఆ ప్రభువు దయజూపాడు. వ్యభిచారిణి, మంచిదొంగ, మగ్దలీన, పేత్రు మొదలైన పాపులను కరుణతో ఆదరించాడు. తప్పిపోయిన గొర్రెను మంచి కాపరిలాగే తానూ త్రోవ దప్పిపోయిన జనులను నెనరుతో దారికి గొనివచ్చాడు. మరియ మార్త లాజరు మొదలైన స్నేహితులను అనురాగంతో ప్రేమించాడు. తెలివితేటలులేని శిష్యులకు నేర్పుతో ఓర్పుతో పరలోక రాజ్యాన్నిగూర్చి బోధించాడు. అతడు శత్రువులను ద్వేషింపలేదుగదా, వాళ్లపట్ల ఆదరాన్ని సహనాన్ని చూపాడు. వేయేల అతడు అందరినీ అంగీకరించాడు, ఆదరించాడు, ప్రేమించాడు. చివరన తన ప్రాణాన్నే త్యాగంచేసి స్వార్థంలేని ప్రేమతో తోడి నరులకోసం సిలువమీద చనిపోయాడు. ఈ కనికరమూ, దయా, నెనరూ, అనురాగమూ, ఓర్పూ, ద్వేషము లేమీ, స్వార్థరాహిత్యమూ – క్రీస్తు మనపట్ల చూపిన ప్రేమలోని నానాలక్షణాలు. మనమూ క్రీస్తులా ప్రేమించాలంటే మన సోదరప్రేమలో కూడ పై లక్షణాలు కన్పించాలి. కనుక క్రీస్తును చూచి రోజురోజు మన సోదర ప్రేమను సవరించుకుంటూండాలి. సరిదిద్దుకుంటూండాలి.

## 3. మూడు ఉపమానాలు

సోదర ప్రేమను ఎందుకు పాటించాలో చెప్తూ, నూత్న వేద రచయితలు ముగ్గురు మూడు ఉపమానాలు వాడారు. యోహాను తన సువిశేషం 15వ అధ్యాయంలో, కొమ్మలు చెట్టుతో ఐక్యమైనట్లుగా మనం క్రీస్తుతో ఐక్యమౌతామన్నాడు. పౌలు మొదటి కొరింతీయులు 12వ అధ్యాయంలో, దేహంలోని అవయవాలు శిరస్సుతో ఐక్యమైనట్లుగా మనం క్రీస్తుతో ఐక్యమౌతామని చెప్పాడు. పేత్రు తాను వ్రాసిన మొదటి జాబు రెండవ అధ్యాయంలో, రాళ్లు మందిరంలోనికి లాగే మనమూ క్రీస్తులోనికి నిర్మింపబడుతూన్నాం అన్నాడు. ఈ మూడు ఉపమానాల్లోను భావం ఒకటే. క్రీస్తుతో ఐక్యమైనవాళ్ళంతా వాళ్ళల్లో వాళ్ళు

ఐక్యమౌతారు. చెట్టుతో ఐక్యమైన కొమ్మలన్నీ, శిరస్సుతో ఐక్యమైన అవయవాలన్నీ, మందిరంతో ఐక్యమైన రాళ్ళన్నీ పరస్పర సంబంధం కలిగివుంటాయికదా! ఆలాగే క్రీస్తుతో ఐక్యమైన మనమందరమూ పరస్పర సంబంధం కలిగి వుంటాం. కనుక మన ప్రేమకు కారణము క్రీస్తే, దానికి విలువనిచ్చేదీ క్రీస్తే.

## 4. సోదరప్రేమను పెంపునకు గొనివచ్చేది దివ్యసత్ప్రసాదం

మన మందరము ఒకే రొట్టెలో పాలుపంచుకొని ఆ వొకే రొట్టెద్వారా అనేకుల మైన మన మందరమూ ఒకే దేహంగా ఏర్పడుతున్నాం -1 కొ 10,17. దివ్యసత్ప్రసాదం మనలను క్రీస్తుతోను తోడి ప్రజలతోను ఐక్యపరుస్తుంది. దీని ద్వారా జాతి వర్గ లింగ భేదాలను అతిక్రమించి ఏకైక క్రీస్తు శరీరంగా, ఏకైక క్రైస్తవ సమాజంగా మారిపోతున్నాం. అంతా అన్నదమ్ములమూ అక్కచెల్లెళ్ళమూ ఔతున్నాం. కనుక మనం దివ్యసత్ప్రసాదాన్ని యోగ్యంగా స్వీకరిస్తూ సోదరప్రేమను వృద్ధిచేసికొంటూండాలి.

## 5. సోదరప్రేమకు ప్రబల శత్రువు స్వార్థప్రేమ

స్వార్థప్రేమవల్ల ఇతరులను అణచివేసి మనం పైకి రాగోరుతూంటాం. స్వార్థమున్నకాడ సోదరప్రేమ వుండదు. అంచేత స్వార్థాన్ని జయిస్తేనేగాని సోదరప్రేమను సాధించలేం. అందుకే క్రీస్తు కూడ "నన్ను వెంబడింప గోరేవాడు తాన్నతాను నిరాకరించుకొని తన సిలువను మోసికొంటూ నా వెంట రావాలి" అన్నాడు - మత్త 16.24. తన్ను తాను నిరాకరించుకొనందే, స్వార్థాన్ని అణచివేసికోందే, సోదరప్రేమ అలవడదు. స్వార్థ మానవుడు ప్రేమమానవుడు కాజాలడు.

## 6. మనం సాధించవలసిన ప్రధానకార్యం సోదరప్రేమ

మామూలుగా క్రైస్తవ సాధకులు రకరకాల ప్రేషిత కార్యాల్లో నిమగ్నులౌతూంటారు. రకరకాల సత్కార్యాలు చేసి వివిధ పుణ్యాలు ఆర్జిస్తూంటారు. కాని అన్నిటికంటే ప్రధానమైన పుణ్యం సోదరప్రేమ. ఈ లోకంలో మనం దేన్ని సాధించినా, దీన్ని సాధించలేకపోతే ప్రయోజనం లేదు. అందుకే పౌలు కొలోసీయులకు వ్రాస్తూ "అన్నిటి కంటే మిన్నగా ప్రేమను సాధించండి. ఈ ప్రేమ అన్ని పుణ్యాలనూ పరిపూర్ణంగా ఐక్యపరుస్తుంది" అని చెప్పాడు - 3,14. అనగా అన్ని పుణ్యాలూ సాధిస్తే ఎంతో ప్రేమను సాధిస్తే అంత. దానికి మించిన పుణ్యమంటూ లేదు. తరుచుగా మనం సోదర ప్రేమను లెక్కచేయం. ఏదో ప్రేషిత కార్యాన్ని సాధింపగోరి దీక్షతో కృషిచేస్తుంటాం. కాని ఈ కృషికి దాసులమైపోయి, ఈ కృషిలోనే సోదర ప్రేమను భంగపరుస్తూంటాం. ఇది పెద్ద పొరపాటు. అన్ని సత్కార్యాల కంటే సోదరప్రేమ గొప్పది అన్నాం. అది అన్నిటికంటే గొప్ప పుణ్యం కనుక, అన్ని పాపాల కంటే సోదర ప్రేమకు వ్యతిరేకంగా జేసే పాపాలే గొప్పవి. కనుక క్రైస్తవ సాధకుడు బహుజాగరూకతతో ఈ పుణ్యాన్ని సాధించాలి.

# 5. సోదరప్రేమ - 2

బైబులు భాష్యం - 43

## మనవిమాట

ప్రస్తుత సంచికలో నూత్నవేదం సోదరప్రేమను గూర్చి చెప్పే ముఖ్యమైన వాక్యాలను ఎన్నుకొని వాటిమీద సంగ్రహమైన వ్యాఖ్య చెప్పాం. ఈ వ్యాఖ్య ధ్యానాత్మకంగా వుండి అనుదిన ప్రార్థనకు ఉపయోగపడుతుంది. కాని పాఠకులు ఈ వ్యాఖ్యను చదివేపుడు ఇందులో ఉదాహరించిన వేదవాక్యాలను నేరుగా బైబులునుండి చదువుకొంటూండాలి. లేకపోతే ఈ వివరణం బోధపడదు.

క్రైస్తవ మతంలో కల్లా అతిశ్రేష్ఠమైందీ, అతికష్టమైందీ కూడ సోదరప్రేమే. ఈ చిన్ని పొత్తం ద్వారా ఈ ప్రేమ మన బైబులు భక్తులకు ఒకపాటిగనైనా ఆకళింపునకు వస్తుందని ఆశిస్తున్నాం.

## విషయసూచిక


1. మత్తయి మార్కు లూకా భావాలు 99
2. యోహాను భావాలు 106
    1. యోహాను సువార్త 106
    2. యోహాను మొదటి జాబు 108
3. పౌలు భావాలు 111


# 1. మత్తయి, మార్కు, లూకా భావాలు

## 1. మంచివాళ్ళకీ చెడ్డవాళ్ళకీ కూడ సూర్యరశ్మి - మత్త 5,43-48

ఇతరులు మనతో ఏలా ప్రవర్తిస్తారో మనమూ వాళ్ళతో అలా ప్రవర్తించాలి అంటుంది పూర్వవేదం. కనుక ఇతరుడు మన కన్ను పోగొడితే మనం వాడి కన్ను పోగొట్టవచ్చు. ఇతరుడు మన పన్ను రాలగొడితే మనమూ వాడిపన్ను రాలగొట్టవచ్చు - లేవీ 24,20. ఇది ప్రతీకార బుద్ధి. శత్రువులను శిక్షించాలి అనే మనస్తత్వం. కాని నూత్నవేదం ఈ పద్ధతిని అంగీకరించదు. మిత్రులనీ శత్రువులనీ అందరినీ ప్రేమించాలని బోధించాడు ప్రభువు. ఈలాంటి విశ్వమానవ ప్రేమకు ఆదర్శం పరలోకంలోని తండ్రే.

అతడు మంచివాళ్ళకు మాత్రమే కాదు చెడ్డవాళ్ళకు కూడ తన సూర్యరశ్మిని దయచేస్తాడు. సజ్జనులకు దుర్జనులకు కూడ వర్షాన్ని సమానంగా కురిపిస్తాడు. వాన మంచివాళ్ళ పొలంమీద మాత్రమే కురిసి చెడ్డవాళ్ళ పొలంమీద ఆగిపోదుకదా! ఆ తండ్రిని ఆదర్శంగా పెట్టుకొని మనం కూడ మంచివాళ్లు చెడ్డవాళ్లు అనే విచక్షణ లేకుండ అందరిని ప్రేమించాలి.

పిల్లలు తల్లిదండ్రుల్లాగ వుండాలి కదా! మన తండ్రియైన దేవుడు కరుణామయుడు. అతడు సులభంగా కోపపడేవాడు కాదు. నిత్యము ప్రేమ చూపేవాడు - నిర్గ 34,6. ఆ తండ్రిపోలిక మనలో వుండాలంటే మనం కూడ కరుణామయులమూ ప్రేమ హృదయులమూ కావాలి.

తమ మిత్రులనూ బంధువులనూ ప్రేమించడంలో గొప్పయేమీ లేదు. అన్యమతస్థులూ పాపులూ కూడ ఈలా చేస్తూనే వున్నారు కదా? మరి మన ప్రత్యేకత యేమిటి? కనుక దేవుని బిడ్డలు వాళ్లువీళ్ళు అనే విచక్షణ లేకుండ అందరిని అంగీకరించాలి. పరలోకంలోని తమ తండ్రిలాగే తామూ పరిపూర్ణులు కావాలి. ఈ పరిపూర్ణత్వం దేనిలో? అందరియెడల దయచూపి అందరిని ప్రేమించడంలో. ఆ తండ్రి పాపాత్ముల కొరకు తన కుమారుణ్ణే అనుగ్రహించాడు - మార్కు 12,1-12. ఈలాగే మనమూ దుష్టులను కూడ అంగీకరించాలి. అప్పుడు గాని మనం కూడ ఆ తండ్రిలాగే పరిపూర్ణులం కాము. ఫలితార్థమేమిటంటే, మనమూ ఆ తండ్రిలాగే అందరినీ ప్రేమించగలిగి వుండాలి.

కొందరు భగవంతుని ప్రమేయం లేకుండానే తోడి జనాన్ని ఆదరిస్తూంటారు. నాస్తికులు కూడ తోడివారిని ప్రేమించవచ్చు. కాని క్రైస్తవుల సోదరప్రేమ ఈలాంటిది కాదు. మనం భగవంతుని కొరకు తోడిజనాన్ని ప్రేమించాలి. భగవంతుడు మన ప్రేమలో ప్రవేశించినపుడే దానికి విలువ వుండేది.

## 2. అన్ని ఆజ్ఞలూ ప్రేమ మీదనే ఆధారపడతాయి - మత్త 22,34-40

ఓమారు ఓధర్మశాస్త్ర బోధకుడు క్రీస్తుని పరీక్షింపగోరి అన్నిటికంటె గొప్పయాజ్ఞ ఏది అని ప్రశ్నించాడు. ఆ సందర్భంలో ప్రభువు పూర్వవేదం నుండి ప్రేమాజ్ఞను ఉదాహరించాడు. ప్రభువుని పూర్ణహృదయంతో, పూర్ణ మనస్సుతో, పూర్ణశక్తితో ప్రేమించాలి అంటుంది ద్వితీయోపదేశకాండం - 6,5. ఈ వాక్యంలో మూడుసార్లు పూర్ణశబ్దం విన్పిస్తుంది. అనగా ఆ దేవుణ్ణి అరకొరలుగాగాక పరిపూర్ణంగా ప్రేమించాలని భావం.

ఈ వాక్యం తర్వాత క్రీస్తు లేవీయకాండం నుండి "నిన్ను వలె నీపొరుగువానిని గూడ ప్రేమించు" అనే వాక్యం ఉదాహరించాడు - 19,18. ఇక్కడ క్రీస్తు పేర్కొన్న ప్రేమాజ్ఞలో రెండు భాగాలున్నాయి. మొదటిది దైవప్రేమ, రెండవది సోదరప్రేమ.

మామూలుగా మనం దైవప్రేమకు ఇచ్చినంత గౌరవం సోదరప్రేమకు ఈయం. కాని క్రీస్తు పలుకుల ప్రకారం ఈ రెండవది కూడ మొదటిదానంత విలువైంది - మత్త 22,39. మోషే ధర్మశాస్త్రమంతటిలోను ఈ రెండాజ్ఞలు ప్రధానమైనవి.

ఈ రెండిటిల్లోను చెప్పబడిన ప్రేమ ఒక్కటే.. మనం అదే ప్రేమతో భగవంతుణ్ణీ తోడినరుణ్ణీ కూడ ప్రేమిస్తాం. ఒకే నది రెండు పాయలుగా చీలిపోతుంది. ఒకే చెట్టు రెండు కొమ్మలుగా చీలిపోతుంది. అలాగే ఒకేప్రేమ దైవ సోదర ప్రేమలుగా విభక్తమౌతుంది.

ఈ ప్రేమాజ్ఞ చాల విలువైంది. ఒంకెమీది నుండి బట్టలు వ్రేలాడుతుంటాయి. అలాగే మోషే జారీ చేసిన ఆజ్ఞలన్నీ ఈ ప్రేమాజ్ఞ మీది నుండి వ్రేలాడుతుంటాయి. అన్నిటికి ఆధారం అదే. ఇంకా ప్రవక్తలు చెప్పిన సందేశాలకు కూడ ఈ ప్రేమాజ్ఞే మూలం. అనగా పూర్వ వేదమంతటికీ ఈ ప్రేమే పునాది అని అర్థం. ఇక, నూత్నవేదానికి ఈ ప్రేమ గుండెకాయలాంటిదని వేరుగా చెప్పాలా?

మనం దైవప్రేమను ఘనంగానే యెంచుతాంగాని సోదరప్రేమను చులకన చేస్తామని ముందే చెప్పాం. ఇది పెద్దపొరపాటు. సోదరప్రేమ గూడ దైవప్రేమంత విలువైంది, దాని లాంటిది. అదిలేందే మన మతాచరణానికి అర్థంలేదు. మన నైతిక కార్యాలకు విలువలేదు. కనుక క్రైస్తవభక్తుడు తన సోదరప్రేమను జాగ్రత్తగా పరీక్షించి చూచుకోవాలి.

## 3. బలుల కంటె దహనబలులకంటె ఘనమైంది ప్రేమ - మార్కు 12,28-34

క్రీస్తు ప్రేమాజ్ఞను ఉదాహరించిన ఘట్టాన్ని మత్తయి లాగే మార్కు కూడ పేర్కొన్నాడు. ఈ సందర్భంలో మత్తయి చెప్పని అంశాలు ఒకటి రెండు మార్కు చెప్పాడు. యావే ఏకైక ప్రభువు. అతనిలాంటివాడు అతడొక్కడే. ఇతర దేవతలకీ అతనికీ సామ్యం లేదు. యిస్రాయేలును ఎన్నుకొని ఓ జాతినిగా తీర్చిదిద్దింది అతడే. కనుక యిస్రాయేలు అతన్ని పూర్ణంగా ప్రేమించాలి. ఇక యూదులు ఆ ప్రభువుని లాగే తోడిజనాన్ని గూడ ప్రేమించాలి.

ప్రేమాజ్ఞలో రెండు భాగాలున్నాయని చెప్పాం గదా! సోదరప్రేమకూ దైవప్రేమకూ సమానమైన విలువుందని చెప్పినవాళ్ళల్లో క్రీస్తే మొదటివాడు కాదు. అతనికి ముందు కొందరు రబ్బయిలు కూడ ఈ బోధ చేసారు. హిలెల్ అనే రబ్బయి "పరిశుద్ధుడయిన దేవుడు పేదలకు బట్టలిస్తాడు, బాధితులను ఓదారుస్తాడు, మృతులను పాతిపెడతాడు. అలాగే మనంకూడ పేదలకు దుస్తులీయాలి, రోగులను పరామర్శించాలి, మృతులను భూస్థాపనంచేయాలి" అని నుడివాడు. కాని ఏ రబ్బయి కూడ క్రీస్తులాగ ఈ రెండాజ్ఞల సమానత్వాన్ని నొక్కి చెప్పలేదు.

ఇక్కడ క్రీస్తు జవాబును ఆలించిన ధర్మశాస్త్ర బోధకుడు మరో సత్యం చెప్పాడు. దేవుణ్ణీ నరుణ్ణీ కూడ ప్రేమించడమనేది బలులూ దహనబలులూ అర్పించడం కంటె గూడ గొప్పది. ఎందుకు? బల్యర్పణం కేవలం కర్మకాండ కావచ్చు. హృదయంలో భక్తిలేకుండానే బయటకి కానుకలు అర్పించవచ్చు. అలాంటి బల్యర్పణానికి విలువలేదు. కాని ప్రేమ అనేది హృదయంలో నుండి పుట్టుకవస్తుంది. మనసులో లేని ప్రేమను బయటికి చూపలేంగదా? కనుక బలి చిత్తశుద్ధి లేనిదైతే ప్రేమ చిత్తశుద్ధి కలది.

ధర్మశాస్త్ర బోధకుని మాటలను మెచ్చుకొని ప్రభువు అతనితో "నీవు చక్కగా సమాధానమిచ్చావు. నీలాంటివాడు దైవరాజ్యానికి చేరువలోనే వుంటాడు" అని పల్కాడు - 12,34 ఆ శాస్త్రి భావాలూ విలువలూ మనకూ వుంటే మనంకూడ అతనిలాగే దైవరాజ్యానికి దగ్గరగా వుంటాం.

## 4. తండ్రిలాగే కరుణాపూరితులం కావాలి - లూకా 6,36

మత్త 5,48 మనం తండ్రిలాగే పరిపూర్ణులమై యుండాలని చెప్తుంది. దీనికి తుల్యమైన వాక్యం లూకా సువార్తలో 6,36. కాని ఈ వాక్యంలో మనం తండ్రిలాగే కరుణాపూరితులం కావాలని చెప్పాడు లూకా. మత్తయి పేర్కొన్న పరిపూర్ణగుణమూ, లూకా పేర్కొన్న కరుణాగుణమూ ఒకటే. మనం తండ్రిలాగ పరిపూర్ణులం కావలసింది ఏయంశంలో? తెలివితేటల్లో కాదు. శక్తిసామర్థ్యాల్లో కాదు. మరి కరుణాగుణంలో. ఆ దేవునిలాగ కనికరం జూపితే మనంగూడ అతని లాగే పరిపూర్ణులమౌతాం.

భగవంతుని కల్యాణగుణాలు చాలా వున్నాయి. వాటన్నిటిలోను అతని కనికరం గొప్పది. కనుకనే అతడు హోషేయ ప్రవక్తముఖాన "నేను కోరేది కనికరం గాని బలులు కాదు" అని పల్కాడు - 6,6. నూత్నవేదంలో క్రీస్తుకూడ ఈ వాక్యాన్ని ఉదాహరించాడు - మత్త 9,13. క్రీస్తు తన తరపునతాను "నేను వచ్చింది వ్యాధిగ్రస్తుల కోసంగాని ఆరోగ్యవంతుల కోసం గాదు" అని పల్కాడు. అనగా అతడు పాపులపట్ల కనికరం చూపడానికి విచ్చేసాడు - లూకా 5,31-32. భగవంతుని జాలి ఈలాంటిది.

నిత్యజీవితంలో మనం ఈ జాలినీ కరుణనీ మరచిపోతాం. మెత్తగా వుంటే జనం మన తలమీదికెక్కి కూర్చుంటారు అనుకొని వాళ్ళపట్ల కటువుగా ప్రవర్తిస్తాం. కాని నెనరు అనేది ప్రేమలో ఓ ముఖ్యభాగం. అదిలేందే సోదర ప్రేమ లేదు. కనుక ఆ తండ్రీకొడుకుల్లాగే మనంకూడ తోడిజనం పట్ల కారుణ్యం చూపడం నేర్చుకోవాలి.

## 5. ఒక చెంపన గొడితే మరో చెంప - లూకా 6,27-31

ప్రభువు ఆజ్ఞల్లో కొన్ని పాటించడానికి కష్టమైనవి. అలాంటివాటిల్లో ఈ యాజ్ఞ కూడ ఒకటి. ఇతరుడు మనలను ఒక చెంపన గొడితే మనం మరో చెంపను

చూపించవలసిందే గాని వాని మీద పగ తీర్చుకోగూడదు. అలాగే అతడు మన వెలుపలి బట్టను లాగుకొంటే లోపలి బట్టను గూడ తీసికోనీయవలసిందే గాని వానిని శిక్షింపకూడదు. అనగా శత్రువులు హింసిస్తున్నపుడు కూడ మనం ఎంతో ఓర్పూ తాల్మీ ప్రదర్శించాలని భావం.

మనం నిత్యజీవితంలో ఈలా ప్రవర్తిస్తే దుర్మార్గుల దౌర్జన్యం ఇంకా పెరిగిపోవచ్చు. అందువల్ల మన తరపున మనం జాగ్రత్తగాను కరకుగాను ఉండగోరుతాం. దౌర్జన్యాన్ని తప్పకుండా ఎదిరించవలసిందే. కాని కరకుగా వుండడమంటే ఓర్పూ తాల్మీ వద్దని కాదు. సోదరప్రేమలో ఓర్పుగూడ ఓ భాగం. దాన్ని పాటించడం చాల కష్టం. ఐనా ఓర్పు కలవాడే సోదరప్రేమ కల నరుడు. విశేషంగా శత్రువుమీద పగతీర్చుకోవడం పనికిరాదు. చెడ్డను చెడ్డతో గాక, మంచితో వారించాలి - రోమా 12,21.

## 6. ఇతరులను తీర్మానించరాదు - లూకా 6,37-38

ఇతరుల యెడల కరుణ చూపాలని చెప్పాం. ఆ కరుణలో ఒక భాగమే ఇతరులను ఖండించకుండా వుండడం. మామూలుగా మనం పరులను అతిసులభంగా విమర్శిస్తాం. వాళ్ళను గూర్చి చెడ్డగా తలుస్తాం, చెడ్డగా మాట్లాడతాం కూడ. ఇది పద్ధతి కాదు.

యూదనాయకులైన పరిసయుల్లో ఈ దుర్గుణం బాగా వుండేది. వాళ్ళు తామే మంచివాళ్ళ మనుకొనేవాళ్ళు. ఇతరులు చెడ్డవాళ్ళనుకొని వాళ్ళను చిన్నచూపు చూచేవాళ్ళు - లూకా 18,9. వాళ్ళు తమ తప్పిదాలను గూర్చి ఆలోచించుకోకుండా వ్యభిచారిణి తప్పిదానికి ఆమెమీద రాళ్ళు రువ్వబోయారు - యోహా 8,4. ఇంకా క్రీస్తులోనూ అతని శిష్యుల్లోనూ తప్పులు పట్టబోయారు - లూకా 5,30. అసలు క్రీస్తులో ఏమి తప్పు దొరుకుతుందా అని అతన్ని పొంచి చూస్తుండేవాళ్ళు - మార్కు 3,2. ఈలాంటి మనస్తత్వం మనకు తగదు. మనం ఏ కొలతన కొలుస్తామో దేవుడు కూడ అదే కొలతన కొలుస్తాడు. కనుక ఇతరులను తీర్మానించడానికి సిద్ధంగా వుండకూడదు.

## 6ఎ. వ్యర్థంగా పలికే ప్రతిమాటకీ - మత్త 12,36

నరులు వ్యర్థంగా పలికే ప్రతిమాటకీ న్యాయనిర్ణయ దినాన లెక్క ఒప్పజెప్పాలి అన్నాడు ప్రభువు. మనం ఎన్నోసారులు అనవసరంగా, అసభ్యంగా మాటాడుతూంటాం. ఈ మాటల్లో ఎన్ని సోదరప్రేమకు వ్యతిరేకంగా వుంటాయో!

ఈ సందర్భంలో యాకోబుజాబు నాలుకను గూర్చి చెప్పే వాక్యాలను గూడ గుర్తుకు తెచ్చుకోవాలి - 3,2-12. నాలుక రవ్వలాగ చిన్న అవయవం. కాని పెద్దచిచ్చు.

చిన్న రవ్వ పెద్ద అడవిని తగులబెడుతుంది. అలాగే నాలుక కూడ మన దేహాన్నంతటినీ తగులబెడుతుంది. దానితోనే దేవుణ్ణి స్తుతిస్తాం, దానితోనే దేవునికి పోలికగా వుండే నరుణ్ణి శపిస్తాం. దాన్ని యెవరూ అదుపులో పెట్టుకోలేరు. రోజూ ఈ నాలుకతో మనం చేసే పాపాలు ఎన్నో!

## 7. సమరయునికి జాలి కలిగింది - లూకా 10,34

యెరికో బాటసారిని దొంగలు గొట్టగా అతడు రోడ్డు ప్రక్కన పడివున్నాడు. దేవాలయంలో ఊడిగం చేసే యాజకుడూ లేవీయుడూ ఆ మార్గం వెంట వచ్చారు. కాని వాళ్ళు అతన్ని పట్టించుకోకుండా వెళ్ళిపోయారు. అటుపిమ్మట సమరయుడు ఆ త్రోవన వచ్చాడు. గాయపడిన వాని దుస్తులు అతడు యూదుడని చెప్పక చెప్తున్నాయి. యూదులకూ సమరయులకూ ఆ యింటిమీది కాకి ఈ యింటిమీద వాలనంత బద్ధవైరం. కనుక సమరయుడు ఈ యూదుణ్ణి పట్టించుకోకుండా వెళ్ళి వుండవచ్చు. ఐనా అతని నిస్సహాయ స్థితిని చూడగా సమరయునికి జాలివేసింది. ఆ పరిస్థితుల్లో ఆ బాటసారిని ఆదుకోకపోతే అతడు తప్పక మరణిస్తాడు. కనుకనే సమరయుడు వాని చెంతకువెళ్ళి అతని గాయాలకు కట్టుకట్టాడు. అతన్ని సత్రానికి తీసుకొనివెళ్ళాడు.

యథార్థమైన సోదరప్రేమ ఉన్నవాడిలో ఈ జాలి తప్పక వుంటుంది. క్రీస్తుకూడ నాయీను విధవాపుత్రుని పాడెను మోసికొనిపోతూండగా చూచి జాలిపడ్డాడు - లూకా 7,13. ఆ కుమారుణ్ణి జీవంతో లేపాడు.

యాజకునికీ లేవీయునికీ ఈ జాలి లేదని చెప్పాం. ఇతరుల శ్రమలను చూచినపుడు మనకు మాత్రం జాలి పుడుతుందా? ఈ జాలి కలవాళ్ళు తప్పక సేవాకార్యాలకు పూనుకొంటారు. అక్కరలో వున్నవాళ్ళకు మనం చేసే సేవ యేపాటిది?

## 8. కానుకను పీఠం వద్దనే వదలిపెట్టి - మత్త 5,23-24

మామూలుగా మనం దైవప్రేమను ఘనంగా యెంచి సోదరప్రేమను తేలిక చేస్తామనీ, ఇది పొరపాటనీ చెప్పాం. సోదర ప్రేమ కూడ దైవ ప్రేమంత విలువైందని నుడివాం. నూత్నవేదంలో ఒక్క సందర్భం సోదరప్రేమ దైవప్రేమ కంటె గూడ ఘనమైందని చెప్తుంది. ఇది చాల అరుదైన వాక్యం. దేవుణ్ణి ఆరాధించడానికి దేవళానికి కానుకతో వచ్చాం. కాని ఇరుగుపొరుగువారిలో ఎవరిమీదనో మనకు మనస్పర్థ ఉన్నట్లుగా గుర్తుకు వచ్చింది. అప్పుడు దేవుణ్ణి పూజించుకొని వెళ్ళిపోతే చాలదు. ఆ కానుకను పీఠం దగ్గరే వదలిపెట్టి వెళ్ళి ఆ విరోధితో సఖ్యపడిరావాలి. ఆ పిమ్మట దానిని దేవునికి అర్పించవచ్చు.

తోడినరునిపట్ల పగా వైరమూ పెట్టుకొని దేవుణ్ణి పూజిస్తే ఆపూజ చెల్లదు. కనుక దేవుణ్ణి ఆరాధించడం కంటె గూడ సోదరప్రేమను పాటించడం లెస్స. మరి యింత విలువైన ఈ సోదరప్రేమను మనం అనాదరం చేయవచ్చా?

## 9. నా సోదరులకు చేస్తే నాకు చేసినట్లే - మత్త 25,40

తోడిజనాన్ని పరామర్శిస్తే ప్రభువుని పరామర్శించినట్లే. దీనులకు అన్నంబెట్టి బట్టలిచ్చి మందులిచ్చి ఆదరిస్తే ప్రభువు తన్ను ఆదరించినట్లే భావిస్తాడు. ఎందుకు? భగవంతుడు నరుణ్ణి తనకు పోలికగా చేసాడు. ప్రతినరుని ముఖంలోను దేవుని పోలిక వుంటుంది - ఆది 1,27. ప్రతి నరునిలోను, విశేషంగా దీనుల్లో, అతడు నెలకొని వుంటాడు. దేవుణ్ణి మనం కంటితో చూడలేం. కాని ఆ దేవునికి గుర్తుగా వున్న నరుణ్ణి మాత్రం ఇరవైనాల్గుగంటలూ చూస్తూనే వుంటాం. కనుక ఆ దేవునికి చేయగోరింది తోడిజనానికి చేస్తే చాలు. ప్రభువు ఆ వుపకారాన్ని తనకు చేసినట్లే భావిస్తాడు. కనుకనే అతడు మీరు నా సోదరులకు చేసిన మేలు నాకు చేసినట్లే ఎంచుతాను అన్నాడు.

మదర్ తెరీసాలాంటి మాన్యులు అనాథులకు సేవలు చేస్తుంది ఎందుకు? వాళ్ళల్లో ఆ ప్రభువుని చూచే, ఆ సేవలు ప్రభువుకి చెందుతాయన్న భావంతోనే. ఈ దృష్టితోనే మనం కూడ దరిద్రులకూ దౌర్భాగ్యులకూ సేవలు చేయాలి. అప్పుడే కాని మనం సోదర ప్రేమను పాటించినట్లు కాదు.

## 10. డెబ్బైయేడుసార్లు క్షమించాలి - మత్త 18,21-22

పూర్వవేదంలో లెమెక్ అనేవాడు శత్రువు మీద డెబ్బైయేడంతలు పగతీర్చుకోగోరాడు - ఆది 4,24. కాని నూత్నవేదంలో ఇది పద్ధతి కాదు. అందుకే శత్రువులను ఏడుపర్యాయాలు క్షమిస్తే చాలా అని పేత్రు అడగ్గా క్రీస్తు డెబ్బైయేడు పర్యాయాలు క్షమించాలని చెప్పాడు. లెమెక్ 77 రెట్లు పగతీర్చుకొంటే శిష్యులు 77రెట్లు క్షమించాలి. అతని పగకు మన క్షమాగుణం విరుగుడు కావాలి. ఇక్కడ 77 సార్లంటే చాలసార్లు, లెక్కలేనన్ని సార్లు అని భావం. అనగా శత్రువులను ఎన్నిసార్లయినా క్షమిస్తుండవలసిందేనని అర్థం.

మామూలుగా మనకు శత్రువులను క్షమించబుద్ధి పుట్టదు. వాళ్ళమీద పగ తీర్చుకోకపోతే మగతనమేముంది అనుకొంటాం. కాని పగతీర్చుకొన్నవాడు కాదు, క్షమించినవాడు ఘనుడు. వాడే సోదరప్రేమను పాటించినవాడు. ఈ సందర్భంలో తెలుగు కవి వేమన ఈలా చెప్పాడు :

చంపదగినయట్టి శత్రువు తనచేత
జిక్కెనేని కీడు సేయరాదు
పొసగ మేలుచేసి పొమ్మనుటే చావు.

### 11. పరలోకంలోని తండ్రికి బిడ్డల మౌతాం - మత్త 5,45

నరునికి దేవునిలాంటివాణ్ణి కావాలనే కోరిక మొదటినుండీ వుంది. ఆదాము చెట్టుపండు తినడంలో ఉద్దేశం ఇదే - ఆది 3,5. కాని ఆదాము దురాశకూ గర్వానికీ ప్రభువు అతన్ని శపించాడు. మరి నరుల్లోని ఈ కోరిక ఏలా తీరుతుంది? సోదరప్రేమను పాటించడం ద్వారా మనం తండ్రికి ఇష్టులమై అతనికి కుమారులమౌతాం. అనగా అతనిలాంటివాళ్ళ మౌతాం - మత్త 5,45. కనుక ఈ సోదరప్రేమ అవశ్యం పాటించదగ్గది.

# 2. యోహాను భావాలు

## 1. యోహాను సువార్త

### 12. దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించాడు - యోహా - 3,16

ఇంతవరకు తొలిమూడు సువార్తల్లోని భావాలు పరిశీలించాం. ఇక యోహాను వ్రాసిన నాల్గవ సువార్తలోని భావాలు పరిశీలిద్దాం.

దేవుడు లోకాన్ని ఎంతో ప్రేమించాడు. ఇక్కడ లోకమంటే కేవలం యూద ప్రపంచం మాత్రమే కాదు. లోకంలోని జనులందరూను. విశేషంగా పాపాత్ములైన నరులు. ఈ నరులకోసం తండ్రి తన ఏకైక కుమారుణ్ణి, అనగా తనకు అత్యంత ప్రీతిపాత్రుడైన క్రీస్తుని పంపాడు. జనులు పాపాత్ములై దేవునికి శత్రువులుగా వున్నపుడు ఈ క్రీస్తు పాపుల కొరకు ప్రాణాలు అర్పించాడు - రోమా 5,8. ఈ కార్యాలన్నిటిద్వారా తండ్రికి మనపట్ల గల ప్రేమ వ్యక్తమౌతుంది. ఆదాము పాపం వల్ల నరులంతా దేవునికి శత్రువులయ్యారు. అలాంటి పరిస్థితుల్లో నరుల కొరకు రక్షణ ప్రణాళికను సిద్ధం చేసి క్రీస్తుని పంపాడు తండ్రి. క్రీస్తు తనంతట తాను రాలేదు. తండ్రి పంపగా వచ్చాడు. తండ్రి ప్రేమమయుడు. కనుక ప్రేమ అనేది మొదట మననుండి కాక దేవుని నుండి పుట్టింది. దేవుడు మొదట మనలను ప్రేమించాడు కనుకనే మన తరపున మనం కూడ ఆ దేవుణ్ణీ తోడి నరుణ్ణీ కూడ ప్రేమించగల్గుతున్నాం. మన ప్రేమకు ఆధారమూ ఆదర్శమూ కూడ ఆ తండ్రి ప్రేమే - 1 యోహా 4,10-12.

## 13. నూతన ఆజ్ఞ - యోహా 13,34

ప్రభువు సోదరప్రేమను నూతన ఆజ్ఞ అని పేర్కొన్నాడు. కాని ఇది నూతన ఆజ్ఞ ఏలా ఔతుంది? లేవీయ కాండం 19,18 నిన్నువలె నీ పొరుగువారిని ప్రేమించమని చెప్తూంది కదా? సోదరప్రేమను గూర్చిన ఆజ్ఞయేమో మోషే ధర్మశాస్త్రంలో గూడ వుంది. కాని ధర్మశాస్త్రం మనం సోదరప్రేమను ఎందుకు పాటించాలో చెప్పదు. యావే ప్రభువుని ఆదర్శంగా పెట్టుకొని, సోదరప్రేమను పాటించాలని పూర్వవేదం ఎక్కడా చెప్పదు. కాని నూత్నవేదంలో క్రీస్తు మనం తన్ను ఆదర్శంగా బెట్టుకొని సోదరప్రేమను పాటించాలని చెప్పాడు. "నేను మిమ్ము ప్రేమించినట్లే మీరూ ఒకరినొకరు ప్రేమించాలి" అన్నాడు. ఈలా క్రీస్తుప్రేమ మనకు ఆదర్శంగా వుండడంవల్లనే అతడు బోధించిన ప్రేమాజ్ఞ క్రొత్తఆజ్ఞ అయింది. ఆజ్ఞయేమో క్రొత్తదికాదు. అతడు దానికి ఆదర్శంగా వుండడం మాత్రం క్రొత్త.

ఏమిటి ఈ యాదర్శం? క్రీస్తు మనలకు అంతం వరకు ప్రేమించాడు - అనగా తన శక్తికొలది పరిపూర్ణంగా ప్రేమించాడు - యోహా 13,1. స్నేహభావంతో శిష్యుల కాళ్ళు కడిగాడు - 13,14. మన కోసం తన ప్రాణాలను ధారపోయడానికి సంసిద్ధమయ్యాడు - 15,13. అతని ప్రేమ అంత చిత్తశుద్ధితో కూడింది, అంత పవిత్రమైంది. ఆ పవిత్రప్రేమే మన సోదరప్రేమకు కూడ ఆదర్శం.

పూర్వాంశంలో తండ్రిప్రేమ మనకు ఆదర్శంగా వుంటుంది అని చెప్పాం. అలాగే కుమారుని ప్రేమకూడ మనకు ఆదర్శంగా వుంటుంది.

## 14. క్రీస్తు శిష్యులకు గుర్తు - యోహా 13,35

మనం క్రీస్తు శిష్యులం అనడానికి గుర్తు ఏమిటి? ఏ లక్షణాన్ని బట్టి లోకం మనలను క్రైస్తవులుగా గణిస్తుంది? సోదరప్రేమను బట్టే. పూర్వం పరిసయులు ముఖపట్టికలు ధరించేవాళ్లు. అది ఆ శాఖీయులకు గుర్తు. స్నాపక యోహాను శిష్యులు యోర్దాను స్నానాన్ని తమ శాఖకు గుర్తుగా నిర్ణయించుకొన్నారు. అలాగే క్రీస్తు శిష్యులకు గూడ ఓ గుర్తు వుంది. అదే సోదరప్రేమ.

అనగా ఈ సోదరప్రేమ మరోవర్గం వాళ్ళల్లో వుండదు. అది క్రీస్తు శిష్యులకు ప్రత్యేకం. దాని ద్వారా వాళ్ళు క్రీస్తుకి సాక్ష్యం పలుకుతారు. క్రీస్తు ఈ గుర్తుని తన జీవితపు చివరి గడియల్లో శిష్యులకు ప్రసాదించాడు. కనుక అది అతని వీలునామా లాంటిది. కలకాలమూ ఇది శిష్యులకు గుర్తుగా వుండాలి. సోదరప్రేమ లేనివాడికి ఆ శిష్యవర్గంలో చేరేహక్కు లేదు.

దివ్యసత్ప్రసాదం శిష్యులకు ఐక్యతను ప్రసాదిస్తుంది. ఒకే రొట్టెను భుజించేవాళ్ళు చాలమంది ఐనాకూడ ఏకశరీరంగా ఐక్యమైపోతారు - 1కొ 10,17. ఈలాగే సోదరప్రేమ కూడ శిష్యులకు ఐక్యతను ప్రసాదిస్తుంది. కనుకనే ప్రభువు తానూ తండ్రీ ప్రేమతో ఐక్యమైయున్నట్లే శిష్యులు కూడ ఒకరితో ఒకరు ఐక్యమైయుండాలని ప్రార్థించాడు - యోహా 17,21. దివ్యసత్ప్రసాదం లాగే సోదరప్రేమ కూడ శిష్యులను ఐక్యంచేస్తుంది. అంటే, దానిలాగే ఇదికూడ క్రైస్తవులకు గుర్తుగా వుంటుంది అని భావం. ఇదికూడ దానంత విలువైంది. ఇవి రెండూ కలసి క్రీస్తు సాన్నిధ్యానికి గుర్తుగా వుంటాయి. ఆదివ్య సత్ప్రసాదాన్ని లాగే ఈ సోదరప్రేమను గూడ ప్రభువే మనకు ప్రసాదించాడు. మనంతట మనం ఈ వరాన్ని ఊహించనైనా ఊహించలేం.

సోదరప్రేమను గూర్చి చెప్పవలసివస్తే యోహాను 13,35 చాల బలమైన వాక్యం. లోకంలో సోదరప్రేమ లేదు. నరునికి నరుడు తోడేలు అన్నట్లుగా ప్రవర్తిస్తుంది లోకం. ప్రపంచంలో సోదరప్రేమను పాటించేది ప్రధానంగా క్రీస్తు శిష్యులు. అలాంటప్పుడు మనలోనే ఈగుణం లోపిస్తే ఇక అంతకుమించిన దౌర్భాగ్యం ఏముంటుంది?

# 2. యోహాను మొదటిజాబు

## 15. చీకటీ వెలుగూ - 1యోహా 2,9

ఇంతవరకూ నాల్గవ సువార్తను విలోకించాం. యోహాను మొదటి జాబుకూడ సోదరప్రేమను గూర్చి చాల సంగతులు చెప్తుంది. వీటిని పరిశీలిద్దాం.

ఈ జాబులో వెలుగు సోదరప్రేమకీ, చీకటి సోదరద్వేషానికీ చిహ్నంగా వుంటాయి. భగవంతుడు జ్యోతిర్మయుడు కాని తమోమయుడు కాదు. అనగా అతనిలో ప్రేమేగాని ద్వేషంలేదు. మనం వెలుగులో నడచినప్పుడు ఆ ప్రభువు మార్గంలో నడచినట్లే. అప్పుడు మనం తోడిజనాన్ని గూడ ప్రేమిస్తాం. కాని మనం చీకటిలో నడచినప్పుడు పిశాచమార్గంలో నడచినట్లే. అప్పుడు మనం తోడిజనాన్ని ద్వేషిస్తాం. అసలు దేవుని బిడ్డలకీ దయ్యం బిడ్డలకీ ఒక్క ప్రేమలో తప్పితే తేడా లేదు.

## 16. మృత్యువూ జీవమూ - 1 యోహా 3,10-15

జీవం సోదరప్రేమకీ, మృత్యువు సోదరద్వేషానికీ, చిహ్నంగా వుంటాయి. తోడిజనాన్ని ప్రేమించేవాళ్లు దేవుని పుత్రులు. వాళ్ళల్లో జీవం వుంటుంది. శిష్యులు ఈలాంటి వాళ్ళు. కాని తోడిజనాన్ని ద్వేషించేవాళ్ళు పిశాచపుత్రులు. వాళ్ళు చావుకి గురౌతారు. కయీను ఈలాంటివాడు. మనం ఈ కయీనులాగ ప్రవర్తించగూడదు. మనం తోడిజనాన్ని ప్రేమించినట్లయితే మృత్యులోకం నుండి జీవలోకానికి సాగిపోయినట్లే.

## 17. క్రియాపూర్వకమైన ప్రేమ - 1 యో3, 16-18

ప్రేమని మాటల్లో కాక చేతల్లో చూపించాలి. తండ్రి తన ప్రేమను చేతల్లో చూపించాడు. కనుకనే అతడు క్రీస్తుని పంపాడు. ఆ క్రీస్తు కూడ తన ప్రేమని చేతల్లో చూపించాడు. అదే అతని సిలువ మరణం. స్నేహితుల కోసం ప్రాణాలు అర్పించడం కంటె గొప్ప ప్రేమ ఏముందని ప్రభువే అన్నాడు - యోహా 15,13. ఈ తండ్రీకొడుకుల్లాగే మనం కూడ మన ప్రేమను క్రియాపూర్వకంగా చూపించాలి.

పై సూత్రం అన్వయించే ఓ సందర్భం. తోడి జనం అక్కరలో వుంటే, మనం కలవాళ్ళమైతే, తప్పకుండా సహాయం చేయాలి. ప్రేమించడమంటే ఈయడం. ఇతరులకు ఇచ్చినపుడే మనప్రేమ యథార్థమైందని రుజువౌతుంది. సోదర ప్రేమకీ సాంఘిక న్యాయానికీ చాల దగ్గరి సంబంధం వుంది. మంచి సమరయుడు బాటసారి మీద జాలిపడి అతనికి సహాయం చేసాడు - లూకా 10,34. మనం తోడి జనానికి సేవలు చేయాలనే ప్రభువు ఆజ్ఞ కూడ వుంది - లూకా 22,26. కూడూ గుడ్డా లేని తోడిజనాన్ని ఆదుకొన్నప్పుడు మాత్రమే మన విశ్వాసాన్ని క్రియాపూర్వకంగా చూపించినట్లవుతుందని చెప్తుంది యాకోబు జాబు - 2,15-16. ఈ వుదాహరణలన్నిటి భావం ఏమిటంటే సోదరప్రేమను చేతల్లో చూపించాలి. చేతలదాకా రాని ప్రేమ యథార్థమైంది కాదు.

## 18. దేవుడు ప్రేమస్వరూపుడు - 1 యోహా 4,8

బైబులు చాల అరుదుగా గాని నిర్వచనాలు చెప్పదు. ఆ కొద్దిపాటి నిర్వచనాల్లో పై వాక్యం గూడ ఒకటి. ఈ వాక్యం దేవుడు తన ఆంతరంగిక జీవితంలో ప్రేమమయుడు అని చెప్తుంది. అనగా సృష్టి చేయడం ద్వారా, క్రీస్తుని పంపి పతనమానవుణ్ణి ఉద్ధరించడం ద్వారా దేవుడు ప్రేమమయుడయ్యాడు. ఇక మనం ఆ దేవునికి బిడ్డలం. బిడ్డలు తండ్రిలాగే వుండాలి. అతనిలాగే మనంకూడ ప్రేమకార్యాలకు పూనుకోవాలి. లేకపోతే అతనికీ మనకీ పొత్తు కుదరదు. అసలు అతన్ని మనం అర్థం చేసికొన్నట్లే కాదు. ప్రేమద్వారా మనం దేవునిలాంటివాళ్ళం ఔతాం. తండ్రి క్రీస్తుపట్ల చూపే ప్రేమా, క్రీస్తు శిష్యులయెడల చూపే ప్రేమా, ఆ శిష్యులు పరస్పరం చూపుకొనే ప్రేమా - అంతా ఒకటే ప్రేమ. ఆ ప్రేమలో పాలుపొందినవాడే యథార్థ క్రైస్తవుడు.

## 19. దేవుడే మొదట మనలను ప్రేమించాడు - 1 యోహా, 4,10-12

దేవుడే గనుక మొదట మనలను ప్రేమించకపోతే మనం ఒకరినొకరం ప్రేమించగలిగేవాళ్ళమే కాదు. ఆ తండ్రే మొదట మనలను ప్రేమించాడు. మన విమోచనం

కొరకు క్రీస్తుని పంపాడు - యోహా 3,16. మనతరపున మనం కూడ ఏలా ప్రేమించాలో నేర్పాడు. కనుక మనం కృతజ్ఞతా పూర్వకంగా అతనికి బదులు ప్రేమ చూపించాలి.

కాని దేవునికి బదులు ప్రేమ చూపించాలంటే అతడు మన కంటికి కన్పించేవాడు కాదు. మరి మన బాకీ ఏలా తీర్చుకొంటాం? దేవుడు మనకు కన్పించకపోయినా తోడినరులు కన్పిస్తూనేవుంటారు. వాళ్ళను ప్రేమిస్తే దేవుడు తన్ను ప్రేమించినట్లే భావిస్తాడు. కనుక దేవుని పట్ల మనం చూపవలసిన ప్రేమను తోడిజనుల పట్ల చూపితే చాలు, మన ఋణం తీరిపోతుంది. ఎందుకంటే మన కంటబడని దేవుడు తోడినరులరూపంలో కంటబడతాడు.

## 20. ప్రేమ హృదయునిలో దేవుడు ఉంటాడు - 1యోహా 4,16

క్రీస్తు తండ్రిని ప్రేమించి అతనిలో నెలకొనివుంటాడు. అలాగే శిష్యులు కూడ క్రీస్తుని ప్రేమించి అతనిలో నెలకొని వుంటారు. ప్రేమ సాన్నిధ్యాన్ని తెచ్చిపెడుతుంది. మనం ఎవరిని ప్రేమిస్తామో వాళ్ళు మనకీ, మనం వాళ్ళకీ సన్నిహితులమౌతాం. ఈ సూత్రం ప్రకారం మనం ప్రేమతో జీవిస్తే దేవుడు మనలో వసిస్తాడు. మనమూ అతనిలో వసిస్తాం. సోదరప్రేమ కల మహానుభావుల హృదయంలో భగవంతుడు నెలకొని వుంటాడు. ఇంతకన్న గొప్పభాగ్యం ఏమి కావాలి?

## 21. అసత్యవాది - 1 యోహా 4,20-21

కొందరు దేవుణ్ణి ప్రేమిస్తున్నా మనుకొంటారు. గుళ్ళోకి వెళ్ళి దేవునికి మ్రొక్కుతారు. కాని తోడి జనాన్ని మాత్రం అనాదరం చేస్తారు. అలాంటప్పుడు వాళ్ళ దైవభక్తి అంతాగూడ వ్యర్థమే. పైగా వాళ్లు అబద్ధాలకోరులు కూడ. ఎందుకు? సులభమైన కార్యం చేయలేని వాడు కష్టమైన కార్యం చేయలేడు. తోడినరుడు మనకంటికి కన్పిస్తాడు. అతన్ని ఆదరంతో చూడ్డం సులభం. దేవుడు మనకంటికి కన్పించడు. మనకు అందుబాటులో వుండడు. అలాంటివాణ్ణి ఆదరించడం కష్టం. ఇక, సులభమైన కార్యాన్ని చేయలేనివాడు కష్టమైన కార్యాన్ని చేయలేడు కదా! సులభంగా దొరకే తోడి నరుణ్ణి పట్టించుకోనివాడు కష్టంతో దొరికే దేవుణ్ణి పట్టించుకొంటాడా? అందుకే యోహాను కంటికి కనుపించే నరుణ్ణి ప్రేమించలేనివాడు కంటికి కనుపించని దేవుణ్ణి ప్రేమించలేడని చెప్పాడు. ఒకవేళ అలాంటివాడు నేను దేవుణ్ణి ప్రేమిస్తున్నానని చెప్తే అసత్యవాది ఔతాడు. పిశాచం అబద్ధాలన్నిటికీ పుట్టినిల్లు. కనుక అతడు కూడ ఆ పిశాచ మార్గంలో నడచినట్లవుతుంది.

ఒకోమారు తోడినరులను ద్వేషిస్తాం. వారిని పీడిస్తాం. వారికి అపకారం చేస్తాం. ఐనా భగవంతుణ్ణి పూజింపబోతాం. అతనికి కానుకలూ మ్రొక్కులూ చెల్లిస్తాం. కాని

ఈలాంటి భక్తిని దేవుడు అంగీకరించడు. అసలు ఇది భక్తి కానేకాదు. కేవలం మన స్వార్థం. ఆ దేవుడి కంటిలో దుమ్ము కొట్టడం, అంతే.

### 22. తండ్రిని ప్రేమించేవాడు అతని పుత్రులనూ ప్రేమిస్తాడు - 1 యోహా 5,1-3

మనకు సృష్టికర్తా మొదట జన్మనిచ్చేవాడూ దేవుడు. కనుక మనం అతన్ని ప్రేమించాలి. కాని ఆ తండ్రికి తన కుమారులందరూ ఇష్టులే. దేవుడే గనుక మనకు ఇష్టమైతే అతని కుమారులు కూడ ఇష్టంకావాలి. ఇక, క్రీస్తు తండ్రికి సహజపుత్రుడు. నరులు, విశేషంగా జ్ఞానస్నానం పొందినవాళ్ళు, అతనికి దత్తపుత్రులు. వీళ్ళల్లో అతడు నెలకొనివుంటాడు. వీళ్ళంటే అతనికి ప్రీతి. కనుక ఈ పుత్రులంతా గూడ మనకు ప్రియపడాలి. ఫలితార్థ మేమిటంటే, మనం దేవుణ్ణి చిత్తశుద్ధితో ప్రేమిస్తే అతని పుత్రులైన తోడిజనాన్ని గూడ ప్రేమిస్తాం. తరచుగా మనకు దైవప్రేమ ఉండదు. కనుకనే సోదరప్రేమ కూడ అంతంతమాత్రంగానే వుంటుంది. అసలు దైవప్రేమలోనే సోదరప్రేమ కూడ ఇమిడివుంటుంది. అవి రెండూ వేరువేరు ప్రేమలు కాదు, ఒకే ప్రేమ.

## 3. పౌలు భావాలు

### 23. ప్రేమ తోడివారిని భవనంలా కడుతుంది - 1కొ 8,1-3

ఇంతవరకు నల్గురు సువార్తాకారుల భావాలను విలోకించాం. ఇక పౌలు భావాలను పరిశీలిద్దాం.

కొరింతులోని క్రైస్తవులు కొందరు విగ్రహాలకు సమర్పించిన మాంసాన్ని భుజించారు. కాని వాళ్ళు అది పాపమనుకోలేదు, పాపంలో పడలేదు కూడ. వాళ్ళను చూచి మరికొందరు క్రైస్తవులు కూడ అదే మాంసం భుజించారు. కాని వీళ్ళు అది పాపమనుకొన్నారు. కనుక వీళ్ళు ఆ మాంసాన్ని భుజించడం ద్వారా పాపం చేసారు కూడ.

మాంసం తిన్న మొదటివర్గం వాళ్ళు తాము జ్ఞానులమనుకొన్నారు. విగ్రహాలు అసలు దేవుళ్ళే కావు గనుక వాటికర్పించిన మాంసం తిన్నాగూడ పాపంలేదులే అనుకొన్నారు వాళ్ళ భావం నిజమే. కాని ఈ మిడిమిడి జ్ఞానం వల్ల వాళ్ళకి పొగరెక్కింది. వాళ్ళు కొలిమితిత్తుల్లా ఉబ్బిపోయారు. కనుక జ్ఞానం వల్ల కలిగే అనర్థం బడాయితో విర్రవీగడం - 1కొ 8,9-11.

కాని సోదరప్రేమ ఈలా చేయదు. అది భవనాన్ని కట్టినట్లుగా క్రైస్తవ సమాజాన్ని కట్టుకొంటూపోతుంది. అనగా క్రైస్తవ సమాజాన్ని వృద్ధిలోకి తెస్తుంది. ఆ సమాజ వ్యక్తుల

శ్రేయస్సు కొరకు కృషి చేస్తుంది. ఎప్పుడు గూడ సోదరప్రేమలో వుండే గుణం యిది - తోడివ్యక్తి అభివృద్ధిని సాధించడం. కనుక జ్ఞానం వలన గర్వం కలుగవచ్చు. కాని సోదరప్రేమ వలన మాత్రం తోడివారి అభివృద్ధికొరకు పాటుపడతాం.

## 24. ఇతరులను ప్రేమిస్తే ధర్మశాస్త్రాన్ని పాటించినట్లే - రోమా 13,8

తోడిజనాన్ని అంగీకరించి ఆదరిస్తే సువిశేషాలు బోధించే నైతిక ధర్మాలన్నీ పాటించినట్లే. మోషే ధర్మశాస్త్రంలోని విధులన్నీ అనుసరించినట్లే. బైబులు భగవంతుడు జారీచేసిన చట్టాలన్నీ ఈ వొక్క ఆజ్ఞలోనే యిమిడి వున్నాయి.

అందుకే యాకోబు జాబుకూడ సోదరప్రేమను "రాజ శాసనం" అని పేర్కొంటుంది. అనగా ఇది శ్రేష్ఠమైన శాసనమనీ, ఇతర శాసనాలన్నిటినీ పరిపాలించేదనీ, వాటినన్నిటినీ తనలో ఇముడ్చుకొనేదనీ భావం. లేవీయకాండ 19,18 పేర్కొంది ఈ శాసనాన్నే. మార్కు 12,31 మత్త 22,39 లూకా 10,27 పేర్కొంది కూడ ఈ యాజ్ఞనే. అన్నిటికంటె విలువైంది సోదరప్రేమ. కనుక క్రైస్తవుడు ఈ యాజ్ఞను తూచ తప్పకుండ పాటిస్తూండాలి.

## 25. క్రీస్తు ప్రేమ మనలను నిర్బంధిస్తుంది - 2కొ 5,14

ఇక్కడ "క్రీస్తుప్రేమ" అంటే క్రీస్తు మనపట్ల చూపిన ప్రేమకాదు. మనం ఆయనపట్ల చూపవలసిన ప్రేమ. ఆ ప్రభువు మనలను ప్రేమించి మనకోసం చనిపోయాడు. కనుక మన తరపున మనంకూడ ఆయన్ని గాఢంగా ప్రేమించాలి. మనం ఆయన దాసులమూ, సేవకులమూ కావాలి.

క్రీస్తు ప్రేమలో సిలువ వుంది. మరణం వుంది. కనుక మన ప్రేమలోకూడ ఈ లక్షణాలు వుండాలి. అతనికోసం మనం శ్రమలు అనుభవించ గలిగివుండాలి.

ఇక క్రీస్తుపట్ల మనం చూపవలసిన ప్రేమ మనలను సోదరప్రేమకు పురికొల్పుతుంది. మనం ఆయనకోసం తోడిజనానికి సేవలు చేయాలని చెప్తుంది. ఇదే మన ప్రేషితోద్యమం. ఈలా ప్రభువుపట్ల గల ప్రేమచేత మనం నానాజనానికీ నానా పరిచర్యలు చేస్తూండాలి.

## 26. ప్రేమను మన హృదయాల్లో కుమ్మరించాడు - రోమా 5,5

ప్రేమ అనేది మనంతట మనం సాధించేదికాదు. అది దైవవరం. తండ్రి తన ప్రేమను మన హృదయాల్లో కుమ్మరిస్తూంటాడు. ఇది మన జ్ఞానస్నానంలో జరగుతుంది. ఆత్మద్వారా జరుగుతుంది.

ఇక్కడ తండ్రి తనప్రేమను "కుమ్మరించాడు" అంటే దాన్ని సమృద్ధిగా దయచేసాడు అని భావం. జలధార చెలమను నీటితో నింపుతుంది. అలాగే తండ్రికూడ మన హృదయాన్ని తన ప్రేమతో నింపుతాడు. ఈ ప్రేమవల్లనే మనం దేవుణ్ణిగాని తోడి జనాన్ని గాని ప్రేమించగల్గుతూన్నాం.

ఇక యీ ప్రేమ ఆత్మద్వారా మనకు లభిస్తుందని చెప్పాం. కనుక సోదరప్రేమకు అంత సులభంగా అలవాటు పడనివాళ్ళు ఆయాత్మనే అడుగుకోవాలి. తమకు ఆ వరాన్ని దయచేయమని ప్రార్థించాలి.

## 27. అన్నిటినీ ఐక్యపరచే సాధనం - కొలొ 3,14

వారుతో నడికట్టు కట్టుకొంటాం. అది మన వంటిమీది బట్టలన్నిటినీ ఏకంజేసి బిగుతుగా వుంచుతుంది. ఈలాగే సోదరప్రేమ కూడ ఓ నడికట్టులాంటిది. అది న్యాయం, సేవ, కరుణ మొదలైన పుణ్యాలన్నిటినీ ఐక్యపరుస్తుంది. వాటినన్నిటినీ ఒక్కటిగా బంధిస్తుంది. జ్ఞానస్నానం పొందిన నూత్నమానవుడు ఈ సోదరప్రేమ అనే నడికట్టు తాల్చాలి.

## 28. క్రీస్తు తన్ను తాను సంతోషపెట్టుకోలేదు - రోమా 15,1-3

ఇది యెంత చిన్నవాక్యమో అంత అర్థవంతమైనది. క్రీస్తు తన లాభం తాను చూచుకోలేదు. అలా చూచుకొంటే అతడు మనకొరకు చనిపోయి వుండేవాడు కాదు. మనంకూడ ఆ ప్రభువులాగే మెలగాలి. మన లాభం మాత్రమే మనం చూచుకోకుండ తోడినరుల మేలు కొరకు కూడ కృషిచేయాలి. వాళ్ళ అభివృద్ధికొరకు పాటుపడాలి. సోదరప్రేమంటే ఇదే. మానవుడు మాత్రమే దీనిని సాధిస్తాడు.

## 29. ప్రేమ చేసే పనులు

పౌలు దృష్టిలో ప్రేమ రెండు ప్రధానకార్యాలు చేస్తుంది. మొదటిది, అది తోడి నరుణ్ణి ఓ భవనం లాగ నిర్మించుకొంటూ పోతుంది. అనగా తోడినరుని అభివృద్ధికి కృషిచేస్తుంది - 1కొ 8,1. రెండవది, అది తోడినరులకు సేవలు చేస్తుంది - గల 5,13. ఈ రెండు లక్షణాలు మనలో వుంటే మనకు సోదరప్రేమ అబ్బినట్లే.

విన్సెంట్ ఫెర్రర్ అనే భక్తుడు మనం తోడివారికి చేసే సేవలు ఏడురకాలుగా వుంటాయని చెప్పాడు.

1. ఇతరులు బాధల్లో వున్నపుడు అవి మన బాధలో అన్నట్లు సానుభూతి చూపాలి.
2. వాళ్ళ అభివృద్ధిని మన అభివృద్ధినిగా భావించి సంతోషించాలి.
3. వాళ్ళ బలహీనతలనూ, వాళ్లు మనకు చేసిన అపకారాలను గూడ ఓర్పుతో సహించాలి.
4. వాళ్ళతో ఆప్యాయంగా మెలగాలి, వాళ్ళ క్షేమాన్ని కాంక్షించాలి.
5. వాళ్లు మనకంటే అధికులని భావించి వాళ్ళపట్ల గౌరవమర్యాదలతో మెలగాలి.
6. వాళ్ళతో ఒద్దికగాను శాంతిసమాధానాలతోను జీవించాలి.
7. వాళ్ళ ఆత్మరక్షణం కొరకు మన ప్రాణాన్ని అర్పించడానికి గూడ సిద్ధంగా వుండాలి.

## 30. ప్రేమతోనే అన్ని పనులూ - 1కొ 16,14

పౌలు సోదరప్రేమకు ఎంత విలువ నిచ్చాడంటే, మనం ఏపని చేసినా ప్రేమతోనే చేయాలి అన్నాడు. ప్రేమతో చేసినపనికి విలువుంటుంది. అలా చేయనిపనికి, అది యెంత పెద్దదైనా సరే, విలువవుండదు. మరో తావులో అతడు మనం ప్రేమలో నడవాలని చెప్పాడు. అనగా మనం ప్రేమతో నడచుకోవాలని భావం. మన ప్రవర్తనం ప్రేమతో నిండివుండాలని అర్థం - ఎఫే 5,13. అన్నిపనులు ప్రేమతో చేయాలి అన్నా, ప్రేమవర్తనం అలవర్చుకోవాలి అన్నా భావం ఒకటే. మనం ప్రేమ పూర్వకంగా జీవించాలని ఫలితార్థం. అగస్టీను భక్తుడు "మొదట ప్రేమించు. ఆ తర్వాత నీవు ఏమి చేసినా చెల్లుతుంది. మన హృదయంలో ప్రేమ బీజం వుండాలి. ఆ బీజంనుండి ప్రేమాంకురం తప్పితే మరో మొలక మొలవదు" అన్నాడు.

## 31. ప్రేమ చాలా పాపాలను కప్పిపెడుతుంది - 1 పేత్రు 4,8

ప్రేమ చాలా పాపాలను కప్పిపెడుతుంది అంటుంది పేత్రుజాబు. "ప్రేమ దోషాలన్నిటినీ కప్పివుంచుతుంది" అని చెప్తుంది సామెతల గ్రంథం - 10,12. అనగా ప్రేమగల నరుడు తోడిజనుల తప్పిదాలను గణించడు. తోడివారిని 77సార్లు క్షమిస్తాడు - మత్త 18,22. అతడు తప్పులన్నేవాడు కాదు, తప్పులు సహించేవాడు.

కాని ఈ వాక్యానికి మరోలా కూడ అర్థం చెప్పవచ్చు. ఇతరుల తప్పిదాలను కప్పిపెట్టేది ప్రేమగల మానవుడు కాదు, దేవుడే అని కూడ అర్థం చెప్పవచ్చు. ఈ భావంకూడ బైబుల్లో అక్కడక్కడ తగులుతుంది. "దయగలవారు దయను పొందుతారు" - మత్త 5,7.

దయాహృదయులను దేవుడు దయతో చూస్తాడనీ, వాళ్ళ తప్పిదాలను క్షమిస్తాడనీ ఈ వాక్యం భావం.

ఏమైతేనేమి ప్రేమ - అది దేవుని ప్రేమ కానీయండి లేక తోడి నరుని ప్రేమ కానీయండి - మన తప్పిదాలను క్షమిస్తుంది. దానిలో క్షమాగుణం వుంది. అలాంటి ఉత్తమ పుణ్యాన్ని మనం తప్పకుండా సాధించాలి.

# ముగింపు

నూత్నవేదం ప్రేమను గూర్చి చెప్పే సంగతులను ఇక్కడ సంగ్రహంగా వివరించాం. ఈ సోదరప్రేమ దేవుడిచ్చే వరం. పరిశుద్ధాత్మే ప్రేమ.

క్రైస్తవుడికి ముఖ్యమైంది ప్రేమేనని చెప్పాం. కనుక క్రైస్తవుడంటే యెవడు? తోడినరులను ప్రేమించేవాడు. అది అతని నిర్వచనం.

ఇక ప్రేమను గూర్చి పైన పౌలు చెప్పిన లక్షణాలన్నీ క్రీస్తులో గోచరిస్తాయి. ఆయన ప్రేమావతారం. మనం ఈ ప్రేమగుణాలను ఎంతగా అలవర్చుకొంటామో అంతగా ఆ ప్రభువుని పోలివుంటాం. సోదరప్రేమను సాధించడం కంటె ఈ మంటిమీద మనం చేయగలిగిన మహత్తరకార్యం మరొకటి లేదు.

పై ప్రేమ లక్షణాలన్నీ క్రీస్తుకి వర్తిసాయని చెప్పాం. ఉదాహరణకు క్రీస్తు తన స్వార్థాన్ని తాను చూచుకోలేదు, కోపపడలేదు, ఇతరులు తనకు చేసిన అపకారాలను మనసులో పెట్టుకోలేదు. కాని ఈ లక్షణాలు ఇదే విధంగా మనకు కూడ వర్తిస్తాయని చెప్పగలమా? పై వాక్యంలో క్రీస్తు పేరును తొలగించి దాని స్థానంలో మన పేరును చేర్చితే వాక్యం భావం కుదురుతుందా?

ఈ యొక్క ఉదాహరణనుబట్టే సోదరప్రేమ ఎంత కష్టమైనదో అర్థం చేసికోవచ్చు. అసలు క్రైస్తవమతంలో సోదరప్రేమ అంతకష్టమైన కార్యం మరొకటి లేదు. దీన్ని పాటించేవాళ్ళకు గాని దీనిలోని లోతుపాతులు తెలియవు. మనంతట మనం ఈ ప్రేమను సాధించలేం. అందుకే దేవుడు కరుణతో పరిశుద్ధాత్మ ద్వారా ఈ ప్రేమను మన హృదయాల్లో కుమ్మరిస్తూంటాడు. కనుక మన తరపున మనం ఈ భాగ్యం కొరకు ఆయాత్మనే అడుగుకోవాలి.

# 6. క్రైస్తవ నాయకత్వం

బైబులు భాష్యం - 17

## విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | నాయకుని లక్షణాలు | 116 |
| 2. | నాయకుని నియామకం | 122 |
| 3. | నాయకుని తర్ఫీదు | 124 |
| 4. | నాయకుని పరీక్షలు | 127 |
| 5. | నాయకుని సమస్యలు | 130 |
| 6. | నాయకుని శోధనలు | 132 |
| 7. | నాయకుని సిలువలు | 135 |


## 1. నాయకుని లక్షణాలు

అన్ని రంగాల్లోలాగే క్రైస్తవ రంగంలో కూడ నాయకులు అత్యవసరం. క్రైస్తవ నాయకుల లక్షణాలు ఏమిటివి? వాళ్ళకు ఏలా తర్ఫీదు ఈయాలి? వాళ్ళు ఏలా పనిచేయాలి? - ఈ ప్రశ్నలకు బైబుల్లో నుండి కొన్ని జవాబులు లభిస్తాయి. ఆ జవాబులను ఈ క్రింద సంగ్రహంగా పరిశీలిద్దాం.

మొదట క్రైస్తవ నాయకుల లక్షణాలను విచారిద్దాం. ఈ లక్షణాలు ప్రధానంగా మూడు. ఆధ్యాత్మిక పరిణతి, విశ్వాసం, ఆత్మపూర్ణత.

### 1. ఆధ్యాత్మిక పరిణతి

తీతు, తిమెతి మొదలైనవాళ్ళు క్రైస్తవ ప్రజలకు కాపరులు. పౌలు వీళ్ళకు వ్రాసిన జాబుల్లో నాయకలక్షణాలను కొన్నిటిని ఉదాహరించాడు. ఉదాహరణకు ఈ క్రింది పట్టులను చూడండి. 1. తిమొ 3, 1-13. తీతు 1, 5-9. 1 పేత్రు 5, 1-9. ఈ జాబితాలను బట్టి చూస్తే క్రైస్తవ నాయకుల్లో కొన్ని ముఖ్య గుణాలు వుండాలి. ఈ గుణాలు ముఖ్యంగా మూడు - స్థిరచిత్తత, నిజాయితీ, వివేకం. ఈ మూడు గుణాలు క్రైస్తవ నాయకునికి ఓ విధమైన ఆధ్యాత్మిక పరిణతిని కలిగిస్తాయి. ఇక ఈ మూడింటిని గూర్చి క్రమంగా విచారిద్దాం.

#### 1. స్థిరచిత్తత

స్థిరచిత్తత అంటే యేమిటి? నాయకుడు క్రీస్తునందు కుదురుకొని వుండడం. క్రీస్తుకు చెంది వుండడం, క్రీస్తును పొందివుండడం. “మీరు మీ సొంతంగాదు, క్రీస్తుచే

పెద్ద విలువపెట్టి కొనబడినవాళ్లు" అన్న పౌలు వాక్యాన్ని అర్థం చేసికోవడం - 1 కొ 6,19. ఈలా క్రీస్తునందు నెలకొని వుండడమనేది నాయకునికి అత్యవసరం.

స్థిరచిత్తుడైన నాయకుడు భయానికి తావీయడు. "మీ హృదయాలను భయపడనీయకండి" అన్న ప్రభువు అభయవాక్యాలను నమ్ముతూంటాడు - యోహా 14,1. యెషయా 9,6 "ప్రభువు తన ప్రభుతను తన భుజాలమీదనే భరిస్తాడు" అని చెప్తుంది. అనగా మంచి చెడ్డలూ కష్టసుఖాలూ అన్నీ అతని చేతిలోనేవుంటాయి. కనుక క్రైస్తవనాయకుడు విషమ పరిస్థితులకు చలించడు. ప్రభువునందు నమ్మిక పెట్టుకొని జీవిస్తూంటాడు. ప్రభువు తన తరపున తాను అతన్నిగూర్చి జాగ్రత్తపడుతూంటాడుగూడ -1 పేత్రు 5,7.

నాయకునికి అన్ని సమస్యలూ అర్థంకావు. కొన్ని సమస్యలకు పరిష్కార మార్గంకూడ తెలియదు. ఐనా అతడు ప్రభువుని అనుమానించడు. దేవుణ్ణి నమ్ముకొని చిక్కుల్లో బడ్డానే అని సంశయింపడు. "నన్ను అనుమానింపని నరుడు ధన్యుడు" అన్న ప్రభువాక్యం అతనికి చీకటిలో గూడ వెలుగును చూపుతూంటుంది - మత్త 11,6. అచ 20,23 లో పౌలు, యెరూషలేములో చెరసాలా శ్రమలూ తన కొరకు కాచుకొని వున్నాయని చెప్తాడు. ఐనా అతడు వాటికి జంకనూ లేదు, వెనుదీయనూలేదు. అతడే 1 తెస్స 3, 3లో శ్రమలకు జంకవద్దనీ క్రీస్తు శిష్యులకు శ్రమలు తప్పవనీ హెచ్చరించాడు. కీర్తన 16,8 "నేను నిత్యం ప్రభుని నా యెదుట నిలుపుకుంటూంటాను. అతడు నా కుడి ప్రక్కన ఉన్నాడు గనుక నేను కలతజెందను" అంటుంది. 1 పేత్రు 5,10 కూడ "మీరు కొద్దిగా బాధలనుభవించినాక ప్రభువే మిమ్ములను సంపూర్ణులనూ శక్తిమంతులనూ స్థిరచిత్తులనూ చేస్తాడని చెప్తుంది. కనుక చిక్కుల్లో కలత జెందకుండా వుండడం గూడ స్థిరచిత్తుడైన నాయకుని లక్షణం.

పైన మనం చూచిన భావాలను బట్టి స్థిరచిత్తుడైన నాయకుడంటే క్రీస్తునందు నెలకొని వుండేవాడు, భయానికి లొంగనివాడు, ప్రభువును అనుమానించనివాడు, కలత జెందనివాడూను. ఈలాంటి మనస్తత్వం క్రైస్తవనాయకునికి అవసరం. ఇదిలేందే ఆధ్యాత్మిక పరిణతి అంటూలేదు.

## 2. నిజాయితీ

క్రైస్తవనాయకుని కుండవలసిన రెండవ గుణం నిజాయితీ. నిజాయితి అంటే మన తలపులకూ మాటలకూ చేతలకూ ఐక్యత కుదరడం. నిజాయితీపరుడు తాను ఆడిన మాట నిలబెట్టుకుంటాడు. తన బాధ్యతలను తాను సక్రమంగా నిర్వర్తిస్తాడు. ఇచ్చే డబ్బులకూ

పుచ్చుకొనే డబ్బులకూ ఖచ్చితంగా లెక్క ఒప్పజెపుతాడు. వేషాలూ నటనామానుకొంటాడు. మనం కొలిచే దేవుడు సత్యాన్ని ప్రేమించే దేవుడనీ మన అంతరంగంలోని సత్యాన్నిజూచి మెచ్చుకొనే దేవుడనీ, గుర్తిస్తాడు - కీర్త 51,6.

యిస్రాయేలు ప్రజల నాయకుడైన మోషే, ఐగుప్తు మంత్రియైన యోసేపూ, దావీదురాజూ ఈ లాంటి నిజాయితీపరులు. ఎవరిని నాయకులనుగా నియమించాలి అనే సందేహం కలిగినప్పుడు ఎవరిలో ఈ నిజాయితీ కన్పిస్తుందో వాళ్ళనే ఎన్నుకోవాలి. ఋజువర్తనుడైన నాయకుడు స్వల్ప విషయాల్లోను గొప్ప విషయాల్లోను నిజాయితీ చూపుతూనే వుంటాడు. కనుక జీవితంలోని సామాన్య సన్నివేశాలను పరిశీలించిగూడ ఎవడు నిజాయితీపరుడో ఎవడు కాడో నిర్ణయించవచ్చు.

## 3. వివేకం

ఆధ్యాత్మిక పరిణతిగల నాయకుని కుండవలసిన మూడవగుణం వివేకం. పౌలు ఫిలిప్పీయుల కొరకు ప్రార్థిస్తూ వారి జ్ఞానము వివేకమూ పెంపుజెందాలని కోరుకొన్నాడు - ఫిలి 1,9. అలాగే కొలొస్సీయులు కూడ ఆధ్యాత్మికమైన జ్ఞానమూ వివేకమూ ఆర్జించాలని ప్రార్థించాడు - కొలో 1,9. అతడు వివేకమనే గుణాన్ని చాల గొప్పగా ఎంచాడు. ఓ మారు మోషే "నీ మార్గాన్ని నాకు చూపించ" మని ప్రభువుని ప్రార్థించాడు - నిర్గ 33,13. అందుకు ప్రభువు తన మార్గాలను మోషేకు బోధించాడు- కీర్త 103,7. ఈ లానాయకులు ప్రభుమార్గాలను తెలిసికొనివుండాలి.

మనంతట మనకు వివేకం చాలదు. కనుక దానికోసం ప్రభువును ప్రార్థించాలి. వివేకం చాలనివాళ్ళు ప్రభువును అడుగుకొంటే అతడా వరాన్ని ప్రసాదిస్తాడు అని చెప్తుంది యాకోబు జాబు 1,5. అలాగే కీర్తన 25,9 ప్రభువు తన మార్గాలనూ తన న్యాయాలనూ వినయవంతులకు బోధిస్తాడని చెప్తుంది. ఎవరు పరిశుద్ధాత్మకు వశవర్తు లౌతుంటారో వాళ్ళను ఆయాత్మే నడిపిస్తూంటుంది. - యోహా 16,13. ప్రభువు ఓ మారు గిబ్యోను వద్ద సోలోమోనుకు ప్రత్యక్షమై నీ యిష్టం వచ్చిన వరం కోరుకొమ్మన్నాడు. ఆ రాజు "మంచి చెడ్డల భేదం తెలిసికొని తన ప్రజలను వివేకంతో పరిపాలించే భాగ్యం" అడుగుకొన్నాడు - 2 రాజు 3,9. వివేకం కొరకు ప్రభువును ప్రార్థించడమంటే యిదే. ప్రభువు గ్రంథాన్ని చదువుకొనే వాళ్ళకీ చదువుకొని మననం చేసుకొనేవాళ్ళకీ ఈ వివేకంమీద కోరిక పుడుతుంది. క్రైస్తవ నాయకుడు నిత్యమూ ఏది మంచో ఏది చెడో పరీక్షించి తెలిసికొంటూండాలి. కనుక అతనికి ఈ వివేకం అత్యవసరం.

క్రీస్తు ఎన్నుకొనిన నాయకుల్లో యూదాకూడ ఒకడు. ఐనా అతనిలో పైన మనం పేర్కొనిన లక్షణాలు లేవు. స్థిరచిత్తతలేదు. అతని మనసు మొదట క్రీస్తుమీద లగ్నమైయుండేదిగాని అటుపిమ్మట వైదొలగింది. నిజాయితీ లేదు. కాసులకు

దాసుడయ్యాడు. బయటకు మాత్రం సత్యవర్తనుడులా కన్పించాడు. వివేకంలేదు. గురువు కెంత విలువ నీయాలో, ముప్పైకాసుల కెంత విలవు నీయాలో, ఏది మంచో ఏదిచెడ్డో నిర్ణయించలేక పోయాడు. క్రైస్తవ నాయకులమైన మనంకూడ ఈ యూదాలాగ తయారౌతుంటాం. అతనిలాగ మనం కూడ ప్రభువును అప్పగింపబోతున్నామేమోనని నిత్యం ఆత్మపరీక్ష చేసికొంటూండాలి - మత్త 26,25.

## 2. విశ్వాసం

క్రైస్తవ నాయకుని కుండే రెండవలక్షణం విశ్వాసం. దేవుని యందు విశ్వాసం లేందే గొప్ప కార్యాలేమీ సాధించలేం. అసలు ఏపనిని సాధించాలన్నా సందేహాలూ అనుమానాలూ వేలాదిగా రేకెత్తుతూంటాయి. వీటిని జయించాలంటే విశ్వాసం అవసరం. ఇక్కడ విశ్వాసమంటే మూడు విషయాలు - దూరదృష్టి, ధైర్యం, నమ్మిక. ఈ మూడు విషయాలను క్రమంగా విచారిద్దాం.

### 1. దూరదృష్టి

క్రైస్తవ నాయకుడు భౌతిక నేత్రాలతో లౌకిక విషయాలను మాత్రమేగాక, జ్ఞాన దృష్టితో ఆధ్యాత్మిక విషయాలనుగూడ గుర్తిస్తూండాలి. అతడు తోడివారికంటె ముందుగా భగవంతుని మార్గాలను తెలిసికొంటూండాలి. భగవంతుడు ఆయాకాలాల్లో ఆయా ప్రజలకు అనుగ్రహింపదలచుకొన్న భాగ్యాలనుగూడ పసికడుతుండాలి. భగవంతుని కొరకు తోడి ప్రజలకొరకు, క్రొత్తపనులను చేపడుతుండాలి. ప్రాత పనులలో నూత్న చైతన్యాన్ని ప్రవేశపెడుతుండాలి. ఇతరులను కూడగట్టుకొని వస్తూండాలి. ప్రోత్సహిస్తూండాలి. ఎక్కడ క్రొత్తదనమనేది లేదో అక్కడ క్రైస్తవ సంస్థలు పాడుబడిపోయిన కొంపల్లాగ బావురు మంటూంటాయి. దేవుని కొరకు క్రొత్త జాతిని రూపొందించిన అబ్రాహాము దూరదృష్టి కలవాడు. దేవుని ప్రజలను బానిసమునుండి విడిపించి స్వేచ్ఛాపరులను జేసిన మోషే దూర దృష్టిగలవాడు. అన్యజాతులకు క్రీస్తును బోధించి ఆ బోధలను లేఖల రూపంలో వెలువరించిన పౌలు దూరదృష్టిగలవాడు. ఈ క్రియాపరులంతా క్రైస్తవ నాయకులకు మార్గదర్శకులు.

### 2. ధైర్యం

క్రైస్తవ నాయకునికి ధైర్యం కూడ అత్యవసరం. పౌలు దేవుని బలాన్ని పొంది తన పనిని కొనసాగించుతూన్నట్లు వ్రాసికొన్నాడు. ఓ ఆపదలో అందరూ పౌలును విడనాడారు. ఐనా ప్రభువు మాత్రం అతనిని సమీపించి తన బలాన్ని ప్రసాదించాడు - అచ 23,11. ప్రభువు తన ముఖాన్ని యెరూషలేము వైపు త్రిప్పి దీక్షతో, ధైర్యంతో ఆ

పట్టణానికి వెళ్లాడు - లూకా 9,51. ఇవన్నీ క్రైస్తవ నాయకుడు ప్రదర్శింప వలసిన ధైర్య గుణానికి నిదర్శనలు.

నాయకునికి ఈ ధైర్యంతో పాటు పట్టుదల కూడ అవసరం. మన మనుకొన్నంత సులభంగా పనులు జరుగవు. నరులు కూడ మనమనుకొన్నంత సులభంగా సత్కార్యాలు చేయరు. ఈలాంటప్పుడు మనం పట్టుదలతో కృషి చేస్తూండాలి. క్రీస్తు ఒకటి చెప్తూంటే శిష్యులు మరొకటి అర్థంచేసికొనేవాళ్లు. ప్రభువు ఎంత బోధించినా వాళ్ళ దృష్టి భౌతిక వస్తువులనుండి ఆధ్యాత్మిక వస్తువులవైపు మరిలేదే కాదు. ఐనా అతడు నిరుత్సాహ పడకుండా పట్టుదలతో బోధిస్తూ వచ్చాడు. కడకు వాళ్ళను మార్చి ఆధ్యాత్మిక నరులనుగా తయారు చేసాడు.

మోషే గతించాక యోషువా ప్రజలకు నాయకుడయ్యాడు. ఆతడు నాయకత్వం వహించేప్పుడు ప్రభువు "శక్తితోను ధైర్యంతోను పనిచేయి, అన్నీ చక్కబడతాయి" అన్నాడు - యోషు 1,7. యోషువా శక్తితోను ధైర్యంతోను పని చేసాడు. ప్రజలను వాగ్దత్త భూమికి చేర్చాడు. నాయకత్వం వహించేవాళ్ళు చూపవలసిన ధైర్యం ఆయాపరిస్థితులనుబట్టి భిన్నభిన్నంగా వుంటుంది. నాయకులకు ఈ ధైర్యాన్ని ప్రసాదించేది పరిశుద్ధాత్మ - మార్కు 13,11.

### 3. నమ్మిక

నాయకుని కుండవలసిన మరోగుణం, దేవునియందు తీరని నమ్మకం. "మీ హృదయాలను కలత జెందనీయకండి, నేను లోకాన్ని జయించాను" అన్నాడు ప్రభువు - యోహా 16,33. మనం ఈ ప్రభువును నమ్ముతూండాలి. అతని విజయం మన విజయం. ప్రభువుకి అపజయమంటూ లేదు. అతనిని నమ్మిన శిష్యులకు గూడ పరాజయమంటూ లేదు. శిష్యులు అతనియందు జీవించేవాళ్లు, అతని బలాన్ని పొందేవాళ్లు. అందుకే "నేను జీవిస్తున్నాను గనుక మీరూ జీవిస్తారు" అన్నాడు ప్రభువు - యోహా 14,19.

## 3. ఆత్మపూర్ణత

క్రైస్తవ నాయకుని కుండవలసిన మూడవ గుణం ఆత్మపూర్ణత. అంటే పరిశుద్ధాత్మతో నిండివుండడం. ఇక్కడ ఆత్మపూర్ణులైన వాళ్ళల్లో కనిపించే లక్షణాలను రెండింటిని పరిశీలిద్దాం. అవి వినయమూ, ప్రేమా.

### 1. వినయం

మామూలుగా మనం అందరికంటె గొప్పవాళ్ళంగా గణింపబడాలని కోరుకొంటూంటాం.. క్రీస్తు శిష్యులు గూడ ఓమారు ఈ దుర్గుణాన్ని ప్రదర్శించారు. అప్పుడు ప్రభువు వాళ్ళను నిశితంగా మందలించాడు - మార్కు 9,33-37. క్రైస్తవ

నాయకుడు ప్రజల గుర్తింపుకోసం ప్రాకులాడ కూడదు. నాయకుల కందరికంటె గొప్ప నాయకుడు క్రీస్తు. ఐనా అతడు ఎవరి గుర్తింపూ కోరుకోలేదు. నజరేతు లాంటి కుగ్రామం తనకు తగదనీ భావించలేదు. అతనిలాగ నడికట్టు కట్టుకొని వినయంతో తోడిప్రజల పాదాలు కడగడానికి వంగేవాడే ఉత్తమ నాయకుడు.

ఈ క్రీస్తు వినయవంతుడు. అతడు సింహాసనంపై కూర్చుండి వుండే గొర్రెపిల్ల. సింహాసనం గౌరవప్రదమైన తావు. గొర్రెపిల్ల వినయానికి ప్రసిద్ధి. గౌరవప్రదమైన తావులో వున్నా క్రీస్తు వినయంగా వుండేవాడు. ఈ వినయమే క్రైస్తవ నాయకులకు గూడ వుండాలి. వినయవంతులైన నాయకులు ఇతరుల విమర్శలను సహిస్తారు. ఇతరులు చేసే సూచనలను ఆదరిస్తారు. తాము అధికారాన్ని నెరపుతూన్నా నెమ్మదిగా ప్రవర్తిస్తారు. తమ అనుచరుల మీద అధికారం చెలాయించరుగదా, వాళ్ళనూ ఓ పాటివాళ్ళనుగా తయారు చేస్తారు. మోషే అనుచరుడు యోషువా. ఐనా మోషే యోషువా వ్యక్తిత్వాన్ని నాశం చేయలేదు. అతన్నీ ఓ నాయకునిగా తీర్చిదిద్దాడు. బైబులు ఈ మోషే మహా వినయవంతుడని చెప్తుంది.

వినయవంతులైన వాళ్ళు నిరుత్సాహానికీ విచారానికీ అట్టే తావీయరు. క్రైస్తవ నాయకులు తరచుగా నిరుత్సాహ పడుతూండడం గమనిస్తూంటాం. ఈ ప్రజలకు ఎంత మేలుచేస్తే మాత్రం ఏమి లాభం అనే భావం నాయకుల కందరికీ కలుగుతూనే వుంటుంది. కాని ఈ నిరుత్సాహ భావాన్ని జయించాలి. మన మెంత గొప్ప నాయకులమైనా అందరూ మన మాట వినరు, అన్నీ సాధించలేం. మోషే అంతటివాడిమీద కోరా తిరుగబడ్డాడు - సంఖ్యా 16,1. మోషే అక్కా అన్నా అయిన మిర్యాము అహరోను అతనిమీద సణుగుకొన్నారు - సంఖ్యా 12,1. మనకు ఎప్పుడూ విజయమే లభిస్తుంది అనుకొంటే మానవ స్వభావం అర్థంచేసికోనివాళ్ళమే ఔతాం. అసలు మొదట నిరాకృతి చెందిన నరునికేగాని తరువాత అంగీకృతి అనేది లభింపదు. కనుక వినయవంతుడు నిరుత్సాహానికి లొంగకూడదు.

నిరుత్సాహానికంటె గూడ పెద్ద దుర్గుణం విచారం. కొందరు నాయకులు తాము సాధింప గోరిన కార్యాన్ని సాధించలేనపుడు విచార హృదయ లౌతూంటారు. ఇక వాళ్ళ ముఖంలో ఉత్సాహంగాని తేజస్సు గాని కనిపించదు. ఇది వాళ్ళ స్వార్థపరత్వానికే నిదర్శనమనాలి. ఏదో కార్యం నెరవేరక పోవడంగాక, తాము కోరుకొన్నట్లుగా ఆ కార్యం నెరవేరక పోవడం ఈ విచారానికి కారణం. నాయకులు ఈ విచార మనస్కతను జయించాలి.

### 3. ప్రేమభావం

ఆత్మపూర్ణుడైన నరుడు తోడి నరులను ప్రేమభావంతో ఆదరిస్తూంటాడు. కాపరి గొర్రెల మందను గూర్చివలె అతడూ ప్రజలను గూర్చి జాగ్రత్త పడుతూంటాడు. గొర్రెల మందల్లాగ దిక్కూమొక్కూ లేక చెల్లాచెదరై యున్న ప్రజా సమూహాలను జూచి క్రీస్తు జాలి

జెందాడు - మార్కు 6,34. క్రైస్తవ నాయకునికి ఈ జాలి, ఈ ప్రజాదరణం అత్యవసరం. అసలు అతని దృష్టిలో ప్రజలూ వాళ్ళ అక్కరలూ మొదట లెక్కింపబడాలి. అనగా అతనికి కరుణా హృదయమూ, ఇతరులకు సేవచేసే హృదయమూ ఉండాలి.

పౌలు స్నేహితుడు బర్నబా. ఇతడు ఇతరులలోని మంచితనాన్ని వెలికిదీసే శక్తిగలవాడు. దమస్కు త్రోవలో ప్రభు దర్శనం పొంది క్రీస్తుశిష్యుడైనంక కూడ పౌలు ఏం చేయడానికీ తోచక స్వీయపట్టణమైన తార్సులో తిరుగాడుతూన్నాడు. పేత్రు మొదలైన శిష్యులు అతన్ని అనుమానించడంవల్ల అట్టే ఆదరం జూపలేదు. కొంత కాలంవరకు పౌలు అనామకుడుగా వుండిపోయాడు. ఆ పరిస్థితుల్లో బర్నబా తార్సు పట్టణానికి వెళ్ళి పౌలును కలసికొని అతన్ని ప్రోత్సహించాడు. అతన్ని అంటియోకయకు కొనివచ్చి అక్కడి శిష్యులతో పరిచయం గలిగించాడు. తర్వాత పౌలు క్రమేణ ప్రసిద్ధిలోనికి వచ్చాడు - అచ 11, 25-26.

ఆలాగే మార్కుకూడ. ఈ మార్కు పౌలు శిష్యుడుగా పనిజేస్తూ ఓ మారు పప్పులో కాలువేసాడు. పౌలు అతన్ని తన శిష్యవర్గం నుండి బహిష్కరించాడు. కాని బర్నబా మాత్రం మార్కుని దీసికొని అతన్ని ప్రోత్సహించాడు. పిమ్మట మార్కు పేత్రు శిష్యుడయ్యాడు, సువిశేషం వ్రాసాడు - అచ 15,39.

ఈలా బర్నబా మంచి కాపరి లాగ వ్యవహరించాడు. మంచి కాపరి తోడి ప్రజల చేత సేవలు చేయించుకోడు. మంచి కాపరి తోడి ప్రజలకు సేవలు చేసిపెడతాడు. వాళ్ళకొరకు ప్రాణాలు సమర్పిస్తాడు. ప్రేమ హృదయమూ, ప్రజాదరణమూ కలవాళ్ళుగాని క్రీస్తు ప్రజలనే మందలకు మంచి కాపరులుగా వ్యవహరించలేరు. ఈ మంచి కాపరులే మంచి నాయకులు, ప్రేమగల నాయకులు. కనుక ఈ లాంటి మనస్తత్వం తమలో వుందో లేదో నాయకులు ఆత్మపరీక్ష చేసి చూచుకొంటూండాలి.

## 2. నాయకుని నియామకం

ప్రాత నాయకులు గతించిపోయేకొలది క్రొత్త నాయకులను నియమిస్తూండాలి. కాని ఈ క్రొత్త నాయకులను ఎన్ను కొనేదెవరు? మనమా, దేవుడా? సమూవేలు సౌలు రాజుతో దావీదు నియామకాన్ని గూర్చి మాటలాడుతూ "ప్రభువు తన కొరకు ఓ నాయకుణ్ణి ఎన్నుకొన్నాడు" అని చెప్తాడు - 1 స 13,14. ప్రభువు సమూవేలుతో ప్రసంగిస్తూ "నేను నీకు చూపిన వానిని నీవు నా నాయకునిగా అభిషేకించాలి" అని చెప్పాడు - 1స 16,3. ఈ వాక్యాలను బట్టి మననాయకులను ఎన్నుకొనేది మనంగాదు, ప్రభువే. అందుకే కీర్తనకారుడు "ప్రభువు కొంతమందిని క్రిందికి దింపివేస్తుంటాడు, మరి కొంతమందిని పైకి లేవనెత్తుతుంటాడు" అంటాడు - 75,7. పౌలు ఎఫెసు పెద్దలతో ముచ్చటిస్తూ పరిశుద్ధాత్ముడే వాళ్ళను ఆ వుద్యోగానికి నియమించాడని పల్కాడు-అచ 20,28.

ఈలా దేవుడే క్రైస్తవ నాయకులను నియమించినపుడు క్రైస్తవ సమాజాలు వృద్ధి చెందుతాయి. అలా కాకుండ ప్రజలే తమకిష్టమైన నాయకులను నియమించుకొనినపుడు సమాజాలు క్షీణించిపోతాయి. మనం తరచుగా బంధుపక్షపాతంతోనో, కులపక్షపాతంతోనో, లేక పలానా వ్యక్తిలో ప్రాకృతికమైన శక్తిసామర్థ్యాలు అధికంగా వున్నాయన్నభావంతోనో ఆయా వ్యక్తులను నాయకులనుగా నియమిస్తూంటాం. కాని ఇవన్నీ వెలుపలి రూపాన్ని జూచి నాయకులను ఎన్నుకోవడం. ఈ పద్ధతి ప్రభువుకి సమ్మతం గాదు. దావీదు అన్న యెలియాబు పొడవైనవాడు, చక్కని ఆకృతి కలవాడు. ఈ యెలియాబు రూపాన్ని జూచి మురిసిపోయి సమూవేలు ప్రవక్త సౌలు స్థానే అతన్ని రాజుగా అభిషేకింపబోయాడు. కాని ప్రభువు సమూవేలుతో "ఇతని ఆకృతినిజూచి బ్రమసిపోవద్దు. నేను ఇతనిని నిరాకరించాను. నరుడు వెలుపలి రూపాన్ని చూస్తూంటాడు. కాని భగవంతుడు హృదయాన్ని పరిశీలిస్తూంటాడు" అని మందలించాడు - 1స 16,7. ఈ వాక్యం పక్షపాతంతో గూడిన మన నియామకాలన్నిటినీ ఖండిస్తుంది గదా!

క్రీస్తు ఎన్నుకొనిన శిష్యులను పరిశీలిద్దాం. వాళ్లు ఆనాటి సమాజంలో పేరుప్రతిష్ఠలు కలవాళ్లు కాదు. ఒట్టి అనామకులు, అసమర్థులు, నిరుపేదలు. ఐనా ప్రభువు అలాంటి వాళ్ళనే ఎన్ను కొన్నాడు. సువిశేషాలుకూడ ఈ శిష్యుల్లో ఆర్గురినిగూర్చి మాత్రమే కొన్నివివరాలైనా చెప్తాయి. పేత్రు, అంద్రెయా, యొహాను, యాకోబు, మత్తయి, తోమా - వీళ్లను గూర్చి మాత్రమే మనకు కొంత బోగట్టా తెలుసు. మిగతా ఆర్గురిని గూర్చి సువిశేషాలు అట్టే మాటలాడవు. మరి వీళ్లలో ఏమి గొప్పతనం జూచి ప్రభువు వీళ్లను ఎన్నుకొన్నట్లు? దేవుడు హృదయాలను పరీక్షించేవాడన్నాం. కనుక వీళ్లు నిర్మల హృదయులై యుండాలి. వీళ్లు విశ్వాసంతో ప్రభువును అనుసరించారు, ప్రేమభావంతో అతన్ని సేవించారు. కనుకనే తండ్రి రాజ్యంలో పన్నెండు సింహాసనాలను ఆక్రమించుకోవడానికి అర్హులయ్యారు. ఈ పన్నెండు మంది ఆత్మపూర్ణులు.

క్రైస్తవ నాయకునికి ఉండవలసిన ప్రధానార్హత ఆత్మచేత నిండివుండడం. ప్రాకృతికమైన జ్ఞానమూ శక్తిసామర్థ్యాలూ అవసరమేగాని, ఆధ్యాత్మిక జ్ఞానమూ పరిశుద్ధాత్మలేందే అవెందుకూ కొరగావు. పరిశుద్ధాత్మ నిండివుండే వ్యక్తుల్లో "నేను" "నాది' ' అనేతాపత్రయం అట్టే కనిపించదు. వాళ్లు సేవాపరులూ వినయవంతులూ ఐయుంటారు. మేము ఇంతటివాళ్లం అంతటివాళ్లం అనుకొని విర్రవీగరు. భగవంతుని మీద ఆధారపడి జీవిస్తూంటారు. ఈలాంటివాళ్లనే నాయకులనుగా ఎన్నుకోవాలి.

మనం, క్రొత్త నాయకులను నియమించేపుడు రెండు విషయాలు పాటించాలి. మొదటిది, యోగ్యుడైన నాయకుణ్ణి ప్రసాదించమని ప్రభువుని ప్రార్థించాలి. మోషే నాయకత్వం చాలించవలసిన రోజులు వచ్చాయి. ప్రజలకు ఎవరిని నాయకునిగా

నియమించాలో అతనికి తెలియలేదు. కనుక అతడు ప్రభువు నుద్దేశించి "సకల ఆత్మలకూ ప్రాణులకూ దేవుడవైన ప్రభూ! ఈ ప్రజల కొక నాయకుని నియమించు" అని ప్రార్థించాడు - సంఖ్యా 27,16. అలాగే క్రీస్తు కూడ శిష్యులను ఎన్నుకోకముందు ఓ రాత్రంతా తండ్రిని ప్రార్థించాడు - లూకా 6,12. భ్రష్టుడై పోయిన యూదా స్థానాన్ని పొందడం కోసమై మత్తీయా, బర్సబా అనే యిద్దరు వ్యక్తులు పోటీకి నిలువగా, వారిలో యోగ్యుడైనవాణ్ణి ఎన్నుకొమ్మని అపోస్తలులు ప్రభువును ప్రార్థించారు - అచ 1,23-26.

రెండవది, ఈ పదవికి ఎవరు అర్హులా అని జాగ్రత్తగా విచారించి చూడాలి. పదవిని పొందడానికి అర్హులనబడినవాళ్ళ ఆధ్యాత్మిక గుణగణాలను జాగ్రత్తగా పరిశీలించి చూడాలి. ఇది కూడ ఒకరిద్దరు కాదు - ఒక కమిటీ లేక భాధ్యతగల కొందరు సభ్యులు పరిశీలన చేయాలి. పౌలు తన శిష్యుడైన తిమోతికి వ్రాస్తూ "తొందరపడి ఎవరిమీద బడితే వాళ్ళమీద చేతులు చాచవద్దు" అని హెచ్చరించాడు - 1తిమొ5,22.

ఈలా ప్రార్థన గుణపరిశీలన అనేవాని ద్వారా నాయకులను ఎన్నుకోవాలి. ఆలా కాకుండ పక్షపాతం కొద్ది మన యిష్టం వచ్చిన నాయకులను ఎన్నుకొంటే లాభంలేదు. మన కిష్టమైనవాళ్ళు దేవునికిష్టమైన నాయకులు కావచ్చు, కాకపోవచ్చుగూడ. ప్రభు సమాజం నానా అవయవాలతో గూడిన దేహం లాంటిది. ఏ అవయవానికి ఏ బాధ్యత అప్పజెప్పాలో ఆ ప్రభువుకే తెలుసు. పైగా ఆ ప్రభువు ఆత్మ కూడ భిన్నవ్యక్తులకు భిన్నభిన్న వరాలు ఇస్తుంది. కనుక ఆ ప్రభువునకు ఇష్టమైన నాయకులను ఎన్నుకొన్నపుడు మన అక్కరలు తీరతాయి. అతని కిష్టంగాని నాయకులను ఎన్నుకొన్నపుడు మన అక్కరలు తీరవుగదా, క్రొత్త సమస్యలు పుట్టుక వస్తాయి. అందుచేత ఉత్తముడూ భగవంతునికి ప్రీతిపాత్రుడూ ఐన నాయకుని ఎన్నుకొన్న సమాజాలు దైవాశీర్వాదాన్ని పొందుతాయి.

# 3. నాయకుని తర్ఫీదు

పుట్టుకతోనే నాయకులుగా పుట్టేవాళ్లు లేక పోలేదుగాని, ఆలాంటి వాళ్లు చాలా అరుదు. అధిక సంఖ్యాకులు తర్ఫీదు వల్ల నాయకులౌతూంటారు. క్రీస్తుకూడ తన శిష్యులకు తర్ఫీదు నిచ్చి వాళ్ళను నాయకులనుగా తయారుచేసాడు. ఈ యధ్యాయంలో మూడంశాలు విచారిద్దాం. శిష్యులకు తర్ఫీదు నీయడంలో క్రీస్తు అవలంబించిన పద్ధతి, క్రీస్తుబోధ, క్రీస్తు మాతృక.

## 1. క్రీస్తు పద్ధతి

క్రీస్తు పన్నెండు మందిని శిష్యులనుగా నియమించాడు. వాళ్లు అతనితోనే వుండేవాళ్లు. జనులకు బోధించడానికీ, రోగుల వ్యాధులు నయంజేయడానికీ, దయ్యాలను

వెళ్ళగొట్టడానికీ ప్రభువు వాళ్లను పంపేవాడు - మార్కు 3, 14. మూడేండ్ల తర్ఫీదు కాలామూ క్రీస్తు శిష్యులను తన చెంతనే వుంచుకొన్నాడు. అతడు ఆయా పనులను చేసి చూపిస్తూ ఆయా వస్తువులను ఉపమానంగా ప్రదర్శిస్తూ శిష్యులకు బోధించేవాడు. చేపలుపట్టే పడవను జూపుతూ నరులనే చేపలను పట్టాలి అన్నాడు. పంటపోలాలగుండా సాగిపోతూ దైవ ప్రజలనే పంటను సేకరించడానికై ప్రేషితులనే కోతగాళ్లు ముందుకి రావాలన్నాడు. గొర్రెల మందలను చూపిస్తూ దిక్కూమొక్కూ లేక గొర్రెల మందల్లాగ చెల్లాచెదరైయున్న ప్రజల మీద తనకు జాలి కలుగుతుందన్నాడు. స్వయంగా శిష్యుల పాదాలు కడిగిచూపించి సేవాభావం ఏలా వుండాలో వివరించాడు. ఈలా క్రీస్తు స్వయంగా ఆదరించి చూపిస్తూ శిష్యులకు ఆయాసత్యాలు బోధించేవాడు. అతడు మొదట ఆచరించి అటుపిమ్మట బోధించిన అంశాలను తెలియజేయడానికే లూకా సువిశేషం వ్రాసాడు - అచ 1,1. ఇందు చేతనే క్రీస్తు బోధలు శిష్యుల హృదయాల మీద చెరగని ముద్రవేసాయి. నేడు మననాయకులు కొన్ని సిద్ధాంతాలు బోధిస్తారు గాని, వాటిని స్వయంగా ఆచరించరు. అందుకే ప్రజలు మన నాయకులను నమ్మరు, గౌరవించరు గూడ.

క్రీస్తు శిష్యులను దైవరాజ్యాన్నిగూర్చి బోధించడానికో, రోగుల వ్యాధులు నయంచేయడానికో, దయ్యాలను వెళ్ళగొట్టడానికో పంపిస్తూండేవాడు. ఈ కార్యాల ద్వారా వాళ్ళు అనుభవం గడించేవాళ్ళు. ఈ పనులను ముగించుకొని వచ్చాక ప్రభువు వాళ్ళను ఏకాంతస్థలానికి తీసికొనివెళ్ళి తన తండ్రినిగూర్చి తన మరణోత్థానాలనుగూర్చి బోధించేవాడు - మార్కు 6,30-31. ప్రభువు ఆయా పనులు చేసి చూపిస్తూ శిష్యులకు బోధించేవాడన్నాం. వారిచేత గూడ స్వయంగా అభ్యాసం చేయించేవాడన్నాం. అటుపిమ్మట వారికి ఏకాంతంగా బోధించేవాడన్నాం. ఇవన్నీ నాయకులను తయారుచేసే పద్ధతులు. క్రీస్తు శిష్యుడైన పౌలు కూడ ఈ పద్ధతులనే అవలంబించాడు. అతడు తీతు, తిమోతి, సిల్వాను మొదలైన శిష్యులకు తర్ఫీదు నిచ్చాడు. వాళ్లు పౌలు గతించాక అతని పనిని కొనసాగించారు. క్రైస్తవ నాయకులను తయారుచేసే విధానం ఇది.

దురదృష్టవశాత్తు నేడు మనం కట్టడాలను నిర్మించడంలో చూసే శ్రద్ధ ప్రజలకు తర్ఫీదు నిచ్చి క్రైస్తవ నాయకులను తయారు చేయడంలో చూపం. ఓ తావులో క్రొత్తగా తిరుసభను నిర్మించడమంటే అక్కడ క్రైస్తవ నాయకులను తయారు చేయడంగాక, కొన్ని భవనాలను నిర్మించడం అని భావిస్తూంటాం. ఐనా మొదటి కట్టడమూ మొదటి దేవాలయమూ రాతితోనో సిమెంటుతోనో కట్టే భవనం కాదు, నరుని హృదయం. ప్రజల హృదయాలను తయారుచేయందే కట్టడాలను నిర్మించడం ద్వారా దైవ రాజ్యాన్ని నెలకొల్పలేం. కట్టడాలు వద్దని గాదు. వాటి విలువ వాటికే వుంటుంది. కాని ప్రజలకు

తర్ఫీదు నీయడం కడ్డడాలు కట్టడం కంటె ముఖ్యం. మనం కట్టిన హైసూళ్లల్లో కాలేజీల్లో ఆసుపత్రుల్లో ప్రజలు కొన్ని యేండ్లకాలం గడపవచ్చు, కడన క్రీస్తును అర్థం చేసికోకుండానే వెళ్ళిపోవచ్చుగూడ. కట్టడాలు చాలవనడానికి ఈ నిదర్శనం ఒక్కటి చాలదా?

## 2. క్రీస్తు బోధ

ప్రభువు పేత్రుని జూచి "నీ పేరు రాయి. ఈ రాతిమీద నా తిరుసభను కడతా" నన్నాడు - మత్త 16,18. అతడు తన బోధ ద్వారా నిలకడలేని పేత్రుని స్థిరమైన రాయినిగా తయారు చేసాడు. యాకోబు యోహాను, తల్లిచే ప్రబోధితులై వచ్చి పరలోకరాజ్యంలో క్రీస్తు సింహాసనానికి ఇరువైపుల ఆసీనులు కావాలని కోరుకొన్నారు. క్రీస్తు వాళ్లను మందలిస్తూ మీరు నా బాధలూ సిలువమరణమూ అనుభవింపగల్గినచో మీకా తావులు లభిస్తాయని నుడివాడు - మత్త 20,23. మరోమారు ఈ యిద్దరు శిష్యులే సమరయులు క్రీస్తును ఆదరించకపోవడం జూచి వాళ్లమీదికి నిప్పులూ ఉరుములూ దిగిరావాలని కోరుకొన్నారు. క్రీస్తు వాళ్లను మందలించి ప్రేమభావాన్ని నేర్పాడు - లూకా 9,54. ఈ లా క్రీస్తు శిష్యుల దైనందిన జీవితంలోని సన్నివేశాలనూ సంఘటనలనూ, శోధనలనూ ఆధారంగా దీసికొని వాళ్లకు బోధించేవాడు. దీనివల్ల వాళ్లు రోజురోజుకీ ఆధ్యాత్మిక జీవితంలో పెంపుజెందుతూ వచ్చారు. ఈలాగే మనం కూడ క్రీస్తు బోధలను జీర్ణంచేసికొంటేనేగాని క్రైస్తవ నాయకులం గాలేం, క్రైస్తవ నాయకులను తయారు చేయలేం.

## 3. క్రీస్తు మాతృక

అన్నిటికంటె ముఖ్యంగా క్రీస్తు మాతృక శిష్యులకు నచ్చింది. అతడు తాను ఆచరించనిదేదీ శిష్యులకు బోధించలేదు. యోహాను తన తొలి జాబును ప్రారంభిస్తూ "మేము చెవులార ఎవరి బోధలు విన్నామో, కన్నులార ఎవరి కార్యాలు చూచామో, చేతులార ఎవరిని తాకి చూచామో ఆ జీవవార్తయైన క్రీస్తును గూర్చి మీకు బోధిస్తున్నాం" అంటాడు 1,1. ఆ ప్రభువును గూర్చి శిష్యులకు కలిగిన అనుభవం అలాంటిది, అతడు వారికి చూపిన మాతృక అలాంటిది. అతని మాటలకూ చేతలకూ సరిపోయింది. అందుకే ఆ నాయకుణ్ణి వాళ్ళు నమ్మారు. నేడు మన మాటలకూ చేతలకూ పొందిక కుదరడం లేదు కనుకనే ప్రజల మన నాయకత్వాన్ని నమ్మడం లేదు. మనం కూడ ఇతర నాయకులను తయారు చేయలేకపోతున్నాం. ప్రభువులాగ నిజాయితీ చిత్తశుద్ధికల నాయకులు కావాలి. మాటల ద్వారా మాత్రమే గాకుండ చేతల ద్వారా గూడ నాయకులను తయారుచేసేవాళ్లు దొరకాలి. అప్పుడు గాని క్రైస్తవ నాయకత్వం సార్థకంగాదు.

# 4. నాయకుని పరీక్షలు

నాయకత్వపు తర్ఫీదు పొందడమంటే ముఖ్యంగా పరీక్షలకు గురిగావడమే. పరీక్షలకు గురిగానివాళ్ళకు గూడ పెద్ద బాధ్యతలను ఒప్పజెప్పడమనేది క్రైస్తవ సమాజాల అపజయానికి ఓ కారణం అనాలి. కొంతమంది పరీక్షలను జాగ్రత్తగా తప్పుకొంటూంటారు. ఈలా పరీక్షలను నేర్పుతో తప్పుకొనేవాళ్ళు నాయకత్వానికి తగరు. పెద్ద శోధనలు వచ్చినపుడు వాళ్ళు తట్టుకోలేరు.

పిశాచంచే శోధింప బడడానికై ఆత్మ క్రీస్తును ఎడారికి తోడ్కొనిపోయింది - మత్త 4,1. పిశాచంచే పేత్రు జల్లెడలోని ధాన్యంలాగ జల్లించబడ్డాడు - లూకా 22,31. అబ్రాహాము, మోషే, దావీదు, యేలీయా, పౌలు - దైవ నాయకులంతా పరీక్షలకు గురైనవాళ్ళే. క్రైస్తవ నాయకులకు పరీక్షలు మామూలుగా నాల్గు రూపాల్లో వస్తూంటాయి. అవి శ్రమలు, బాధ్యతా నిర్వహణం, ఒంటరితనం, అపజయాలు. వీటిని గూర్చి క్రమంగా విచారిద్దాం.

## 1. శ్రమలు

దేవుడు ఐగుప్తునకు ఓ మంత్రినీ, యిస్రాయేలు ప్రజకు ఓ రాజునూ నియమించాలి అనుకొన్నపుడు ఆ యిద్దరికీ శ్రమల ద్వారా తర్ఫీదు నిచ్చాడు. అన్నలు యోసేపునకు పెట్టిన బాధలు, సౌలు దావీదునకు కలిగించిన శ్రమలు మనకు తెలుసు. "మీరు కొంతకాలం శ్రమలు అనుభవించాక ప్రభువు మిమ్ము బలపరచి స్థిరపరుస్తాడు" అని వ్రాసాడు పేత్రు - 1 పే 5,10. శ్రమలు లేందే దేవుని వరప్రసాదం పొందలేం. క్రీస్తు కూడ మొదట శ్రమలనుభవించి అటుపిమ్మట మహిమలో అడుగుపెట్టాలని ప్రవక్తలు వ్రాసారు - లూకా 24,26. గురువు కొక మార్గమూ శిష్యుల కింకొక మార్గమూ వుంటుందా? ఈ శ్రమలు కూడ నానా రూపాల్లో వస్తూంటాయి. ఏ రూపంలో వచ్చినా అవి మనకు అప్రియమూ బాధా కలిగించి తీరతాయి. వాటిల్లోని ప్రధాన లక్షణమే అది. ఐనా ఈ శ్రమలనే పరీక్షలో నెగ్గితేనేగాని మనం నాయకత్వం వహించడానికి సమర్థులంగాము.

## 2. బాధ్యతా నిర్వహణం

మనం చేయవలసిన పనిని క్రమంగా చేయడమే బాధ్యతా నిర్వహణం. ఇది ఒకనాటితో తీరిపోదు. జీవితాంతమూ ఉంటుంది. చాలమంది క్రైస్తవ నాయకులు బద్ధకింపువలన తమ బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించరు. బాధ్యతనిర్వహణ మనేది పెద్ద బాధ. ఐనా దైనందిన బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించేవాడు నిజమైన నాయకుడు, గొప్ప నాయకుడు గూడ. ఈలా నిర్వర్తించనివాడు తన నాయకత్వం కోల్పోయినట్లే. మన

పనులకూ, తోడి ప్రజలకూ, భగవంతునికీ మనం చెల్లించవలసిన బాధ్యతలను చెల్లిస్తే చాలు, పుణ్యాత్ములమై పోతాం.

ఈ బాధ్యతా నిర్వహణంలో క్రీస్తే మన ఆదర్శం. అతని బాధ్యతను నూత్నవేదం ఓ చిన్న మాటలో వ్యక్తం చేసింది. ఆ మాట "ఆవశ్యకం" (గ్రీకు భాషలో "దేయి"). అతడు చిన్ననాడే "నేను నా తండ్రి పనిలో నిమగ్నుణ్ణైవుండడం ఆవశ్యకం గాదా?" అని అడిగాడు - లూకా 2, 49. తరువాత జీవితమంతా గూడ "తండ్రి చిత్తాన్ని నెరవేర్చడమే తన భోజనం" అనుకొన్నాడు - యోహా 4,34. అటుపిమ్మట "క్రీస్తు మొదట శ్రమలనుభవించి ఆ తరువాత మహిమలో ప్రవేశించడం ఆవశ్యకం గాదా" అని తలంచాడు - లూకా 24,26. ఈలా తండ్రి ఆజ్ఞకు బద్ధుడై జీవించడమే క్రీస్తు బాధ్యతా నిర్వహణం. ఆ ప్రభుని ఆదర్శంగా బెట్టుకొని క్రైస్తవ నాయకులు గూడ బాధ్యతాబద్ధులు కావాలి. క్రమం తప్పని బాధ్యతాయుత జీవితం క్రైస్తవ నాయకునికి పెట్టని పరీక్ష. వైద్యుడు, నర్సు, ఉపాధ్యాయుడు, విద్యార్థి, అధికారి, గుమాస్తా - ఈలా మన చుట్టూ పనిచేసేవాళ్ళంతా బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తున్నారా అని పరీక్షిస్తుంటాం గదా! క్రైస్తవ నాయకునికి గూడ ఇదే పరీక్ష చెల్లుతుంది. ఈ బాధ్యతను కూడ తప్పనిసరియైగాదు, ప్రేమభావంతోను సేవాభావంతోను నిర్వర్తించాలి.

## 3. ఒంటరితనం

ఒకోమారు బంధువులూ మిత్రులూ మనలను చేయి విడుస్తారు. అప్పుడు మనం ఒంటరిగా ఉండిపోతాం. ఇక్కడ ఒంటరితనమంటే ఈ బంధుపరిత్యాగం గాదు. ప్రభు సేవకోసం బుద్ధిపూర్వకంగానే ఒంటరితనాన్ని అవలంబించడం. కొన్ని ఉదాహరణలు చూద్దాం. క్రీస్తు ఎవరి ఆశ్రయాన్ని కోరుకోలేదు. క్రీస్తు ఒంటరితనం ఏలాంటిదంటే అతనికి తల దాచుకొనే తావైనా లేకపోయింది - మత్త 8,20. ఓమారు ఎవరో వచ్చి "మీ సోదరులూ తల్లీ మీ కొరకు వెలుపల వేచివున్నా" రని చెప్పగా ప్రభువు "నా సోదరు లెవరు? తల్లి యెవరు? అని ప్రశ్నించాడు - మత్త 12, 48. తండ్రి చిత్తాన్ని నెరవేర్చడం కొరకు అతడు బుద్ధిపూర్వకంగా ఒంటరిగాడై పోయాడు. పౌలునకు తన క్రైస్తవ సమాజాలంటే పరమ ప్రీతి. తీతు మొదలైన శిష్యవర్గమన్నా అత్యాదరం. ఐనా అతడు క్రీస్తు కొరకు, ఆ క్రీస్తును బోధించడం కొరకు తన జనాన్నందరిని విడిచి ఒంటరివా డయ్యాడు. మోషేకు అతని అన్నయైన అహరోను, శిష్యుడైన యోషువా సహచరులు. ఐనా అతడు వాళ్ళిద్దరిని గూడ వదలిపెట్టి యావే సాన్నిధ్యం కలిగించుకొనేందుకు ఒంటరిగా ఉండిపోయాడు.

మామూలుగా మన నాయకులు ఒంటరితనానికి భయపడుతూంటారు. ఒంటిగాడికి బలం వుండదు గదా? అందుచేత న్యాయమైనా కాకపోయినాసరే ఏ పక్షంతోనో

ఏ ముఠాతోనో చేతులు కలుపుతూంటారు. కాని యథార్థమైన నాయకుడు ఈలా చేయడు. అతడు మానవ బలంమీదకంటె దైవబలంమీద అధికంగా ఆధారపడుతూంటాడు. ఒంటిరివాడైనా సరే, నరుల ముఠాలతో అతనికి పనిలేదు. బలం కొరకు ఎవరి పక్షాన్నీ ఆశ్రయించడు. దేవుని మీద ఆధారపడి జీవిస్తూంటాడు, అంతే. ఈ సత్యాన్ని గ్రహించనివాళ్లు ఉత్తమ నాయకులు కాలేరు. ఒంటరితనానికి భయపడేవాడు నాయకత్వపు పరీక్షలో ఓడిపోయినట్లే.

## 4. అపజయం

నాయకుడు అపజయాన్ని భరించగలిగాడా లేదా అన్నది కూడ నాయకత్వానికి ఓ పెద్ద పరీక్ష. జీవితంలో అపజయం పొందని నాయకుడంటూ లేడు. మోషే యావే తరపున నాయకత్వం వహించి ఫరో దగ్గరకు వెళ్ళి యిస్రాయేలు ప్రజలను పంపివేయమని అడిగాడు. ఫరో ఆ ప్రజలను పంపివేయలేదుగదా ఇంకా ముప్పుతిప్పలు పెట్టించాడు. ఇంకోమారు మోషే యావేనుండి పది ఆజ్ఞలు పొందడానికై కొండ మీదికి వెళ్ళగా క్రిందనున్న ప్రజలు యావేను విడనాడి బంగారు దూడను ఆరాధిస్తూ కూర్చున్నారు. మరోమారు ప్రజలు ఎడారిలో ప్రయాణం చేస్తూ మాసా మెరీబా అనే తావులో నీళ్ళు దొరక నందున మోషే మీద తిరుగుబాటు చేసారు. ఇక ముందుకు కదలమని మంకుపట్టు పట్టారు. ఇవన్నీ మోషే అపజయాలు. ఐనా అతనికి మించిన నాయకుడెవరు?

ప్రవక్త యేలీయా కాలంలో ఆహబు రాజు యెసబెలురాణి యావే ఆరాధనను అరికట్టి బాలు ఆరాధనను ప్రోత్సహించారు. అందుచేత ప్రవక్త రాణిని ఎదిరించి నిలిచాడు. కాని ఆమె క్రోధానికి తట్టుకోలేక యేలీయా హోరెబు కొండకు పారిపోవలసివచ్చింది. ఇది యేలీయా అపజయం. ఐనా చివరకు ఆ రాణి గతిలేని చావు చచ్చింది, ప్రవక్త నెగ్గాడు.

దావీదు మహాభక్తుడు, మహావీరుడుకూడ. ఐనా అతడు పొందిన అపజయాలకు లెక్కలేదు. సౌలు ఎదుటినుండి పారిపోయి చాలకాలం కాందిశీకుడుగా బ్రతికాడు. ఓ మారు తన కుమారుడు అబ్షాలోము చేతుల్లో బందీ అయ్యాడు. ఇంకోమారు స్వీయ బలహీనతవల్ల తనకు తానే బందీ అయ్యాడు. ఊరియాను చంపించి అతని భార్య బత్షేబాను చేపట్టాడు. అప్పుడు నాతాను ప్రవక్త తన్ను కఠినంగా మందలించగా పశ్చాత్తాప పడ్డాడు. ఇన్ని అపజయాలు పొందినా యిస్రాయేలు రాజుల్లో దావీదును మించినవాడు లేడు.

పౌలు మహాప్రేషితుడు. ఐనా కొందరు శిష్యులు అతనిని అపార్థం చేసికొన్నారు. అతని ప్రేషిత కార్యాన్ని భగ్నంచేసారు. అతనికి ప్రక్కలోని బల్లెంలా తయారయ్యారు. వీళ్ళనుగూర్చే అతడు "నా శరీరంలో గ్రుచ్చుకొన్న ముల్లు" అని పేర్కొన్నాడు. ఓ మారు అతడు ఆతెన్సు నగరంలోని గ్రీకు పండితులకు బోధించగా వాళ్లు "నీ బోధలు వినడానికి

మా కిప్పుడు వ్యవధిలేదు, మరోమారు వింటాంలే" అని గేలి చేసారు. ఇవి పౌలు అపజయాలు. ఐనా పౌలునకు మించిన ప్రేషితుడెవరు?

కడన క్రీస్తు కూడ పరాజయం పొందాడు. అతని మరణకాలంలో అంతా అపజయమే ననిపించింది. అతడు వృథాగా ప్రాణత్యాగం చేసినట్లనిపించింది. కాని ఆ పరాజయం నుండే మహా జయం పుట్టుకవచ్చింది. అందుచేత క్రైస్తవ నాయకులు అపజయానికి భయపడకూడదు. నాయకత్వంలో అపజయం కూడ ఒక భాగం. సమస్యలు, పరీక్షలు, శ్రమలు, అపజయాలు అనే తంతువులతోగాని భగవంతుడు నాయకత్వమనే వస్త్రాన్ని నేయడు. ఐనా "దేవుణ్ణి ప్రేమించే వాళ్ళకి అన్నీ సవ్యంగానే పనిచేస్తాయి" - రోమా 8,28. ఈ వాక్యాన్ని విశ్వసించి క్రైస్తవ నాయకుడు తన అపజయాలకు నిరుత్సాహపడకుండా ముందునకు సాగిపోతుండాలి.

# 5. నాయకుని సమస్యలు

నాయకుడు ఎదుర్కొనే సమస్యలు బోలెడన్ని ఉంటాయి. కొందరి దృష్టిలో నాయకత్వమంటే ఒకదాని తరువాత ఒకటిగా చిక్కులను విషమ సమస్యలను ఎదుర్కొంటూండడమే. ఐనా ఈ సమస్యలను ఎదుర్కొనడం ద్వారా గాని నాయకుడు పరిపూర్ణ మానవుడు కాలేడు. నాయకుడు ఎదుర్కొనే సమస్యలు ఎన్నైనా వుంటాయన్నాం. ప్రస్తుతానికి వాటిల్లో రెండింటిని మాత్రం పరిశీలిద్దాం.

## 1. అధికార నిర్వహణం

నాయకత్వాన్ని సక్రమంగా నిర్వహించగలమా అన్నదే ఓ పెద్ద సమస్య. ఓ మారు షెబా రాణి సొలోమోనును చూడవచ్చింది. ఆమె అతని విజ్ఞానాన్నిచూచి మెచ్చుకొని "నీవలన ప్రీతి జెంది నిన్ను యిస్రాయేలు సింహాసన మెక్కించిన ఆ ప్రభువు స్తుతింప బడునుగాక'' అంది - 1 రాజు 10,9. ఈ వాక్యాన్ని బట్టి సొలోమోనును సింహాసనమెక్కించింది ప్రభువే. సర్వధికారమూ దేవుని వద్దనుండే వస్తుంది. ప్రభువే దానికి ఆధారం. మనం దేవునికి ప్రతినిధులం, అతని వద్ద నుండి అధికారం పొందేవాళ్ళం. కనుక అధికారం మన జన్మహక్కనీ, మన వ్యక్తిత్వానికి సంబంధించిందనీ అనుకోవడం వెర్రి. నాయకత్వ మంటే అధికారం. కాని ఆ యధికారాన్ని జూచుకొని కన్నుమిన్ను గానకుండ ప్రవర్తించ గూడదు. అధికారం పరసేవకుగాని ఆత్మోత్కర్షకు గాదు.

రోమను సైన్యాధిపతి క్రీస్తుతో "నేనూ అధికారం క్రింద బ్రతికేవాణ్ణే" అన్నాడు - మత్త 7,9. అతడు రోము అధికారం క్రింద పనిచేస్తున్నాడు గనుక ఆ రోమను సైన్యాన్ని ఆజ్ఞాపింపగలిగాడు. మనం కూడ క్రీస్తు అధికారం క్రింద పనిచేస్తున్నాం గనుకనే

క్రీస్తు ప్రజలను ఆజ్ఞాపింప గల్గుతూన్నాం. కనుక క్రైస్తవ నాయకులు అహంభావంతో గాదు, వినయంతో ప్రవర్తించాలి. స్వార్థబుద్ధితో గాదు, క్రీస్తు బుద్ధితో అధికారం నిర్వహించాలి.

ఓ యజమానునికి ఓ సేవకుడుండేవాడు. అతడు యజమానుని ఆస్తిపాస్తులను పరామర్శిస్తూండేవాడు. కాని ఆ సేవకుడు స్వామి సొత్తు దుర్వినియోగం చేస్తున్నాడని ఫిర్యాదులు వచ్చాయి. కనుక యజమానుడు అతనితో "ఓయి! ఖచ్చితంగా లెక్కలొప్పజెప్పు, ఇక నీవు నా కొలువులో ఉండదగవు" అన్నాడు - లూకా 16,2. ఈలాగే ప్రభువు కూడ మన నాయకత్వాన్ని గూర్చి ఓనాడు నిశితమైన లెక్క అడుగుతాడు. మన ప్రవర్తనం ఆ లెక్క ఒప్పజెప్పడానికి తగినట్లుగా వుండాలి. ఆలా వుందా?

నాయకులైన వాళ్ళు అధికారవిభజనం గూడ ఓ ముఖ్య విషయమని గుర్తించాలి. ఐగుప్తునుండి వెడలి వచ్చిన యిస్రాయేలు ప్రజలందరకు మోషే నాయకుడు. వాళ్ళందరూ తమ తగాదాలను మోషేవద్ద వినిపించేవాళ్ళు. ఆ తగాదాలన్నీ తీర్చలేక మోషే విసిగి వేసారిపోయేవాడు. ఇది చూచి మోషే మామ యిత్రో "ఈ పనంతా నీ వొక్కడవే చేయలేవు. నీ క్రింద కొంతమంది పెద్దలను నియమించు. నీకు మారుగా వాళ్ళు ఈ తగాదాలన్నీ పరిష్కరిస్తారు" అని సలహా యిచ్చాడు - నిర్గ 18,21. మోషే యీ సలహాను పాటించాడు. నాయకుడు తన అధికారాన్ని యితరులకు పంచిపెట్టడమంటే యిదే. కొంతమంది నాయకులు తమ అధికారాన్ని ఇతరులకు పంచియీయరు. తామే అన్ని పనులూ చేయగోరుతారు. ఈలాంటివాళ్ళు ఎక్కువకాలం మనలేరు. నాయకుడు తన అధికారాన్ని యితరులకు పంచియిస్తూండాలి. ఇతరుల ద్వారా తన పనిని కొనసాగించుకొంటూ పోతుండాలి. అసలు అనుచరులు చేయగలిగిన పనిని నాయకుడు తాను చేయనేకూడదు. తొలినాటి యెరూషలేము సమాజంలో ఓ చిన్న తగాదా వచ్చింది. పేద ప్రజలకు కూడూగుడ్డా పంచియిచ్చేకాడ పేచీలు వచ్చాయి. పేత్రు ఆతగాదాను ఈలా పరిష్కరించాడు. అపోస్తలులు పేద ప్రజలను పరామర్శించడము మానుకొని ప్రార్థనకూ, ప్రభు వార్తాప్రచారానికీ పూనుకొన్నారు. కూడూగుడ్డా మొదలైన వ్యవహారాలను చూడ్డానికి ఏడ్గురు పరిచారకులను నియమించారు. ఇక్కడ అపోస్తలులు తమ అధికారాన్ని ఈ యేడ్గురికీ పంచియిచ్చారు - అచ 6, 1-4. ఈలాగే నాయకులు కూడ ప్రవర్తించాలి.

## 2. అధికార విసర్జనం

మన నాయకులు చాలమంది అధికార విసర్జనానికి ఒప్పుకోరు. తాము లేకపోతే ఆ పని జరగదు అన్నట్లు ప్రవర్తిస్తుంటారు. కాని బైబులునాయకులు సంతోషంతో అధికార విసర్జనం చేసారు. మోషే మహానాయకుడు. సీనాయి పర్వతంమీద ప్రభువును దర్శించి,

ఆ ప్రభుధర్మశాస్త్రాన్ని అమలు పరచినవాడు. అతడు ప్రజలను వాగ్దత్త భూమికి చేర్చక ముందే త్రోవలోనే నాయకత్వాన్ని విసర్జించవలసి వచ్చింది. ప్రభువు అతని స్థానే యోషువాను నాయకునిగా ఎన్నుకొన్నాడు. ప్రభు చిత్తం తెలిసికొన్న వెంటనే మోషే దైవాజ్ఞకు బద్ధుడై యోషువా మీద చేతులు చాచి అతన్ని నాయకునిగా నియమించాడు. తాను అధికారంనుండి వైదొలగాడు - సంఖ్యా 27, 22-23. అతడు ఎంతటి నాయకుడో అంతటి వినయవంతుడు.

ఈలాగే మహా ప్రవక్తయైన యేలీయా నాయకత్వం విడనాడవలసిన రోజు వచ్చింది. ప్రభువు యెలిషాను ప్రవక్తగా నియమించాడు. కనుక యేలీయా యెలిషాను వెదకబోయాడు. అతడు వచ్చేప్పటికల్లా యెలిషా పన్నెండు కాండ్ల యెద్దులతో పొలం దున్నిస్తూన్నాడు. తాను చివరి కాడి దున్నుతూన్నాడు. యేలీయా తన ఉత్తరీయాన్ని తీసి యేలీయా మీద కప్పాడు. దానితో యెలిషా యేలీయా స్థానాన్ని పొంది ప్రవక్త అయ్యాడు - రాజు 19, 19-21. యేలీయా తన ఉద్యోగాన్ని విరమించుకొని దేవుని చేరుకొన్నాడు.

ఈ లాగే స్నాపక యోహాను క్రీస్తు వచ్చిందాకా మహా జ్యోతిగా వెలిగాడు. కాని క్రీస్తురాకతో ఆతని నాయకత్వ మంతరించింది. యోహాను వినయంతో "అతడు అతిశయించాలి, నేను తగ్గిపోవాలి" అన్నాడు - యోహా 3,30. తరువాత హెరోదు యోహానును వధించాడు, ఆతని శిష్యులు క్రీస్తు శిష్యులయ్యారు.

మోషే, యేలీయా, యోహాను మొదలైన బైబులునాయకులంతా తమ రోజు వచ్చినపుడు వినయంతో నాయకత్వం వదలుకొన్నారు. ఈ మహానుభావులు మనకు ఆదర్శంగా వుండాలి. చాలమంది క్రైస్తవనాయకులు తమ నాయకత్వాన్ని వదలుకోవడానికి ఒప్పుకోరు. వృద్ధులైన నాయకులు అసలే ఒప్పుకోరు. ఏవేవో తంత్రాలు పన్ని సాకులు చెప్పి ఉద్యోగానికి అంటిపెట్టుకొని వుంటూంటారు. పదిమంది చేత "ఛీ" అనిపించుకొనిగాని పదవి నుండి వైదొలగరు. ఆలా వైదొలగినంక గూడ, తమ స్థానాన్ని పొందినవాళ్ళ అధికారంలో ఇంకా జోక్యం గలిగించుకో గోరుతూంటారు. నాయకులు ఈ యవివేక ప్రవర్తనను చక్కదిద్దుకోవాలి. ఓ మారు ప్రభుచిత్తం తెలిసికొన్నంక వాళ్ళంతట వాళ్లే శీఘ్రంగా పదవీ విరమణం చేసి ప్రక్కకు వైదొలగాలి. బహుశః ప్రభువు మన తరువాత మన కంటె యోగ్యులను, మనకంటె సమర్థులను పదవిలో నియమించవచ్చుగదా!

## 6. నాయకుని శోధనలు

పిశాచం క్రీస్తుని ఉన్నతమైన పర్వత శిఖరంమీదా, దేవాలయ గోపురంమీదా నిల్పి శోధించింది. నాయకుడు గూడ ఓ గొప్ప పదవిని పొందుతాడు. ఓ ఉన్నత స్థానంలో నిలుస్తాడు. కాని ఈ ఉన్నత స్థానమే ఒకోమారు అతని పతనానికి కారణమౌతుంది.

కనుక అతడు చాల జాగ్రత్తగా ప్రవర్తించాలి. చాల వినయంతోను అణకువతోను మెలగాలి. నాయకునికి కలిగే మామూలు శోధనల్లో నాల్గింటిని గూర్చి ప్రస్తుతం విచారిద్దాం. అవి ప్రమత్తత, గర్వం, ధనవాంచ, మురాతత్వం.

## 1. ప్రమత్తత

నాయకులకు దేవుడు ఓ పదవినీ, ఓ బాధ్యతను ఒప్పజెపుతాడు. ఆ బాధ్యత ప్రకారం ప్రవర్తించకపోతే ప్రభువు వాళ్ళను కఠినంగా శిక్షిస్తాడు. ఎంత చెట్టుకి అంతగాలి గదా! పౌలు చాల గొప్ప నాయకుడు. కాని ఆ నాయకత్వం వల్ల తల దిరిగి భ్రష్టుణ్ణి పోతానేమోనని అతడు చాల భయపడ్డాడు - 1 కొ 9,27. సంసోను న్యాయాధిపతి, నాయకుడు. కాని అతడు స్త్రీలోలుడయ్యాడు. డెలీలాకు దాసుడయ్యాడు. కనుక ప్రభువు అతన్ని పరిత్యజించాడు. సంసోను ప్రభువు తన్ను విడనాడి వెళ్ళిపోయాడని గుర్తించనైనా లేదు. అంతటి దౌర్భాగ్యుడయ్యాడు - న్యాయా 16,20. ఎడారి ప్రయాణంలో మాసా మెరిబాలవద్ద నీళ్ళు దొరకక యిస్రాయేలు ప్రజలు దేవుని మీద తిరుగబడ్డారు. దేవుడు మోషేను పిలిచి బెత్తంతో రాతి బండను చరవమని చెప్పాడు. కాని మోషే బండనుండి నీళ్ళు పుడతాయా అని సందేహించాడు. అందుచేత యావేకు అప్రియం కలిగింది. ప్రభువు అతన్ని వాగ్దత్త భూమిలో ప్రవేశింప నీయలేదు. అతని నాయకత్వాన్ని గూడ యోషువాకు ఇచ్చివేసాడు. ఈ విధంగా ప్రభువు తన నాయకుల లోపాలను కఠినంగా శిక్షించాడు. ఔను, అధికంగా పొందినవాళ్ళు అధికంగానే లెక్క ఒప్పజెప్పాలి గదా! - లూకా 12,48.

దేవుడు మనకు గొప్ప శక్తిసామర్థ్యాలను ప్రసాదించినపుడు వాటిని సద్వినియోగం జేసికొంటున్నామా అని కూడ పరిశీలిస్తాడు. లోపమూ పాపమూ అనేవి యెవరిలో కన్పించినా దేవుడు సహింపడు. పాపాల నిమిత్తమై అతడు తన ఏకైక కుమారుని గూడ కరుణింపలేదు - రోమీ 8,31. ఇక మన నాయకత్వపు పాపాలను క్షమిస్తాడా? కనుక నాయకులు జాగరూకతతో ప్రవర్తించాలి. నాయకత్వపు తొలి రోజుల్లో గాదు గాని, కొంతకాలమైనంక చాలమంది నాయకులు అశ్రద్ధ జూపుతూంటారు. ధీమాగా ప్రవర్తిస్తూంటారు. ఇది పెద్ద పొరపాటు.

## 2. గర్వం

విశేషంగా మూడు గుణాలు నాయకులను తప్పుదారి పట్టిస్తాయి. అవి అధికారభావమూ, పలుకుబడీ, గర్వమూ. అధికారభావంవలన చెడిపోనివాళ్ళు అరుదు. నాయకులూ అంతే. పలుకుబడివలన నాయకులు కన్నుమిన్ను కానకుండా తిరగడం కూడ కద్దు. ఇక, నాయకత్వం వలన కొంతమందికి తల తిరుగుతుంది. అదే గర్వం. ఈ దుష్టగుణాల కన్నిటికీ విరుగుడు ఏమిటి? సేవా భావం. నాయకత్వమంటే ప్రధానంగా సేవ అని గ్రహించడం.

క్రీస్తు "నేను ఓ సేవకుళ్లాగ మీ మధ్యలో వున్నాను" అంటాడు - లూకా 22,27. "మనుష్య కుమారుడు సేవలు చేయించుకోవడానికి గాదు, సేవలు చేయడానికి వచ్చాడు" అని పల్కాడు - మార్కు 10,45. కనుక సేవ చేయడమనేది క్రైస్తవ నాయకత్వానికి ప్రధాన లక్షణం. క్రీస్తు తన శిష్యులకు బోధిస్తూ అన్యజాతి ప్రజల్లో కన్పించే నాయకత్వాన్ని పరిశీలించమన్నాడు. వాళ్ళల్లో పైఅధికారి తన క్రింది అధికారి మీద పెత్తనం చెలాయిస్తూంటాడు. కాని ఇది నాయకత్వం గాదు, ప్రభుత్వం. ప్రభువు శిష్యులతో "మీరీలా ప్రవర్తించగూడద"ని నొక్కి చెప్పాడు. శిష్యుల్లో నాయకుడు కాదలచుకొన్నవాడు, ఇతరులకు సేవచేయాలి. మొదటివాడు కాదలచుకొన్నవాడు కడపటివాడు కావాలి - మార్కు - 9,35. ఈ బోధలను జీర్ణం చేసికొన్న పేత్రు తర్వాత తన క్రింది అధికారులకు వ్రాస్తూ "మీరు అధికారుల్లాగ దైవ ప్రజల మీద పెత్తనం చెలాయించవద్దు. చక్కని ఆదర్శంతో వాళ్ళకు సన్మాతృక నీయండి" అని వ్రాసాడు - 1 పే 5,3.

ప్రభువు శిష్యుల పాదాలు కడిగి "నేను మీకు ఓ మాతృకను జూపాను, మీరూ నాలాగే ప్రవర్తించండి" అని పల్కాడు - యోహా 13,15. కనుక నాయకత్వమంటే వినయంతో తోడి ప్రజలకు సేవలు చేయడమే. ఈ భావాన్ని భాగా అర్థం జేసికొంటే నాయకత్వానికి అంతగా అఱ్ఱులు చాచం. అధికారాలను పొందడానికీ, పెద్ద పదవులను సంపాదించడానికి అంతగా ఉబలాటపడం. పెద్దలే స్వయంగా ఆ పదవులనూ అధికారాలనూ మన భుజాల మీద పెట్టినపుడు "నాకు రాత్రిలో గూడ గొడుగు పట్టండి" అన్నట్లుగా ప్రవర్తించం. అందుచేత క్రైస్తవ నాయకత్వమనేది స్వార్థం కొరకు గాదు, పరసేవ కొరకని గ్రహిద్దాం.

## 3. ధనవాంఛ

ధనవాంఛవల్ల క్రైస్తవ నాయకులు చాలామంది చెడిపోయారు, చెడిపోతున్నారు గూడ. పౌలు తాను నియమించిన తిమోతి, తీతు మొదలైన నాయకులను ధనవాంఛను గూర్చి పదేపదే హెచ్చరించాడు. డబ్బు చేసికోవాలనుకొనేవాడు నాయకత్వానికి తగడని చెప్పాడు - 1 తిమొ 3, 3; 3,8. తీతు 1,7. పైగా 1 తిమొ 6,10లో "ధనవాంఛ సకల అనర్థాలకు మూలం" అని చెప్పాడు. డబ్బు చేసికోగోరే నాయకులు ప్రజలకు సేవ చేయలేరు. ధనపిశాచం సోకినవాళ్లు ప్రజలకు చెల్లవలసింది గూడ తామే కొట్టేస్తూంటారు. ధన మొక యజమానుడు, భగవంతుడు వేరొక యజమానుడు. ఈ యిద్దరికీ ఒకే మారు సేవ చేయలేం - మత్త 6,24. ధనవాంఛ నాయకులను పట్టి పీడించే ప్రధాన శోధనల్లో ఒకటిగా భావించాలి.

## 4. మఠాతత్వం

కొంతమంది నాయకులు సులభంగా మఠాల్లో చేరిపోతూంటారు. లేదా స్వయంగా ఓ క్రొత్త మఠాను లేవదీస్తూంటారు. మన దేశంలో ఈ మఠాలు తరచుగా

కులాన్ని బట్టి పుడుతూంటాయి. ఓ కులానికో వర్గానికో చెందినవాళ్ళంతా ఓ ముఠాగా ఒనగూడుతారు. నాయకుడు ఈ ముఠాతో ఐక్యమై తన బలాన్ని అధికంజేసికొంటాడు. తన ముఠాకు చెందనివాళ్ళను అనాదరం చేస్తాడు, చేయగూడని దారుణ కార్యాలు చేస్తాడు. దైవబలాన్ని విస్మరించి మానుష బలంమీద ఆధారపడడమంటే యిదే. ఈలాంటివాళ్ళను గూర్చి యిర్మీయా "దేవుని మీద ఆధారపడే వాడు ధన్యుడు. కాని నరుని మీద ఆధారపడేవాడు శాపం పాలౌతాడు" అని వాకొన్నాడు - 17, 6-7.

పూర్వం కొరింతు ప్రజల్లో ఈలాంటి ముఠాలు ఏర్పడ్డాయి. వాళ్ళు కులాన్ని బట్టిగాదుగాని, తమకు బోధించిన బోధకులను బట్టి కొన్ని ముఠాలుగా చీలిపోయారు. కొందరు మాది పౌలు ముఠా అన్నారు. మరి కొందరు మాది పేత్రు ముఠా అన్నారు. ఇంకా కొందరు మాది అపొల్లో ముఠా అన్నారు. ఈ సంగతి విని పౌలు వాళ్ళను కఠినంగా మందలించాడు. క్రైస్తవుల కందరికీ ఒకే నాయకుడు క్రీస్తు, క్రైస్తవులందరూ ఒకే సమాజం తిరుసభ అని బోధించాడు - 1 కొ 1, 10-13.

క్రైస్తవ నాయకులు ఈ ముఠా తత్వాన్నుండి జాగ్రత్తగా వైదొలగుతూండాలి. దురదృష్టవశాత్తు ధనవాంఛా ముఠాతత్వమూ నేడు మన నాయకుల్లో ప్రచురంగా కన్పిస్తున్నాయి. ఈనాడు చాల క్రైస్తవ సమాజాలు క్షయ రోగిలాగ నవిసిపోతున్నాయంటే, ఈ దుర్గుణాలే కారణం.

# 7. నాయకుని సిలువలు

క్రైస్తవ నాయకుడు కొన్ని సిలువలను మోయడానికి సంసిద్ధుడు కావాలి. అప్పుడు గాని అతని నాయకత్వం ఫలవంతం గాదు. ఈ సిలువలు ముఖ్యంగా మూడు - శిక్షణం, బాధలు, బలహీనత. వీటిని గూర్చి క్రమంగా విచారిద్దాం.

## 1. శిక్షణం

సామెతల గ్రంథం "కుమారా! ప్రభు విచ్చే శిక్షణను అనాదరం చేయబోకు. ప్రభువు ఎవరిని ప్రేమిస్తాడో వాళ్ళను శిక్షిస్తాడు" అంటుంది - 3, 11-12. కాని ప్రభువు ఈలా శిక్షించడం దేనికి? నరులు ఆత్మనిగ్రహం అలవర్చుకోవడానికి. "ఎవడైనా నన్నను సరింపగోరితే తన్ను తాను నిగ్రహించుకొంటూ రోజురోజు నా సిలువను మోసికొంటూ నా వెంట రావాలి" అన్న ప్రభువాక్యం మనకు తెలుసు - లూకా 9,23. కనుక శిక్షణం ఆత్మనిగ్రహం కొరకు. ఈ నిగ్రహం ద్వారా మనలో దివ్యజీవం నెలకొంటుంది. నాయకులు మానుషత్వాన్ని దాటి దివ్యత్వాన్ని చేకొనాలంటే, శీలవంతులూ భగవత్సేవకులూ కావాలంటే ఈ శిక్షణను పొందాలి. ఈ శిక్షణను మనకు ఎవరో వచ్చి యిచ్చిపోరు. మనలను మనమే శిక్షించుకోవాలి. ప్రభు వరప్రసాద సహాయంతో మనలోని ఆశాపాశాలనూ వ్యామోహాలనూ

మనమే అరికట్టుకొంటూండాలి. పౌలు ఈలా తన్నుతాను శిక్షించుకొన్నాడు. కనుకనే "నా దేహాన్ని శిక్షించి అదుపులో పెట్టుకొంటున్నాను" అని చెప్పుకొన్నాడు - 1కొ 9, 27. కనుక క్రైస్తవ నాయకుడు నానా రూపాల్లో తన్ను తాను శిక్షించుకొని తనలోని స్వార్థాన్ని జయిస్తూండాలి. విశేషంగా పౌలు పేర్కొనిన "శరీర కార్యాలను" శిక్షించి అదుపులోనికి తెచ్చు కొంటూండాలి - గల 5, 19-21.

## 2. బాధలు

క్రీస్తు అననీయాతో పౌలును గూర్చి మాటలాడుతూ "పౌలు నా కొరకు ఎన్ని బాధలు అనుభవించాలో అతనికి తెలియజేస్తాను" అన్నాడు - అకా 9,16. ఈ పౌలు నాయకుళ్ళాగే క్రైస్తవ నాయకుడు గూడ క్రీస్తు కొరకు చాలా బాధ లనుభవించాలి. అపుడు గాని అతడు ప్రజలకు ఏమైనా ఉపకారం చేయలేడు. స్వార్థాన్ని చంపుకోవాలంటే బాధలు ఉపయోగ పడినంతగా మరే మందూ ఉపయోగపడదు.

## 3. బలహీనత

పౌలునకు చాలా శ్రమలూ బాధలూ కలిగాయి. ఈ వేదనలకు తట్టుకోలేక అతడు వాటిని తొలిగించమని ప్రభువుని ముమ్మారు ప్రార్థించాడు. కాని క్రీస్తు అతనితో "నీవు బలహీనుడవై యున్నపుడు నా శక్తి నీ మీద బలంగా పనిచేస్తుంది. నా వర ప్రసాదం నీకు తోడ్పడుతుంది, అది చాలుపో" అన్నాడు. పౌలు ఈ సత్యాన్ని బాగా జీర్ణం చేసికొని "నేను బలహీనుడనై యున్నపుడే బలవంతుడను" అని వ్రాసికొన్నాడు - 2కొ 12, 9-10. నాయకునికి స్వీయబలం చాలదు. అసలు స్వీయబలాన్ని అతడు లెక్కింపగూడదు. ఓ విధంగా చెప్పాలంటే, స్వీయబలం నశిస్తేనేగాని దైవబలం పనిచేయదు. మన శక్తిసామర్థ్యాల మీద నమ్మకం తగ్గిపోతేనేగాని, దైవశక్తి మనకు తోడ్పడదు. కనుక క్రైస్తవ నాయకుడు తన్ను తాను తగ్గించుకోవాలి, తాను బలహీనుణ్ణని నమ్మాలి. తన బలహీనతను తాను గుర్తించాలి, అంగీకరించాలి గూడ. అప్పుడుగాని అతనికి మించిన శక్తి అతనిమీద పని చేయదు.

పై పుటల్లో క్రైస్తవ నాయకుని కుండవలసిన లక్షణాలను కొన్నిటివి వివరించాం. బైబులు గ్రంథం నుండి ఉదాహరణలు చూపించాం. మన నాయకులు ఈ లక్షణాలను చిత్తశుద్ధితో మననంజేసికొని తమ నాయకత్వాన్ని సార్థకంజేసికొందురుగాక. ప్రస్తుతం మన దేశంలో ఉత్తమ నాయకులకున్న కొరత అంతింతగాదు. భారత క్రైస్తవ సమాజాలు కూడ చక్కని నాయకులు లేక అలమటిస్తున్నాయి. ఈ కొరతను తీర్చడానికి ఉదారబుద్ధితో ముందుకు వచ్చేవాళ్ళంతా మన క్రైస్తవ సమాజాలకు ఎనలేని ఉపకారంచేసిన వాళ్ళౌతారు.

"అర్ఖిప్పసుతో నీవు ప్రభువు నుండి పొందిన పరిచర్యను చక్కగా నిర్వర్తింప వలసిందని చెప్పండి" - కొలో 4,17.

# 7. సాంఘిక న్యాయం

బైబులు భాష్యం - 35

విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | సాంఘిక న్యాయమూ, నిర్గమనమూ | 137 |
| 2. | సాంఘికన్యాయమూ, ధర్మశాస్త్రమూ | 141 |
| 3. | సాంఘికన్యాయమూ, అధికారులూ | 149 |
| 4. | సాంఘికన్యాయమూ, ఆరాధనమూ | 155 |


## 1. సాంఘిక న్యాయమూ, యూదుల నిర్గమనమూ

ప్రభువు యిస్రాయేలీయులను ఐగుప్తునుండి కనాను మండలానికి తరలించుకొని వచ్చాడు. ఎందుకు? వాళ్ళ సాంఘిక అన్యాయంవల్ల బాధపడుతున్నారు గనుక. ఐగుప్తీయులు యూదులను అన్యాయంగా పీడించి పిప్పిచేస్తున్నారు గనుకనే యావే వాళ్ళ కోపు తీసికొన్నాడు. ఇక్కడ రెండంశాలు పరిశీలిద్దాం.

### 1. ప్రభువు సాంఘిక అన్యాయాన్ని ఎదిరించాడు

పూర్వం ఐగుప్తులో కరవురాగా ప్రధాన మంత్రియైన యోసేపు ముందుగనే ధాన్యం నిల్వజేయించి వుంచాడు. అతడు దేశాన్ని వివేకవంతంగా పరిపాలించడం వల్ల ఐగుప్తీయులు కాటకానికి తప్పి బ్రతికారు. నాటి రాజు అతన్ని చాలా మెచ్చుకొన్నాడు. కాని కొంతకాలానికి ఆ రాజవంశం పడిపోయింది. క్రొత్త ప్రభువు అధికారాన్ని చేపట్టాడు. వాళ్ళకు యూదుల చరిత్రా, పూర్వం యోసేపు దేశానికి చేసిన ఉపకారమూ ఏమీ తెలియదు.

క్రొత్త రాజవంశాని చెందిన ఫరో ప్రభువు సేతోస్ అనేవాడు యూదులను హింసించడం మొదలెట్టాడు. అతడు వాళ్ళచేత వెట్టిచాకిరి చేయించాడు. వాళ్ళ మగబిడ్డలందరిని నైలునదిలో త్రోయించాడు. ఆ జాతి వృద్ధిలోకి రాకుండా వుండాలని అతని కోరిక. యుద్ధాలు వచ్చినపుడు యిస్రాయేలీయులు శత్రుపక్షంతో చేరిపోతారేమోనని అతని భయం - నిర్గ 1, 10.

సేతోస్ తర్వాత రెండవ రామ్సెస్ ఐగుప్తుకు ప్రభువయ్యాడు. మోషే నాయకత్వం క్రింద యూదులు ఐగుప్తునుండి వెడలివచ్చింది ఇతని యేలుబడిలోనే. అది క్రీస్తు పూర్వం 13వ శతాబ్దం. రామ్సెస్ రాజు ధాన్యాన్ని నిల్వజేయించడానికి పీతోము, రమేసెసు అనే నగరాల్లో బ్రహ్మాండమైన గిడ్డంగులు నిర్మించాడు. యిస్రాయేలీయులచేత వెట్టిచాకిరి

చేయించి ఆ భవనాలను కట్టించడం మొదలెట్టాడు - 1,11. ఆ ప్రజలు అతనికి బానిసలైపోయారు. ఆ భవనాలకు అంతులేదు. యూదుల అగచాట్లకూ అంతులేదు. ఆ బాధలు భరించలేక వాళ్ళు ప్రభువుకి మొరపెట్టుకున్నారు. యిస్రాయేలీయులు బానిసతనాన మునిగి మూలుగుతూ సహాయంకొరకు ప్రభువుకి మొరపెట్టుకొన్నారు. వారి మొర దేవుని చెవిని బడింది, దేవుడువారి మూలుగు విన్నాడు. పూర్వం తాను అబ్రాహాము ఈసాకు యాకోబులతో చేసికొన్న ఒడంబడికను గుర్తుకి తెచ్చుకొన్నాడు. అతడు యిస్రాయేలీయుల దుస్థితినిగాంచి వాళ్ళను కరుణించాడు" - 2, 23-25.

పై వాక్యాల భావం యిది. యిస్రాయేలీయుల మొర ఓ దహన బలిలాగ యావే సన్నిధికి ఎగసిపోయింది. ఆ ప్రభువు పూర్వమే అబ్రాహాము మొదలైన పితరులతో వాగ్దానం చేసికొన్నాడు. ఇప్పుడు ఈ మొర వినగా అతనికి ఆ వాగ్దానం గుర్తుకు వచ్చింది. పూర్వం కయీను హేబెలుని అన్యాయంగా చంపాడు. అప్పుడు హేబెలు నెత్తురు మా యన్న చేసిన అన్యాయం చూడమని దేవునికి మొరపెట్టింది. - ఆది 4,10. ఆలాంటి మొరే ఇది కూడాను. కనుక యావేకి యిస్రాయేలీయులమీద జాలి వేసింది. వాళ్ళను ఏ విధంగానైనాసరే రక్షించాలని నిర్ణయించుకొన్నాడు. ఆ ప్రభువు జాలిగుండెలు కలవాడు గనుక తనలోతాను ఈలా అనుకొన్నాడు. "ఐగుప్తుదేశంలో నా ప్రజలు అనుభవించే బాధలు కన్నులార చూచాను. దాసాధ్యక్షుల బారినుండి విడిపించమని వాళ్ళు చేసిన మనవి విన్నాను. వాళ్ళు పడే పాట్లు గుర్తించాను. ఐగుప్తీయుల ఇనుప పిడికిళ్ళనుండి వాళ్ళను విడిపించడానికై క్రిందికి దిగివచ్చాను. వాళ్ళను ఈ దేశంనుండి పాలు తేనెలు పారే మరో దేశానికి తీసికొని వెళ్తాను. యిస్రాయేలీయుల మొర నా చెవిని బడింది. ఐగుప్తీయులు వీళ్ళనేలా పీడిస్తున్నారో కన్నులార చూచాను" -3, 7-9.

కనుక యావే ప్రభువు మోషేను పిల్చి అతన్ని కార్యనిర్వహకుణ్ణిగా నియమించాడు. ఐగుప్తునుండి యిస్రాయేలీయులను వెలుపలికి తీసికొనిరావడానికై అతన్ని ఫరోవద్దకు పంపాడు. యిస్రాయేలీయులకు ఇతనిద్వారా స్వేచ్ఛ రావాలి. అహరోను మోషేకు సహాయకుడు. యావే తన సేవకులైన మోషే అహరోనుల ద్వారా తొమ్మిది అద్భుతకార్యాలు చేసాడు. అవి నీరు నెత్తురుగా మారడం, కప్పలు వచ్చిపడటం, దోమపోటు, ఈగపోటు, పశునాశం, బొబ్బలు పొక్కడం, వడగండ్ల వాన, మిడుతల దండు, చీకట్లు అలముకోవడం. కాని ఈ యరిష్టాల వలన ఫరో గుండె కరుగలేదు. పై పెచ్చు అతడు హృదయాన్ని రాయి చేసికొన్నాడు. కఠిన హృదయుడై యిస్రాయేలీయులను ఇంకా అదనంగా బాధించాడు.

అప్పుడు ప్రభువు ఫరోను లొంగదీయడానికై "యిస్రాయేలు నా కుమారుని క్రింద లెక్క. అతడు నాకు మొట్టమొదట పుట్టినవాడు. నన్నారాధించడానికి నా కుమారుణ్ణి

వెళ్ళనిమ్మని నీతో చెప్పాను. కాని అతడు వెళ్ళడానికి నీవంగీకరించలేదు. కనుక నేను నీకు మొట్టమొదట పుట్టిన కుమారుణ్ణే హతమారుస్తాను" అన్నాడు. 4,22 -23. తాను చెప్పినట్లే ప్రభువు ఐగుప్తీయుల తొలిచూలు పిల్లలందరిని చంపాడు. రామ్సెసు మొదటి కొడుకు, ఆ దేశంలోని ప్రథమ కుమారులు, పసులు తొలిచూలు దూడలు - అందరూ చచ్చారు. ఇది పదియవ అరిష్టం.

దానితో ఫరోకు గుండె చెదరింది. అతడు మోషేను చూచి "నేను మీ దేవుడైన యావేకూ మీకూ ద్రోహం చేసాను. ఈ సారికి నా పాపాలను క్షమించండి" అన్నాడు - 10, 16-17 యిస్రాయేలీయులను మందలు తోలుకొని తమ దేశం విడిచివెళ్ళమని కోరాడు. ఆలా వెళ్తూ తన్నుకూడ దీవించి పొమ్మని ప్రాధేయపడ్డాడు - 12, 32. ఇకనేం, యిస్రాయేలీయులు ఐగుప్తీయులను దోచుకొని అక్కడినుండి వెళ్ళిపోయారు.

ఈలా ప్రభువు మోషే నాయకత్వాన యిస్రాయేలీయులను ఐగుప్తునుండి తోడ్కొనివచ్చాడు. కాని ఇక్కడ ప్రభువు ఈ ప్రజల జీవితంలో జోక్యం కలిగించుకొంది దేనికి? వాళ్ళకు జరిగే సాంఘిక అన్యాయాన్ని ప్రభువు భరించలేకపోయాడు. ఆ యన్యాయాన్ని చక్కదిద్దడానికి పూనుకొన్నాడు. పది యరిష్టాలతో ప్రజాపీడకుడైన ఫరోను అణగద్రొక్కాడు. కనుక ప్రభువు యిస్రాయేలీయుల జీవితంలో జోక్యం కలిగించుకొనడానికి కారణం సాంఘిక అన్యాయమే. వాళ్ళ రక్షణ చరిత్రలో అదే మొదటి మెట్టు. యిస్రాయేలీయుల రక్షణం ప్రప్రథమంగా ఆధ్యాత్మికమైంది కాదు, ఐహికమైంది.

## 2. యావే ఏకైక ప్రభువు, ప్రజలంతా సోదరులు

సాంఘిక న్యాయాన్ని చక్కదిద్దడంకోసం ప్రభువు యిస్రాయేలీయుల చరిత్రలో జోక్యం జేసికొన్నాడు అని చెప్పాం. కాని యావే కేవలం సాంఘిక అన్యాయాన్ని చక్కదిద్దేవాడు మాత్రమేనా లేక ఇంకేమైనా ఆశయాలు కలవాడు కూడానా? అతడు ప్రజలకు తాను ఏకైక ప్రభువునని తెలియజేసాడు. తన్ను కొలిచేవాళ్ళంతా సోదరుల్లాగా కలసిమెలసి ఒక్క సమాజంగా జీవించాలని కోరాడు. ఈ రెండు ఆశయాల కోసంగూడ అతడు యిస్రాయేలీయులను ఐగుప్తునుండి తరలించుకొని వచ్చాడు. ఈ రెండంశాలను పరిశీలిద్దాం.

యావే ఈలా అన్నాడు. "నేను ప్రభువుని, సర్వశక్తి మంతుణ్ణయిన దేవుణ్ణిగా నేను పూర్వమే అబ్రాహాము ఈసాకు యాకోబులకు ప్రత్యక్షమయ్యాను. కాని యావే అనే పేరుతో మాత్రం వారికి నన్నెరుకపరచుకోలేదు. ఐగుప్తీయులు బానిసలుగా చేసిన

యిస్రాయేలీయుల మొరను నేను చెవులార విన్నాను. మీ శత్రువులను నిశితంగా శిక్షించి మిమ్ము దాస్యం నుండి విడిపిస్తాను. మిమ్ము నా ప్రజగా స్వీకరిస్తాను. నేను మీకు దేవుణ్ణౌతాను. అబ్రాహాము ఈసాకు యాకోబులకు ఇస్తానన్న దేశానికి మిమ్ము తోడ్కొని పోతాను. ఆ గడ్డను మీకు సొంతం చేస్తాను. నేనే ప్రభువుని" - 6,2-8.

పై వాక్యాల భావం యిది. యావే యిస్రాయేలీయులకు తన్ను ప్రభువునిగా తెలియజేసికొన్నాడు. యిస్రాయేలీయులు సాంఘిక అన్యాయానికి లొంగి క్రుగ్గిపోతూ వున్న తరుణంలో యావే ఈలా తెలియజేసికొన్నాడు. ఆ ప్రజలంటే అతనికి ఎక్కడ లేని జాలి. పైగా యావే ఒడంబడికల దేవుడు. అతడు వాళ్ళను తన ప్రజగాను, వాళ్లు అతన్ని తమ దేవుణ్ణిగాను స్వీకరించారు. ప్రభువు పితరులకు వాగ్దానం చేసిన కనాను దేశాన్ని వాళ్ళకు వారసభూమిగా ఇస్తాడు. యావే ప్రభువని యిస్రాయేలీయులకు అంతకు ముందు తెలియదు. ఇప్పుడు ఫరో దాస్యవిముక్తి ద్వారా తెలియవచ్చింది. యావే ఏకైక ప్రభువు. అతన్ని మించిన వాడు లేడు. ఫరోగాని అతడు కొలిచే దేవతలుగాని యావేను ఎదిరించలేరు.

ఐగుప్తు దాస్య విముక్తిద్వారా యిస్రాయేలీయులు యావేను ఏకైక ప్రభువుగా గుర్తించారు అన్నాం. కనుకనే మోషే “మా దేవుడైన యావేకు ఎవరూ సాటిరారు” అంటాడు - 8,10. యావేకూడ" ఈ సర్వప్రపంచంలో నావంటివాడు ఇంకొకడు లేడు” అంటాడు - 9,14. ఈ భూమండలానికంతటికీ అధిపతి ప్రభువే - 9,29. కనుకనే అతడు కానాను మండలాన్ని యిస్రాయేలీయులకు వారసభూమిగా ఈయగలిగాడు. ఆలాంటి ప్రభువుని యిస్రాయేలీయులు ఆరాధించాలి. అతన్ని తప్పితే మరొకర్ని కొలవగూడదు.

ఇక, ఒడంబడిక ద్వారా యిస్రాయేలీయులు ప్రభువు సొంత ప్రజలయ్యారు. వాళ్లు అతన్ని కొలిచే ప్రజలు, అతనిలాగే పవిత్రులైన ప్రజలు - 19, 5-6. ఆ కాలంలో యిస్రాయేలీయుల ఇరుగుపొరుగు జాతులు ఎవరికివాళ్లు ఓ సమాజంగా జీవించేవాళ్లు. ఒక్క సమాజంలోని వాళ్ళంతా పరస్పరం ఇచ్చిపుచ్చుకొంటూ అన్నదమ్ముల్లాగ ఐక్యభావంతో మనేవాళ్లు. యావే యిస్రాయేలీయులను కానాను మండలంలో స్థిరపడేలా చేసి వాళ్ళను ఓ సమాజంగా ఏర్పరచాడు. ఆ ప్రభువుని ఆరాధిస్తూ అతని పేరుమీదిగా వాళ్ళంతా పరస్పర ప్రేమతో సోదరుల్లాగ జీవించాలని కోరాడు.

ఈ రీతిగా ఐగుప్తు నిర్గమనం యావే ఏకైక ప్రభువనీ, అతన్ని కొలిచే యిస్రాయేలు ప్రజలంతా తోబుట్టువుల్లాగ కూడిమాడి జీవించేవాళ్ళనీ విశదపరచింది.

# 2. సాంఘిక న్యాయమూ, ధర్మశాస్త్రమూ

ప్రభువు మోషే ద్వారా ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు. దాన్ని అనుసరిస్తేనేగాని యిస్రాయేలీయులు యావేకు ప్రియపడరు. ఇక, ధర్మశాస్త్రం సాంఘిక న్యాయాన్ని పాటించమని ఉద్ఘోషిస్తుంది. ఆ కాలంలో మెసపొటామియా, ఐగుప్తు, బాబిలోనియా ప్రజలకుగూడ ధర్మశాస్త్రా లుండేవి. కాని వాటన్నిటికంటె అధికంగా మోషే ధర్మశాస్త్రం సాంఘిక న్యాయాన్ని పాటించమనీ పేదసాదల యెడల దయాదాక్షిణ్యాలతో ప్రవర్తించమనీ నొక్కి చెప్తుంది. ఆమోసు, యిర్మీయా, యెషయా, మొదలైన మహా ప్రవక్తలంతా ధర్మశాస్త్రం ఆదేశించే సాంఘిక న్యాయాన్ని నిక్కచ్చిగా పాటించాలని మాటిమాటికి హెచ్చరించారు. ఇక్కడ ధర్మశాస్త్రం నుండి సాంఘిక న్యాయానికి సంబంధించిన అంశాలను నాల్గింటిని పరిశీలించిచూద్దాం.

## 1. పరదేసులు, విధవలు, అనాథులు

మోషే ధర్మశాస్త్రం పరదేసులను వితంతువులను అనాథబాలలను కరుణతో ఆదరించాలని చెప్తుంది. "మీరు పరదేసులను పీడించుకూడదు, బాధించకూడదు. ఒకప్పుడు మీరుగూడ ఐగుప్తులో పరదేసులుగా వుండలేదా? మీరు విధవలనుగాని, అనాథులనుగాని, బాధించగూడదు. బాధిస్తే వాళ్లు నాకు మొరపెట్టుకొంటారు. నేను వాళ్ళ మొరవింటాను. నా కోపాగ్ని మీమీద రగుల్కొంటుంది. మిమ్ము నా కత్తికి బలి చేస్తాను. మీ భార్యలు వితంతువు లౌతారు. మీ బిడ్డలు అనాథులౌతారు" - నిర 22, 21-24. కనుక యిస్రాయేలీయులు పై మూడు వర్గాల వాళ్లపట్ల కరుణతో మెలగాలి.

ఇంకా ధర్మశాస్త్రం "మీరు పరదేసులకు అనాథులకు అన్యాయం చేయకూడదు. వితంతువు కట్టుబట్టలను తాకట్టుగా తీసికోరాదు." అంటుంది - ద్వితీ 24,17. పొలంలో సేద్యం జేసే రైతులు పై మూడు వర్గాలవాళ్ళనీ ఆదుకోవాలి. "మీరు పొలంలో పంటకోసేపుడు ఏదైనా వో కట్టను మరచిపోతే మళ్ళా దానికోసం వెళ్ళవద్దు. పరదేసులు అనాథులు వితంతువుల కొరకు దానిని వదలివేయండి. అప్పుడు ప్రభువు మీరు చేసే పనులన్నిటినీ దీవిస్తాడు. ఆలాగే మీరు ఓమారు ఓలివుపండ్లు కోసుకొన్నంక మళ్ళా రెండవమారు ఆ చెట్లవద్దకు వెళ్లవద్దు. ఆ మిగిలిన పండ్లను పరదేసులు అనాథులు వితంతువులకొరకు వదలివేయండి. ఓమారు ద్రాక్షపండ్లు కోసికొన్నంక మళ్లా రెండవమారు ఆ చెట్లవద్దకు వెళ్ళవద్దు. ఆ మిగిలిన పండ్లను పరదేసులు అనాథులు వితంతువులకొరకు వదలివేయండి. మీ మట్టుకు మీరుగూడ ఓ మారు ఐగుప్తులో బానిసలుగా వుండి

వచ్చినవాళ్ళే. కనుక నేను మీకు ఈ యాజ్ఞనిచ్చాను" - 24 : 19-22. మోషే ధర్మశాస్త్రానికి సమకాలికాలైన ఐగుప్త, మెసపొటామియా, హమ్మురబి ధర్మచట్టాలు చాలా వున్నాయి. కాని వాటిల్లో వేటిలోకూడ పేదలకోసమని ఇంత దయతో చేసిన శాసనం మరొకటి కన్పించదు.

ఇట్లంటే ధనవంతులు అనుభవింపగా మిగిలినది పేదల మొగాన వేసేవాళ్ళనికాదు. ప్రతి మూడవయేటి చివరన పండిన పంటలో పదియవవంతు సేకరించి నగరంలో నిల్వజేయాలి. ఈ పంట అనాథులు వితంతువులు పరదేసులు మొదలైన పేదలకోసం - 14:28-29. యూదులు తమతో వసించే పరదేసులను గూడ సజాతీయులనులాగే అంగీకరించి ప్రేమించాలి - లేవీ 19:34. ఈలా ప్రేమింపబడే హక్కు వాళ్ళకుంది.

ప్రభువుకి దీనజనులంటే అపారమైన దయ. కనుక పరదేసులు అనాథులు వితంతువులు మొదలైన బక్కవాళ్లహక్కులకు భంగం కలిగించేవాళ్ళను అతడు శపిస్తాడు - ద్వితీ 27:19.

నరులు ఎల్లప్పుడూ స్వార్ధపరులే. యూదులు మాత్రం పేదసాదలను ఆదరంతో చూస్తారా? కనుక ప్రవక్తలు ఈ యంశాన్ని మాటిమాటికి హెచ్చరించేవాళ్లు. యిర్మీయా రాజకుటుంబాన్ని ఉద్దేశించి "పరదేసులను అనాథులను వితంతువులను దోపిడి చేయవద్దు" అన్నాడు - 22 :3. యెషయా అనాథులనూ వితంతువులనూ ఆదుకోవాలి అని బోధించాడు - 1:17. కీర్తనకారుడు "ప్రభువే పరదేసులను పరామర్శిస్తాడు. వితంతువులనూ అనాథులనూ సంరక్షిస్తాడు" అన్నాడు - 146:9. ఇంకా, ప్రభువు అనాథులకూ వితంతువులకూ న్యాయం జరిగిస్తాడు. పరదేసులను ఆదరించి వారికి అన్నపానీయాలు అందిస్తాడు - ద్వితీ 10:18.

కాని ప్రభువు ఈ పరదేసులనూ అనాథులనూ వితంతువులనూ ఇంతగా పట్టించుకోవడం దేనికి? పరదేసులు వాళ్ల దేశాన్నీ వాళ్ళ జాతిజనులనూ విడిచిపెట్టివచ్చి యిస్రాయేలును ఆశ్రయించినవాళ్లు. అనాథులకు తల్లిదండ్రులు లేరు. వితంతువులకు భర్తృసంరక్షణం లేదు. అందుచేత దయామయుడైన ప్రభువు ధర్మశాస్త్రం ద్వారా ఈ మూడు వర్గాలవాళ్ళకు భద్రత కల్పించాడు. కనుక ఈ మూడు వర్గాలనూ ఆదరించడం యిస్రాయేలు ప్రజలకు తప్పనిసరి అయింది. ఇక, యూదులు ఈ దీనజనులను ఎందుకు పరామర్శించాలి అంటే, వాళ్లూ ఓమారు ఐగుప్తులో దీనజనులుగా వుంటే ప్రభువు వాళ్ళను ఆదుకొన్నాడు. "మీరు ఐగుప్తులో బానిసలుగా గ్రమగ్గుతూంటే మీ ప్రభువు మిమ్మచటినుండి విడిపించుకొని వచ్చాడు" - 24:18. ఈ విముక్తికి జ్ఞాపకార్థంగా యూదులు ఇప్పుడు

ఇతర దీనప్రజలను ఆదుకోవాలి. ఈ విధంగా పైమూడు వర్గాల నిరుపేదలను పురస్కరించుకొని ధర్మశాస్త్రం సాంఘిక న్యాయాన్ని పాటించమని చెప్తుంది.

## 2. ఇతరుల హక్కులను మన్నించాలి

యూదులు ఒకరి హక్కులను ఒకరు మన్నించాలని ధర్మశాస్త్రం ఖండితంగా చెప్తుంది. హత్య చేయకూడదు, వ్యభిచరించగూడదు, దొంగతనం చేయకూడదు - ఈలాంటి ఆజ్ఞలన్నీ తోడి నరుల హక్కులను కాపాడ్డంకోసమే ఉద్దేశింపబడ్డాయి. సొంత ప్రాణమూ, భార్యా, వస్తువులూ ఇవన్నీ నరునికి చెందినవి. వాటిమీద అతనికి హక్కు ఉంటుంది. ఆ హక్కుని ఎవరూ భంగం చేయగూడదు. - నిర్గ 20,13-15.

ఎవరి జంతువైనా తప్పిపోతే అవి కనిపించినవాళ్ళు వాటిని మళ్ళా యజమానునికి అప్పజెప్పాలి. "నీ తోడివాడి ఆవూగొర్రే తప్పిపోతూంటే నీవు చూచీచూడనట్లుగా ఉండగూడదు. వాటిని సొంతదారునివద్దకు తోలుకొనిపోవాలి. అతడు నీకు సమీపంలో లేకపోయినా, అసలు అతడెవరో నీకు తెలియక పోయినా, ఆ జంతువులను నీ యింటికి తోలుకొనిరావాలి. యజమానుడు వచ్చిందాకా అవి నీ యింటిలోనే వుంటాయి. అతని గాడిదా పైగుడ్డా జారిపోయినపుడుగూడ నీవు ఈలాగే చేయాలి. అతని వస్తువు ఏది జారిపోయినా ఈలాగే చేయాలి" - ద్వితీ 22:1-4.

దిక్కూ మొక్కూలేని దీనుడికి అందరూ అన్యాయం చేస్తారు. కనుక ధర్మశాస్త్రకారుడు నిరుపేద కూలీలను రక్షించే తలంపుతో ఈ క్రింది నియమం చేసాడు. "పేదకూలివాణ్ణి, అతడు స్వజాతీయుడైనాసరే విజాతీయుడైనాసరే, పీడించవద్దు. సూర్యుడు అస్తమించకమునుపే ఏనాటికూలి ఆనాడు వాడికి ముట్టజెపుతూండాలి. వాడు నిరుపేద గనుక ఆ కూలికోసం కనిపెట్టుకొని వుంటాడు. వాడు నాకు మొరపెడితే నేను మిమ్ము దోషులనుగా గణిస్తాను." - 24:14-15. ఈ శాసనంలో ఎంత సాంఘిక న్యాయం ఇమిడివుందో ఆలోచించండి!

## 3. యూదులపట్ల విశేష కరుణ

యూదులు తోడి యూదులపట్ల విశేష కరుణను ప్రదర్శించాలని చెప్తుంది ధర్మశాస్త్రం. విజాతీయులకంటె స్వజాతీయులు అధికంగా కరుణింపదగినవాళ్ళు. ఇక్కడ వడ్డీ, బానిసలు, కొలతలు అనే మూడంశాలు పరిశీలిద్దాం.

మొదటిది వడ్డీ. "మీరు నా జనుల్లోని ఓ పేదవానికి సొమ్ము అప్పుగానిస్తే వానితో వడ్డీవ్యాపారివలె ప్రవర్తించగూడదు. వానినుండి వడ్డీ పుచ్చుకోరాదు. మీరు మరియొకని నిలువుటంగీని కుదువసొమ్ముగా తీసికొంటే ప్రొద్దు క్రుంకక మునుపే దాని

నతనికి తిరిగి ఇచ్చివేయాలి. కప్పుకొనడానికి అతనివద్ద ఉన్నదదే. అతడు వంటిమీద కప్పుకొనే నిలువుటంగీ అదే. అదికాస్త తీసికొనిపోతే అతడేమి కప్పుకొని పండుకొంటాడు? అతడు మొరపెట్టుకొంటే నేనతనిమొర వింటాను. నేను దయామయుణ్ణి" - నిర్గ 22, 25-27. ఈ నియమాన్నిబట్టి యూదులు యూదులదగ్గర వడ్డీ తీసికోగూడదు. కాని అన్యజాతులవాళ్ళ వద్దనుండి మాత్రం వడ్డీ పుచ్చుకోవచ్చు - ద్వితీ 23,20. ఇంకా యిస్రాయేలీయులు తోడి యూదుల నుండి తిరుగలిరాతిని కుదువ సొమ్ముగా తీసికోగూడదు. అలా చేస్తే అతని జీవనాధారం పోతుంది - 24,6. అలాగే వితంతువు కట్టుబట్టను తాకట్టుగా తీసికోగూడదు. అలా తీసికొంటే ఆవిడ చలిలో ఏమి కప్పుకొంటుంది? - 24, 17.

ఇంకో సంగతి. పేదవాడికి అరువిచ్చినపుడుగూడ వాడి యింటికిపోయి అతని వస్తువులను కుదువసొమ్ముగా గుంజుకొని రాకూడదు. అసలు అతనియింటిలో అడుగు పెట్టగూడదు. ఆ దరిద్రుడు తన చేతిమీదగానే వస్తువును వెలుపలికి తెచ్చి యిచ్చినదాకా ఆగాలి. "నీవు పొరుగువాడికి ఏదైనా ఎరువిచ్చినపుడు దానికి బదులుగా ఏవస్తువునైనా కుదువగా తీసికొనడానికై వాని ఇంటిలోకి వెళ్ళకూడదు. నీవు బయటనే వుండాలి. అరువు తీసికొన్నవాడు తాను తాకట్టు వస్తువును నీ వద్దకు తీసికొని వస్తాడు. పైగా అతడు పేదవాడైతే నీవు రాత్రిపూటగూడ అతని తాకట్టు బట్టను అట్టిపెట్టుకోగూడదు. మునిమాపున నీవా బట్టను తిరిగి ఇచ్చివేస్తే అతడు కప్పుకొని పండుకొంటాడు. నిన్ను దీవిస్తాడుగూడ. ఈలా చేస్తే ప్రభువు నిన్ను మెచ్చుకొంటాడు" - ద్వితీ 24,10-13.

రెండవది, బానిసలు. యిస్రాయేలు బానిసలకు చాల హక్కులుండేవి. అన్యజాతి బానిసలకు మాత్రం ఏ హక్కులూ వుండేవికావు. హీబ్రూ ప్రజలు మూడు విధాలుగా బానిసలయ్యే వాళ్లు. మొదటిది, దొంగతనం చేసి ఆ దొంగిలించిన సొమ్మును తీర్చలేకపోతే బానిసలయ్యేవాళ్లు. - నిర్గ 22,2. రెండవది, పేదవాళ్లు తమ్ముతామే బానిసలనుగా అమ్ముకొనేవాళ్లు - లేవీ 25,39. మూడవది, తండ్రి ఏండ్లురాని కూతురుని బానిసగా అమ్మవచ్చు. నిర్గ 21,7. పైమూడు రకాల బానిసలూ ఆరేండ్లు మాత్రమే బానిసంచేసి ఏడవయేడు స్వేచ్ఛను పొందవచ్చు. - నిర్గ 21,2. ఆలా స్వేచ్ఛను పొంది వెళ్ళిపోయేపుడు యజమానుడు అతనికి కొన్ని గొర్రెలూ, ధాన్యమూ, ద్రాక్షసారాయమూ కానుకగా ఇవ్వాలి - ద్వితీ 15:14. యిస్రాయేలీయుడు యిస్రాయేలు బాలికను బానిసగా గొని తన భార్యను చేసికొంటే, ఆమెవలన అతనికి సంతృప్తి కలుగకపోతే, ఆమెను అన్యులకు బానిసగా అమ్మివేయకూడదు. - నిర్గ 21,2. తండ్రి తాను బానిసనుగా కొన్న బాలికను తన కుమారునికిచ్చి పెండ్లిచేస్తే ఆమెను సొంత కూతురినిలాగే చూచుకోవాలి - 21,9.

యూద బానిస నీచమైన పనులు చేయనక్కరలేదు. నీచపు పనులంటే యజమానుల చెప్పులు విప్పడమూ, వాళ్ళ కాళ్లు కడగడమూ మొదలైన కార్యాలు. కనుక నూత్నవేదంలో స్నాపక యోహాను "నేను క్రీస్తు చెప్పులవారు విప్పడానికి గూడ యోగ్యుణ్ణి కాదు" అంటే తాను బానిసకన్న తక్కువవాడని భావం - యోహా 1,27. ఇంకా పేత్రు క్రీస్తుని తన కాళ్లు కడగనీయకపోవడానికి కారణం, ఆ పని యూద బానిసలు కూడ చేయరు. యజమానుల కాళ్లు కడగడం అన్యజాతి బానిసల పని - యోహా 13,6.

యూదబానిస చక్కగా భుజించవచ్చు. దుస్తులు తాల్చవచ్చు. పడక మీద పండుకొనవచ్చు. మామూలుగా అతన్నికూడ కుటుంబ సభ్యుణ్ణిగానే గణించేవాళ్లు. అతడూ ప్రభువుని ఆరాధించేవాడు. విశ్రాంతిదినాన పని మానుకొనేవాడు, కుటుంబం అర్పించే బలిలో పాలు పొందేవాడు, పాస్కబలి మొదలైన వాటిల్లో పాల్గొనేవాడు. ఒకోమారు అతనికి యజమానుని ఆస్తిలో వాటా వచ్చేది. యజమానునికి సంతానం లేనప్పుడు అతడే వారసు కూడ అయ్యేవాడు - ఆది 15,3. అబ్రాహాము బానిసయైన యెలియసేరు యజమానుని కుమారునికి పిల్లను కుదుర్చుకొని రావడానికై పదనారాముకు వెళ్లాడు. అక్కడినుండి రిబ్కాను వెంటబెట్టుకొని వచ్చాడు. అబ్రాహాము ఇతన్ని ఓ కుటుంబ సభ్యునిలాగా ఆదరాభిమానాలతో చూచుకొన్నాడు. కాని అందరు యజమానులూ తమ బానిసలను ఇంతగా ఆదరించివుండరు - ఆది 24.

యూదులు యూదజాతి బానిసలను ఈలా దయతో చూచేవాళ్లు. అసలు ఈ బానిసల బ్రతుకు బానిసంలా వుండేదేకాదు. నిజం చెప్పాలంటే యిస్రాయేలీయులు ఒకరికొకరు బానిసలు కాదు. వాళ్లు ప్రభువుకి మాత్రమే బానిసలు - లేవీ 25,42. యిస్రాయేలీయులను యావే ఐగుప్తునుండి విడిపించుకొని వచ్చాడు. వాళ్ళంతా అతనికి బానిసలు. కనుక ఏ యిస్రాయేలీయుడూ తోడి నరునికి శాశ్వతంగా బానిస కావడానికి వీల్లేదు. ఈలా యూదులు యూద బానిసలను చూచే తీరులో కూడ సాంఘిక న్యాయాన్ని పాటించమంది ధర్మశాస్త్రం.

మూడవది, తూకాలు. ప్రభువు పేద ప్రజల కోపు తీసికొనేవాడు. కాని ధనవంతులు దొంగతూకాలతో బక్కవాళ్ళకు అన్యాయం చేస్తున్నారు. కనుక ధర్మశాస్త్రం దొంగతూకాలను ఖండించి మంచితూకాలను వాడమని హెచ్చరించింది. ఆసబోతులైన ధనవంతులు తమకొక తూకపురాతినీ ఇతరులకు ఇంకొక తూకపు రాతినీ వాడేవాళ్లు. ధర్మశాస్త్రం ఈ మోసాలను ఖండించింది. "ఒకటి పెద్దది ఒకటి చిన్నదిగా రెండు తూకపు రాళ్ళను మీ సంచిలో ఉంచుకోవద్దు. ఒకటి పెద్దది ఒకటి చిన్నదిగా రెండు కొలమానాలను

మీరు వాడవద్దు. సక్రమమైన తూకపురాతిని ఒక్కదాన్నే ఉపయోగించండి. అప్పుడు ప్రభువు మీ కిచ్చిన గడ్డమీద మీరు చిరకాలం జీవిస్తారు. తూకాల్లో కొలమానాల్లో మోసం జేసేవాళ్ళను ప్రభువు ఈసడించుకొంటాడు" - ద్వితీ 25,13 -16. "దొంగతూకాలనూ దొంగ కొలమానాలనూ వాడేవాళ్ళను ప్రభువు అసహ్యించుకొంటాడు" - సామె 20,10. దొంగ తక్కెళ్ళను వాడేవాళ్ళను అతడు చీదరించుకొంటాడు. న్యాయమైన తూకాలు తూచేవాళ్ళంటె అతనికి ఇష్టం - 11,1.

ప్రభువుకి పేదప్రజలంటే అపారమైన కరుణ గనుక ధనవంతులు వాళ్ళకు అన్యాయం చేయకుండా ఉండాలని అతని కోరిక. అతని ఆజ్ఞమీరి పేదలను బాధించినవాళ్ళని ఆ ప్రభువు శిక్షిస్తాడు. అతడు పీడితులకు కొమ్ము కాసేవాడు. - కీర్త 146,7. దరిద్రులంటే ఆ ప్రభువుకి ఎంత దయో అర్థం చేసికోవడానికి ఈ వొక్క శాసనం చాలు. "మీరు ఎవరిని మోసగించవద్దు. ఎవరికీ అన్యాయం చేయవద్దు. మీకు కూలిచేసిన కూలివాని కూలిని ఒక్కరేయికూడ మీవద్ద ఉంచుకోవద్దు. చెవిటివానిని శపించవద్దు. గ్రుడ్డివాని కాళ్ళకు ఏదైనా అడ్డంపెట్టి వాణ్ణి క్రిందపడవేయవద్దు" - లేవీ 19,13-14.

## 4. విశ్రాంతి వత్సరం

యూదప్రజల్లో నాడునాటికి స్వార్థం పెరిగిపోయింది. ధనవంతులు పేదలను బానిసలనుజేసి వాళ్ళచేత వెట్టిచాకిరి చేయించుకొంటున్నారు. వాళ్ళ పొలాలను స్వాధీనం చేసికొంటున్నారు. ఈ యన్యాయాలను అరికట్టడానికై ధర్మశాస్త్రం ముందుగనే రెండు నియమాలు చేసింది. మొదటిది విశ్రాంతి వత్సరం. రెండవది విడుదల వత్సరం. ఈ రెండిటిని పరిశీలిద్దాం.

విశ్రాంతి వత్సరం ప్రతి యేడవయేడు వచ్చేది. ఈ యేట యూదబానిసలందరికి స్వాతంత్ర్యం వచ్చేది. వాళ్లు పూర్వం బాకీలవల్ల బానిసలయ్యారు. ఏడవయేట ఆ బాకీలన్నీ రద్దయ్యేవి. వాళ్ళకు స్వేచ్ఛ లభించేది. ఈలా యూదబానిసలు ఆరేండ్లు పనిచేసి ఏడవయేడు స్వాతంత్ర్యం సంపాదించుకొనేవాళ్లు.

ఇంకా ఈ విశ్రాంతియేట పొలాన్ని దున్నకుండా బీడుగా వుంచేవాళ్లు. భూమికూడా విశ్రాంతి పొందాలనీ దానిలోని సారం సమసిపోకుండా వుండాలనీ ఈ నియమం భావం. మామూలుగా దేవుడు ఆరవయేడు ఇబ్బడిగా పంటనిచ్చేవాడు. ఆ పంటతోనే ప్రజలు నేల బీడుగావున్న ఏడవయేడుకూడ బ్రతికేవాళ్లు.

ఈ యంశాలన్నీ ద్వితీయోపదేశకాండంలో వర్ణింపబడ్డాయి. "ప్రతి యేడవయేటి చివర మీకు బాకీపడినవాళ్ళ అప్పులను రద్దు చేయాలి. ప్రతి ఋణదాత తోడి యిస్రాయేలీయుల కిచ్చిన బాకీలను వదలుకోవాలి. ప్రభువే బాకీలు రద్దయినవని ప్రకటిస్తున్నాడు గనుక మీరు వాటిని వసూలుచేయడం తగదు. మీరు విజాతీయులనుండి బాకీలు రాబట్టుకోవచ్చుగాని స్వజాతీయుల నుండిమాత్రం రాబట్టుకోగూడదు. ఈలా చేస్తే ప్రభువు మీకిచ్చే గడ్డమీద మీకు దీవెన లభిస్తుంది. మీరు ప్రభువు ఆజ్ఞను పాటిస్తే ఇక మీలో పేదలంటూ వుండరు. ప్రభువు తాను మాట ఇచ్చినట్లే మిమ్ము దీవిస్తాడు. ఫలితంగా మీరు చాలా జాతులకు అప్పులిస్తారుగాని ఏజాతినుండిగూడ అప్పు తీసికోరు. మీరు చాల జాతులమీద అధికారం చెలాయిస్తారుగాని ఏజాతిగూడ మీమీద పెత్తనం చేయలేదు. దేవుడు మీకిచ్చిన ఈ గడ్డమీద ఏపట్టణంలో నైనాసరే పేద యిస్రాయేలీయుడు ఎవడైనా వుంటే స్వార్థబుద్ధితో అతనికి సాయం చేయడం మానకండి. ఉదారబుద్ధితో అతనికి వలసినంత సాయం చేయండి. అప్పులు రద్దయ్యే విశ్రాంతి వత్సరం దగ్గరికొస్తుందిగదా అన్న నీచభావంతో అక్కరలోవున్నవారికి సాయం చేయడం మానకండి. మీరు ఆలాచేస్తే అతడు ప్రభువైన నాకు మొరపెట్టుకొంటాడు. అప్పుడు నేను మిమ్ము అపరాధులనుగా గణిస్తాను. కనుక మీరు ఉదారబుద్ధితో తోడివారికి సాయం చేయండి. అప్పుడు ప్రభువు మీరు చేసే పనులన్నీ దీవిస్తాడు" - 15:1-10.

పై వాక్యాల భావం ఇది. యిస్రాయేలీయులు తోడి యూదులపట్ల సాంఘిక న్యాయాన్ని పాటించాలి. అక్కరలోవున్న పేదవాళ్ళను ఆదుకోవాలి. ఏడవయేడు అప్పులు రద్దవుతాయన్న భావంతో పేదవాళ్ళకు సహాయం నిరాకరించగూడదు. వాళ్ళకు సాయం చేయకపోతే పాపం తగుల్తుంది. సహాయం చేసినవాళ్ళని దేవుడు దీవిస్తాడు.

ఇక పై విశ్రాంతి వత్సరంలాంటిదే విడుదల సంవత్సరం కూడ. ఇది ప్రతి యేబదియవయేట వచ్చేది. బాకీలవలన భూములు పోగొట్టుకొన్న పేదవాళ్లు ఈ యేబదియవయేట మళ్ళా తమ భూములను తాము పొందవచ్చు. అనగా ధనవంతులు పేదవాళ్ళ భూములను శాశ్వతంగా ఆక్రమించుకోవడానికి వీల్లేదు. ఏబదియవయేట ఎవరి పొలాలను వాళ్ళకు వదలివేయాలి - లేవీ 25,8-13. ఈలా విశ్రాంతి వత్సరమూ, విడుదలయేడూ పేదలకు మేలు చేసాయి.

ఇక్కడే భూమినిగూర్చిన యిస్రాయేలీయుల భావం కూడ అర్థంజేసికోవాలి. ఐగుప్తులో నేల అంతా ఫరో రాజుకు గాని దేవాలయాలకు గాని చెందివుండేది. మెసపొటామియాలో నేల రాజులకూ దేవాలయాలకే గాక కుటుంబాలకూ వ్యక్తులకూ గూడ చెందివుండేది. ఇక, యిస్రాయేలీయులకు నేలను గూర్చి ఓ ప్రత్యేకభావం వుండేది.

నేడు మనం మన పొలాన్ని మన సొంతభూమిగా భావిస్తాం. కాని పూర్వం యిస్రాయేలీయులకు ఈ భావం వుండేది గాదు. యూదులనుభవించే వాగ్దత్త భూమి, అనగా కనాను మండలం, వాళ్ళది కాదు. ప్రభువుది. అతడు ఆ భూమిని యూదులకు గుత్తకిచ్చాడు. వాళ్ళు పరదేసుల్లాగ దాన్ని అనుభవించాలి - లేవీ 25,23-24. కనుక ఎవ్వరూ వాగ్దత్త భూమిని శాశ్వతంగా అమ్మలేరు. శాశ్వతంగా కొనుక్కోలేరు కూడ. అది ప్రభువుది. యూదులు దానికి ధర్మకర్తలు మాత్రమే.

ఇంకా ప్రభువు ఈ నేలను పండ్రెండు గోత్రాల వాళ్ళకు పంచియిచ్చాడు. కనుక వాళ్ళందరూ ఓ సమాజంగా జీవిస్తూ ఆ భూమిని సమంగా పంచుకొని అనుభవించాలి. ఎవరైనా అత్యాశతో గట్టురాళ్ళను తొలగించి తన పొరుగువాడి పొలాన్ని ఆక్రమించుకొంటే ప్రభువు వాణ్ణి శపిస్తాడు. ఈలాంటి పాపులనుద్దేశించి హోషేయా ప్రవక్త "యూదానాయకులు గట్టురాళ్ళు తొలగిస్తున్నారు. నా కోపం వాళ్ళమీదికి ఓ ప్రవాహంలాగ దిగివస్తుంది అన్నాడు - 6,10. ఇంకా సామెతల గ్రంథం "మీ పూర్వులు పాతిన గట్టురాళ్ళను తొలగించవద్దు" అంటుంది - 23, 29.

కనుక పూర్వవేదప్రజలకు మనకులాగ సొంతభూమి అనే భావంలేదు. వాళ్ళకు యావే భూమిని మేము అనుభవిస్తున్నాం అనే భావం వుండేది. మాతోపాటు తోడి జనం గూడ ఆ భూమిని అనుభవించాలి, ప్రభువు పండ్రెండు గోత్రాలవాళ్ళకీ వాగ్దత్త భూమిని ఇచ్చాడు అనే భావంకూడ వుండేడిది. ఈ యూదుల భావంనుండి నేడు మనంకూడ ఓ నీతిని నేర్చుకోవాలి. భగవంతుడు భూమిని అందరు నరులకోసమూ సృజించాడు. కాని మనదేశంలో కొద్దిమంది తెలివైనవాళ్లూ ధనవంతులూ ప్రోగై మొత్తం నేలలో 60 శాతం ఆక్రమించుకొన్నారు. మిగతా దేశానికంతటికీ నలభైశాతం నేలను మాత్రమే వదలివేసారు. ఇది పెద్ద సాంఘిక అన్యాయం. ఇటీవలి భూసంస్కరణలు కూడ ఈ యన్యాయాన్ని పెద్దగా చక్కదిద్దలేక పోయాయి.

ఇక ధర్మశాస్త్రానికి వద్దాం. మోషేధర్మశాస్త్రం దయకూ కారుణ్యానికి పెట్టింది పేరు. న్యాయస్థానంలో దోషిని కొరడా దెబ్బలతో శిక్షించేపుడు నలభై దెబ్బలతో ఆగాలి. అంతకన్నా ఎక్కువగా కొడితే అతన్ని బహిరంగంగా అవమానించినట్లవుతుంది - ద్వితీ 25,3. ఒక్క నరులమీదనేగాదు, పక్షులమీద వృక్షాలమీదగూడ కనికరం జూపాలి అంటుంది ధర్మశాస్త్రం. "మీరు అటూయిటూ వెళ్ళేప్పుడు చెట్టుమీదనో నేలమీదనో ఓ పక్షిగూడు కన్పించిందనుకోండి. ఆ గూటిలో తల్లిపక్షి గ్రుడ్లమీదనో పిల్లలమీదనో కూర్చుండి

వుందనుకోండి. మీరు ఆ పొదుగుతూవున్న తల్లిపక్షిని పట్టుకొని పోకూడదు. కావాలంటే పిల్లలను తీసికోండి గాని తల్లిని మాత్రం పట్టుకోవద్దు. ఈలా చేస్తే మీకు దీర్ఘాయువు కలుగుతుంది. మీరు వృద్ధిలోకి వస్తారు గూడ" -22,6-8.

పూర్వం రాజులు శత్రుపట్టణాలను పట్టుకొన్నపుడు అక్కడి పండ్లచెట్లను నరికించేవాళ్లు. పాలస్తీనా దేశంలో శత్రువులు విశేషంగా ఓలివులూ, ద్రాక్షలు, అత్తిచెట్లూ కొట్టించారు. కాని ధర్మశాస్త్రకారుడికి ఈ పద్ధతి నచ్చలేదు. కనుక అతడు యూదులు శత్రునగరాలను ఆక్రమించుకొన్నపుడు అక్కడి పండ్లచెట్లను ముట్టుకోవద్దని శాసించాడు. "మీరేదైనా శత్రునగరంమీద బడి ముట్టడి కొనసాగించేపుడు అక్కడి చెట్లను గొడ్డలితో నరికివేయవద్దు. ఆ చెట్ల పండ్లను భుజించండిగాని వాటిని నరికి వేయకండి. పొలంలోని చెట్లను గూడ ముట్టడించడానికి అవేమి నరులాయేమిటి?" - 20,19. ఈలాంటి కరుణాపురితాలైన శాసనాలను పేర్కొందిగనుకనే మోషే ధర్మశాస్త్రం ఆనాటి సమకాలీన ధర్మశాస్త్రాలన్నింటికంటె మిన్నయైనదని చెప్తారు.

కడన ఒక్క ప్రశ్న అడగాలి. ధర్మశాస్త్రం ఇన్ని మంచి శాసనాలు చేసింది. పేదలను పీడించవద్దనీ సాంఘికన్యాయం పాటించమనీ చెప్పింది. కాని యూదులు ఈ నియమాలను పాటించారా? ధర్మశాస్త్రకారుడు ఎంతవరకు కృతకృత్యుడయ్యాడు? యూదులు చాలమంది స్వార్థబుద్ధితో ఈ శాసనాలను పాటించలేదు. ఈ నియమాలను లెక్కచేయకుండా పేదలను పీడించదల్చుకొన్నవాళ్లు పీడించారు. ఐనా తోడినరుణ్ణి పీడించాలి అని మానవుడి హృదయాంతరాళంలో సహజంగానే వుండే దుష్టవాంఛను ఈ నియమాలద్వారా ధర్మశాస్త్రం కొంతవరకైనా అరికట్టగలిగింది. ఈ దృష్టితో పరిశీలిస్తే ధర్మశాస్త్రం సాంఘికన్యాయాన్ని బోధించి, అమలుపరచి, పేదవాడికి రక్షణ చేకూర్చిందనే చెప్పాలి.

# 3. సాంఘిక న్యాయమూ, అధికారులు

న్యాయాధిపతులూ రాజులూ సాంఘికన్యాయాన్ని రక్షించాలి. వీళ్ళను ఈ పదవుల్లో నిల్పిన ప్రభువే సాంఘిక న్యాయాన్ని కాంక్షించేవాడు. కనుక అతనివల్ల అధికారంలోకి వచ్చినవాళ్లుకూడ న్యాయాన్ని కాపాడాలి. ఇంకా ధనవంతులు కూడ సాంఘిక న్యాయాన్ని సంరక్షించాలి. ఈ మూడు వర్గాలవాళ్ళూ ఈ ధర్మాన్ని ఏలా పాటించాలో పరిశీలిద్దాం.

## 1. న్యాయాధిపతులు

యిస్రాయేలు న్యాయాధిపతులు రెండురకాలుగా వుండేవాళ్లు. మొదటిరకంవాళ్లు ఆయా గోత్రాలకు పెద్దలు. వీరు నగర ద్వారంవద్ద కూర్చుండి తగాదాలు పరిష్కరించేవాళ్ళు,

ప్రజలే వీళ్ళను ఎన్నుకొన్నారు. రెండవరకంవాళ్ళు రాజులచే అధికారపూర్వకంగా నియమింపబడినవాళ్లు.

న్యాయాధిపతుల బాధ్యతలు ఇవి. మీరు "న్యాయం చెప్పేప్పుడు అన్యాయం చేయకూడదు. తీర్పు చెప్పేప్పుడు పేదవాళ్ళకోపు తీసికోనూరాదు, ధనవంతులకు భయపడనూరాదు. ధర్మబుద్ధితో తోడివాడికి తీర్పు చెప్పాలి - లేవీ 19,15. అధిక సంఖ్యాకుల అభిప్రాయంతో ఏకీభవించి న్యాయానికి భంగం కలిగించకూడదు - నిర్గ 23,2. న్యాయకర్తలు పేదవాణ్ణి మోసగించి తీర్పు చెప్పకూడదు. - 23,6.

ఇన్ని శాసనాలున్నా కొందరు న్యాయమూర్తులు ధర్మసమ్మతంగా తీర్పు చెప్పేవాళ్లుకాదు. కనుకనే కీర్తనకారుడు వాళ్ళను ఈలా హెచ్చరించాడు:

"మీ అన్యాయపు తీర్పులు ఇక చాలు
దుర్మార్గులకు అనుకూలంగా తీర్పు చెప్పకండి
పేదలకు అనాథులకు న్యాయం జరిగించండి
దీనులకూ బికారులకూ న్యాయం చేకూర్చండి
దుష్టులనుండి వారిని విడిపించండి" - కీర్త 82:2 -4.

కొందరు న్యాయాధిపతులు లంచాలు తీసికొని న్యాయం చెరిచేవాళ్లు. ఈలాంటివాళ్ళను ఆమోసు ప్రవక్త నిశితంగా విమర్శించాడు :

"అన్యాయపు న్యాయమూర్తులు లంచాలు తీసికొని
మంచివాళ్లను అమ్మివేస్తున్నారు
ఒక జోడు చెప్పులు లంచంగా పుచ్చుకొని
పేదవాణ్ణి అమ్మివేస్తున్నారు" - 2,6.

నగరద్వారంవద్ద అన్యాయమైన తీర్పుచెప్పే పెద్దలను న్యాయస్థానాలు ఏవగించుకొంటున్నాయి - 5,10. ఈలాంటి పరిస్థితుల్లో మంచివాళ్లు తమ తగాదాలను అసలు న్యాయస్థానాలకు తీసికొనిరావడమే లేదు. - 5:13. కనుకనే ప్రవక్త న్యాయాధిపతులను ఈలా హెచ్చరించాడు:

"మీరు చెడ్డను విడనాడి మంచిని చేపట్టండి
ఆలా చేస్తే బ్రతికిపోతారు
సర్వశక్తిమంతుడైన ప్రభువుకూడ
మీకు తోడ్పడతాడు
మీరు న్యాయస్థానాల్లో ధర్మం జరిగించండి

అప్పుడు ప్రభువు ఈ దేశంలో
మిగిలివున్న ప్రజలనైనా కరుణిస్తాడు" - 5 :14-15

ఇంకా యెషయా ఈలా అన్నాడు న్యాయాధిపతులతో :
"మీరు డబ్బు తీసికొని దుర్మార్గులను వదలివేస్తున్నారు
సన్మార్గులకు న్యాయం చెరుస్తున్నారు" - 5:23.

ఈలా ధర్మశాస్త్రమూ ప్రవక్తలూకూడ న్యాయాధిపతులు సాంఘిక న్యాయాన్ని పాటించాలని ఉద్ఘోషించారు.

## 2. రాజులు

న్యాయాధిపతుల తర్వాత న్యాయాన్ని కాపాడవలసినవాళ్లు విశేషంగా రాజులు. యిర్మీయాప్రవక్త రాజులనుగూర్చి ఈలా పలికాడు : "ప్రభువునైన నా యాజ్ఞ యిది. మీరు నీతి నియమాలను పాటించండి. దోపిడిచేసేవాడి చేతుల్లోనుండి పేదవాణ్ణి కాపాడండి. పరదేసులనూ అనాథులనూ విధవలనూ పీడించనూవద్దు బాధించనూవద్దు. ఈ పవిత్ర స్థలంలో నిరపరాధుల నెత్తురు చిందింపవద్దు. మీరు నా యాజ్ఞలు పాటిస్తే అప్పుడు దావీదు వంశీయులు రాజులుగా కొనసాగుతారు. వాళ్ళు తమ అధికారులతోను ప్రజలతోను గలసి రాజప్రాసాద ద్వారంగుండా గుఱ్ఱాలమీదా రథాలమీదా పయనిస్తారు. కాని మీరు నా మాట పాటించపోతే ఈ ప్రాసాదం సర్వనాశమౌతుంది. ఇది ప్రభువునైన నా పలుకు" - 22:3-5.

కాని చాలమంది రాజులు సాంఘిక న్యాయాన్ని లెక్కచేయకుండా దరిద్రులను పీడించారు. ఆలాంటి రాజుల్లో ఒకడైన యొయాకిమును యిర్మీయా ఈలా మందలించాడు:

"అన్యాయాలతో మేడకట్టించేవాడు
అక్రమాలతో మీదిగదులు నిర్మించుకొనేవాడు
తోడి జనంతో ఊరికే చాకిరి చేయించుకొని
కూలి ఎగగొట్టేవాడు, సర్వనాశమైపోతాడు
నీ దృష్టీ నీ కోరికా యెప్పుడూ స్వార్థలాభంమీదనే
నీవు నిరపరాధుల నెత్తురు ఒలికించావు
ప్రజలను పీడించి పిప్పిచేసావు" - 22 :13 -18

ఈలాంటి దుర్మార్గపు పనులుచేసి దరిద్రులకు అన్యాయం చేసిన రాజులు ఇంకా ఎంతోమంది వున్నారు.

## 3. ధనవంతులు

న్యాయాధిపతులూ రాజులకంటెగూడ ధనవంతులను అధికంగా చీవాట్లుపెట్టారు ప్రవక్తలు. యిస్రాయేలు సమాజంలో క్రమేణ ధనవంతులు పేదలు అనే రెండుశాఖలవాళ్లు ఏర్పడ్డారు. ఓ వైపు పేదలు మలమలమాడి చస్తూంటే మరోవైపు ధనవంతులు సుఖభోగాలతో హాయిగా కాలం వెళ్లబుచ్చుతున్నారు. ఆకాలంలో ధనవంతులకు వేసవికాలపు గృహాలూ శీతాకాలపు గృహాలూ వేరువేరుగా వుండేవి. కనుకనే ఆమోసు ప్రవక్త ఈలా అన్నాడు :

"మీ శీతాకాలపు గృహాలనూ వేసవికాలపు ఇండ్లనూ
దంతంతో అలంకరించిన నివాసాలనూ
నేను కూల్చివేస్తాను" - 3,15.

ఈ ధనవంతులుచేసే అన్యాయాలను యెషయా పేర్కొన్నాడు :

"ఇంటికియిల్లూ చేనికిచేనూ చేర్చి
అంతా తామే ఆక్రమించుకొంటున్నారు
దేశమంతా తమ స్వాధీనం చేసికొంటున్నారు" - 5,8.

ఈ ధనవంతులు చేసే దోపిడిని మీకా ఈలా వర్ణించాడు :

"దుష్టులు హాయిగా పడకలమీద పండుకొని
దుర్మార్గపు పన్నాగాలు పన్నుతూన్నారు
తెల్లవారగానే ఆ పన్నుగడలు సాధిస్తారు
వాళ్ళకు బలముందిగదా!
ఇతరుల పొలాలు కావలసివస్తే
వాటిని ఆక్రమించుకొంటారు
ఇండ్లు కావలసివస్తే వాటినీ కాజేస్తారు
ఆ యిండ్లతోబాటు వాటిల్లోని
కుటుంబాలనుగూడ స్వాధీనం చేసికొంటారు" - 2, 1-2.

ఆమోసు ప్రవక్త ఈ ధనవంతుల సుఖజీవనాన్ని తీక్షణంగా ఖండించాడు :

"దంతపు మంచాలమీద పండుకొని
మెత్తని పాన్పులమీద దొర్లుతూ
మంచి గొర్రెపిల్లలను క్రొవ్విన దూడలనూ భుజించే
ధనవంతులకు దుర్గతి తప్పదు
మీరు దావీదులాగ పాటలుకట్టి
వీణలమీద పాడుతూన్నారు

పాత్రలనిండ ద్రాక్షసారాయం సేవిస్తున్నారు
వంటినిండ శ్రేష్ఠమైన పరిమళం పూసికొంటున్నారు
కాని యిస్రాయేలు ప్రజ నాశమౌతుందే అని
మీకు చింతాకంత జాలిగూడలేదు
ఇకనేం, ప్రవాసానికివెళ్ళే బందీల్లో
మీరే మొదటివాళ్లౌతారు
అప్పుడుగాని మీ పండుగలూ విందులూ
తుదిముట్టవు" - 6, 4-7.

అకాలపు ధనిక స్త్రీలుకూడ పేదప్రజలను పీడించారు. తమ సుఖంకోసం పేదలను దోచుకొనిరమ్మని భర్తలను పురికొల్పారు. ఆమోసు ఆ ధనవంతులనుకూర్చి ఈలా అన్నాడు:

"సమరయస్త్రీలారా వినండి !
మీరు భాషాను ఆవుల్లాగ తెగబలిసిపోయారు!
మీరు పేదలను బాధించి పీడిస్తున్నారు
మద్యం తీసికొనిరమ్మని మీ భర్తలను వేధిస్తున్నారు.
కాని పరిశుద్ధుడైన ప్రభువు ఈలా అంటున్నాడు
శత్రువులు వచ్చి మిమ్ము గాలాలతోపట్టి లాగుతారు
మీరంతా గాలానికి తగిలిన చేపల్లాగౌతారు
గోడలోని గండ్లద్వారా మిమ్మందరినీ
బయటికి ఈడ్చుకొని పోతారు" - 4, 1-4

ఆ కాలంలోని ధనవంతుల దుష్కృత్యాలను ప్రవక్తలు పేర్కొన్నారు. హోషేయ ఈలా అన్నాడు :

"ఈ దేశప్రజల్లో విశ్వాసంలేదు
దయలేదు, దైవజ్ఞానంలేదు - ఎటుచూచినా
అబద్ధాలు, కూటసాక్ష్యాలూ, హత్యలూ, దొంగతనాలూ
వ్యభిచారాలూ, నేరాలూ, ఖూనీలూను" - 4, 1-3

ఇంకా మీకా ఈలా వాపోయాడు :

"భక్తిమంతులు భూమిమీద కరవైపోయారు
సత్యవంతులు కలకానికైనా లేరు
ప్రతివాడూ హత్యకు పాల్పడేవాడే
ప్రతివాడు పొరుగువాణ్ణి వేటాడేవాడే

ప్రజలు దుర్మార్గాల్లో ఆరితేరిపోయారు
అధికారులూ న్యాయమూర్తులూ లంచాలు కోరుతున్నారు
పలుకుబడికలవాళ్ల కోరికలు నెరవేరుతున్నాయి" - 7, 2-3.
ధనవంతలు పేదలను పీడించడం నిత్యకృత్యాలయ్యాయి. ఆమోసు ఈలాపలికాడు:
"ధనవంతులు దరిద్రులను క్రిందపడవేసి
కాలితో త్రొక్కుతూన్నారు
వాళ్ళను త్రోవనుండి ప్రక్కకు నెడుతూన్నారు
తండ్రీ కొడుకూ ఒకే స్త్రీని కూడి
ప్రభువు నామం అపవిత్రపరుస్తూన్నారు" - 2,7.

ఈలాంటి అన్యాయపు పరిస్థితుల్లో ఆమోసు ధనవంతులు పేదలను ఆదరించాలని ప్రచారం సాగించాడు. ధనవంతులకూ పేదలకూ మధ్యవున్న తారతమ్యం ప్రభువు చేసిన ఒడంబడికకు విరుద్ధమని బోధించాడు. ప్రభువు ధనవంతులను దారుణంగా శిక్షిస్తాడని గూడ హెచ్చరించాడు :

"శత్రువులువచ్చి ఈ దేశం చుట్టుముడతారు
కోటలను ముట్టడించి మేడలను కూలద్రోస్తారు
సింహం పట్టిన గొర్రెనుండి కాపరికి
రెండు కాళ్లో ఒక చెవో దొరికినట్లే
సమరియాలో నేడు పాన్పులమీద
సుఖంగా దొర్లాడే వాళ్ళల్లో
కొద్దిమందే మిగులుతారు
సర్వశక్తిమంతుడైన ప్రభువు
యిస్రాయేలును ఈలా హెచ్చరించమంటున్నాడు
ఆ దినం నేను యిస్రాయేలును
వారి పాపాలకై నిశితంగా శిక్షిస్తాను" - 3, 11-14.
"మీరు పేద ప్రజలను పీడించి
వాళ్ళ ధాన్యాన్ని దోచుకొన్నారు గనుక
చెక్కడపురాళ్ళతో సుందరంగా నిర్మించుకొన్న
మీయిండ్లల్లో మీరు వసించరు
మక్కువతో నాటుకున్న మీ తోటలనుండి లభించే
ద్రాక్షసారాయాన్ని మీరు చవిజూడరు

మీ దుష్కార్యాలు అన్నీయిన్నీగావు" - 5,11-12.

ఈలా ధనవంతులు పేదలకు సహాయంచేయాలనీ లేకపోతే దైవశాపానికి గురౌతారనీ హెచ్చరించాడు ప్రవక్త ఆమోసు. పేద ప్రజలకు న్యాయం జరగాలని అతడు ఎలుగెత్తి చాటాడు:

"నీతి ఓ నదిలాగ పొంగిపారాలి

న్యాయం ఓ జీవనదిలాగ ప్రవహించాలి" - 5,24.

ఔను, న్యాయాధిపతులూ రాజులూ ధనవంతులూ కూడ సాంఘిక న్యాయాన్ని నిలబెట్టాలి. పేదలకు జరిగే అన్యాయాలను అరికట్టాలి. లేకపోతే ప్రభువు వాళ్ళను దారుణంగా శిక్షిస్తాడు.

# 4. సాంఘిక న్యాయమూ, ఆరాధనమూ

కొందరు యిస్రాయేలీయులు సాంఘిక న్యాయాన్ని పాటించకుండానే దేవుణ్ణి ఆరాధించడానికి దేవాలయానికి వెళ్ళేవాళ్ళు. కాని ప్రవక్తలు ఈలాంటి ఆరాధనంవల్ల లాభంలేదని ఖండితంగా చెప్పివేసారు. ఇక్కడ మూడంశాలు చూడాలి.

## 1. మొదట పొత్తు కుదిరింది

సాంఘిక న్యాయమంటే తోడిజనాన్ని, విశేషంగా పేదజనాన్ని ఆదరించడం. యిస్రాయేలు యావే ప్రజ. వాళ్ళంతా ఆ ప్రభువుని ఆరాధించేవాళ్ళు. ఆలా ఆరాధించేవాళ్ళంతా ఒక్క సమాజంగా ఏర్పడి పరస్పర సోదరభావంతో జీవించారు. కనుక వాళ్ళు ప్రభువుని దేవుణ్ణిగా అంగీకరించినప్పుడే తోడి నరుణ్ణిగూడ సోదరుణ్ణిగా అంగీకరించారు. ఐగుప్తు నిర్గమనం సాంఘిక అన్యాయానికి సంబంధించింది అన్నాం. ఆ యన్యాయంనుండి యిస్రాయేలును కాపాడినవాడు ప్రభువు. అప్పటినుండి యిస్రాయేలు యావేను ప్రభువుగాను తోడినరులను సోదరులనుగాను అగీకరించింది. తర్వాత ప్రభువు సీనాయికొండవద్ద తమతో నిబంధనం చేసికొన్నపుడుగూడ ప్రజలు ఈ రెండు సత్యాలూ గుర్తించారు. మోషే ధర్మశాస్త్రాన్ని ప్రతిపాదించే లేవీయకాండా ద్వితీయోపదేశకాండాగూడ దేవుణ్ణి ఆరాధించాలనీ తోడి జనాన్ని ప్రేమించాలనీ బోధించాయి. ఈలా యిస్రాయేలీయుల జీవితపు తొలిరోజుల్లో ఆరాధనకూ సాంఘిక న్యాయానికీ పొత్తు కుదిరింది.

## 2. తర్వాత పొత్తు కుదరలేదు

క్రమేణ సాంఘిక న్యాయమూ దైవారాధనమూ రెండుగా విడిపోయాయి. ప్రజల్లో డాంబికత్వం పెచ్చుపెరిగింది. చిత్తశుద్ధి లేకపోయినా కర్మకాండలూ బాహ్యాచారాలూ

ఉపవాసాలూ బలులూ చాలులే అనే భావం ప్రచారంలోకి వచ్చింది. ప్రజలు సాంఘిక న్యాయమూ సోదరప్రేమా అంతముఖ్యం కాదులే అనుకొన్నారు. ఈలాంటి తప్పుడు భావాలను ప్రవక్తలు ఖండించారు. ఉదాహరణకు యెషయా ఈలా అన్నాడు :

"నిరంతరమూ మీరర్పించే ఈ బలులు నాకెందుకు?
మీరు దహనబలిగా అర్పించే పొట్టేళ్లూ
కోడెదూడల క్రొవ్వూ నాకు విసుగుపుట్టిస్తున్నాయి
ఎడ్ల నెత్తురూ, మేకల నెత్తురూ నాకు గిట్టవు
నా దేవళంలో ఆరాధించడానికి వచ్చేపుడు
మిమ్ము వీటన్నింటిని తీసికొని రమ్మన్న దెవరు?
మీ కొరగాని బలులు నాకిక వద్దు
వాటి పొగను నేను చీదరించుకొంటున్నాను
మీ అమావాస్య పండుగలు, విశ్రాంతిదిన పండుగలు
మీ జాతరలు నాకు అసహ్యంగా వున్నాయి
వాటిని నేనిక భరించలేను, సహించలేను
మీరు ప్రార్థనకై చేతులెత్తినపుడు
నేను మీ మొగంగూడ చూడను
మీరు ఎన్ని జపాలు చేసినా నేను విననే వినను
మీరు వట్టి నరహంతలు" - 1, 11-15

సాంఘిక న్యాయాన్ని పాటించని ఆరాధనను ప్రవక్తలు తెగడిన తీరు ఈలా వుంటుంది. కాని ప్రవక్తలు ఈ యారాధనను ఎందుకు ఖండించారా అని ఆలోచిస్తే మూడు కారణాలు కన్పిస్తాయి.

## 1) అపవిత్రారాధనం

మొదటిది, అది అపవిత్రారాధనం. పేదల నోళ్ళుగొట్టి అన్యాయంగా ఆర్జించిన సొమ్ముతో చేసే ఆరాధనం అపవిత్రమైంది. ఆలాంటి కైంకర్యాన్ని దేవుడు అంగీకరించడు. అందుకే సీరా ఈలా నుడివాడు:

"అన్యాయంగా ఆర్జించినదాన్ని దేవునికి అర్పిస్తే
అది అపవిత్రమైన సమర్పణం ఔతుంది
దుర్మార్గుల కానుకలను దేవుడు అంగీకరించడు
భక్తిహీనుల బలి మహోన్నతునికి సమ్మతంకాదు

ప్రభువు అపారంగా బలులర్పించినవాడి
పాపాలు పరిహరించడు
పేదల నోళ్లుగొట్టి ఆ సొమ్ముతో బలి అర్పిస్తే
తండ్రియెదుటనే అతని కుమారుణ్ణి చంపినట్లు
దరిద్రుడి అన్నం పేదకూడు
వాడి నోటికాడికూడు పడగొట్టేవాడు నరహంత
పేదవాడి బత్తెం చెడగొడితే వాణ్ణి చంపినట్లే
కూలి ఎగవేస్తే వాడి నెత్తురు చిందించినట్లే " - 34, 18-22

ధనవంతులు పేదలసొమ్ము దోచుకొని ఆ సొమ్ముతో దేవునికి బలులర్పిస్తున్నారు. ఈలాంటి ఆరాధనను దేవుడు అంగీకరించడు అని సీరా భావం.

## 2) పేదవాడి మొర

బక్కవాణ్ణి దోచితెచ్చిన సొమ్ముతో గుడిలో బలులర్పిస్తే, ఆ బలిగుండానే పేదవాడి మొరకూడ దేవుని సన్నిధిలోకి వెళ్తుంది. కనుక ప్రభువు ఆ మొర ఆలించితీరతాడు. సీరా ఈలా పలికాడు:

"ఒకడు ప్రార్థిస్తుంటే మరొకడు శపిస్తుంటే
దేవుడు ఆ యిద్దరిలో ఎవరి మొర ఆలిస్తాడు?
నరుడు శవాన్నితాకి స్నానంచేసి
మళ్ళా శవాన్ని ముట్టుకొంటే లాభమేమిటి?
జనుడు పాపాలుచేసి ప్రాయశ్చిత్తంగా వుపవాసముండి
మళ్ళా అదే పాపాలు చేస్తే
వాని ప్రార్థనలు ఎవరు ఆలిస్తారు?
ఆ వుపవాసంవలన ఫలితమేమిటి?" - 34: 24-26.
"ప్రభువు పేదలకు అన్యాయం జరగనీయడు
అతడు పీడితునిమొర ఆలించితీరతాడు
అనాథుల గోడు వినితీరతాడు
వితంతువు ఆపసోపాలు ఆలించితీరతాడు" - 35, 13-15

## 3) కపటభక్తుల ఉపవాసాలు ఫలించవు

కపటభక్తులు ఓ వైపు పేదలను పీడిస్తూ మరోవైపు దేవుణ్ణి కొలుస్తూ ఉపవాసముంటారు. కాని దీనులను వంచించారు గనుక ప్రభువు వాళ్ళ ఉపవాసాన్ని అంగీకరించడు. యెషయా ఈలా చెప్పాడు :

"మీరు ఉపవాసాలు చేస్తూనే పేదలను పీడిస్తున్నారు
ఉపవాసాలు చేస్తూనే దీనులతో పోట్లాడి
వాళ్ళను చేత్తో మోదుతున్నారు
ఈ లాంటి వుపవాసాలు సాగిస్తే
మీ మొర దేవుని చెవిలో పడుతుందా?" - 58, 4-5

ఫలితాంశమేమిటంటే, హృదయశుద్ధి లేని కర్మకాండలు దేవునికి ప్రియపడవు. సాంఘిక న్యాయాన్ని సోదర ప్రేమనూ పాటించకుండా వట్టి బలులూ నైవేద్యాలూ అర్పిస్తే దేవుడు చీదరించుకొంటాడు. ఈలా మూడు కారణాలను మనసులో పెట్టుకొని ప్రవక్తలు ఆ నాటి ఆరాధనను తెగడారు.

## 3. చిత్తశుద్ధిగల ఆరాధనం

ప్రవక్తలు డాంబికమైన ఆరాధనను ఖండించారు అన్నాం. వాళ్లు చిత్తశుద్ధిగల ఆరాధనం ఏలా వుంటుందోగూడ తెలియజేసారు. సాంఘిక న్యాయాన్ని పాటిస్తూ భక్తిగల హృదయంతో అర్పించేదే నిజమైన ఆరాధన. యెషయా ఈలా వచించాడు :

"మీ యొడలు కడుగుకొని శుద్ధిచేసికొనండి
ఇక నా యెదుట దుష్కార్యాలు చేయకండి
మీ పాపపుపనులనుండి వై దొలగి
సత్కార్యాలకు పూనుకొనండి
న్యాయాన్ని పాటించండి
పీడితులకు మేలుచేయండి
అనాథుల హక్కులు నిలబెట్టండి
వితంతువులను ఆదుకొనండి" - 1,16-17

సీరా ఈలా ఆదేశించాడు :

"ధర్మశాస్త్రపు ఆజ్ఞలను పాటిస్తే
చాలా బలులు అర్పించినట్లే
దాని విధులను అనుసరిస్తే
సమాధానబలి సమర్పించినట్లే
ఉపకారానికి ప్రత్యుపకారం చేస్తే
పిండిని నైవేద్యంగా అర్పించినట్లే
దానధర్మాలు చేస్తే
కృతజ్ఞతాబలి అర్పించినట్లే
దుష్కార్యాలు మానుకొంటే

ప్రభువుకి ప్రియం కలిగించినట్లే
అన్యాయంనుండి వైదొలగితే
పాపపరిహారబలి సమర్పించినట్లే" - 35, 1-3

కడన యెషయా ఈలా బోధించాడు:
"దరిద్రులను పీడించే బంధాలను సడలిస్తే
వాళ్ళ మెడమీది అన్యాయపు కాడిని తొలగిస్తే
వాళ్ళకు స్వాతంత్ర్యం ప్రసాదిస్తే
అదే నాకు నచ్చిన ఉపవాసం,
మీ భోజనాన్ని పేదలకు గూడ వడ్డిస్తే
దిక్కులేని వారికి మీ యింటిలో ఆశ్రయమిస్తే
దీనులకు బట్టలు కట్టబెడితే
అక్కరలోవున్న తోడి జనాన్ని ఆదుకొంటే
అదే నాకు నచ్చిన వుపవాసం" - 58, 6-7

ప్రవక్తలు మెచ్చిన ఆరాధనం ఈలాంటిది. అది సాంఘిక న్యాయాన్ని పాటించేది. దిక్కూమక్కూలేని దీనజనులను ఆదరించేది. హృదయంలోనుండి పుట్టుకవచ్చేది. కనుకనే అది ప్రభువుకి ప్రియపడేది.

## ఉపసంహారం

1. పూర్వవేదం జగత్సృష్టితో ప్రారంభమౌతుంది. కాని పూర్వవేద ప్రజలు ప్రభువుని తెలిసికొంది ఈ సృష్టిద్వారా కాదు, ఐగుప్తు నిర్గమనంద్వారా. ప్రభువు యిస్రాయేలీయులను ఐగుప్తునుండి తరలించుకొనివచ్చిన ఘట్టం పూర్వవేదానికి గుండెకాయలాంటిది. ఆ ప్రజల నిర్గమనానికి కారణం సాంఘిక అన్యాయమే. ఈ నిర్గమనంద్వారా యావే యిస్రాయేలీయులకు ఏకైక ప్రభువయ్యాడు. వాళ్లు పరస్పరం సోదరులయ్యారు.

2. యావే యిస్రాయేలీయులతో నిబంధనం చేసికొన్నాడు. వాళ్లు నిబంధన న్యాయాన్ని పాటించాలని తెలియజేస్తూ మోషే ముఖాన ధర్మశాస్త్రాన్ని ప్రసాదించాడు. ఈ ధర్మశాస్త్రంలో సాంఘిక న్యాయంకూడ ఓ ముఖ్యాంశం. దీనిలో పేదసాదల హక్కులు జాగ్రత్తగా పేర్కోబడ్డాయి. ధనవంతులు దుర్మార్గులై సాంఘిక న్యాయాన్ని పాటించనపుడు ప్రభువు ప్రవక్తలద్వారా వాళ్లను హెచ్చరించాడు. కనుక మొదట ఐగుప్తులోలాగే తర్వాత యెరూషలేములో గూడ యావే సాంఘిక న్యాయానికి నాయకుడు, పీడిత ప్రజలకు సంరక్షకుడు. ఎవరైనాసరే పేదప్రజలను దోచుకొని వారిని పీడిస్తే ప్రభువు వూరుకోడు.

దీనుల మొర అతని చెవిని పడితీరుతుంది. ప్రజాపీడకులనూ దోపిడి గాండ్రనూ అతడు నిశితంగా శిక్షించితీరుతాడు.

3. వాగ్దత్తభూమి యావేది. అతడు ఆ గడ్డను యిస్రాయేలీయులందరికీ కానుకగా యిచ్చాడు. వాళ్లు దాన్ని తాత్కాలికంగా అనుభవించేవాళ్ళు మాత్రమే. ఆ నేల ఎవరి కాణాచీ కాదు. యూదుల్లో ఎవరైనా పేదవాళ్ళుంటే ధనవంతులు వాళ్ళను ఆదుకోవాలి. అంటే భాగ్యవంతులు తమ ఆదాయంలో ఓ ఐదు శాతమో లేక పదిశాతమో పేదల కిచ్చివేస్తే సరిపోదు. దరిద్రుల అక్కరలు తీరిందాకా - అనగా ఇల్లూ వాకిలీ కూడూ గుడ్డా అబ్బిందాకా - వాళ్ళకు సహాయం చేయవలసిందే.

4. యిస్రాయేలీయుల్లో కొందరు ఐశ్వర్యవంతులై పెద్దపెద్ద భవనాల్లో సుఖంగా జీవిస్తున్నారు. మరికొందరు దరిద్రులై గుడిసెల్లో తలదాచుకొంటూ ఆకటితో మ్రగ్గిపోతూన్నారు. ఇది సాంఘిక అన్యాయం. వీళ్ళంతా దేవుని ప్రజలై దేవుని భూమిని అనుభవించేవాళ్ళు గనుక పేదవాడికి ధనవంతుని సిరిసంపదల్లో పాలుపొందే హక్కు వుంది. పీడితులకూ దీనులకూ ధర్మశాస్త్రమే హక్కులు ప్రసాదించింది. వాగ్దత్తభూమినిలాగే దానిమీద వచ్చే ఆదాయాన్నిగూడ ప్రభువు యిస్రాయేలీయు లందరికోసం ఉద్దేశించాడు. కనుక ధనవంతుడు కూడబెట్టిన సొమ్ములో పేదవాడికిగూడ వాటా వుంది.

5. రాజులకూ న్యాయాధిపతులకూ పేదలహక్కులను నిలబెట్టవలసిన బాధ్యత వుంది. వాళ్లు లంచాలు తీసికొని పేదలకు న్యాయం చేకూర్చకపోతే అది ఘోరమైన సాంఘిక అన్యాయం ఔతుంది.

6. నరుని రక్షణం సాంఘికన్యాయాన్ని పాటించడంమీద గూడ ఆధారపడుతుంది. ఓ వైపు తోడి నరుణ్ణి పీడిస్తూ మరోవైపు దేవాలయానికి వెళ్ళి ఆరాధనలు చెల్లిస్తే దేవుడు అంగీకరించడు. ఆలాంటి ఆరాధనం అపవిత్రమైంది, హృదయశుద్ధి లోపించింది. కనుక సాంఘికన్యాయాన్ని పాటించని ఆరాధనలు నిష్ప్రయోజనం. క్రీస్తువాక్కులే దీనికి ప్రబల తార్కాణం. ఆ ప్రభువు ఈలా వక్కాణించాడు:

"నా తండ్రిచేత దీవింపబడినవారలారా రండి: రాజ్యాన్ని చేకొనండి, నేను ఆకలిగొంటే మీరు అన్నంపెట్టారు. దప్పికగొంటే దాహం తీర్చారు. పరదేశినైయుంటే నన్ను ఆదరించారు. వస్త్రహీనుణ్ణయివుంటే బట్టలిచ్చారు. రోగినిగావుంటే, చెరసాలలో వుంటే నన్ను దర్శించారు. నా సోదరుల్లో అత్యల్పుడైనవాడికి మీరు ఈ లాంటి కరుణకార్యాలు చేసారు కనుక అవి నాకు చేసినట్లే లెక్క

శాపగ్రస్తులారా! మీరు నా వద్దనుండి తొలగిపోయి నిత్యనరకాగ్నిలో పడండి. నేను ఆకలిగొంటే మీరు అన్నం పెట్టలేదు. దప్పిక గొంటే దాహమీయలేదు. పరదేశినై యుంటే నన్ను దర్శింపలేదు. వస్త్రహీనుణ్ణయివుంటే బట్టలీయలేదు. రోగినిగాను చెరసాలలోను వుంటే నన్ను పరామర్శించలేదు. నా సోదరుల్లో అత్యల్పుడయినవాడికి మీరు ఈలాంటి కరుణ కార్యాలు చేయలేదుగనుక అవి నాకు చేయనట్లే లెక్క" - మత్త 25, 35-45.

# 8. సదసదాత్మ విచారం



**విషయసూచిక**


| | | |
|---|---|---|
| 1. | ప్రారంభ విషయాలు | 162 |
| 2. | ఆనందానుభూతి | 164 |
| 3. | విచారానుభూతి | 166 |
| 4. | పిశాచ శోధనలు | 167 |
| 5. | ఇగ్నేష్యను అనుభవాలు | 170 |
| 6. | దేవుడే భక్తులను నడిపిస్తాడు | 173 |
| 7. | క్రీస్తు బోధలు | 175 |
| 8. | పరిశుద్ధాత్మ నడిపించే తీరు. | 177 |


**మనవి మాట**

[ఇది బైబులు భాష్యం 23వ సంచిక. దీనికి "సదసదాత్మ విచారం" అని పేరుపెట్టాం. సత్+అసత్+ఆత్మ+విచారం అని పదాలు విభజించుకోవాలి. సదాత్మ అంటే పరిశుద్ధాత్మ. అసదాత్మ అంటే పిశాచం. ఈ రెండాత్మలూ మనలను నడపించే తీరు తెలిసి కోవడమే సదసదాత్మ విచారం. దీన్నే ఇంగ్లీషులో Discernment of Spirits అంటారు.

పరిశుద్ధాత్మా పిశాచమూ మనల నేలా నడిపిస్తుంటాయో తెలిసికోవడం ఆధ్యాత్మిక జీవితానికి చాలముఖ్యం. ఐనా నేటి క్రైస్తవులకు ఈ రంగంలో అట్టే అనుభవం లేదు. ఈ పొత్తమునందలి తొలి ఐదధ్యాయాల్లోని భావాలను ఇగ్నేష్యస్ లొయోలా గారి "తపోభ్యాసాలు" అనే గ్రంథం నుండి స్వీకరించాం. ప్రాచీన క్రైస్తవ భక్తులందరిలోను ఇన్యాసివారు సదసదాత్మల ప్రబోధాలను అర్థం చేసికోవడంలో దిట్ట. కడపటి మూడధ్యాయాల్లోని భావాలను నూత్నవేదం నుండి గ్రహించాం.

పరిశుద్ధాత్మా దేవదూతలూ ఒక జట్టుగాను, పిశాచమూ దాని దూతలూ ఇంకొక జట్టుగాను మనలను నడిపిస్తుంటారు. ఈ యాత్మలు మనలను ప్రబోధించే తీరు తెలిసికోవడం కొంతవరకు కష్టమే. ఐనా ఈ రంగంలో గడించే కొద్దిపాటి అనుభవం గూడ మన ఆధ్యాత్మిక జీవితానికి ఎంతో మేలు చేస్తుంది. కనుక పాఠకులు సదసదాత్మ ప్రబోధాలను గూర్చి ఈ పొత్తం వివరించే సూత్రాలను జాగ్రత్తగా గుర్తించాలి. దేవుని బిడ్డలను దేవుని ఆత్మే నడిపిస్తుంటుందని తెలిసికోవడం గొప్ప భాగ్యం గదా! ]

# 1. ప్రారంభ విషయాలు

1. మన అంతరాత్మలో మూడు శక్తులు పనిచేస్తుంటాయి. మొదటిది పిశాచం. "మీరు తోటలోని ఏ చెట్టు పండ్లూ తినగూడదట నిజమేనా?" అని పిశాచం ఏవను శోధించింది- ఆది 3,1. నాటి నుండి నేటిదాకా దయ్యం నరులను పాపానికి పురికొల్పుతూనే వుంది. రెండవశక్తి దేవుని ఆత్మ. పరిశుద్ధాత్మ మన హృదయానికి ప్రబోధం కలిగించి మనలను క్రీస్తువైపు నడిపిస్తుంటుంది. ఓవైపు పిశాచం బిడ్డలను పిశాచం నడిపిస్తూంటే మరోవైపు దేవుని బిడ్డలను దేవుని ఆత్మ నడిపిస్తుంటుంది-రోమా 8,14. ఈ పరిశుద్ధాత్మతో పాటు దేవునిదూతలు కూడ మంచిని చేయమనీ చెడుగును వారించమనీ మనలను ప్రోత్సహిస్తుంటారు. ఈ దూతలు నిత్యం మనకు తోడ్పడుతుంటారు - హెబ్రే 1,14. ఇక మూడవశక్తి, మన పతనస్వభావం. ఆదాము పాపఫలితం మనకు సోకింది. జన్మపాపం నరులందరినీ కూలద్రోసింది. ఈ పతనం వలన మన ఆధ్యాత్మికశక్తులు పూర్తిగా నాశమైపోలేదు గాని, గాయపడ్డాయి. దీని ఫలితంగా మనలో దుష్టవాంఛలు రేకెత్తాయి. మనం మంచిని గాదు, చెడ్డను కోరుకొంటాం. పాడుపనులు చేస్తాం - యాకో 1,14.

పై మూడు శక్తులూ నిత్యమూ మనలను ప్రభావితులను చేస్తూంటాయి. అందుచేత ఎప్పుడు మనలను పవిత్రాత్మ ప్రబోధిస్తుందో, ఎప్పుడు అపవిత్రాత్మ ప్రబోధిస్తుందో, ఎప్పుడు మన దుష్టవాంఛలే మనలను పురికొల్పుతుంటాయో తెలిసికోగలిగి వుండాలి. ఈ తెలివిడికే సదసదాత్మవిచారం అని పేరు.

2. ఇగ్నేష్యన్ లొయోలాగారు సదాత్మలూ అసదాత్మలూ కలిగించే ప్రబోధాలను చక్కగా అనుభవానికి తెచ్చుకొన్నవారు. ఆయన ఈ విషయాన్ని గూర్చి ఎన్నో సూచనలు తయారుచేసి భావితరాలవాళ్లకు అందించిపోయాడు. ఇక్కడ సదసదాత్మలను గూర్చి ఇగ్నేష్యను చెప్పిన సూత్రాలను కొన్నిటిని పరిశీలిద్దాం.

కొంతమంది జనులు పాడుజీవితం జీవిస్తూంటారు. పాపాల తర్వాత పాపాలు చేస్తూంటారు. ఈ పాపాలు మోసం, గర్వం, దొంగతనం, వ్యభిచారం, వంచన- ఈలాంటివి ఏవైన కావచ్చు. ఈలాంటివాళ్ళకు సదాత్మ మనస్తాపం పుట్టిస్తుంది. వాళ్ల అంతరాత్మను హెచ్చరిస్తుంది. పూర్వపు మంచిజీవితాన్ని జ్ఞాపకానికి తెస్తుంది. మరణమూ, కడతీర్పూ, నరకమూ మొదలైన అంత్యగతులను తలంపునకు తెస్తుంది. ఈలాచేసి పాపి తన జీవితం మార్చుకొనేలా చేస్తుంది. కాని అసదాత్మ ఆ పాప జీవితంలోనే సంతోషం కలిగిస్తుంది. ఇంద్రియ సుఖభోగాల వైపు మనసు త్రిప్పుతుంది. ప్రస్తుతం అనుభవించే సుఖాన్నీ భావిలో అనుభవింపబోయే సుఖాన్నీ జ్ఞప్తికి తెస్తుంది. "ఈ యింద్రియ సుఖాలను వదలుకోవడమా!" అనే శంక కలిగిస్తుంది.

కనుక పాపజీవితం జీవించేవాళ్లు ఆ జీవితాన్ని సమర్థించే భావాలు కలిగినపుడు అవి పిశాచం నుండి వచ్చాయని గుర్తించాలి. ఆ జీవితాన్ని ఖండించే భావాలు కలగినపుడు అవి పరిశుద్ధాత్మ నుండి పుట్టాయని గుర్తించాలి. ఎప్పుడూ ఈ యాత్మలు రెండూ తమస్వభావానికి తగినట్లుగా ప్రవర్తిస్తాయి. కనుక దుష్టాత్మ దుష్టభావాలనూ, సదాత్మ సద్భావాలనూ కలగిస్తుంటుంది.

3. కొంతమంది జనులు పాపజీవితం వదలుకొని పుణ్యమార్గంలో నడిచే ప్రయత్నం చేస్తూంటారు. పూర్వం చేసిన దుష్టకార్యాలను వదలివేసి సన్మార్గానికి వస్తారు. తమ పాపాలకు పశ్చాత్తాప పడతారు. అలాంటివాళ్ల విషయంలో సదాత్మ అసదాత్మ ఏలా ప్రవర్తిస్తాయి? సదాత్మ ధైర్యమూ ఉత్సాహమూ పుట్టిస్తుంది. ఆనందమూ మనశ్శాంతీ ప్రసాదిస్తుంది. ఈలాంటి మనోభావాలతో ఆయాత్మ భక్తుణ్ణి పాపమార్గం నుండి వైదొలగిస్తుంది. అతన్ని బుజ్జగించి ముందుకు నడిపిస్తుంది. కాని అసదాత్మ భక్తునికి ఆటంకాలు తెచ్చిపెడుతుంది. ఆందోళనమూ సంకోచమూ విచారమూ పుట్టిస్తుంది. “ఈ సుఖాన్ని వదలుకోవడం సాధ్యమా? ఈ పని చేయకుండా వుండగలమా?” అనే కుతర్కాన్ని రేకెత్తిస్తుంది. ఈలాంటి ఆలోచనలతో అతన్ని పాపమార్గంలోనే వుంచే ప్రయత్నం చేస్తుంది.

జీవితంలో అప్పుడప్పుడూ కొన్ని పెద్దపాపాలకు అలవాటు పడిపోతాం. కాని కొంతకాలమయ్యాక దైవానుగ్రహం వల్ల ఆ పాపాలను విడనాడాలనే బుద్ధి పుడుతుంది. కొంత ప్రయత్నం గూడ చేస్తాం. ఆ సందర్భంలో మన హృదయంలో కలిగే భావాలు ఏయాత్మ నుండి వచ్చాయో తెలిసికోవడం ఏలాగ? ఆ భావాలు పూర్వం అలవాటు పడిన పాపాన్ని వదలిపెట్టమని ప్రోత్సాహిస్తుంటే అవి సదాత్మ నుండి వచ్చినట్లు. పూర్వపాపాన్ని వదలి పెట్టవద్దని చెప్తూంటే అవి దుష్టాత్మనుండి వచ్చినట్లు.

4. వరప్రసాదస్థితిలో వుండి పుణ్యజీవితం జీవించేవాళ్ల హృదయం మీద సదాత్మ చాలా మృదువుగా పనిచేస్తుంది. ఆ యాత్మ ప్రబోధం స్పాంజ్‌మీద నీటిబొట్టు పడినట్లుగా నిశ్శబ్దంగా మెత్తగా వుంటుంది. కాని అదేప్రజల హృదయం మీద పిశాచమైతే చాల కటువుగా, గోలగా, ఆందోళనపూరితంగా పనిచేస్తుంది. నీటుబొట్టు రాతిమీద పడినట్లుగా చిటుక్కుమనిపిస్తుంది. ఈ యాత్మలు తమకు అనుకూలంగా ప్రవర్తించేవాళ్ల మీద మృదువుగా పనిచేస్తాయి. కనుక మనం మంచి జీవితం జీవిస్తున్నపుడు మన హృదయంలో మృదువైన ప్రబోధం కలిగితే అది పరిశుద్ధాత్మ నుండి వచ్చిందని గుర్తించాలి. అలా కాకుండ ఏదోశక్తి మన హృదయాన్ని కటువుగా కదలించివేసినట్లుగా వుంటే అది పిశాచం నుండి వచ్చిందనుకోవాలి.

# 2. ఆనందానుభూతి

5. భక్తుల్లో ఆనందానుభూతి విచారానుభూతి అనే మనోభావాలు రెండుంటాయి. ఈ భావాల వల్ల మనకు ఉపకారమో అపకారమో జరుగుతుంటుంది. కనుక సాధకులు ఈ మనోభావాలను జాగ్రత్తగా గుర్తిస్తూండాలి. అవి యేయాత్మనుండి పుట్టాయో తెలిసికోగలిగి వుండాలి. మొదట, ఆనందానుభూతి అంటే యేమిటో చూద్దాం. అది ఓ విధమైన ఆనందభావం, ఓ అనుభవం. ఈ యనుభవం కలిగినపుడు మనసు సృష్టివస్తువులను దాటిపోతుంది, సృష్టికర్తయైన భగవంతుణ్ణి ప్రేమిస్తుంది. ఆ భగవంతుని మీదగల ప్రేమచే హృదయం స్పందించడం, ఒకోమారు ఆనంద బాష్పాలు రాల్చడం గూడ కద్దు. ఈ స్థితిలో వున్నపుడు పాపాలకు పశ్చాత్తాపం కలుగుతుంది. విశ్వాసమూ నమ్మికా దేవప్రేమా వృద్ధి చెందుతాయి. హృదయంలో శాంతీ సంతోషమూ తృప్తీ నెలకొంటాయి. ఈ భావాలు మామూలుగా మనసులో కన్పిస్తాయి. ఒకోమారు ఈ భావాలు మనసు నుండి ఇంద్రియాలకు గూడ ప్రాకవచ్చు. అపుడు ఓ విధమైన శారీరక ఉల్లాసం పుడుతుంది. చెలమలోని నీళ్లలాగ పైకి ఉబికివుబికి వచ్చే ఆనందభావం గోచరిస్తుంది. ఉత్థానక్రీస్తే తన భక్తులకు ఈ యానందానుభూతి అనే వరాన్ని ఇస్తుంటాడు- కొలో 3,1.

6. ఆనందానుభూతి ఎక్కడ నుండి వస్తుంది? మామూలుగా సదాత్మ నుండి వస్తుంది. అది దేవుడు తన భక్తులకు ఉచితంగా ఇచ్చే వరం. ఈ యనుభవమున్నపుడు భగవంతునికి సేవచేయడం సులభమనిపిస్తుంది. తెరచాప నెత్తినపుడు పడవ సులభంగా కదిలిపోతుంది. అలాగే ఆనందానుభూతిలో వున్నపుడు ఆధ్యాత్మిక జీవితం గూడ సుకరంగా సాగిపోతుంది. మనం దైవసేవకు పూనుకొనిన తొలినాళ్లలో భగవంతుడు ఈ యానందానుభూతిని అధికంగా ఇస్తూంటాడు. అమ్మ చిన్నపిల్లలకు మిఠాయి పెట్టి బడికి పంపుతుంది. అలాగే భగవంతుడు కూడ ఈ మిఠాయితో మనలను తన సేవకు ఆకర్షించు కొంటూంటాడు.

ఆనందానుభూతి కలిగినపుడు మనం ఏలా ప్రవర్తించాలి? ఈ యనుభవం కలిగినపుడు సాధకుడు తానేమో భక్తుణ్ణై పోయానని విర్రవీగగూడదు. అది కేవలం దేవుని వరం గనుక వినయంగా వుండిపోవాలి. దేవునికి కృతజ్ఞత తెలియజేయాలి. మళ్ళా విచారానుభూతి యెప్పుడు వచ్చిపడుతుందో అని భయపడుతుండాలి. ఐగుప్తున యేసేపు కరువుకాలానికని ముందుగానే ధాన్యం సేకరించి వుంచాడు - ఆది 41,34-36. అలాగే భక్తుడు ఇప్పుడు అనుభవించే ఆనందానుభూతి వలన భవిష్యత్తులో వచ్చే విచారానుభూతికి తట్టుకోగలుగుతాడు. కనుక ఈ వరం కోసం మనం భక్తితో ప్రార్థించాలి.

ఇంకో విషయం. ఆనందానుభూతిలో వున్నపుడు పూర్వం చేసికొన్న నియమాలను గాని తీసికొన్న మాటపట్టులను గాని మార్చుకోగూడదు. క్రొత్త మాటపట్టులను

తీసికోగూడదు. ఆనందానుభూతి మామూలుగా భక్తిమంతమైన జీవితానికి నిదర్శనం. అది సాధారణంగా సదాత్మ నుండే వస్తుంది. కాని ఒకోమారు మనలను మోసగించడానికై పిశాచం గూడ ఈ యానందానుభూతిని కలిగించవచ్చు. అప్పుడు పిశాచాన్ని గుర్తించడం ఎలా?

7. మామూలుగా మనం ప్రార్థనం చేసుకొన్నపుడో, ఓ మంచి గ్రంథాన్ని చదివినపుడో, ఓ మంచి ప్రసంగం విన్నపుడో ఆనందానుభూతి కలుగుతుంది. కాని ఒకోమారు ఈలాంటి పూర్వకారణాలు ఏమి లేకుండానే అకస్మాత్తుగా ఆనందానుభూతి కలుగుతుంది. ఉదాహరణకు, ఓ గృహిణి వంట చేసికొంటూండగా లేదా ఓ మఠకన్య బోర్డింగులో పిల్లలతో ఏదో పని చేయిస్తుండగా అకస్మాత్తుగా ఆనందానుభూతి కలుగుతుంది. ఇక్కడ పైన పేర్కొన్న ప్రార్థన మొదలైన పూర్వకారణాలేమీ లేవు. ఈలా కారణ రహితంగా పుట్టిన ఆనందానుభూతి తప్పకుండా సదాత్మ నుండి వచ్చిందని చెప్పాలి. ఎందుకు? మన ఆత్మ దేవునికి సొంత యిల్లులాంటిది. దేవుడు మాత్రమే ప్రత్యక్షంగా నేరుగా ఆయాత్మ లోనికి ప్రవేశింపగలడు. పిశాచాలు దేవదూతలు మొదలైనవాళ్లు పరోక్షంగా, మన యింద్రియాల ద్వారా గాని మన ఆత్మ మీద పనిచేయలేరు. ఇక్కడ పేర్కొనబడిన ఆనందానుభూతి ప్రత్యక్షంగా ఆత్మలో కలిగిందేగాని పరోక్షంగా ప్రార్థనాదుల వలన కలిగింది కాదు. కనుక ఇది దేవుని నుండి వచ్చిందే. కాని ఈలాంటి ఆనందానుభూతి చాల అరుదుగా గాని లభింపదు. కావున ఇది అసాధారణమైన ఆనందానుభూతి అని చెప్పాలి.

8. మామూలుగా పూర్వ కారణాన్ని పురస్కరించుకొనే ఆనందానుభూతి కలుగుతుంది. అనగా ప్రార్థనం, సద్గ్రంథపఠనం, సదుపన్యాసం వినడం మొదలైన వాటి తర్వాతనే ఆనందానుభూతి కలుగుతుంది. కాని ఈ యనుభూతి సదాత్మనుండైనా కలుగవచ్చు, అసదాత్మనుండైనా కలుగవచ్చు. తెలిసికోవడం ఏలాగ?

ఆనందానుభూతి సదాత్మనుండి వచ్చినట్లయతే మనలను తప్పకుండా పుణ్యమార్గంలో నడిపిస్తుంది. కాని అది పిశాచం నుండి వచ్చినట్లయితే మనలను అపమార్గం పట్టిస్తుంది. కనుక ఆ యానందానుభూతితో మనంచేసేపనే ఆయనుభూతి ఏయాత్మ నుండి వచ్చిందో తెలియజేస్తుంది.

పండునుబట్టి చెట్టు ఏలాంటిదో నిర్ణయించమన్నారు. కనుక మనం చేసిన పనినిబట్టి మనలను సదాత్మే నడిపించిందో అసదాత్మే నడిపించిందో తెలిసికోవచ్చు. మనం ఓపనిచేస్తాం. దాని ప్రారంభమూ, మధ్యమూ అంతమూ – ఈమూడు దేవునికి ప్రియపడేలా జరిగిపోతే ఆపని సదాత్మ ప్రబోధంతో జరిగిపోయినట్లే. కాని ఆపని ప్రారంభం మాత్రం బాగుగానేవుండి దాని మధ్యమో అంతమో పాపానికి దారితీస్తే అది పిశాచం ప్రబోధంతో

జరిగినట్లే. ఉదహరణకు ఇద్దరు కాలేజీ యువకులకు ప్రక్కకాలేజి యువతులతో స్నేహం ఏర్పడింది. ఒక యువకుని స్నేహం నిర్మలంగా ప్రారంభమైంది. నిర్మలముగానే కొనసాగింది. మరొక యువకుని స్నేహం నిర్మలంగానే ప్రారంభమైందిగాని కొంత కాలమైనాక పాపానికి దారి తీసింది. వీటిల్లో మొదటి స్నేహం సదాత్మ ప్రేరణంవల్లా, రెండవస్నేహం దుష్టాత్మప్రేరణంవల్లా కలిగాయి. ఈలాగే మనకు కలిగే ఆనందానుభూతితో మనం చేసే పనులకుగూడ పై నియమాన్నే అన్వయించి చూడాలి. ఆపనుల ప్రారంభమూ, మధ్యమూ అంతమూ మూడూ మనలను దేవుని వైపు నడిపిస్తున్నాయో లేదో పరిశీలించి చూచుకోవాలి. ఈ విషయంలో ఒకమారు పిశాచం వలన వంచితులమయ్యామో, రెండవ మారు జాగ్రత్తగా వుండాలి.

## 3. విచారానుభూతి

9. విచారానుభూతి అంటే మనసులో ఓ విధమైన విచారమూ నిరాశా గోచరిస్తాయి. మన కోర్కెలు సృష్టికర్తను విడనాడి సృష్టివస్తువులవైపు పోతాయి. క్షుద్రవస్తువులను కోరుకొంటాయి. హృదయంలో ఒకవిధమైన అంధకారమూ, క్షోభమూ, అపనమ్మికా, నిరుత్సాహమూ, నిరాశా గోచరిస్తాయి. శోధనలు బలంగా వస్తాయి. విశ్వాసమూ నమ్మికా దేవప్రేమా సన్నగిల్లి పోతాయి. దేవునితో సంబంధం తెగిపోయిందా అనిపిస్తుంది. ప్రార్థనం రుచించదు. ఓ విధమైన బద్ధకింపూ సోమరితనమూ జనిస్తుంది. హృదయం నీళ్లు వట్టి పోయిన మడుగులా వుంటుంది. మొత్తము మీద విచారానుభూతి వలన కలిగే భావాలు ఆనందానుభూతి వలన కలిగే భావాలకు విరుద్ధంగా వుంటాయి. ఈ గుణాలు మామూలుగా ఆత్మలో కన్పిస్తాయి. కాని ఒకోమారు ఇవి యింద్రియాలకు గూడ ప్రాకవచ్చు. అప్పుడు విపరీతమైన నిరుత్సాహమూ నీరసభావాలూ గోచరిస్తాయి.

10. విచారానుభూతి ఏందుకు కలుగుతుంది? మూడు కారణాల వల్ల విచారానుభూతి పుట్టవచ్చు, మొదటిది, మన నులివెచ్చనితనం. మనం ప్రభుసేవలో శ్రద్ధచూపం. పట్టీపట్టనట్లుగా ప్రవర్తిస్తాం. దానికి గాను ప్రభువు మనలను శిక్షించి మన హృదయం ఎండిపోయేలా చేస్తాడు. ఆనందానుభూతిని నిరాకరిస్తాడు. అమ్మ పోకిరి పిల్లలకు మిఠాయి పెట్టదుగదా! రెండవది, దేవుడు మనలను పరీక్షించడానికై విచారానుభూతి కలిగిస్తాడు. ఆనందానుభూతితో దేవుణ్ణి సేవించడం సులభం. కాని విచారానుభూతిలో వున్నపుడు అతణ్ణి సేవిస్తామా లేదా అని పరీక్షించి చూడ్డానికై భగవంతుడు మనకు ఈలాంటి కష్టానుభూతి నిస్తాడు. మూడవది, మనకు వినయాన్ని నేర్పించడం కోసం. మనం నిత్యం ఆనందానుభూతినే అనుభవిస్తుంటే ఇక పరిశుద్ధులమై పోయామనీ దేవుని అనుగ్రహానికి పాత్రులమై పోయామనీ విర్రవీగుతాం. వినయాన్ని కోల్పోతాం. దేవుణ్ణి మరచిపోతాం. కనుక మన పాపస్వభావాన్ని మనం గుర్తించడం కోసం దేవుడు విచారానుభూతిని కలిగిస్తాడు.

11. విచారానుభూతిలో వున్నపుడు ఏంచేయాలి? విచారానుభూతి ఎప్పుడూ పిశాచం వల్లనే కలుగుతుంది. కాని పైన పేర్కొన్న మూడు కారణాలను బట్టి దేవుడు విచారానుభూతిని అనుమతిస్తుంటాడు. ఇది పిశాచం నుండి వచ్చే అనుభూతి కనుక మన తరపున మనం దీనినుండి వైదొలగే ప్రయత్నం చేస్తూండాలి. విశేషంగా మనం మూడు కార్యాలు చేయాలి. మొదటిది, ఆనందానుభూతి లాగే విచారానుభూతి కూడ తాత్కాలికంగా వుండే మనోభావం. పైగా ఈ స్థితిలో పిశాచం మనలను ప్రబోధిస్తూంటుంది. కనుక ఈ స్థితిలో వున్నపుడు మనం పూర్వం తీసికొన్న నిర్ణయాలను గాని మాటపట్టులను గాని మార్చుకోగూడదు. క్రొత్త నిర్ణయాలను చేపట్టనూగూడదు. రెండవది, మనకు రుచించకపోయినాసరే అధికంగా ప్రార్థనం చేసికొని ప్రభు సహాయం అడుగుకోవాలి. ఆ విచారానుభూతి దాటిపోవాలని వేడుకోవాలి. మూడవది, మన తరపున మనం గొప్ప ఓర్పునూ నమ్మికనూ చూపాలి. చీకటి గతించిపోయాక వెలుగు వస్తుంది. అలాగే విచారానుభూతి దాటిపోయాక ప్రభువు మళ్లా ఆనందానుభూతిని ప్రసాదిస్తాడు. ఆ పుణ్యకాలం కోసం ఓపికతో వేచివుండాలి. విచారానుభూతిలో వున్నపుడు గూడ చాలినంత దైవవరప్రసాదం మనమీద పనిచేసి మనం పిశాచానికి దొరికిపోకుండా వుండేలా తోడ్పడుతూనే వుంటుంది.

## 4. పిశాచ శోధనలు

12. పిశాచం మనలను శోధిస్తుంది. మోసగిస్తుంది. సాతాను మొదట ఆది దంపతులను శోధించి వాళ్లు దైవాజ్ఞ మీరేలా చేసింది. కయీనును శోధించి అతని చేత హేబెలును హత్య చేయించింది. యూదనాయకులను శోధించి క్రీస్తును చంపించింది. ఈలాగే మన జీవితంలో గూడ నానాశోధనలూ మోసాలూ తెచ్చిపెడుతుంది. కనుకనే బైబులు పిశాచాన్ని "శోధనకారుడు" అని పేర్కొంటుంది- మత్త 4,3. భక్తుడు ఇగ్నేష్యన్ పిశాచం మనలను మోసగించే తీరును వివరిస్తూ మూడు ఉపమానాలు వాడాడు. ఆ మూడింటినీ క్రమంగా పరిశీలిద్దాం. దయ్యం పురుషునితో పోరాడే గయ్యాళి స్త్రీ లాంటిది. పురుషుడు దౌర్బల్యం జూపితే గయ్యాళి అతన్ని లొంగదీసికొంటుంది. కాని పురుషుడు ధైర్యంతో ఎదిరించి నిలిస్తే గయ్యాళి తానే లొంగిపోతుంది. పిశాచం గూడ అలాగే. మనం దానికి జడిసి దాని దుర్బోధలకు సులభంగా లొంగిపోతే అది మనలను వశం జేసికొంటుంది. కాని ధైర్యంగా దాన్ని ఎదిరించి నిలిస్తే, దాని శోధనలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తే, అది పారిపోతుంది. దయ్యం కట్టివేసిన కుక్కలాంటిది. ఆ దుష్టమృగం చెంతకు వెళ్తేనే గాని అది మనల్ను కరవలేదు. అది నేరుగా మన ఆత్మను చేరలేదు. మన యింద్రియాల మీద పనిచేసి పరోక్షంగా మన ఆత్మను చేరుతుంది. అది మన హృదయ

కవాటం వద్ద నిలబడి తట్టగలదే గాని, తలుపు తెరచుకొని నేరుగా మన హృదయంలో ప్రవేశింపలేదు. కనుక మనం తలచుకొంటేచాలు, దాని ప్రబోధాలను సులభంగా అణచివేయవచ్చు. కాని ఒకమారు పిశాచానికి భయపడి దాని శోధనలకు లొంగిపోయి దాన్ని హృదయంలో ప్రవేశింపనిచ్చామో, ఇక అది మహాదారుణంగా మనమీద పరిపాలన చేస్తుంది. ఓ క్రూరమృగం లాగ మనలను చీల్చివేస్తుంది. మనం దానికి బానిసలమై పోతాం.

13. పిశాచం పరస్త్రీని చెరపజూచే దుష్ట ప్రేమికుని లాగ ప్రవర్తిస్తుంది. పరస్త్రీని మోసం జేయగోరే దుష్ట ప్రేమికుడు ఆమె తన పన్నాగాలను భర్తకు గాని తండ్రికి గాని తెలియజేయకుండా వుండాలని కోరుకొంటాడు. ఒకవేళ ఆమె ఆ దుష్ట ప్రేమికుని కుతంత్రాలను తనవాళ్లకు ఎరుకపరిస్తే అతనికి పట్టరాని కోపం వస్తుంది. ఎందుకంటే అతని ఆటలు ఇక సాగవు గనుక. అలాగే పిశాచం గూడ తాను కలిగించే శోధనలను మనం పెద్దలకూ ఆత్మగురువులకూ తెలియజేయకుండా వుండాలని కోరుకొంటుంది. అలా తెలియజేస్తే దానికి విపరీతమైన కోపం వస్తుంది. ఎందుకంటే దాని పప్పులు ఇక ఉడకవు గనుక. అందుచేత దయ్యం "ఈ శోధనలను పెద్దలకు తెలియజేస్తే వాళ్లేమనుకొంటారో, మనలను చిన్నచూపు చూస్తారు గాబోలు" అనే భావాలను పుట్టిస్తుంది. కుతర్కాలను కలిగించి మనం నిజం చెప్పడానికి వెనుకాడేలా చేస్తుంది. కనుక మనం పిశాచానికి లొంగిపోకుండా వుండాలంటే శోధనలు ఎదురైనపుడు వెంటనే తగిన పెద్దలకు తెలియజేస్తుండాలి. ఆ పెద్దల సలహాలను పాటిస్తుండాలి. లేకపోతే పై యుదాహరణం లోని అమాయకురాలైన స్త్రీ లాగ మోసపోతాం.

14. పిశాచాన్ని శత్రువుల కోటను ముట్టడించే సైన్యాధిపతితో గూడ పోల్చవచ్చు. సైన్యాధిపతి కోటగోడ చుట్టూ తిరిగిచూచి గోడ ఎక్కడ బలంగాలేదో అక్కడ ముట్టడి ప్రారంభిస్తాడు. అలాగే నరజాతి శత్రువైన పిశాచం గూడ మనలను జాగ్రత్తగా పరిశీలిస్తుంది. మన లోపాలనూ బలహీనతలనూ నిశితంగా తెలిసికొంటుంది. మన బలహీనతల ద్వారానే మనలను శోధించి కూలద్రోస్తుంది. కొందరిలో సోమరితనమూ, కొందరిలో గర్వమూ, కొందరిలో కామవాంఛా, కొందరిలో అసూయా - ఈలా రకరకాల జనుల్లో రకరకాల లోపాలుంటాయి. పిశాచం ఈ లోపాల ద్వారానే వీళ్లను పడద్రోస్తుంది. అందుకే పేత్రు మొదటిజాబు, మన శత్రువైన పిశాచం గర్జించే సింహం లాగ ఎవరిని మ్రింగుదామా అని రౌద్రంగా తిరుగాడుతూంటుందని వాకొంటుంది - 5,8.

15. పిశాచం మామూలుగా నరులకు కలిగించే శోధనలు ఇవి. మొదట సుఖభోగాల మీద వాంఛ పుట్టిస్తుంది. ఆ మీదట ధనవాంఛ కలిగిస్తుంది. అటుతరువాత పదవులూ బిరుదాలూ గౌరవాలూ కీర్తి ప్రతిష్ఠలూ మొదలైన వాటిని కాంక్షించేలా చేస్తుంది.

ఇవి అబ్బిన తరువాత వీటినుండి గర్వాన్ని పుట్టిస్తుంది. వీటినుండి కలుగగూడని అవలక్షణాలన్నీ కలుగుతాయి. ఈ పిశాచ వాంఛలకు వ్యతిరేకంగా సదాత్మ మనలో ఆత్మనిగ్రహమూ, ధనం మీద అత్యాశ పెట్టుకోకుండా వుండడమూ, గొప్పపేరు సంపాదించు కొందామనే లోభానికి లొంగకుండా వుండడమూ, వినయమూ, దేవుని మీద ఆధారపడి జీవించడమూ మొదలైన సద్గుణాలను కలిగిస్తుంది. కనుక మనలో వుండే కోరికలనూ, ఆ కోరికలను సాధించడానికై మనం చేసే పనులనూ బట్టి కూడ ఏయాత్మ మనలను నడిపిస్తుందో తెలిసికోవచ్చు.

16. నాలుకకు రుచిగా వుండే అన్న పానీయాలు, చెవికింపుగా వుండే ముచ్చటలూ, కంటికింపుగా వుండే వ్యక్తులూ, దృశ్యాలూ, స్పర్శ సుఖాలూ - ఈలాంటివన్నీ యింద్రియ సుఖభోగాలు. ఈ సుఖాలు అనుభవించిన మొదటిరోజుల్లో ఆనందాన్నీ ఉత్సాహాన్నీ కలిగిస్తాయి. కాని కడన నిరాశనూ అసంతృప్తినీ తెచ్చిపెడతాయి. ఇక ఆత్మ సంబంధమైన కార్యాలు అనగా ప్రార్థనమూ, ఆత్మనిగ్రహమూ, బైబులు పఠనమూ, దైవసేవా, సోదరప్రేమా, పవిత్ర జీవితమూ మొదలైనవి మొదట కష్టంగాను అనిష్టంగాను వుంటాయి. కాని అభ్యాసం చేసేకొలది గొప్ప ఆనందాన్నీ సంతృప్తినీ ప్రసాదిస్తాయి. బైబులు గ్రంథం రెండు త్రోవలున్నాయని చెప్తుంది - మత్త 7,13-14. మొదటి త్రోవ విశాలమైంది. దానిలో ప్రయాణం చేయడం సుకరమనుకొని చాలమంది మోసపోతారు. కాని అది వినాశానికి చేరుస్తుంది. రెండవత్రోవ ఇరుకైంది. ఆ త్రోవలో ప్రయాణం చేయడం కష్టమనుకొని చాలమంది దాన్ని అనుసరించరు. కాని కడన భగవంతుణ్ణి చేర్చే మార్గం అదే. కనుక మనం ఇంద్రియ సుఖభోగాలను వెదుకుతుంటే పైన చెప్పిన విశాల మార్గంలో ప్రయాణం చేస్తున్నట్లు. ఆధ్యాత్మిక సుఖాలను వెదుకుతుంటే ఇరుకైన మార్గంలో ప్రయాణం చేస్తున్నట్లు. మనలను విశాల మార్గంలో నడిపించేది దుష్టాత్మ. ఇరుకుమార్గంలో నడిపించేది పరిశుద్ధాత్మ.

17. మనలో రెండు రకాల శక్తులున్నాయి. మొదటి రకం శక్తులు ఆత్మకు సంబంధించినవి. ఇవి బుద్ధిశక్తీ చిత్తశక్తీని. బుద్ధిశక్తితో విషయాలు తెలిసికొంటాం. ఆలోచించిచూస్తాం. సత్యం గ్రహిస్తాం. చిత్తశక్తితో కార్యానికి పూనుకొంటాం, స్వాతంత్ర్యం నెరపుతాం, ప్రేమిస్తాం. ఈ శక్తులు ఉన్నతశక్తులు. ఇక రెండవరకం శక్తులు మన యింద్రియాలకు సంబంధించినవి. ఇవి మన పంచేంద్రియాలూ, సుఖదుఃఖాది మనోభావాలూ, జ్ఞాపకశక్తీ మొదలైనవి. ఇవి అల్పశక్తులు. మొదటి కోవకు చెందిన ఉన్నత శక్తుల మీద నేరుగా దేవుడు మాత్రమే పనిచేయగలడు. అనగా మన బుద్ధిశక్తినీ చిత్తశక్తినీ నేరుగా భగవంతుడు మాత్రమే ముట్టగలడు. పిశాచాలు గాని దేవదూతలు గాని నేరుగా వాటి మీద ప్రభావం జూపలేవు. కాని ఈ పిశాచాలూ దేవదూతలూ నేరుగా మన అల్పశక్తులను ముట్టగలవు. అవి ప్రత్యక్షంగా మన యింద్రియ శక్తులమీద పనిచేసి వాని

ద్వారా పరోక్షంగా ఆత్మశక్తులను ప్రభావితం జేయగలవు. పిశాచం తరచుగా పంచేంద్రియాల ద్వారా మనలను శోధిస్తుంది. చూపు, వినికిడి, స్పర్శ, రుచి, వాసన మొదలైన క్రియలకు కారణమైన కన్ను, చెవి, చర్మము, నాలుక, ముక్కు పంచేంద్రియాలు. కనుక మనం ఈ యవయవాల విషయంలో నిర్మలంగా వుండి శోధనల్లో చిక్కుకోకుండా వుండాలి.

18. నరుల్లో కొద్దిమందికి సున్నితమైన మనస్సాక్షి వుంటుంది. ఈలాంటి వాళ్ళు తప్పు చేయకపోయినా చేసామేమోననీ, స్వల్ప పాపం చేసినా చావైన పాపం చేసామోమోననీ బాధపడుతుంటారు. పిశాచం వీళ్లను బాధింపగోరి వీళ్ల మనస్సాక్షిని ఇంకా సున్నితం చేస్తుంది. పాపం చేయకపోయినా చేసామోమోననే శంకలూ బాధలూ అనుమానాలూ కలిగిస్తుంది. ఈ విధంగా వాళ్ల చిత్తశాంతిని పాడుచేస్తుంది. ఐనా ఈ యపాయానికి గురయ్యేవాళ్లు కొద్దిమంది. ఇక, నరుల్లో చాలమందికి మొద్దువారిన మనస్తత్వం వుంటుంది. ఈలాంటివాళ్లు తప్పుచేసి కూడ చేయలేదన్నట్లుగా ధీమాగా వుండిపోతుంటారు. పిశాచం వీళ్ల మనస్సాక్షి మరింత బండవారిపోయేలా చేస్తుంది. వీళ్లు చావవైన పాపం చేసినపుడు స్వల్ప పాపమేలే అని అనుకొనేలాగా, స్వల్ప పాపం చేసినపుడు అసలది పాపమే కాదులే అని అనుకొనేలా చేస్తుంది. కనుక మొద్దువారిన మనస్సాక్షి కలవాళ్లు జాగ్రత్తగా ప్రవర్తించాలి. కొంతవరకైన సున్నితమైన అంతరాత్మను అలవరచుకొనే ప్రయత్నం చేయాలి.

## 5. ఇగ్నేష్యసు అనుభవాలు

19. ఇగ్నేష్యస్ పరిశుద్ధాత్మ అపరిశుద్ధాత్మ నరులను నడిపించే తీరు క్షుణ్ణంగా అవగాహనం చేసకొన్నవాడని ముందే చెప్పాం. అతని జీవితంలో ఇందుకు చాలా ఉదాహరణలు కన్పిస్తాయి. అతడు ఇంకా పరివర్తనం చెందకముందే పాంపలూనా యుద్ధంలో సైనికాధికారిగా పోరాడి గాయపడి ఆస్పత్రిలో చేరాడు. అచట కాలవ్యాపనానికని అతనికి అర్చ్యశిష్టుల చరిత్రలు కొన్ని తెచ్చియిచ్చారు. అవి ఫ్రాన్సిసు, డోమినికు మొదలైన మహాభక్తుల చరిత్రలు. ఈ గ్రంథాలు చదువుతుంటే ఇగ్నేష్యస్‌కు రెండు రకాల తలంపులు కలిగేవి. ఒకరకం తలపులు తన ప్రాత జీవితానికి సంబంధించినవి. తాను పెద్ద సైనికోద్యోగిగా పేరుగాంచి రాజును మెప్పించాలి. రాజవంశానికి చెందిన ఓ అందగత్తెను వివాహమాడాలి. కాని ఈలాంటి తలంపులు వచ్చి దాటిపోయాక అతని హృదయంలో ఓ రకమైన అశాంతీ నిరుత్సాహమూ విచారమూ గోచరించేవి. మరోరకం తలంపులు తాను చదువుతున్న అర్చ్యశిష్టుల చరిత్రలను పురస్కరించుకొని కలిగేవి. డోమినికూ ఫ్రాన్సిసూ అన్ని పుణ్యకార్యాలు చేసినపుడు తాను మాత్రం ఎందుకు చేయగూడదు? వాళ్లు భగవంతునికీ తోడిప్రజలకీ అంతగా సేవ చేసినపుడు తానుమాత్రం ఎందుకు చేయకూడదు? ఈలాంటి తలంపులు వచ్చి దాటిపోయాక అతని హృదయంలో ఓ రకమైన శాంతీ ఆనందమూ

సంతృప్తీ ఉత్సాహమూ గోచరించేవి. ఈ మనోస్థితిని బట్టి అతడు తొలిరకపు తలంపులు పిశాచం నుండి వచ్చాయనీ రెండవరకపు తలంపులు పరిశుద్ధాత్మ నుండి వచ్చాయనీ నిర్ణయించుకొన్నాడు. పండును బట్టి చెట్టును నిర్ణయించాడు. తాను రాజసేవను మానుకొని దైవసేవలో చేరాడు.

20. పరివర్తనానంతరం ఇగ్నేష్యసు జపతపాల్లో కాలం గడుపుతూ మన్రేసా గుహలో కొంతకాలం వసించాడు. ఆ సమయంలో అతనికి ప్రకాశిస్తున్న ఓ సుందరవస్తువు కన్పించేదట. అది పాము ఆకారంలో వుండేదిట. దాన్ని చూచినంత సేపూ అతనికి ఎంతో ఆనందం కలుగుతుండేది. కాని ఆదర్శనం తొలగిపోగానే అతని హృదయంలో ఏదో అసంతృప్తి నిరుత్సాహమూ గోచరించేవి. ఈ మనోస్థితిని బట్టి అతడు దాన్ని పిశాచ దర్శనంగా నిర్ణయించాడు. మళ్లా ఆ మెరిసే పాము కన్పించినపుడు దాన్ని తన కర్రతో బాది తరిమివేసేవాడు. ఆ సమయంలోనే అతని అంతరాత్మలో "నీ వింకా జీవించబోయే డెబ్బైయేండ్లూ ఈలాంటి కఠిన తపస్సులు ఏలా భరిస్తావు?" అనే ఓ ప్రశ్న విన్పిస్తుండేది. ఇగ్నేష్యసు ఆప్రశ్న ఏయాత్మనుండి వచ్చిందో గుర్తించి "ఓరీ పిశాచమా! నీవు డెబ్బైయేండ్లు కాదుగదా ఒకరోజు ఆయవు మాత్రము ఈయగలవా?" అని అడిగేవాడు. దానితో ఆశోధన తొలగిపోయింది. ఈలా అతడు పిశాచ ప్రబోధాన్ని గుర్తించేవాడు, జయించేవాడు.

21. పరివర్తనం తర్వాత ఇగ్నేష్యసు చిన్నపిల్లలతో గలసి వ్యాకరణమూ లెక్కలూ మొదలైన ప్రాథమికవిద్యలు నేర్చుకోవడం మొదలెట్టాడు. కాని అతడు చదువుకోబోయేప్పుడెల్లా ఓ విధమైన ఆనందానుభూతి కలిగేది. కన్నీళ్లు ధారగా కారేవి. హృదయంలో గొప్ప భక్తిభావం జనించినట్లుగా కన్పించేది. ఐతే ఈ భక్తిపారవశ్యం వల్ల అతని చదువు కుంటుపడిపోయేది. అతడు పాఠాలు నేర్చుకునేవాడు కాదు. ఇది చూచి ఇగ్నేష్యసు నిశితంగా విచారించి చూచుకొన్నాడు. తన చదువుకు అంతరాయం కలిగించే ఈ యానందానుభూతి సదాత్మ నుండి వచ్చివుండదని నిర్ణయించుకొన్నాడు. వెంటనే తన ఉపాధ్యాయుని వద్ద కెళ్లి ఇక తాను ఈలాంటి ఆనందానుభూతికి లొంగిపోననీ, పాఠాలు శ్రద్ధగా చదివి ఒప్పజెపుతాననీ ప్రమాణం చేసాడు. తరువాత ఆయానందానుభూతి దానంతటదే ఆగిపోయింది. ఇంకోమారు ఓ పెద్ద గోయి కన్పింపగా అతనికి ఆత్మహత్య చేసికోవాలనే బుద్ధి పుట్టింది. కాని ఆ కోరిక ఎక్కడ నుండి వచ్చిందో అతడు గుర్తింపగలిగాడు. ఈ విధంగ అతడు ఒక్కో కార్యాన్నీ ఒక్కో కోరికనీ జాగ్రత్తగా పరిశీలించి చూచేవాడు. ఏది పిశాచ ప్రబోధమో ఏది సదాత్మ ప్రబోధమో గుర్తుపట్టేవాడు.

22. ఇగ్నేష్యసుకు అప్పుడప్పుడూ ప్రభు దర్శనం లభిస్తుండేది. ప్రభువు అతనికి ఒకోమారు సూర్యుడు లాగ, ఒకోమారు తెల్లని ఆకృతితోను దర్శన మిచ్చేవాడు. కాని ఈ దర్శనాలు చాల అస్పష్టంగా వుండిపోయేవి. ఐనా అతడు దర్శన ఫలితాలను జాగ్రత్తగా పరిశీలించి చూచుకొనేవాడు. ప్రభు సాక్షాత్కారం వల్ల అతనికి తన మీద తనకే ఏహ్యాభావం

జనించేది. తన పూర్వ పాపాలను తలంచుకొని దుఃఖించేవాడు. ఇరుగుపొరుగువాళ్లకు క్రీస్తును బోదించాలనే కోరిక పుట్టుకువచ్చేది. హృదయంలో శాంతిభావమూ ఆనందమూ నెలకొనేవి. ఈ సత్ఫలితాల వల్ల అతడు తాను చూచిన దర్శనాలు యథార్థమైనవేననీ అవి పిశాచం తెచ్చిపెట్టిన మోసాలు కాదనీ నిర్ణయించుకొన్నాడు.

23. జీవితంలో మనం చేసికొనే నిర్ణయాలకు ఇగ్నేష్యసు చాల ప్రాముఖ్యమిచ్చేవాడు. మామూలుగా నరులు స్వార్థం కొద్ది తమ కనుకూలంగా వుండేలా నిర్ణయాలు చేసికొంటారు గాని, భగవంతునికి ప్రియపడేలా కాదు. మన స్వార్థాన్ని గుర్తించి పిశాచం గూడ మనకనుకూలంగా వుండేలాగే ఆయా నిర్ణయాలు చేసికొమ్మని ప్రోత్సహిస్తుంటుంది. ఉదాహరణకు మనకు ఓ పెద్దపదవి సిద్ధించేలా వుంది. దాన్ని మనం అంగీకరించాలా అంగీకరించగూడదా? మన స్వార్థం తప్పకుండా ఆ పదవిని పొందాలనే కోరుకొంటుంది. కాని ఆ పదవికి మనం అట్టే అర్హులం గాదు. దానిని చేపట్టినందు వలన మనకూ యితరులకూ నష్టాలు కూడ కలుగుతాయి. ఈలాంటి పరిస్థితుల్లో స్వార్థానికి లొంగిపోకుండా మంచి నిర్ణయం చేసికొనే పద్ధతి ఒకటి ఇగ్నేష్యసు వివరించాడు. మొదట మనం ఆ పదవి అంగీకారం వైపూ మొగ్గగూడదు. అనంగీకారం వైపూ మొగ్గగూడదు. మంచి తక్కెడలాగ అటుగాని యిటుగాని మొగ్గకుండ సమభావంతో వుండాలి. అటుపిమ్మట ఈ విషయంలో స్వార్థానికి లొంగిపోకుండ దేవునికి ప్రియపడేలా నిర్ణయం చేసికోవాలని ఆ ప్రభువు అనుగ్రహం అడుగుకోవాలి. అటుతర్వాత ఆ పదవిని అంగీకరించినందువలన కలిగే ఫలితాలేమిటివో, నిరాకరించినందువలన కలిగే ఫలితాలేమిటివో జాగ్రత్తగా పరిశీలించి చూడాలి. తదనంతరం రెండు పక్షాల్లో ఎటువైపు బలమైన కారణాలు కన్పిస్తే అటువైపే ఎన్నిక చేసికోవాలి. మనస్వార్థం ఎంత కోరుకొన్నా బలమైన కారణాలు కన్పించని పక్షాన్ని ఎన్నుకోగూడదు. అలా చేసికొన్న ఎన్నికను కడన భక్తితో దేవునికి సమర్పించాలి. ఈలా నిర్ణయం చేసికొన్నప్పుడు స్వార్థానికి గాని బంధు పక్షపాతానికి గాని పిశాచప్రేరణకు గాని లొంగిపోవడమంటూ వుండదు. ఇగ్నేష్యసు వ్రాసిన "తపోభ్యాసాలు" అనే గ్రంథం ఈలాంటి ఆధ్యాత్మిక విషయాలతో నిండి వుంటుంది.

24. ఇగ్నేష్యసు రోజుకు రెండుసారులు - మధ్యాహ్నమూ, రాత్రీ - సాధారణమైన ఆత్మశోధనం చేసికొంటూండేవాడు. పైగా రోజూ చాలసారులు ప్రత్యేకమైన ఆత్మశోధనం గూడ చేసికొంటూ వుండేవాడు. ఈ యాత్మశోధనలన్నిటిలో అతడు తన హృదయాన్ని సదాత్మ ప్రబోధిస్తుందా లేక దుష్టాత్మ ప్రబోధిస్తుందా అని జాగ్రత్తగా పరిశీలించు కొంటూండేవాడు. తన హృదయంలో వెలుగూ ప్రశాంతభావమూ నెలకొని వున్నాయా లేక చీకటీ ఆందోళనమూ చోటుచేసికొంటున్నాయా అని విచారించి చూచుకొనేవాడు. దీనివల్ల తన్ను సదాత్మే నడిపిస్తుందో లేక దుష్టాత్మే నడిపిస్తుందో తెలిసికొంటూండేవాడు.

అతడు యేసుసభ సభ్యులు ఈ యాత్మశోధనలను ఎల్లకాలమూ విధిగా పాటించాలని నియమంచేసాడు. వ్యాధిగా వున్నపుడు ధ్యానమైనా మానివేయవచ్చు గాని, ఆత్మశోధనం మానివేయ గూడదని ఆజ్ఞచేసాడు. పరిశుద్ధాత్మ అపరిశుద్ధాత్మ మన మీద పనిచేసే తీరును అనుభవ పూర్వకంగా తెలిసికొన్న భక్తుడతడు.

## 6. దేవుడే భక్తులను నడిపిస్తాడు

25. ఇంతవరకు ఇగ్నేష్యసు అనుభవాలను పరిశీలించాం. ఇక, పరిశుద్ధాత్మా దుష్టాత్మా మనలను నడిపించే తీరునకు బైబులు నుండి కొన్ని ఉదాహరణలు చూద్దాం. ఒకోమారు భగవంతుని పిలుపు చాల స్పష్టంగా విన్పిస్తుంది. ఇక సందేహమంటూ వుండదు. కనుక భక్తుడు భగవంతుణ్ణి అనుసరిస్తాడు. ఉదాహరణకు, ప్రభువు సుంకపు మెట్టువద్ద కూర్చుండివున్న మత్తయిని పిలువగా అతడు లేచి క్రీస్తుని అనుసరించాడు- మత్త 9,9. అలాగే ఉత్థాన క్రీస్తు దమస్కు త్రోవనుండి పౌలును పిలువగా అతడు వెంటనే ప్రభు శిష్యుడయ్యాడు - అ.చ. 8,4. ఈ పిలుపుల్లో సందేహానికి ఆస్కారంలేదు. కాని ఈలాంటి పిలుపులు చాల అరుదుగా గాని లభింపవు. కొన్నిసారులు ప్రభువు పిలుపు అంత స్పష్టంగా వుండదు గూడ. ఏంచేయాలో, ఏలాచేయాలో తెలియదు. బోలెడన్ని సందేహాలు కలుగుతాయి. ఈలాంటప్పుడు భక్తుడే ఆ సందేహాలను నివారించుకోవాలి. ఓ ఉదాహరణం. ప్రభువు అవివాహితయైన మరియను మెస్సీయాకు తల్లివి కమ్మని కోరాడు. ఆమె వినయంతో ఇదేలా సాధ్యపడుతుందని అడిగింది. ఆమె పురుష ప్రయత్నంతో గాదు, దైవశక్తితో బిడ్డను కంటుందని వివరించాడు దేవదూత - లూకా 1,28-34. ఇక్కడ మరియ సందేహ నివృత్తి చేసికొంది. ఈలా భగవత్ప్రబోధాలను గూర్చిన సందేహాలను నివృత్తి చేసికొనే బాధ్యత మనమీదనే వుంటుంది.

26. మత్తయి పౌలులకూ మరియకూ విన్పించిన పిలుపు అసాధారణమైంది. మన జీవితంలో అసలు ఈలాంటి పిలుపే విన్పించదు. మామూలుగా ఆ ప్రభువు మన అంతరాత్మలో మాటలాడుతూ మనలను నడిపిస్తూంటాడు. మన హృదయంలో ఓ విధమైన ప్రబోధం కలిగించి మనమేమి చేయాలో చెప్తూంటాడు. ఐనా భగవంతుడు కలిగించే ఈ ప్రబోధం మనకు స్పష్టంగా తెలిసిరాదు. చాల అనుమానాలూ శంకలూ వుండిపోతాయి. ఈలాంటి పరిస్థితుల్లో తెలియక ఒకోమారు మనం పొరపాటు చేయడం గూడ కద్దు. ఉదాహరణకు, పౌలు మంచిపనే చేస్తున్నాననుకొని క్రైస్తవులను హింసించాడు. క్రైస్తవులను బాధిస్తే తానింకా అధికంగా యూదభక్తుణ్ణి ఔతాననుకొన్నాడు. తరువాత తాను చేసింది తప్పని తెలిసికొని పశ్చాత్తాపపడ్డాడు. అటుతరువాత క్రీస్తుని ఆధారంగా తీసికొని గాని

ఆయా నిర్ణయాలు చేసికోగూడదని నిశ్చయించుకొన్నాడు. అన్ని పనుల్లోను ఆ ప్రభువు మనస్తత్వమే మనకూ వుండాలని బోధించాడు ఫిలి 2,5. ఈ పౌలు లాగే మనం కూడ భగవత్ప్రబోధం గుర్తించలేక జీవితంలో చాలాసారులు పొరపాటులు చేస్తుంటాం.

27. బైబులు భక్తులు భగవంతుడు తమ్ము నడిపించాలని ప్రార్థించారు. కీర్తనకారుడు తన యిక్కట్టులలో దేవాలయానికి వెళ్లి ప్రభుని సంప్రతించి చూడాలని కోరుకొన్నాడు-27,4. రిబ్కా తన గర్భంలోని కవలపిల్లలు ఒకరి నొకరు నెట్టుకొంటూండగా చూచి ప్రభుని సంప్రతించింది - ఆది 25,22. దావీదు తన ఆపదల్లో ప్రభుని సంప్రతించి చూచేవాడు. ప్రభువు సలహా ప్రకారం ప్రవర్తించేవాడు. ప్రవక్తలు తాము దైవ సందేశాన్ని విన్పింపకముందు ప్రభుని సంప్రతించేవాళ్లు. నూత్న వేదంలో పౌలు దైవచిత్తాన్ని తెలిసికోవడానికై పలుసారులు ప్రార్థన చేసాడు - కొలో 1,9. దమస్కును త్రోవలో ప్రభుప్రకాశం పౌలును నేల మీద కూలద్రోయగా అతడు "ప్రభో నేనేమి చేయాలో తెలియజేయి" అని ప్రార్థించాడు - అచ 22,10. ఈలాగే మనంకూడ భగవంతుడు మనలను నడిపించాలని ప్రార్థించాలి. మనం పిశాచం కపటోపాయాలకు లొంగిపోకుండా వుండాలనీ, దేవుని చిత్తప్రకారం జీవించాలనీ అడుగుకొంటూండాలి.

27ఎ. భగవంతుడు నరుల హృదయాల్లో మాటలాడుతూంటాడు. కీర్తనలు వ్రాసిన భక్తులకు ఈ యనుభవం బాగా వుంది. "నీయాలోచనలతో నన్ను నడిపిస్తుంటావు, కడన నన్ను నీ మహిమలో చేర్చుకొంటావు" అన్నాడు ఓ కీర్తనకారుడు-73,24. మనకు మంచి ఆలోచనలు పుట్టించేదీ, మనచేత మంచిపనులు చేయించేదీ, వాటికి సంభావన ఇచ్చేదీ ప్రభువే. "ప్రభువు నాకు హితోపదేశం చేస్తుంటాడు, రాత్రుల్లో గూడ అంతరాత్మ నన్ను హెచ్చరిస్తుంటుంది" అన్నాడు మరో భక్తుడు-16,7. భగవంతుడు తన భక్తులకు మేల్కొని వున్నపుడే గాదు నిద్రబోతున్నపుడు గూడ నడిపిస్తూంటాడు. యెషయా ప్రవచనం 54,13. "మీ బిడ్డలందరికీ ప్రభువే ఉపదేశం చేస్తాడు" అని చెప్తుంది. ఈ వాక్యాలను బట్టి ప్రభువు తన భక్తుల హృదయాల్లో మాటలాడుతుంటాడనీ, తన ప్రబోధం ద్వారా వాళ్లను నడిపిస్తుంటాడనీ, వ్యక్తమౌతుంది గదా! కాని ప్రభువు నరులు మాటలాడినట్లుగా పెద్దగా మాటలాడడు. అతడు తిన్నని యెలుగుతో మన హృదయంలో మాటలాడతాడు. ఆ ప్రభుస్వరం ఆధ్యాత్మిక మానవులకే గాని విన్పించదు. ప్రాపంచిక సుఖభోగాలతో సృష్టి వస్తులంపటత్వంతో సతమతమయ్యే వాళ్లకి ఆ ప్రభుస్వరం విన్పించనే విన్పించదు. కనుక మనం తరచుగా హృదయంలోనికి తొంగిచూచుకొని అక్కడ ప్రభువేమైనా ఉపదేశం చేస్తున్నాడా అని పరిశీలించి చూచుకోవాలి. భక్తులకు ఈలాంటి అలవాటు ఉంటుంది.

28. ప్రభువు మనలను నడిపించే తీరులో ఇంకో విషయం గూడ వుంది. మనం పెద్దల అధికారానికి లొంగి వుండాలి. దమస్కు మార్గంలో ప్రభువు పౌలు మనసును మార్చినాక అతన్ని నేరుగా క్రైస్తవ సమాజంలో చేర్చుకోలేదు. దమస్కు క్రైస్తవ సమాజంలో పేరెన్నికగన్న అననీయాను అతని వద్దకు పంపాడు. పౌలుకు జ్ఞానస్నానమిచ్చింది ఈ భక్తుడే - ఆ.చ. 9,17-19. అనగా పౌలు అననీయా అధికారాన్ని గుర్తించాలి. తొలినాటి సమాజంలో క్రైస్తవులు మోషే ధర్మశాస్త్రాన్ని పాటించాలా అక్కరలేదా అన్న వివాదం వచ్చింది. కొందరు పాటించాలని వాదించారు. పౌలు పాటించనక్కర లేదన్నాడు. మనలను రక్షించేది మోషే ధర్మశాస్త్రం గాదు, క్రీస్తునందలి విశ్వాసం అని బోధించాడు. కాని అతడు యెరూషలేము వెళ్లి అక్కడ వున్న పేత్రు యాకోబు మొదలైన భక్తులను కలుసుకొని తన వాదాన్ని విన్పించాడు. వాళ్ల అంగీకారాన్ని పొందాడు - అచ 15,1-3. ఈ సన్నివేశాలను బట్టి మనం క్రైస్తవ సమాజాధికారులకు లోబడి వున్నపుడు మాత్రమే దైవాత్మచే నడిపింపబడుతున్నామనే నిర్ధారణకు రావచ్చునని రూఢమౌతుంది గదా!

## 7. క్రీస్తు బోధలు

29. క్రీస్తుని పరిశుద్ధాత్మ ఎడారికి తోడ్కొని పోయింది. ఎందుకు? పిశాచం అతన్ని శోధించేందుకు - మత్త 4,1. ఈ విధంగా ఓ వైపు పరిశుద్ధాత్మా మరోవైపు దుష్టాత్మా మనలను ప్రభావితం చేస్తూంటాయి. ఇక, దుష్టాత్మ ప్రభుని ముమ్మారు శోధించింది. మొదట రాళ్లను రొట్టెలుగా మార్చమంది. అటుతరువాత దేవాలయ గోపురం మీది నుండి క్రిందికి దుముకమంది. అటుపిమ్మట చాగిలపడి తన్ను ఆరాధించమంది. ఈ మూడు శోధనల్లోని ముఖ్యాంశం, క్రీస్తు తండ్రి చిత్తాన్ని మీరేలా చేయడమే. కాని ఈ శోధనల్లో ప్రభువు పిశాచానికి లొంగిపోలేదు గదా, దాన్ని జయించాడు. ఐనా పిశాచం క్రీస్తుని అంతటితో వదలిపెట్టలేదు. పేత్రు ద్వారా మళ్ళా ప్రభువుని శోధించింది. అందుకే ప్రభువు పేత్రుని "సైతానూ! నా యెదుటి నుండి తొలగిపో" అని గద్దించాడు - మత్త 16,23. పిశాచం మనలను శోధించే తీరుగూడ ఈలాగే వుంటుంది.

30. క్రీస్తు బోధల్లో సదసదాత్మలను గుర్తుపట్టడానికి ఉపయోగపడే అంశాలు కొన్ని ఉన్నాయి. ప్రభువు ఇద్దరు యజమానులకు సేవచేయ వద్దన్నాడు - మత్త 6,24. ఈ యిద్దరు యజమానులు ఎవరు? భగవంతుడూ పిశాచమూను. మనం పూర్తిగా పిశాచం వైపు పోము. దేవుని సేవిస్తూనే వుంటాం. కాని పూర్తిగా దేవుని వైపు గూడ పోము. ఓ వైపు దేవుని ఆజ్ఞలు పాటిస్తూనే వుంటాం. మరోవైపు పిశాచంతో కూడ చేతులు కలుపుతూంటాం. దాని చెప్పుచేతలకు గూడ లొంగిపోతూంటాం. ఈ సంగతి మనకు తెలుసు. ఐనా స్వార్థం కొద్దీ గడ్డి తింటూంటాం. యూదా క్రీస్తునీ కోరుకున్నాడు ధనాన్నీ

కోరుకొన్నాడు. కడకు ఉట్టికీ స్వర్గానికీ గూడ పనికిరాకుండా పోయాడు-యోహా 12,6. ఈలా ప్రవర్తిస్తే పరిశుద్ధాత్మ ప్రబోధాన్ని నిరాకరించి దుష్టాత్మ ప్రబోధానికి లొంగిపోయినట్లే.

31. ప్రభువు "మీరు చిన్నబిడ్డలవలె నైతేనే తప్ప పరలోక రాజ్యంలో ప్రవేశింపలేరు" అన్నాడు-మత్త 18,3. ఇక్కడ చిన్నబిడ్డల వలె కావడం అంటే యేమిటి? మనం ప్రాయంలో చిన్న బిడ్డలం కాలేం. కాని మనస్తత్వంలో కాగలం. బిడ్డ మనస్తత్వానికీ పెద్దవాళ్ల మనస్తత్వానికీ చాలా భేదముంటుంది. పెద్దవాళ్లు ఇతరుల మీద అట్టే ఆధారపడరు. తమంతటతాము నిలువగలరు. కాని చిన్నబిడ్డలు నిత్యమూ తల్లిదండ్రుల మీద ఆధారపడతారు. క్రీస్తు నిత్యమూ తన తండ్రిమీద ఆధారపడి జీవించాడు. అలాగే మనం కూడ ఆ తండ్రి మీద ఆధారపడి జీవించాలని బోధించాడు. కనుక పసిబిడ్డల వలె కావడమంటే దేవుని మీద ఆధారపడ్డమే. వినయం గల నరుడు దేవుని మీద ఆధారపడి జీవిస్తాడు. కాని గర్వాత్ముడు దేవుని మీద ఆధారపడ్డానికి ఒప్పుకోడు. నాకు నేను చాలుదు ననుకొంటాడు. వినయాత్ములను పరిశుద్ధాత్మా గర్వాత్ములను అపరిశుద్ధాత్మా నడిపిస్తూంటుంది.

32. పైన 29వ అంశంలో క్రీస్తు పేత్రుని "సైతానూ నా యెదుట నుండి తొలగిపో" అని మందలించాడని చెప్పాం - మత్త 16,23. ఇక్కడ క్రీస్తు పేత్రుని "సైతానూ" అని పిలవడంలో భావమేమిటి? ప్రభువు తాను యెరూషలేములో బాధలనుభవించి సిలువ మీద మరణించాలి అని శిష్యులకు బోధించాడు. ఆ బోధ పేత్రుకు నచ్చలేదు. అతడు క్రీస్తుని ప్రక్కకు తీసికొనిపోయి ఈలాంటి మరణం నీకు ప్రాప్తించకుండా వుండాలి అని పల్కాడు. అనగా పేత్రు క్రీస్తు మరణాన్ని అర్థం చేసికోలేదు. క్రీస్తు సుఖాలు అనుభవించాలే గాని కష్టాలు అనుభవించ గూడదని అతని భావం. క్రీస్తుకు ఈ బోధచేయమని పిశాచమే అతన్ని ప్రోత్సహించింది. క్రీస్తు తన సిలువను నిరాకరించి తండ్రి చిత్తానికి వ్యతిరేకంగా పోవాలని పిశాచం ఈవరకే యెడారిలో శోధించింది. అక్కడ తాను నెగ్గలేక ఇప్పుడు పేత్రుద్వారా ప్రభుని శోధిస్తుంది. అందుకే ఈ శోధనను అర్థం చేసికొన్న ప్రభువు ఇక్కడ పేత్రుని "సైతానూ" అని పేర్కొన్నాడు. ఇక, క్రీస్తు మొదట సిలువ మరణం అనుభవించి ఆ పిమ్మట పునరుత్థానుడైనవాడు. అతని శిష్యులమైన మనం కూడ మొదట బాధలనుభవిస్తేనే గాని అటుపిమ్మట మహిమను పొందలేం. ఎవరు సిలువను నేర్పుతో తప్పించుకో జూస్తూంటారో వాళ్లను నడిపించేది పిశాచమే.

33. పై సన్నివేశం లాంటిదే మరొకటుంది. ఉత్థాన క్రీస్తు ఇద్దరు శిష్యులతో ఎమ్మావు గ్రామానికి వెళ్తున్నాడు. వాళ్లకు అతడే క్రీస్తని తెలీదు. ఆ శిష్యులు క్రీస్తు రోమను ప్రభుత్వంతో యుద్ధం చేసి పాలస్తీనా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించి పెడతాడనీ, అతడు రాజకీయాల్లో జోక్యం జేసుకొనే మెస్సీయా అనీ నమ్మారు. కాని క్రీస్తు అలాంటి

పనేమీ చేయకుండానే చనిపోయాడు. అంచేత వాళ్ల ఆశలన్నీ అడియాసలై పోయాయి. వాళ్ల మొగాలు చిన్నవోయాయి. ఈలాంటి శిష్యులను మందలిస్తూ ప్రభువు "క్రీస్తు మొదట శ్రమలనుభవించి అటుపిమ్మట మహిమలో ప్రవేశించుట అగత్యం కాదా" అని హెచ్చరించాడు - లూకా 24,26. ఇది మహావాక్యం. క్రీస్తుకు మొదట శ్రమలూ అటుపిమ్మట మహిమాను. గురువు కొక త్రోవా శిష్యుల కింకొక త్రోవా అంటూ లేదు. మనం కూడ ఆ గురువు లాగే మొదట సిలువ మోయాలి. అటుపిమ్మట మోక్ష మహిమను పొందాలి. కనుక మన ఆధ్యాత్మిక జీవితం సిలువ - ఉత్థానం అనే రెండు స్తంభాల మీద ఆధారపడి నిలుస్తుంది. ఈ సత్యాన్ని గ్రహించి జీవితంలోని శ్రమలను మంచి మనసుతో అంగీకరించే మహానుభావాలను పరిశుద్ధాత్మ నడిపిస్తుందని చెప్పాలి.

34. క్రీస్తు చెప్పిన ఇంకో వాక్యం గూడ ఇదే భావాన్ని తలంపునకు తెస్తుంది. ప్రభు శిష్యుడు కాగోరేవాడు తన్ను తాను నిగ్రహించుకోవాలి, ప్రభు సిలువను మోస్తూ, ఆయన్ని అనుసరించి వెళ్లాలి - మత్త 16,24. ఈ మహావాక్యం మూడు భావాలను బోధిస్తుంది. మొదటిది, క్రీస్తు శిష్యుడు తన్నుతాను నిగ్రహించుకోవాలి. తన్ను తాను జయించుకోవాలి. అనగా అతడు తన్ను తాను నిరాకరించుకొని క్రీస్తునే తన సర్వస్వంగా ఎన్నుకోవాలి. రెండవది, క్రీస్తు సిలువను మోయడానికి సంసిద్ధుడు కావాలి. ఇక్కడ సిలువంటే రకరకాల శ్రమలూ, మరణమూను. వీటిని హృదయపూర్వకంగా అంగీకరించినవాడే క్రీస్తు భక్తుడు. మూడవది, క్రీస్తును అనుసరించాలి. అనగా అతని శిష్యుడు కావాలి. క్రీస్తునాడు యూదుల రబ్బయుల శిష్యులు వాళ్ల గురువుల బోధలను నేర్చుకొని వాటిని తూచ తప్పకుండ భావితరాలవాళ్లకు అందించిపోయారు. కాని క్రీస్తు శిష్యులకు ఈ మాత్రం చాలదు. వాళ్లు క్రీస్తు బోధలను ఆలించడం మాత్రమే గాదు. అచ్చంగా అతనిలాగే జీవించాలి. విశేషంగా అతనిలాగే పరలోకంలోని తండ్రి మీద ఆధారపడి మనుగడ సాగించాలి. ఆ తండ్రిపట్ల బిడ్డల్లా మెలగాలి. ఈ నియమాలను పాటించేవాళ్లే యథార్థమైన క్రీస్తు శిష్యులు. వాళ్లే దేవుని ఆత్మచే నడిపింపబడే దైవపుత్రులు. మనం పరిశుద్ధాత్మచే నడిపింపబడుతున్నామో లేదో తెలిసికోగోరే వాళ్లకు ఇది పరీక్షావాక్యం. క్రైస్తవ శిష్యుని కుండవలసిన లక్షణాలను గూర్చి ప్రస్తావించేపుడు దీనికంటే గొప్పవాక్యం మరొకటి క్రీస్తు బోధల్లో కన్పించదు.

## 8. పరిశుద్ధాత్మ నడిపించే తీరు

35. క్రీస్తు శిష్యులతో ఉన్నంతకాలం అతడే వాళ్లకు ఆదరణ కర్త. క్రీస్తు ఉత్థానమై వెళ్లిపోయాక అతని ఆత్మ శిష్యులకు ఆదరణకర్తగా వచ్చింది. యూదు ప్రజల సంప్రదాయాన్ననుసరించి ఒక నాయకుడు దాటిపోతూ మరొక నాయకుణ్ణి నియమించి

వెళ్తాడు. ఆ రెండవ నాయకుడు మొదటి నాయకుడు ప్రారంభించిన పనిని కొనసాగించుకొని పోతాడు. మోషే దాటిపోతూ యోషువాని నాయకుణ్ణిగా నియమించాడు. యోషువా యిస్రాయేలు ప్రజలను వాగ్దత్త భూమికి చేర్చాడు. యేలీయా దాటిపోతూ యెలీషాను ప్రవక్తగా నియమించాడు. అలాగే క్రీస్తు దాటిపోతూ పరిశుద్ధాత్మను నాయకునిగా నియమించాడు. కనుక క్రీస్తు నెలకొల్పిన క్రైస్తవ సమాజాన్ని ఈయాత్మ నడిపిస్తూంటుంది. తండ్రి వద్దకు చేర్చుతూంటుంది. ఒకవైపు పిశాచం బిడ్డలను పిశాచం నడిపిస్తుంటుంది. మరోవైపు దేవుని బిడ్డలను దేవుని ఆత్మ నడిపిస్తూంటుంది - రోమా 8,14.

36. పరిశుద్ధాత్మ భక్తులను నడిపిస్తుందని చెప్పాం. కొన్ని ఉదాహరణలు చూద్దాం. మరియ బాలయేసును దేవాలయంలో అర్పించడానికి వెళ్ళినపుడు ఆత్మ సిమియోను అనే వృద్ధుని నడిపించుకొని వచ్చింది. అతడు క్రీస్తును దర్శించిందాకా కన్నుమూయడని ఆత్మ అతనికి హామీ యిచ్చింది - లూకా 2,25-28. అలాగే ఆత్మ గ్రీకు ప్రజలకు సువార్తను బోధించడానికై అంటియోకయ నుండి పౌలును బర్నబాను కొనిపోయింది - అచ 13 2-4. పౌలు మూడవ ప్రేషిత ప్రయాణంలో వుండగా యెరూషలేములో అతని కోసం శ్రమలు కాచుకొని వున్నాయని ఆత్మ అతనికి ముందుగానే ఎరుకపరిచింది-20, 22-33. రథంమీద కూర్చుండి యెషయా ప్రవచనాన్ని చదువుకొంటూ పోతూన్న యితియోపీయుని వద్దకు ఫిలిప్పుని నడిపించుకొని వచ్చింది- 8,29. యెరూషలేము లోని తొలి క్రైస్తవ సమాజానికి ఏడ్గురు డీకన్లు నాయకులుగా వ్యవహరించారు. వాళ్ళల్లో ఒకడైన స్తెఫను ఆత్మచే ప్రబోధితుడై వేదసాక్షిగా మరణించాడు-7,55. ఈలా ఆత్మ నిత్యం తన భక్తులను నడిపిస్తూనే వుంటుంది.

37. ఇటీవల మన కాలంలోనే ఆత్మ జాన్ పోపుగారిని నడిపించింది. ఈ మహానుభావుడు క్యాతలిక్ సమాజానికి పట్టిన బూజులు తుడిచివేయాలని సంకల్పించుకొన్నాడు. కాని ఆ తొలిరోజుల్లో ఇతర క్యాతలిక్ అధికారులు ఈయనతో అట్టే సహకరించలేదు. అపుడు ఈ పుణ్యపురుషుని హృదయంలో ఓ ఆవేదనం మంటలా మండేదిట. "నీవు క్రైస్తవ సమాజాన్ని సంస్కరించాలి సుమా!" అనే ప్రబోధం అతని అంతర్మాతలో విన్పించేదట. ఆ భక్తుడు అది పరిశుద్ధాత్మ ప్రబోధమని గుర్తించాడు. ఆ ముసలి ప్రాయంలో రెండవ వాటికన్ సమావేశం ప్రారంభించాడు. మన క్యాతలిక్ సమాజానికి ఆయన చేసిన ఉపకారం అంతా యింతా కాదు. మొదటి పెంతెకోస్తు తర్వాత వాటికను సమావేశము వంటి సంఘటనం మరొకటి క్రైస్తవ చరిత్రలో లేనేలేదని విజ్ఞుల అభిప్రాయం. మన దౌర్భాగ్యమా అంటూ ఈ వాటికను సభ చేసిన నిర్ణయాలూ సంస్కారాలూ నేటివరకూ మనదాకా రానేలేదు. ఆ జాను భక్తుని హృదయం ఓ మంటలా రాజుకొంటూండేదని చెప్పాం. పూర్వం యిర్మీయా ప్రవక్తకు గూడ యీలాంటి అనుభవమే వుండేది - యిర్మీ 20,9. భక్తులైనవాళ్ళని ఆత్మ నడిపించే తీరు ఈలా వుంటుంది.

38. పరిశుద్ధాత్మ మనకు వరాలనిస్తుంది. ఈ వరాల్లో వొకటి ఏవి సదాత్మలో ఏవి దుష్టాత్మలో గ్రహించేలా చేస్తుంది. అనగా సదసదాత్మ వివేచనం పరిశుద్ధాత్మ వరం - 1కొ 12,10. పరిశుద్ధాత్మా అపరిశుద్ధాత్మా నిప్పు నీళ్లు లాగ ఒక దానితో ఒకటి కలియవు. అపరిశుద్ధాత్మ వున్న కాడ పరిశుద్ధాత్మ వుండదు. అలాగే పరిశుద్ధాత్మ వున్న కాడ అపరిశుద్ధాత్మ వుండలేదు. ఈ యాత్మలు మనలను నడిపించే తీరు తెలిసికోవాలంటే మొదట మనతరపున మనకు కొంత జాగ్రత్తా ఆలోచనా వుండాలి. ఈ వరాన్ని ప్రసాదించమని ఆత్మను ప్రార్థించాలి గూడ. మన జీవితంలో ఏయాత్మ ఏతీరుగా ప్రవర్తిస్తుందా అని ఆలోచించి చూచి కొంత అనుభవం గడించాలి. మొత్తం మ్మీద సదసదాత్మ జ్ఞానమనేది కొంత కృషి చేసి సాధించదగిన ఉత్తమ వరం.

39. పరిశుద్ధాత్మ నడిపించే వాళ్లల్లో కొన్ని లక్షణాలుంటాయని చెప్పాడు పౌలు. ఈ లక్షణాలను అతడు "ఆత్మఫలాలు" అని పేర్కొన్నాడు. అవి ప్రేమ, సంతోషము, సమాధానము, సహనము, దయ, మంచితనము, నమ్మనగిన తనము, వినయము, ఇంద్రియ నిగ్రహము- గల 5,22. కనుక ఈ లక్షణాలు మనలో వుంటే ఆత్మ మనమీద పనిచేస్తుందని రూఢిగా చెప్పవచ్చు. ఈలాగే పిశాచం నడిపించే వాళ్లల్లో పిశాచలక్షణాలు కన్పిస్తాయి. వాటిని గూడ పౌలు పేర్కొన్నాడు. అవి జారత్వము, అపవిత్రత, చెడునడత, విగ్రహారాధనము, మాంత్రిక క్రియలు, ద్వేషము, కలహము, మత్సరము, క్రోధము, స్వార్థము, కక్షలు, వర్గాలు, పక్షాలు, త్రాగుబోతుతనము, అల్లరిపనులు. ఈ లక్షణాలను బట్టి మనమీద పిశాచ ప్రభావం ఎంతగా వుందో గుర్తించవచ్చు - గల 5,19-21. సదసదాత్మల ప్రభావాన్ని పరిశీలించి తెలిసికోగోరేవాళ్లాకి ఇంతకంటె స్పష్టమైన లక్షణాలు నూత్నవేదంలో మరెక్కడా కన్పించవనే చెప్పాలి.

40. పౌలు చాలతావుల్లో క్రైస్తవ సమాజాన్ని ఓ దేవాలయంతో పోల్చాడు. ఈ దేవాలయానికి పునాదిరాయి క్రీస్తే. క్రైస్తవులంతా ఈ పునాది రాతిమీద సజీవ శిలలుగా అమర్చబడతారు. వాళ్లంతా కలసి ఓ దేవాలయంగా తయారౌతారు - ఎఫె 2,20-22. ఇక, మనమెప్పుడూ ఈ క్రైస్తవ సమాజ నిర్మాణానికి పూనుకోవాలే గాని దాన్ని ధ్వంసం చేయగూడదు. కొంతమంది ఈ సమాజంలో చీలికలు తెచ్చిపెడుతూంటారు. దాని ద్వారా సమాజం నాశమైపోతుంది. ఈలాంటి వాళ్లను పిశాచం నడిపిస్తుందనే చెప్పాలి. క్రైస్తవ సమాజ నిర్మాణంలాగే సోదరప్రేమ కూడ చాల ముఖ్యమైంది. ఓ ప్రాచీన రోమను సామెత "నరునికి నరుడు తోడేలు" అని చెప్తుంది. నరులు స్వార్థం కొద్దీ ఒకణ్ణి ఒకడు పీకుకొని తింటుంటారు. ఈలాంటి పరిస్థితుల్లో దేవుడు పరిశుద్ధాత్మ ద్వారా తన ప్రేమను మన

హృదయాల్లో కుమ్మరిస్తూంటాడు - రోమా 5,5. కనుక ఎవరు సోదర ప్రేమతో జీవిస్తుంటారో వాళ్లను పరిశుద్ధాత్మ నడిపిస్తున్నట్లు. ఎవరు సోదర ప్రేమ మీరి తోడేళ్లలాగా ప్రవర్తిస్తుంటారో వాళ్లను అపరిశుద్ధాత్మ నడిపిస్తున్నట్లు.

41. యోహాను మొదటి జాబు 2,20 వచనమూ, 2,27 వచనమూ దేవుని ఆత్మ మన హృదయాలను అభిషేకిస్తుందని వాకొంటుంది. ఇక్కడ ఆత్మ మన హృదయాలను అభిషేకించడమంటే, మనకు క్రీస్తు పట్ల విశ్వాసం పుట్టించడమే. అతని బోధలను మనం అర్థం చేసికొనేలా చేయడమే. అతని జీవితాన్ని, విశేషంగా మరణాన్నీ ఉత్థానాన్నీ, మనం అంగీకరించేలా చేయడమే. ఈ భావమే యోహాను సువార్త 16,12-14 వాక్యాల్లో గూడ కన్పిస్తుంది. పరిశుద్ధాత్మ దిగివచ్చి శిష్యులను సంపూర్ణ సత్యంలోనికి నడిపిస్తుంది. ఇక్కడ సంపూర్ణ సత్యమంటే క్రీస్తే. అనగా ఆత్మ వచ్చి శిష్యులు క్రీస్తుని బాగుగా అర్థం చేసికొనేలా, అతన్ని పూర్ణ హృదయంతో అంగీకరించేలా చేస్తుంది. ఆత్మ క్రీస్తు బోధలనే గైకొని వాటిని మళ్లా శిష్యులకు బోధిస్తుంది. ఆ బోధల భావాన్ని విప్పి చెప్తుంది. కనుక ఆత్మచే నడిపింపబడేవాళ్లకు మన క్రైస్తవ మతసత్యాల పట్ల ఆసక్తి కలుగుతుంది. బైబులు మీద కోరిక పుడుతుంది. క్రీస్తు జీవిత పరమార్థాన్నీ అతని బోధల భావాన్నీ అధికాధికంగా తెలిసికొందామనే ఆశ జనిస్తుంది. ఈ కోరిక గూడ కేవలం జ్ఞానం కొరకు గాదు, భక్తి కొరకు. ఆచరణం కొరకు. అందుచేత మనం ఈ యాత్మ అభిషేకం కోసం ప్రార్థిస్తూండాలి.

42. ఆత్మ మనకు చేసే ప్రధానమైన సేవ ఒక్కటే ఒక్కటి - మనలను ఆ క్రీస్తు వద్దకు తోడ్కొని పోవడం. ఆ ప్రభువుతో జోడించడం. ఈ కార్యాన్నే ఆత్మ నానా రూపాల్లో చేస్తుంది. "నన్ను పంపిన తండ్రి ఆకర్షిస్తేనే తప్ప ఎవడూ నా యొద్దకు రాలేడు" అనే క్రీస్తు వాక్యం ఒకటుంది -- యోహాను 6,44. ఈ యాకర్షణే పరిశుద్ధాత్మ. అనగా తండ్రి పరిశుద్ధాత్మ ద్వారా మనలను క్రీస్తు వద్దకు రాబట్టు కొంటూంటాడు. ఆత్మ మనలను క్రీస్తు వద్దకు చేరుస్తూంటుంది. ఈ యాత్మ అనుగ్రహం లేందే మనం యేసు ప్రభువు అని అంగీకరించలేమన్నాడు పౌలు - 1కొరి 12,3. ఈ వాక్యంలో "ప్రభువు" అంటే దేవుడని భావం. కనుక మనం క్రీస్తు దేవుడని విశ్వసించేది గూడ పరిశుద్ధాత్మ ద్వారానే. ఈ యాత్మ మన హృదయం మీద క్రీస్తు రూపురేఖలు చిత్రిస్తుంది. క్రీస్తు పట్ల భక్తిని కలిగిస్తుంది.

43. క్రీస్తు అనుసరణ గ్రంథం 3,54 మానవ ప్రకృతితో నడిచేవాళ్లు కొందరూ, దైవ వరప్రసాదంతో నడిచేవాళ్లు కొందరూ అని చెప్తుంది. ఈ యిరుతెగల వాళ్ల లక్షణాలను చాల పేర్కొంటుంది. వాటిలో కొన్నిటిని ఈ క్రింద ఉదాహరిస్తున్నాం. ఇక్కడ మానవ ప్రకృతి అంటే పిశాచ ప్రబోధం. దైవ వరప్రసాదమంటే పరిశుద్ధాత్మ ప్రబోధం. సాధకులు ఈ యధ్యాయాన్ని జాగ్రత్తగా చదివి చూడండి. మిమ్మేయాత్మ నడిపిస్తుందో మీకే బోధపడుతుంది.

| మానవ ప్రకృతి | దైవ వరప్రసాదం |
|---|---|
| మోసమూ, దంబమూ | నిరాడంబరం |
| విచ్చలవిడిగా తిరగడం | ఆత్మనిగ్రహం |
| ఇతరుల అధికారాన్ని సహించకపోవడం | ఇతరులకు లొంగివుండడం |
| స్వీయలాభం కోరడం | పరుల లాభం |
| స్వీయ ఘనత కోరడం | దేవుని మహిమపరచడం |
| శరీర సుఖాలు | కష్టపడి పనిచేయడం |
| నాజూకు వస్తువులపై మోజు | సామాన్య వస్తువులు చాలు |
| అనిత్య సుఖాలు వెదకడం | శాశ్వత సుఖాలు |
| పుచ్చుకోవడం | ఈయడం |
| వస్తువులు కూడబెట్టడం | పంచుకోవడం |
| ప్రపంచాడంబరాలవైపు ఆకర్షణ | దేవునివైపు ఆకర్షణ |
| సంచార ప్రీతి | నిలకడ |
| ఇతరుల బహుమతులు కావాలి | దేవుడే మన బహుమతి |
| ఇతరుల మెప్పులు పొందాలి | దేవుణ్ణే స్తుతించాలి |
| అధికారులు, గొప్పవాళ్లూ మనకు స్నేహితులు కావాలి | దేవుడే స్నేహితుడు |
| కష్టాలు సహించకపోవడం | తాల్మి |
| వార్తలూ సుద్దులూ కావాలి | లోకంలో క్రొత్త యేముంది? |
| సృష్టివస్తువుల వైపు ఆకర్షణ | సృష్టికర్తవైపు ఆకర్షణ |

44. దేవుని ఆత్మచే నడిపింపబడ్డ మనేది జీవితంలో ఒక్క సన్నివేశానికి గాని లేక ఒక్క రోజుకి గాని సంబంధించినది గాదు. మన జీవితమంతా ఆత్మచేత నడిపింప బడుతూండవలసిందే. మన కార్యాలన్నీ ఆత్మ అనుగ్రహంతో కొనసాగి పోతుండవలసిందే. కనుక భక్తుడైనవాడు రోజురోజూ, వారవారమూ, నెలనెలా తన దినచర్యను పరిశీలించి చూచుకొంటూంటాడు. తన ప్రార్థనల్లో, ఆత్మశోధనల్లో, ధ్యానాల్లో, వడకాల్లో తాను ఏ యాత్మ చేత నడిపింప బడుతున్నాడో జాగ్రత్తగా పరిశీలించి చూచుకొంటూంటాడు. ఇగ్నేష్యసు తన్ను ఏయాత్మ నడిపిస్తుందో రోజూ ఆత్మ శోధనల్లో తరచితరచి చూచుకొనేవాడని చెప్పాం. మనం కూడ రోజూ ఈలా ఆత్మపరీక్ష చేసికొంటూంటే ఎంత బాగుంటుంది! ఇంకా చూడు, బైబులు ధ్యానాలు 29, "రెండు మార్గాలు".

# 9. పిలుపు



విషయ సూచిక

| | | |
|---|---|---|
| 1. | సేవా జీవితం | 182 |
| 2. | ఎన్నిక | 185 |
| 3. | పిలుపు | 188 |
| 4. | క్రీస్తుతో పరిచయం | 190 |
| 5. | సువార్తను ప్రకటించడం | 194 |
| 6. | ఆత్మరక్షణ కాంక్ష | 196 |
| 7. | నిగ్రహం | 199 |
| 8. | మోక్షభాగ్యం ధ్రువం | 202 |

## 1. సేవా జీవితం

గురుజీవితమూ కన్యాజీవితమూ ప్రధానంగా సేవాజీవితం. ఈ జీవితాన్ని గూర్చి యీ తొలియధ్యాయంలో కొన్ని ప్రాథమికాంశాలు తెలిసికొందాం.

### 1. గురువుల కొరత

మనదేశంలో క్రైస్తవప్రజలు రెండున్నర శాతంమాత్రమే. ఈ సమాజం ఇంకా యెంతో వృద్ధిలోకి రావాలి. క్రైస్తవప్రజలకు సేవలుచేసి వాళ్లను నడిపించే నాయకులు గురువులూ మఠకన్యలూను. కాని ఈ గురువులూ మఠకన్యలూ కావడానికి మన సమాజంనుండి చాలినంతమంది యువతీయువకులు ముందుకి రావడంలేదు. దక్షులైన నాయకులు లేందే క్రైస్తవప్రజలు ఏలా వృద్ధిలోకి వస్తారు? ప్రభువు తననాటి యూదప్రజలనుజూచి వాళ్లు కాపరిలేని మందలాగ వున్నారని చింతించాడు - మార్కు - 6,34. ఈ వాక్యం నేటి మన క్రైస్తవసమాజాలకూ అక్షరాల వర్తిస్తుంది. కనుక చైతన్యంగల యువతీయువకులు ఉత్సాహంతో ముందుకి వచ్చి గురువులూ మఠకన్యలుగా పనిచేయడానికి పూనుకోవాలి.

### 2. సేవాభావం

గురుజీవితమూ కన్యాజీవితమూ ప్రధానంగా సేవకొరకు ఉద్దేశింపబడినవని చెప్పాం. గురువూల మఠకన్యలూ క్రైస్తవ సమాజానికి చేసే సేవలు ఏమిటివి? మన క్రైస్తవ సమాజాలు దేశంలో గొప్పగొప్ప విద్యాసంస్థల నెన్నిటినో నడిపిస్తున్నాయి. వీటిల్లో విద్యాసేవ చేసేనాథులు దొరకవద్దా? ఇంకా మన సమాజాలు పెద్దపెద్ద ఆస్పత్రులు

నడిపిస్తున్నాయి. ఈ యాస్పత్రుల్లో వైద్యసేవ చేసేవాళ్ళు కావాలి. పేదసాదలనూ బలహీన వర్గాలనూ అర్థికంగాను సాంఘికంగానూ ముందుకి తీసికొనిరావడానికి మన వాళ్ళు సాంఘిక సేవాకార్యక్రమాలను ఎన్నిటినో చేపడుతున్నారు. ఈ కార్యక్రమాల్లో పనిచేసేవాళ్ళు ఉండాలి. ఇక, క్రీస్తుని బోధిస్తూ సువిశేషాన్ని ప్రకటిస్తూ జ్ఞానోపదేశసేవ చేసేవాళ్ళూ కావాలి. ఈ సేవాసంస్థలన్నిటినీ కొనసాగించుకొంటూ పోవాలంటే ఎంతోమంది యువతీయువకులు ముందుకివచ్చి వీటిల్లో గురువులుగా మఠకన్యలుగా పనిచేయాలిగదా? ముసలివాళ్ళు పనినుండి విరమించుకొంటూంటే వయసువాళ్ళువచ్చి పనిలో చేరుతూండాలిగదా? చోద్యమేమిటంటే, మన యువతీయువకులు క్రైస్తవ సంస్థల్లో చదువుకొని వృద్ధిలోకి వస్తూంటారు. కాని తర్వాత ఈ సంస్థల్లోచేరి సేవచేయడానికిమాత్రం ఎంతమాత్రమూ ఒప్పుకోరు. ఇది వట్టి స్వార్థం.

## 3. కన్యాజీవితపు విలువ

రీత, సుజాత అని యిద్దరమ్మాయిలు. వాళ్ళిద్దరూ తోటలోనికివెళ్ళి రెండు గులాబీపూలు కోసుకొన్నారు. రీత తాను కోసికొనిన పూవును జడలో ముడుచుకొని యెంతో సంతోషించింది. కాని సుజాత తనపూవును తీసుకొనివెళ్ళి గుళ్ళో దేవుని పాదాలవద్ద సమర్పించింది. రీత పూవును జడలో పెట్టుకోవడం మంచిదే. కాని సుజాత పూవును దేవునికి సమర్పించుకోవడం అంతకంటె మంచిది. ఓ యువతి తన జీవితాన్ని ఓ పురుషునికి అర్పించుకొని అతనితో వివాహజీవితం జీవించడం మంచిదే. కాని అదేయువతి తన జీవితాన్ని భగవంతునికి సమర్పించుకోవడం అంతకంటె యోగ్యమైంది. వివాహితమైనయువతి భర్తనేలా సంతోషపెట్టాలా అని లౌకిక విషయాలతో సతమత మౌతూంటుంది. కాని అవివాహితయైన మఠకన్య ప్రభువునేలా సంతోషపెట్టాలా అని ఆధ్యాత్మిక విషయాలతో సతమత మౌతూంటుంది. ఇదే నియమం వివాహితుడైన పురుషునికీ అవివాహితుడైన గురువుకీగూడ వర్తిస్తుంది. కన్యాజీవితంలోను గురుజీవితంలోను వుండే విలువంతా యిక్కడే వుంది - 1కొ 7, 32-34.

## 4. కన్యాజీవితానికే శాశ్వతస్థితి

వివాహజీవితం కేవలం ఈలోకంకొరకు ఉద్దేశింపబడింది. ఇక్కడి ప్రజలు చనిపోతుంటారుగనుక వివాహజీవితంద్వారా క్రొత్త జనాన్ని కనవలసివుంటుంది. కాని మోక్షంలోని నరులు చనిపోరు. అక్కడ క్రొత్తవాళ్ళను కనవలసిన అవసరంలేదు. కనుక అక్కడ వివాహజీవితమంటూ వుండదు. అక్కడివాళ్ళు పెండ్లి చేసుకోరు. శాశ్వతంగా దేవదూతల్లా వుండిపోతారు. కన్యాజీవితంగూడ ఈలా అవివాహితులుగా వుండిపోవడమే.

కనుక వివాహజీవితం కేవలం ఈలోకానికి సంబంధించింది. దానికి శాశ్వతస్థితి అంటూలేదు - మార్కు 12, 25.

కన్యాజీవితం ఈ లోకానికీ పరలోకానికీగూడ సంబంధించిందీ, శాశ్వతమైందీని.

## 5. ఏలా తెలిసికోవాలి?

సుందరిని తల్లిదండ్రులు మేనత్త కొడుకు సత్యానికిచ్చి పెండ్లి చేయాలనుకొన్నారు. కాని సుందరిమాత్రం ప్రక్కింటి యువకుడు రాజును పెండ్లి చేసికొంటాననంది. తల్లి సత్యాన్ని చేసికొమ్మని కూతురుని దబాయించింది. కాని ఆ యమ్మాయి ఒప్పుకోలేదు. రాజంటే తనకెంతో యిష్టం అనిచెప్పింది. ఇక్కడ ఈ "యిష్టం" ప్రధానం. గురుజీవితానికి కన్యాజీవితానికీ గూడ ఇదే నియమం వర్తిస్తుంది. మనకు గురుజీవితానికీ కన్యాజీవితానికీ పిలుపువుంటే ఆ జీవితంమీద ఓ విధమైన యిష్టం పుడుతుంది. మనకు పిలుపు వుందా లేదా అని తెలిసికోవాలి అంటే ఈ యిష్టం అనే దానికంటె గొప్పగురుతు ఏమీలేదు. పరిశుద్ధాత్మే మన హృదయంలో ఈ యిష్టాన్ని పుట్టిస్తుంది. పిలుపు లేనివాళ్లకు ఈలాంటి జీవితాన్ని ఎన్నుకోవాలంటే యెంతో అనిష్టంగా వుంటుంది. ఈ యిష్టం కొందరిలో స్పష్టంగాను బలంగాను వుంటుంది. కొందరిలో అంత స్పష్టంగా వుండదు. మనకు గురుజీవితంమీదా కన్యాజీవితంమీదా పెద్ద యిష్టం కన్పించక పోయినా, అనిష్టం మాత్రం వుండకూడదు. పిలుపుకి ఇది చాలు.

పిలుపుకి ఇష్టం ప్రధానలక్షణం అన్నాం. కాని పిలుపు వున్నవాళ్లల్లో ఈ యిష్టంతోపాటు కొన్ని అప్రధాన లక్షణాలు కూడ కన్పిస్తాయి. అవి దేవద్రవ్యానుమానాలమీద ఆశ, చావైన పాపాలను మానుకోవడం, చెడు సవాసాలకు పోకుండా వుండడం, విరక్తత్వంపట్ల ప్రీతి, లోకంలోని ఆడంబరాలమీద అట్టే మోజు పెట్టుకోకుండా వుండడం, నిరాడంబర జీవితం, దేవమాతపట్ల భక్తి, తోడి ప్రజలకు ఏదో మేలు చేద్దామన్న కోరిక - మొదలైనవి. ఈ లక్షణాలన్నీ మనలో వుండనక్కరలేదు. వీటిల్లో కొన్ని వున్నా చాలు. ఈ పిలుపు విషయంలో సందేహం కలిగినపుడు పెద్దలూ తల్లిదండ్రులూ ఆత్మగురువులూ మొదలైన వాళ్లను సలహా అడగాలి.

ఇంకా, క్రైస్తవప్రజలను నడిపించేది పరిశుద్ధాత్మ - రోమా 8,14. పిలుపుద్వారా మనలను గురుజీవితానికీ కన్యాజీవితానికీ నడిపించేదిగూడ ఆయాత్మే. కనుక గురువూ మఠకన్యా కావాలనుకొనేవాళ్లు ఆయాత్మ సహాయం అడుగుకోవాలి. మనం ఏత్రోవవెంట వెళ్లాలో తెలియజెప్పమనీ, మనహృదయంలో మాటలాడమనీ ఆయాత్మను అడుగుకోవాలి.

## 6. ఎవరిలో చేరాలి?

చాలరకాల గురువులున్నారు. అదేవిధంగా అమ్మగార్లకు గూడ చాల మఠసభలున్నాయి. యువతీయువకులకు ఏ గురువుల్లో, లేక ఏ యమ్మగార్లల్లో చేరితే

బాగుంటుంది అనే సందేహం కలుగుతుంది. మామూలుగా విద్యార్థులు ఎవరి విద్యాసంస్థల్లో చదువుకొంటారో వాళ్ళల్లో చేరుతూంటారు. ఎందుకంటే ఆ గురువులనుగూర్చీ, ఆ మఠకన్యలనుగూర్చీ మనకు కొంత పరిచయముంటుంది. వాళ్ళుకూడ మనం తమలోచేరాలనే కోరుకుంటూంటారు. కాని మనకు ఒకోమారు వేరేవాళ్ల సభలో చేరాలనికూడ కోరిక పుడుతుంది. దీనికి బలమైన కారణాలుకూడ వుండవచ్చు. అలాంటప్పుడు నిరభ్యంతరంగా మనం కోరుకొన్న సభలో చేరవచ్చు. ఈ విషయంలో ఏదైనా సందేహంకలిగితే తల్లిదండ్రులూ ఆత్మగురువులూ మొదలైనవాళ్లను సంప్రతించాలి.

ఈ యధ్యాయంలో పిలుపుగూర్చి కొన్ని విషయాలు స్థూలంగా జెప్పాం. ఈ యంశాలు ఇంకా పాఠశాలల్లోను కళాశాలల్లోను చదువుకొనే విద్యార్థులకొరకు. ఇక రాబోయే అధ్యాయాల్లో పిలుపును సవిస్తరంగా వివరిస్తాం. ఆ వివరాలు ఈ వరకే నోవిష్యేటుల్లోను సెమినరీల్లోను చేరిన యువతీయువకులకు ఎక్కువగా ఉపయోగపడతాయి.

# 2. ఎన్నిక

పౌలు తన పిలుపునుగూర్చి చెప్పుకొంటూ యీలా వ్రాసాడు : 1 నేను తల్లి గర్భంలో రూపొందినప్పటినుండే దేవుడు నన్ను ప్రత్యేకపరచాడు. 2 తన కృపచేత నన్ను పిలిచాడు. 3 తన కుమారుణ్ణి నాకు ప్రత్యక్షంచేసాడు. 4 నేను అన్యజనులకు తన కుమారుణ్ణి ప్రకటించాలని కోరుకొన్నాడు - గల 1,15 -16. పౌలుచెప్పిన పైనాల్గుభావాలను నాల్గు అధ్యాయాల్లో విపులంగా పరిశీలించి చూద్దాం. ఈ మొదటి అధ్యాయంలో "దేవుడు నన్ను ప్రత్యేకపరచాడు" అనే భావాన్ని చూద్దాం. దీన్నే ఎన్నిక అంటాం.

## 1. ఆకర్షణం

దేవుడు కొందరు స్త్రీ పురుషులను తన పనికై యెన్నుకొంటాడు. ఈ యెన్నికలో రెండంశాలు ఉంటాయి. మొదటిది, ప్రభువు తానెన్నుకొనిన వ్యక్తిని పాపపు ప్రపంచాన్నుండి వేరుచేస్తాడు. రెండవది, పవిత్రుడైన భగవంతుడు ఆ వ్యక్తిని తన సేవకు అంకితం జేసికొంటాడు. యెషయా యిర్మీయావంటి ప్రవక్తలూ, మోషే దావీదులాంటి నాయకులూ, అపోస్తలులూ మరియావంటి భక్తులూ ఈ లక్షణాలు కలవాళ్లే. ప్రభువు తానెన్నుకొనిన వ్యక్తిని తోడిజనంనుండి వేరుజేస్తాడు. తన వరప్రసాదంతో ఆ వ్యక్తిని తనవైపు బలంగా ఆకర్షించుకొంటాడు. ఈ యాకర్షణనుగూర్చి మాట్లాడుతూనే క్రీస్తు ఓమారు "నా తండ్రి ఆకర్షిస్తేనేతప్ప ఎవరూ నాచెంతకు రాలేరు" అని పల్కాడు - యోహా 6,44.

## 2. ప్రభువుకి మనలనుగూర్చి ముందుగనే తెలుసు

"నేను తల్లిగర్భంలో రూపొందించినప్పటినుండే ప్రభువు నన్ను ప్రత్యేకపరచాడు" అన్నాడు పౌలు. ఇది చాల గొప్పభావం. మనం పుట్టక పూర్వం మనలనుగూర్చి ఎవరికి

తెలుసు? మన తల్లికిగూడ తెలీదు. ఆమె యింకా మనలను కంటితో చూడనేలేదు. ఐనా మనం తల్లిగర్భమనే చీకటి కోనేటిలో వుండగనే ప్రభువు మనలను ఆదరంతో వీక్షించాడు. అప్పటికింకా మనకు జన్మపాపం వుంది. ఐనా ప్రభువు మనలను చిన్నచూపు చూడలేదు. అసలు మనం తల్లికడుపున బడినప్పటినుండే ప్రభువు మనలను తన సేవకు అంకితం జేసికొన్నాడు. తొలుతటినుండీ మనం అతని వాళ్లమే. కనుకనే ప్రభువు యిర్మీయా ప్రవక్తకు ఈలా సెలవిచ్చాడు. "నీవు మాతృగర్భంలో రూపొందకముందే నిన్ను గూర్చి నాకు తెలుసు. నీవు తల్లికడుపునుండి వెలువడకముందే నేను నిన్ను ప్రతిష్ఠించాను. నిన్ను అన్యజాతులకు ప్రవక్తగా నియమించాను" - యిర్మీ 1,5. ప్రవక్త తన పిలుపునుగూర్చి చెప్పుకొన్న ఈ వాక్యాలనే పౌలు తన పిలుపుకుగూడ అన్వయించుకొన్నాడు. ఇదే వాక్యాలను ఈనాడు మన పిలుపుకీ వర్తింపజేసికోవచ్చు.

ప్రభువుకి మనలనుగూర్చి ముందుగనే తెలుసు అనేభావం పౌలుకి ఎంతైనా నమ్మికనూ ఉత్సాహాన్నీ పుట్టించింది. అందుకే అతడు తనజాబులో "యేసుక్రీస్తు దాసుడూ, ప్రేషితుడుగా పిలువబడినవాడూ, దేవుని సువార్తను ప్రకటించడానికి ప్రత్యేకింప బడినవాడూ ఐన పౌలు రోమాపురిలోని దేవుని ప్రియులందరికీ వ్రాయునది" అని సగర్వంగా చెప్పుకొన్నాడు - రోమా 1,1. ప్రపంచములోని ప్రజలు తమ పేర్లకు ఎన్నో బిరుదాలూ డిగ్రీలూ తగిలించుకొంటారు. కాని మనకు వాటితో అవసరంలేదు. మన బిరుదాలు ఏసుక్రీస్తు దాసుడు, ప్రేషితుడుగా పిలువబడినవాడు, దేవుని కృపచేత ప్రత్యేకింపబడినవాడు - ఇవి. మనకు ఈ పేర్లు చాలు. మరియ ఎలిసబేత్తును సందర్శించడానికిరాగా ఆమె "ప్రభువు తల్లి నావద్దకు రావడమా? ఈభాగ్యం నాకేలా ప్రాప్తించింది?" అని విస్తుపోయింది - లూకా 1, 43. ఆలాగే మనంకూడ ఎన్నిక అనే భాగ్యానికి నోచుకొన్నందుకు ఎంతో విస్తుపోవాలి.

## 3. పౌలు అనుభవం

ఎన్నిక అనేది చాల గొప్పభాగ్యం. పౌలు ఈ యెన్నిక అనేవరం తనకేలా సిద్ధించిందా అని ప్రశ్నించుకొని ఈలా జవాబిచ్చాడు. "ప్రభువు మనలను పరిశుద్ధజీవితం జీవించడానికి పిల్చాడు. ఈలా పిలిచింది మనంచేసిన సత్కార్యాలను బట్టిగాదు, తన సంకల్పంద్వారానే. అనాది కాలంనుండీ యేసుక్రీస్తునందు మనకు అనుగ్రహింపబడిన వరప్రసాదంద్వారానే". - 2 తిమొ 1,9. ఇక్కడ పౌలు సూచించిన భావాలు ఈనాడు మనకూ అక్షరాల వర్తిస్తాయి. వీటిని కొంచెం విపులంగా పరిశీలిద్దాం.

1. "మన సత్కార్యాలను బట్టిగాదు, తన సంకల్పంద్వారానే". ప్రభువు పిలిచేప్పటికి మనంలేము. మన సత్కార్యాలు అసలేలేవు. ఐనా ప్రభువు స్వయంగానే ఈ యెన్నిక అనే

భాగ్యాన్ని మనకిచ్చాడు. మనకే యెందుకీయాలి? మనకు తెలీదు. ప్రభువు తన భక్తుడైన మోషేతో "నేను నాయిష్టం వచ్చినవాళ్లను కటాక్షిస్తాను. నేను కోరుకొన్నవాళ్లకు కరుణ చూపుతాను" అన్నాడు - నిర్గ 33,19. ప్రభువు సంకల్పం ఆలాంటిది, అంతే.

2. "అనాది కాలంనుండీ". అనాది కాలంనుండి గూడ ప్రభువు మనలను ప్రేమిస్తూ వచ్చాడు. అందుకే అతడు యిర్మీయాతో "నేను నిన్ను శాశ్వతప్రేమతో ప్రేమించాను, నా ప్రేమ నీపట్ల స్థిరంగా వుంటుంది" అని చెప్పాడు - యిర్మీ 31,3. కనుక అనాది కాలం నుండే ప్రభువు మనలను తలంచుకొన్నాడు, జ్ఞాపకముంచుకొన్నాడు, ప్రేమించాడుగూడ. ప్రభువుచూపిన ఈ యాదరాభిమానాలకు మనమెంతైన కృతజ్ఞులమై యుండాలి. కీర్తనకారునిలాగే మనంకూడ "ప్రభువు నాకుచేసిన ఉపకారాలకు నేను ప్రత్యుపకారమేమి చేయగలను?" అనుకోవాలి. - కీర్త 116,12.

3. "యేసుక్రీస్తునందు". ప్రభువు క్రీస్తుద్వారా మనకు ఈ యెన్నిక అనే భాగ్యాన్నిచ్చాడు. ఇది మన గొప్పనుబట్టికాదు, క్రీస్తునిజూచి. మనం అతనిలోనికి జ్ఞానస్నానం పొందుతామనీ, అతని తమ్ముళ్ళమూ చెల్లెళ్లమూ ఔతామని తెలిసికొని తండ్రి మనలను ఎన్నిక చేసాడు. కనుక మన సౌభాగ్యమంతా క్రీస్తునందే.

4. "మనకు అనుగ్రహింపబడిన వరప్రసాదంద్వారానే". మనం పుట్టకముందే ఈ వరప్రసాదం మనకోసం సంసిద్ధమై వుంటుంది. మనకోసం కాచుకొని వుంటుంది. మనం పుట్టగానే అది మనమీద బలంగా పనిచేస్తుంది. మనలను ఆ ప్రభువువైపు ఆకర్షిస్తుంది. ఎన్నికఅంటే యిదే. ధనికులయింటిలో పుట్టే బిడ్డకు తల్లిదండ్రుల సిరిసంపదలు అబ్బుతాయిగదా! ఆలాగే దేవునివలన ఎన్నికైన భక్తులకు చిన్ననాటినుండే అతని వరప్రసాదం విరివిగా లభిస్తుంది.

## 4. ప్రార్థనా భావాలు

1. క్రీస్తు శిష్యులను ఎన్నుకోవడాన్ని గూర్చి చెప్తూ మార్కుసువార్త "అతడు కొండయెక్కి తనకిష్టమైనవాళ్లను పిలువగా వాళ్లు అతనివద్దకు వచ్చారు" అని చెప్తుంది - 3, 13. ప్రభువు ఎన్నుకొనేవాళ్లు అతనికి యిష్టులు. ప్రభువు మనలనుగూడ ఎన్ను కొన్నాడు అంటే, మరి మనంగూడ అతనికి యిష్టులమనేభావం.

2. యిర్మీయా, పౌలూ మేము మాతృగర్భంలో వున్నపుడే ప్రభువు మమ్మ్మ ఎన్నుకొన్నాడు అని భావించి సంతృప్తిచెందారు. మనకూ ఇదేభావన వుండాలి. మన పిలుపు యాదృచ్ఛికమైంది గాదు, ప్రభువు బుద్ధిపూర్వకంగా నిర్ణయించింది. ఈ భావం మన కెంతైనా సంతృప్తినీ ధైర్యాన్నీ కలిగించాలి.

3. పౌలు తన పిలుపునీ పూర్వ పాపజీవితాన్నీ గూర్చి చెప్పుకొంటూ "పూర్వము దూషకుడనూ హింసకుడనూ హానికరుడనూ ఐయున్న నన్ను ప్రభువు తన పరిచర్యకు

నియమించాడు. ఆయన నేను నమ్మదగినవాణ్ణని ఎంచాడు. దీనికిగాను నేను అతనికి కృతజ్ఞుణ్ణి" అని వ్రాసికొన్నాడు. మనలనుగూడ ప్రభువు నమ్మదగిన వాళ్లనుగా ఎంచాడు. కనుకనే మనలను పిల్చాడు. ప్రభువుకి మనమీద వున్న ఈ సదభిప్రాయాన్ని నిలబెట్టుకొనే బాధ్యత మనది. - 1 తిమొ 1, 12-13

4. కీర్తనకారుడు "ప్రభో! నేను నీ దాసుణ్ణి. నీ దాసురాలి కుమారుణ్ణి" అని చెప్పుకొన్నాడు - కీర్త 116, 16. ఈ భక్తునిలాగే మంనకూడ ప్రభువుపట్ల కృతజ్ఞులమైయుండాలి. ప్రభో! నేను నీవాణ్ణి. నీవాణ్ణిగా వుండాలనే నా కోరిక అని చెప్పుకొంటూండాలి

## 3. పిలుపు

"ప్రభువు తన కృపచేత నన్ను పిలిచాడు" అని చెప్పుకొన్నాడు పౌలు. ఈ పిలుపు ఏలావుంటుందో పరిశీలించి చూద్దాం.

### 1. పిలుపు ముగ్గురు దైవవ్యక్తులనుండి

కఫర్నాములో ప్రభువుచెప్పిన మాటలనుబట్టి ఈపిలుపు తండ్రివద్దనుండి లభిస్తుంది. "నన్ను పంపిన తండ్రి ఆకర్షిస్తేనేతప్ప ఎవరూ నావద్దకు రాలేరు" అన్నాడు ప్రభువు - యోహా 6,44. ఆలాగే పిలుపు క్రీస్తువద్దనుండి కూడాను. "మీరు నన్ను ఎన్నుకోలేదు, నేనే మిమ్ము ఎన్నుకొన్నాను"- యోహా 15, 16. ఇక పిలుపు పరిశుద్ధాత్మనుండిగూడ. "అంతియోకయలోని ప్రవక్తలూ బోధకులూ ప్రభుని సేవిస్తూ ఉపవాసం చేస్తూన్నారు. అప్పుడు పవిత్రాత్ముడు నాపనికై సౌలునూ బర్నబానూ ప్రత్యేకించండని వాళ్లతో చెప్పాడు" - అకా 13,2. ఈ రీతిగా మన పిలుపు ముగ్గురు దైవవ్యక్తులనుండి వచ్చింది. కనుక మనం దాన్ని ఎంతో విలువతో చూచుకోవాలి. శ్రేష్ఠమైన ప్రతివరమూ, సంపూర్ణమై ప్రతిబహుమానమూ జ్యోతిర్మయుడైన తండ్రి వద్దనుండే వస్తుంది - యాకో 1,17. మన పిలుపుగూడ ఈలాంటి వరమేగనుక మనం ఆ తండ్రికి కృతజ్ఞులమై యుండాలి.

### 2. పిత కానుకను క్రీస్తు స్వీకరిస్తాడు

పిత నాకనుగ్రహించిన వాళ్లంతా నా చెంతకువస్తారు అన్నాడు ప్రభువు - యోహా 6,37. పిలువబడినవాళ్లు పితచే ప్రత్యేకంగా ఆకర్షింపబడినవాళ్లు. పితకు చెందినవాళ్లు. పిత వీళ్లను క్రీస్తుకు కానుకగా సమర్పిస్తాడు. తండ్రియిచ్చే ఈ కానుకపట్ల క్రీస్తుకు ఆదరం ఎక్కువ. ఎందుకంటే క్రీస్తు తరువాత అతడు ప్రారంభించిన ప్రేషిత ఉద్యమాన్ని కొనసాగించేది వీళ్లే. అంచేత క్రీస్తుకి వీళ్లంటే యెంతోప్రేమ. కనుకనే అతడు "నా వద్దకు వచ్చినవాళ్లను నేను ఎంతమాత్రమూ నిరాకరించను" అన్నాడు - యోహా 6,37. ఈ వాక్యం మనకెంతైనా ఊరట నీయాలి.

## 3. భద్రంగా కాపాడతాడు

క్రీస్తు మనలను తనతో వుంచుకొని భద్రంగా కాపాడాలనే పితకోరిక. కనుకనే ప్రభువు "నీవు నాకు అనుగ్రహించినవారిని నేను నీ పేరట కాపాడాను" అన్నాడు - యోహా 17,12. కడకు యూదా భ్రష్టుడైపోయినపుడుగూడ అతడు "నీవు నాకు అప్పగించిన వాళ్లందరిని భద్రంగా కాపాడాను. నాశమైపోయేవాడు ఒక్కడుదప్ప మిగతావాళ్లెవరూ జారిపోలేదు" అని తండ్రితోజెప్పాడు - 17, 12. ఈలా మనం క్రీస్తుచే కాపాడబడేవాళ్లం. అతనికి చెందినవాళ్లం. కనుక మన మనుగడ వ్యర్థమైపోదు.

## 4. మన సహకారంగూడ అవసరం

ఈ పిలుపులో మన సహకారమనేదిగూడ వుంది. కొందరు దైవపిలుపును కాదన్నారు. ధనికయువకుడు ప్రభువు పిలుపును నిరాకరించాడు, విచారంతో వెళ్లిపోయాడు - మత్త 19,22. ఇంకా, క్రీస్తు పిలిచినవాళ్లల్లో ఒకడు తండ్రిని పాతిపెట్టి రావడానికివెళ్లాడు. మరొకడు బంధువులవద్ద సెలవుతీసుకొని వస్తానని వెళ్లాడు. కాని వాళ్లిద్దరూ మళ్లా తిరిగిరానేలేదు - లూకా 9, 59-62. ఈలాంటివాళ్లంతా ప్రభువు పిలుపుకి యోగ్యులుకారు. ప్రభువు ఎవరిని నిర్బంధం చేయడు. బుద్ధిపూర్వకంగా అంగీకరించినవాళ్లనేగాని అతడు తన శిష్యులను జేసికోడు. కనుకనే అతడు ధనికయువకునితో "బాబూ! నీవు పరిపూర్ణుడవు కాగోరినట్లయితే వచ్చి నన్ను వెంబడించు" అని అన్నాడు - మత్త 19,21. ఎప్పుడూ కొంతమంది ప్రభువు పిలుపును పెడచెవిని బెడుతూనేవుంటారు. మనం కూడ ఈలాంటి అకార్యానికి పాల్పడవచ్చు. పిలవబడినవాళ్లేమో చాలామందిగాని, ఎన్నుకోబడేవాళ్లుమాత్రం కొద్దిమందే - మత్త 22,14. కనుక మన తరపున మనం జాగ్రత్తగా మెలగాలి. దేవుడిచ్చిన పిలుపును భయభక్తులతో కాపాడుకోవాలి.

## 5. ప్రభుమార్గాలు అగమ్యాలు

ఐనా ప్రభువు మనలను ఎన్నుకొన్నాడు. ఎందుకు? ఇతరులను ఎన్నుకొన్నట్లయితే వాళ్లు ఇంకా అధికంగా భగవంతుణ్ణి ప్రేమించేవాళ్లేమో! తోడిజనానికి ఇంకా అధికంగా సేవలు చేసేవాళ్లేమో! ఐనా ప్రభువు మనలనే ఎన్నుకొన్నాడు అంటే, అది మన గొప్పేమీకాదు. కేవలం ఆ పరమాత్ముని కరుణ. "తన సంకల్పంద్వారానే" -మరి దానికి తిరుగులేదు. "ప్రభుమార్గాలు అగమ్యాలు" - రోమా 11,33. ఈలాంటి సందర్భంలో వినయంతోను భక్తిభావంతోను తలవంచి ఆ ప్రభువుకి మ్రొక్కు కోవడందప్ప మనం చేయగలిగిందేముంది?

## 6. ప్రార్థనా భావాలు

1. ప్రపంచంలో ఇన్ని జాతులుంటే ప్రభువు తమనే యెందుకెన్నుకోవాలా అని ఆశ్చర్యపోయారు పూర్వవేదపు యూదులు. వాళ్లు పెద్దజాతా అంటే కానేకాదు, చాల చిన్న జాతి. వినయవంతులాంటే కానేకాదు, వట్టి తలబిరుసురకం. మరి ప్రభువు వాళ్లనే యెందుకు ఎన్నుకొన్నట్లు? ప్రభువు వాళ్లను అధికంగా ప్రేమించాడు గనుక వాళ్లను ఎన్నుకొన్నాడు. అంతే. మరో కారణమంటూ లేనేలేదు - ద్వితీ 7, 6-8. మన పిలుపుకుగూడ ఇదే కారణం. ప్రభువు మనలను ప్రేమించాడు, తన సేవకు పిల్చుకొన్నాడు, అంతే.

2. ఓ యువకుడు ఓ యువతిని ప్రేమించాడు అంటే ఆమెలో యేదో విలువ వుండాలి. అందచందాలో, ధనమో, తెలివితేటలో, మంచితనమో యేదోవొకటుండాలి. లేకుంటే ఒట్టినే యువకుడు యువతిని ప్రేమించడు. కాని భగవంతుడు మనలను ప్రేమించి మనలను తనసేవకు ఎన్నుకొన్నాడు అంటే, పై యువతిలోలాగే మనలోగూడ యేదో విలువ వుండబట్టిగాదు, భగవంతుడంతటివాడు మోజుపడేవిలువ మనలో యేముంటుంది? అసలు భగవంతుడు మోజుపడేవిలువ అతనికి వెలుపల ఏముంటుందిగనుక? ఐనా అతడు మనలను ప్రేమించాడు అంటే, మనలను తనసేవకు పిలుచుకొన్నాడు అంటే, అది మనగొప్పగాదు అతని గొప్పేఐయుండాలి.

3. నరునిలో ఏదో గొప్పతనముందిగనుక భగవంతుడు అతనికి పిలుపు అనే వరాన్నీయడు. మరి భగవంతుడు నరుని ప్రేమించడంద్వారా అతనిలో ఏదో గొప్పతనాన్ని కలిగిస్తాడు. అంతకు ముందులేని దివ్యగుణాన్ని సృజిస్తాడు. కనుక భగవంతునిప్రేమ సృజనాత్మకమైంది. అతనిప్రేమకు పాత్రులం గావడంవల్ల మనం ఒకపాటివాళ్ల మౌతం. కనుక మనపిలుపులో విలువలేదు అనకూడదుగాని, ఆ విలువ మననుండి వచ్చింది అనిమాత్రం చెప్పగూడదు. భగవంతుడే తన పిలుపుద్వారా మనకు విలువనిస్తాడు. ఈ యాలోచన మనకు వినయాన్నీ అణకువనూ నేర్పించాలి. మనమీద మనకే నమ్మికను గూడ పుట్టించాలి.

# 4. క్రీస్తుతో పరిచయం

"దేవుడు తనకుమారుణ్ణి నాకు ప్రత్యక్షంచేసాడు" అన్నాడు పౌలు. క్రీస్తును ప్రత్యక్షంచేసికోవడమే మన సెమినరీ, నోవిష్యేటు తర్ఫీదు. కనుక ప్రస్తుతాధ్యాయంలో ఈ తర్ఫీదును గూర్చి కొన్నివిషయాలు పరిశీలిద్దాం.

## 1. ప్రభు శిష్యులు

ఎన్నికా పిలుపూ అయ్యాక ప్రభువు శిష్యులను ఏలా తయారుచేసాడు? "ప్రభువు కొండమీదికెక్కి తనకిష్టమైన వాళ్లను పిలువగా వాళ్లు ఆయనవద్దకు వచ్చారు. వాళ్లంతాగలిసి

పం(డెండుమంది. వాళ్లు అతనితోగూడ వుండడానికీ, సువిశేషాన్ని బోధించడానికీ, దయ్యాలను వెళ్లగొట్టడానికీ నియమింపబడ్డారు" -మార్కు 3,13-15. మొదట ఈ వాక్యాల భావాన్ని పరిశీలిద్దాం. ప్రభువు తనకిష్టమైన వాళ్లను పిల్చాడు. పిలుపు అనేది దేవుడే స్వయంగా యిచ్చేవరం. నేనే మిమ్ము ఎన్నుకొన్నాను అన్నాడు ప్రభువు. ఆలా పిలువగా శిష్యులు ఆయనవద్దకు వచ్చారు. పిలుపుఅంటే పాపప్రపంచాన్నుండి వేరుగావడమూ, పరిశుద్ధుడైన భగవంతునికి అంకితంగావడమూ అని ముందేచెప్పాం. ఆలా వచ్చినవాళ్లు పం(డెండుమంది. పూర్వవేదప్రజలకు పం(డెండుమంది పితరులు నాయకులు. ఆలాగే నూత్నవేద ప్రజలకూ పం(డెండుమంది (పేషితులు నాయకులు. ఈ పం(డెండు మందిలో ఒకడైన యూదా పడిపోగానే అతనిస్థానంలో మత్తీయాను ఎన్నుకొన్నారు - అచ 1,26. ఈ శిష్యులు ప్రభువుతో వుండాలి. వాళ్లు ప్రభువుతో పరిచయం గలిగించుకొని అతనితో అన్యోన్యంగా మెలగాలి. అటుపిమ్మట సువిశేషాన్ని బోధించి దయ్యాలను వెళ్లగొట్టాలి. ఇది వాళ్ల పిలుపుయొక్క ప్రయోజనం.

## 2. శిష్యుల తర్ఫీదు

పరిశుద్ధాత్మ దిగివచ్చాకగాని శిష్యుల తర్ఫీదు ముగియలేదు. అంతకుముందు ఓ పనిపిల్లకు భయపడిపోయిన పేత్రు ఆత్మదిగివచ్చాక యూదుల మహా సభముందు నిలబడి ధైర్యంగా బోధించాడు అంటే అది ఆ పరిశుద్ధాత్మ యిచ్చినవరమే. కాని క్రీస్తు నాడే వాళ్ల తర్ఫీదు ప్రారంభమైంది. వాళ్లు మూడేండ్లూ క్రీస్తుతో వుండి అతనివలన తర్ఫీదు పొందారు. అతని బోధలు విన్నారు. అతడు చేసిన అద్భుతాలను చూచారు. అతన్ని నమ్మారు.

## 3. అన్నీ వదలివేసి

"మేము అన్నీ వదలివేసి నిన్ననుసరించాం" అన్నారు (పేషితులు క్రీస్తుతో - మార్కు 10, 28. యోహాను దప్పితే మిగిలిన (పేషితులంతా పెండ్లయినవాళ్లే. కావున వాళ్లు ఆస్తిబాస్తులనూ, వృత్తినీ, యింటినీ, భార్యాపిల్లలనూ వదలివేసి వచ్చారనుకోవాలి. వాళ్లమీద ప్రభు ఆకర్షణం ఎంత బలంగా వుండేదంటే, వాళ్లతన్ని వదలి వెళ్ళేవాళ్లుకాదు. క్రీస్తు నా శరీరాన్నే మీకు ఆహారంగా యిస్తానని కఠినమైనమాట చెప్పినంక గూడ వాళ్లు ప్రభుని విడనాడలేదు. "ప్రభో! మేము ఎవరిదగ్గరికెళ్తాం, నిత్యజీవమిచ్చే పలుకులు గలవాడివి నీవే" అన్నారు - యోహా 6, 68. వాళ్లు విడిచిపెట్టి వచ్చిన ప్రపంచం ఇక వాళ్లకు తృప్తినీయలేదు. కనుక వాళ్లు అతన్నే అనుసరించగోరారు. ఈ సందర్భంలో పౌలుకూడ "నాకు జీవించడమంటే క్రీస్తు" అని వ్రాసికొన్నాడు - ఫిలి 1, 21.

## 4. బాధల్లోగూడ

శిష్యులు క్రీస్తు పాటుల సమయంలో అతన్ని వదలివేసారు. ఇది వాళ్లబలహీనత. "నేను కాపరిని వధిస్తాను, మందంతా చెల్లా చెదరౌతుంది" అన్న ప్రవక్త వాక్యాలు నెరవేరాయి – మత్త 26,31. ఐనా శిష్యులు మళ్లా యెరూషలేముమీదిగదిలో సమావేశమై ప్రభుని స్మరించుకోవడం మొదలెట్టారు. ఈవిధంగా "ప్రభువుతో వుండిపోవడం" అపోస్తలుల తర్ఫీదులోని ముఖ్య విషయం. వాళ్లల్లో కొన్నిలోపాలు ఉండవచ్చుగాక. ఉదాహరణకు, ఓమారు శిష్యులంతా నేనుగొప్పంటే నేనుగొప్పని తమలో తాము గీజులాడుకొన్నారు – మార్కు 9, 33-35. కాని ప్రభువు ఈలాంటి బలహీనతలను అట్టే పట్టించుకోలేదు. పైగా అతడు "మీరు నాబాధల్లో నాకు తోడుగా నిలబడ్డాడు" అని వాళ్లను భూషించాడుగూడ – లూకా 22,28. ఈలాగే మనంకూడ కష్టసుఖాల్లోను ప్రభువుచెంత నిలవగలిగి వుండాలి. తర్ఫీదు అంటే యిదే.

## 5. క్రీస్తే మనకు ఆదర్శం

క్రీస్తు ఎప్పుడూ తనతండ్రితో వుండేవాడు. శ్రమల్లో కూడ అతడు తండ్రియిచ్చిన పాత్రను త్రాగడమే తనవిధి అనుకొన్నాడు – మార్కు 14,36. తండ్రియిచ్చిన కార్యక్రమం ప్రకారం సిలువమీద చనిపోవడమే తన బాధ్యత అనుకొన్నాడు. ఈలాంటి క్రీస్తుని ఆదర్శంగా బెట్టుకొని మనంగూడ నిత్యం అతనితో వుండిపోవడం నేర్చుకోవాలి. సెమినరీ, నోవిష్యేటు ఇందుకొరకే ఉద్దేశింపబడ్డాయి. ఆనాడు అపోస్తలులకుమల్లె ఈ నాడు మనకుగూడ క్రీస్తే ఇక్కడ తర్ఫీదునిస్తాడు. అపోస్తలుల జీవితంలో ఆ మూడేండ్లూ ఏలాంటివో మనజీవితంలో ఈ తర్ఫీదు యేండ్లు ఆలాంటివి. ఇక్కడ ప్రభువుతో అన్యోన్యంగా మెలుగుతూ జపమూ బైబులుపఠనమూ నేర్చుకోవాలి. ప్రేషితోద్యమాన్ని అవగాహనం చేసికోవాలి. తోడినరులకు సేవచేయడానికీ సువార్తను ప్రకటించడానికీ సంసిద్ధంకావాలి.

## 6. ప్రార్థనాభావాలు

1. మఠజీవితంలో ప్రవేశించే అమ్మాయికి ముఖ్యమైంది అద్భుతమైన తెలివితేటలూగాదు, పెద్ద చదువులూగాదు, ఆరోగ్యమూగాదు. కాన్వెంటికి ఎంతకట్నం ఈయగలమా అనేది అసలేగాదు. మరి ఆయమ్మాయి భగవంతుణ్ణీ ఆ భగవంతునికోసం తోడిజనాన్నీ ప్రేమించగలదా అనేది ముఖ్యం. మనం మఠంలో అడుగుపెట్టేది ప్రభువుమీదగల ప్రేమచేతనే. అక్కడ నిలువగలిగేదిగూడ ఆ ప్రేమవలననే. హృదయంలో ఈ ప్రేమ లేనివాళ్లు మఠజీవితంలో రాణించలేరు.

2. మఠంలో చాలా అంశాలుంటాయి. అర్చ్యశిష్టులపట్ల భక్తీ, నియమాలను పాటించడమూ, మౌనమూ, నియమిత జపాలూ, నేత్రవినీతీ మొదలైన అంశాలు ఎన్నైనా వుంటాయి. క్రీస్తుపట్ల ప్రేమా భక్తీ చూపడంగూడ ఈ నానావిషయాల్లో ఒకటి అనుకోగూడదు. క్రీస్తు భక్తి ప్రధానవిషయం. వేరేవన్నీ దీనికోసం. కనుక ఇదిలేందే అవన్నీ వ్యర్థం. బండిచక్రంలోని ఆకులన్నీ మధ్యనున్నకుండలోనికి కేంద్రీకృతమైనట్లే మన కోరికలూ పనులూ భక్తిక్రియలూ అన్నీకూడ క్రీస్తుమీదికి కేంద్రీకృతంకావాలి. ఇది క్రీస్తుకేంద్రీకృత జీవితం. కొంతమంది మఠవాసినులు ముసలి వాళ్లైనంకగూడ ఈ సత్యాన్ని గమనింపరు. ప్రభువు "మార్తా! నీవు చాలా పనులతో సతమతమై పోతూన్నావు. కాని అవసరమైనదొక్కటే" అన్నాడు - లూకా 10,41. తండ్రిమీదా, అతడు పంపిన క్రీస్తుమీదా హృదయం నిల్పడమే అవసరమైన పని.

3. మనం మఠంలో చేరేది కొన్ని నియమాల ప్రకారం జీవించేందుకుగాదు. మరి సజీవుడైన ఓ వ్యక్తిని అనుసరించేందుకు. కాంగ్రెసు, కమ్యూనిస్టు వంటి రాజకీయపక్షాలు కొన్ని సిద్ధాంతాల ప్రకారం నడుస్తూంటాయి. కాని మఠజీవితమంటే ఓ సిద్ధాంతం ప్రకారం జీవించడంగాదు. ఓ వ్యక్తిని అనుసరించడం. ఈ వ్యక్తి దేవుడు, ఐనాగాని మానవుడు. మృతుడు, ఐనాగాని ఉత్థానమై సజీవుడై యున్నవాడు. క్రైస్తవ సమాజంలోని విశ్వాసుల్లోను మఠకన్యల్లోను గురువుల్లోను నెలకొనివుండే ప్రభువు. ఈ ప్రభువుకై మన హృదయాన్ని అర్పించుకోవాలి. బిడ్డ తల్లిచేతుల్లోనికిలాగ అతని చేతుల్లోనికి మనలను మనం అర్పించుకోవాలి. మహాభక్తులు ఈలా ఆత్మార్పణం చేసికొన్నారు. ఇప్పుడు నేనుగాదు నాయందు క్రీస్తే జీవిస్తున్నాడు అన్నాడు పౌలు - గల 2, 20. ఆ ప్రభువు ఓరాజు, నేను అతని సేవకుణ్ణి అన్నాడు ఇగ్నేష్యము. ఆ ప్రభువు ఓ తండ్రిలాంటివాడు, అతనిచేతుల్లోకి ఓ పసిబిడ్డనులాగ నున్ను నేను అర్పించుకొంటున్నాను అంది చిన్న తెరేస.

4. మామూలుగా మనం నోవిష్యేటులో వున్నదానికంటె తరువాత ఎక్కువ భక్తిమంతురాళ్లం కాలేము. ఉదయాన్నిబట్టి ఆరోజు ఏలావుంటుందో నిర్ణయించవచ్చు. చిన్న పిల్లవాణ్ణి జూచి వాడు పెద్దవాడయ్యాక ఏలాంటి వాడౌతాడో తెలిసికోవచ్చు. ఆలాగే నోవిసునుజూచే ఆమె భావి కన్యాజీవితం ఎలావుంటుందో ఊహించవచ్చు. కనుక నోవిష్యేటులో వున్నపుడే క్రీస్తుని అర్థం చేసికోవాలి. ఆ ప్రభువుపట్ల భక్తి అలవర్చుకోవాలి. నోవిసుకు వేరేపనంటూ లేదు.

5. నోవిష్యేటుల్లోను సెమినరీల్లోను తర్ఫీదుపొందే యువతీయువకులు బాధ్యతాయుతంగా మెలగడం నేర్చుకోవాలి. బడిపిల్లల్లాగ చిలిపిచేష్టలతో కాలం గడపగూడదు. వాళ్లు రేపటి అమ్మగార్లూ గురువులూను. కనుక వాళ్లు ఈ తర్ఫీదుకాలంలో పెద్దలు మనలను గమనిస్తున్నారు, పై యధికారులును మెప్పిద్దాం అన్నట్లుగా

ప్రవర్తించగూడదు. భగవంతుణ్ణి మెప్పించే ప్రయత్నం చేయాలి. మనవ్యక్తిత్వాన్ని మనం పెంపొందించుకొని భవిష్యజ్జీవితానికి తయారుకావాలి. ఇక్కడ మనం క్రీస్తుని సాక్షాత్కారం చేసికోందే తరువాత అతన్ని ప్రజలకు చూపించలేం.

6. మన హృదయాలు ప్రేమకోసం సృజింపబడ్డాయి. ప్రేమించందే వాటికి తృప్తి అంటూలేదు. కాని గురువులూ మఠకన్యలూ ఐనవాళ్లకి లైంగికప్రేమ నిషిద్ధం. కనుక మనం పవిత్రమైన నిర్మలప్రేమతో క్రీస్తుని ప్రేమించడం నేర్చుకోవాలి. లేకపోతే తరువాత పాపప్రేమల్లోచిక్కి భ్రష్టులమైపోతాం. ఈ నిర్మలప్రేమనుగూర్చి బెర్నార్డు భక్తుడు ఈలా వ్రాసాడు.

ఇప్పుడూ యెప్పుడూ ప్రభువునందే
నిద్రబోతున్నా మేల్కొనివున్నా
ప్రేమిస్తున్నా ప్రేమింపబడుతూన్నా
విచారంగావున్నా సంతోషంగావున్నా
ఆరోగ్యంగావున్నా వ్యాధిగావున్నా
జీవిస్తున్నా చనిపోతూన్నా
అంతా ఆ ప్రభువునందే.

# 5. సువార్తను ప్రకటించడం

"దేవుడు నేను అన్యజనులకు తనకుమారుణ్ణి ప్రకటించాలని కోరుకొన్నాడు" అన్నాడు పౌలు. సువార్తా ప్రచారమనేది ప్రేషితుల బాధ్యత. కనుక పిలుపు నందుకొనిన యువతీయువకులు ప్రేషితోద్యమానికి ఏలా సంసిద్ధులుకావాలో పరిశీలించిచూద్దాం.

## 1. పంటపొలం

క్రీస్తు శిష్యులతో "పంట విస్తారంగా వుందిగాని కోతగాళ్లు తక్కువ. పంటను ప్రోగుచేయడానికి పనివాళ్లను పంపమని పంటయజమానుని మనవిచేయండి" అన్నాడు - మత్త 9,37-38. ఇక్కడ పంటయజమానుడు పరలోకపితే. కోతగాళ్లు ప్రేషితులు. సేకరించవలసినపంట ప్రజలే. ఎప్పుడూ ప్రజలకు భగవంతుణ్ణిగూర్చి తెలియజెప్పేవాళ్లు తక్కువే. కనుక ఎక్కువ మంది పిలుపునందుకొని ముందుకువచ్చి సువార్తను బోధించాలి. ప్రజలను దేవునివైపు మరల్చాలి.

## 2. ద్రాక్షలత

క్రీస్తు శిష్యులతో "కొమ్మ ద్రాక్షతీగలోనికి అతుకుకొని వుండందే తనంతటతాను ఏలాగు ఫలింపలేదో ఆలాగే మీరూ నాలో నిలిచివుంటేనేగాని ఫలింపలేరు" అన్నాడు -

యోహా 15,4. కొమ్మలు తల్లితీగలోనికి అతుకుకొని వుంటాయి. ఆతల్లితీగలోని సారాన్నిపొంది దాన్ని కాయలుగా మార్చుకొంటాయి. ఆలాగే శిష్యులుకూడ క్రీస్తులోనికి ఐక్యమైయుండాలి. అతని సారాన్ని లేక వరప్రసాదాన్నిపొంది దాన్ని ఫలాలుగా మార్చుకోవాలి. శిష్యులు తాము ఫలించడమంటే విశ్వాసులహృదయాల్లో వరప్రసాదం నెలకొనేలా చేయడమే. విశ్వాసులకు వరప్రసాదం అందీయడమే.

## 3. ప్రసవవేదన అనుభవించే తల్లి

"నా బిడ్డలారా! క్రీస్తురూపం మీలో నెలకొనేదాకా మిమ్ముగూర్చి నేను ప్రసవేదన పడుతూన్నాను" - గల 4,19. తల్లి గర్భవతియై ప్రసవవేదన అనుభవించి బిడ్డను కంటుంది. పౌలు ఇక్కడ తన్ను ఓ గర్భవతితో పోల్చుకొన్నాడు. తాను కనేది క్రీస్తుబిడ్డనే. అతడు ఆశిశువును కనేదెక్కడ? విశ్వాసుల హృదయాల్లోనే. అనగా విశ్వాసుల హృదయాల్లో క్రీస్తు నెలకొనేలా చేయాలని పౌలు నానాయాతనా పడుతూన్నాడు. ఈ పౌలులాగ ప్రేషితులందరుగూడ శ్రమననుభవించి విశ్వాసుల హృదయాల్లో క్రీస్తుని పుట్టించాలి. అనగా విశ్వాసులు క్రీస్తుని పొందేలా చేయాలి.

పంటపొలం, ద్రాక్షతీ, బిడ్డనుకనే తల్లి - ఈమూడు ఉపమానాలు గూడ ప్రేషితులు విశ్వాసులహృదయాల్లో క్రీస్తుజీవం నెలకొల్పాలని సూచిస్తాయి. ప్రభువు మననుండి ఆశించేది యిదే. క్రీస్తుని ప్రకటించడమన్నా గూడ యిదే.

## 4. ప్రార్థనాభావాలు

1. "నా తండ్రి నన్నుపంపినట్లే నేనూ మిమ్ము పంపుతూన్నాను" అన్నాడు క్రీస్తు - యోహా 20,21. క్రీస్తు పిత పంపగా వచ్చాడు. మొదటి ప్రేషితుడు అతడే. ఈ క్రీస్తు మళ్లా తనతరపున మనలను పంపుతాడు. మనం అతనికి అనుయాయులమై అతని ప్రేషితకార్యాన్ని కొనసాగిస్తాం. కనుక మనం ప్రప్రథమంగా పంపబడినవాళ్లం. మనంజీవించే గురుజీవితమూ కన్యాజీవితమూ ఈ లక్షణానికి అనుకూలంగా వుండాలి.

2. యెషయాప్రవక్త ఓ దర్శనంలో ప్రభుని చూచాడు. ప్రభువు రాజఠీవితో దేవాలయంలో సింహాసనంపై ఆసీనుడై యున్నాడు. దేవదూతలు కొలువుకాళ్లై అతనిచుట్టూ మూగివున్నారు. ప్రభువు ఈ కొలువుకాళ్ళతో సంప్రతిస్తూ "మనతరపున దూతగా బోయేదెవరు? యెరూషలేము ప్రజలకు బోధించేదెవరు?" అని ప్రశ్నిస్తూండడం యెషయా విన్నాడు. అతడు వెంటనే ముందుకి వచ్చి "ప్రభో! నేనున్నానుగదా! నన్ను పంపు. నీ తరపున నేను వెళ్లి ప్రజలకు బోధిస్తాను" అన్నాడు - యెష 6,9. ఈ ప్రవక్తలాగే ప్రేషితులు క్రీస్తుని బోధించడానికి ఉత్సాహంతో ముందుకిరావాలి. ప్రేషితనాయకత్వమంటే యిదే. ఈ నాయకత్వంలేని ప్రేషితులు జీవితంలో పెద్దగా యేమీ సాధించలేరు.

3. దమస్కులోని అననీయ అనే భక్తుడు సౌలుకు జ్ఞానస్నానమీయాలి. ప్రభువు అననీయతో "క్రైస్తవేతరులకు, రాజులకు, యిస్రాయేలుప్రజలకు నన్నుగూర్చి బోధించడానికై నేను ఈ సౌలుని ఎన్నుకొన్నాను. సౌలు నా నిమిత్తం ఎన్నిబాధలనుభవించాలో నేనతనికి తెలియజేస్తాను" అని చెప్పాడు - అచ 9, 15-16. ప్రేషితులంగా మెలగడమంటే యీ సౌలులాగా నానా ప్రజలకు క్రీస్తుని బోధించడం. క్రీస్తుసేవలో నానాయాతనలూ అనుభవించడం. దీనికి దగిన సామర్థ్యాన్నీ శక్తినీ ప్రసాదించేది గూడ ఆప్రభువే.

4. యిర్మీయా ప్రభునిగూర్చి బోధిస్తూండగా ఆనాటి రాజులూ అధికారులూ అతనికి అడ్డుదగిలారు. అతన్ని హింసించారు. ఆ బాధ భరించలేక యిర్మీయా ఇక దేవుణ్ణిగూర్చి బోధించడం మానివేద్దామనుకొన్నాడు. కాని దేవుణ్ణిగూర్చి బోధించాలి అనే కోరిక అతని హృదయంలోను ఎముకల్లోను అగ్నిజ్వాలలాగ మండజొచ్చింది. ఉదరంలోమండే ఆ నిప్పును అతడు భరించలేక పోయాడు. దాన్ని వెళ్లగక్కితేనేగాని - అనగా దైవవార్తను బోధిస్తేనేగాని - అతనికి ఉపశాంతి కలుగలేదు. ప్రభువు ప్రేషితులను నిర్బంధపెట్టేతీరు ఈలా వుంటుంది - యిర్మీ 20,9.

5. తూర్పుదేశపు జ్ఞానులువచ్చి క్రీస్తు శిశువునూ ఆ శిశువు చెంతనున్న మరియమాతనూ దర్శించారు - మత్త 2, 11. సువిశేషం చెప్పదుగాని, ఆ తల్లి జ్ఞానులకు శిశువును అందించి వుంటుంది. వాళ్లు ఆ బిడ్డను ముద్దాడి ఆరాధించి కానుకలర్పించు కొన్నారు. అప్పటినుండి క్రైస్తవసమాజంలో మరియ చేసేపని విశ్వాసులకు క్రీస్తుని అందిస్తూండడమే. ఆమె మహాప్రేషితురాలు. ఈ మరియలాగే గురువులూ మఠకన్యలూ ప్రజలకు క్రీస్తుని అందిస్తూండాలి. ప్రేషితధర్మమంటే యిదే.

# 6. ఆత్మరక్షణ కాంక్ష

ప్రేషితులు క్రీస్తుని బోధించాలనీ క్రీస్తు రక్షణాన్ని ప్రజలకు అందజేయాలనీ ఉవ్విళ్లూరుతూండాలి. ప్రస్తుతాధ్యాయంలో ఈ యాత్మరక్షణ కాంక్షనుగూర్చి కొన్ని అంశాలు పరిశీలిద్దాం.

## 1. అధికంగా పొందినవాళ్లు

ప్రభువు ఎప్పుడుగూడ అధికంగా పొందినవాళ్లనుండి అధికంగానే అడుగుతాడు - లూకా 12,48. ప్రేషితులుగూడ ప్రభువునుండి ఎక్కువగానే పొందుతారు. వాళ్ల పిలుపు అనేది దేవుడిచ్చిన ఓ మహాభాగ్యం. కనుక వాళ్లు ఈ పిలుపునకు తగిన విధంగా లెక్కనొప్పజెప్పాలి. దేవుడు మనకిచ్చిన భాగ్యాలను మనం ఇతరులకు పంచిపెడుతూండాలి. పౌలు రెండవ ప్రేషిత ప్రయాణలో త్రోయ అనే నగరానికి వచ్చాడు. అక్కడ ఓరాత్రి

మాసెడోనియా నరుడొకడు అతనికి కలలోకన్పించి మా రాష్ట్రానికివచ్చి మాకు సహాయం చేయమని వేడుకొన్నాడు. పౌలు ఆ స్వప్నాన్ని దైవప్రేరణంగా భావించి మాసెడోనియాలో సువార్తను ప్రకటించడానికి ప్రయాణమయ్యాడు - అకా 16,9. ఈ పౌలులాగే మనంకూడ తోడినరులకు క్రీస్తుని తెలియజేయడానికి పూనుకోవాలి. ఇది తోడిజనానికి మనంజేసే గొప్ప సహాయం.

## 2. ఓ బాధ్యత

ప్రేషితకార్యం ధర్మంజేయడంలాంటిది గాదు. అది మన ఉదారత్వంమీద ఆధారపడి ఉండేదిగాదు. అది ఓ పెద్ద బాధ్యత. మనం ప్రేషితులంగా మెలగకపోతే నాశమైపోతాం. కనుకనే పౌలు "సువార్తను బోధించినంతమాత్రాన్నే నాకు గొప్పలు చెప్పుకొనే హక్కేమిలేదు. సువార్తను ప్రకటించమని ప్రభువు నన్నాజ్ఞాపించాడు. కనుక ఆ పనిచేయకపోతే నాకు దారుణమైన శిక్ష పడుతుంది" అని చెప్పాడు - 1 కొ 9, 16. వత్తి తన్నుతాను కాల్చుకొంటూ వెలిగిపోతూంటుంది. ఆలాగే పౌలుకూడ తన్నుతాను వ్యయపరచుకొంటూ ప్రేషితరంగంలో రేయింబవళ్లు కృషిచేసాడు -2 కొ 12, 15. ఈ పౌలులాగే తామ్ముతాము ప్రేషిత జీవితానికి సమర్పించుకొని తమజీవితాన్ని తాము వ్యయంజేసికొనే గురువులూ మఠకన్యలూ ధన్యులు.

## 3. మన ఋణం

పిలుపును పొందడంద్వారా మనం దేవునికి ఋణపడతాం. కాని ఈ ఋణాన్ని దేవుడు ఆత్మలపరంచేస్తాడు. కనుక మనం ఋణం తీర్చుకోవాలంటే తోడిజనానికి మేలు చేయాలి - రోమా 1, 14. ఇక,తోడిజనానికి చేసిన మేలును ప్రభువు తనకు చేసినట్లే భావిస్తాడు. కావుననే అతడు "నా సోదరులలో అత్యల్పునికి చేసిన మేలికార్యం నాకు చేసినట్లే భావిస్తాను" అన్నాడు - మత్త 25, 40.

## 4. మనం గృహనిర్వాహకులం

ధనవంతుల యిండ్లల్లో గృహనిర్వాహకులనేవాళ్లుంటారు. వీళ్లు యజమానుల ఆదాయవ్యయాలను విచారిస్తూంటారు. సేవకులచేత పనిచేయించుకొని వాళ్లకు జీతాలు బత్తాలూ ఇస్తూంటారు. గురువులూ మఠకన్యలూగూడ దేవుడనే యజమానుని యింటిలో గృహనిర్వాహకుల్లాంటి వాళ్లు. "మీరు మంచి గృహనిర్వాహకుల్లాగ మెలగండి. మీరు దేవునినుండి పొందిన ప్రత్యేక వరాలను ఇతరుల మేలుకై వినియోగించండి - 1 పేత్రు 4, 10. మనం యజమానులమూగాదు, అధికారులమూకాదు. ఆ బిరుదాలు దేవునికే చెల్లుతాయి. మనం కేవలం గృహనిర్వాహకులం మాత్రమే. అనగా దేవునియింటిని చక్కబెట్టే సేవకులం. కనుక దేవునిసొత్తును ప్రజలకు పంచిపెట్టడం మనబాధ్యత.

## 5. అందరికీ అనుకూలంగా మెలగాలి

తోడిజనాన్ని సేవించినపుడు ప్రభువునే సేవించినట్లు, కాని తోడిజనంపట్ల అనుకూలంగా మెలగలకపోతే వాళ్ళకు సేవచేయలేం. కావుననే పౌలు అందరికీ దాసుడయ్యాడు. అందరికీ అనుకూలంగా ప్రవర్తిస్తే కొందరినైనా రక్షించవచ్చుగదా అనుకొన్నాడు. అతడు యూదులతో మెలిగేప్పుడు యూదుల్లాగ, గ్రీకు రోమను ప్రజలతో మెలిగేప్పుడు వాళ్ళలాగ నడుచుకొన్నాడు - 1కొ 9, 19-21. పౌలు పేర్కొన్న ఈ యనుకూలగుణం ప్రేషితులకు అత్యవసరం. ప్రజలకు అనుకూలంగా మెలగకపోతే వాళ్ళు మనబోధ ఆలించరు. ఇది తెలియక కొంతమంది ప్రేషితులు తమ పద్ధతులూ తమ పోకడలే ముఖ్యమన్నట్లు మెలుగుతూంటారు. మొండిపట్టు పడుతూంటారు.

## 6. తల్లిదండ్రులు పిల్లలకోసం

పిల్లలు తల్లిదండ్రులకోసం సొమ్ము చేకూర్చరు. తల్లిదండ్రులే పిల్లలకోసం ఆస్తి చేకూర్చిపెడతారు. కనుక పౌలు తన బిడ్డలైన కొరింతు విశ్వాసులకొరకు భగవంతుని ఆస్తి చేకూర్చి పెట్టాడు. తాను సంపాదించిన దివ్యసంపదలను ఆ యాత్మలకోసం వ్యయం చేసాడు - 2 కొ 12, 14-15, తన్ను తాను వాళ్ళకోసం అర్పించుకొన్నాడు. ఈ పౌలులాగే మనంకూడ విశ్వాసులకొరకు జీవించాలి. మనశక్తి సామర్థ్యాలను వాళ్ళకోసం వినియోగించాలి. మనకున్నదికాస్త వాళ్ళపరం చేయాలి. అంతేగాని, ఆ విశ్వాసుల సొత్తునే మనం అపహరించగూడదు.

## 7. ఆదర్శం

ప్రేషితులకు స్వార్థం పనికిరాదు. పరార్థబుద్ధి కావాలి. అనగా విశ్వాసులు మనకేదో ఉపకారంచేయాలి అని కోరుకోగూడదు. మనమే ఆ విశ్వాసులకు ఏదో ఉపకారంచేయాలి అనుకోవాలి. క్రీస్తుకూడ తన్నుతాను సంతోషపెట్టుకోలేదు - రోమా 15, 3. ఇది మహావాక్యం. అతడు తన సుఖాన్ని తాను వెదుకుకున్నట్లయితే మనకోసం సిలువమీద చనిపోయేవాడేనా? ఇక, పౌలుకూడ క్రీస్తులాగే స్వార్థరహితంగా జీవించడానికి ప్రయాసపడ్డాడు. తాను క్రీస్తుని అనుసరించినట్లే తన విశ్వాసులూ తన్ననుసరించాలని కోరుకొన్నాడు - ఫిలి 3, 17. ఈ యనుసరణం దేనిలో? స్వార్థాన్ని చంపుకోవడంలోనే. కనుక ప్రభువులాగా, ప్రభువుశిష్యుడు పౌలులాగా, మనంకూడ స్వార్థరహితమైన జీవితం గడపాలి. అప్పుడేగాని పదిమందికి సేవలుచేసినవాళ్ళం కాలేం. ప్రేషితకార్యం ఓ బాధ్యత, ఓ ఋణం. భక్తులైన ప్రేషితులు ఈ ఋణం ఏలా తీర్చుకోగలమా అని భయపడిపోయి అహోరాత్రులూ కృషిచేస్తూంటారు. అల్పులైన ప్రేషితులు మాత్రం నిశ్చింతగా కాలం గడుపుతూంటారు.

8. ప్రార్థనాభావాలు

1. అన్యదేశాలనుండి మనదేశానికివచ్చి మనప్రజలకు సేవలు చేసే విదేశగురువులనూ మఠకన్యలనూ చూస్తూంటే మనకు సిగ్గువేస్తుంది. వాళ్ళకుండే ఆసక్తీ స్వార్థత్యాగమూ మనకు లేదు. వాళ్ళలాగా మనం కష్టపడి పనిచేయం. వాళ్ళలాగా తోడిజనంకోసం మన జీవితాన్ని సమర్పించుకోం. అందుకే వాళ్ళలాగా మనం క్రీస్తుని బోధించలేకపోతున్నాం. ఈ విదేశ ప్రేషితులనుజూచి మన జీవితాన్ని సవరించుకోవడం మేలు.

2. జేన్ షాంతాల్ ధనవంతురాలు, భక్తురాలుకూడ. ఆమె భర్త మరణానంతరం మఠకన్య కావాలనుకొంది. కాని ఆమె యిల్లు విడిచిపోయేనాడు ఆమె బిడ్డలు గడపదగ్గిర అడ్డంగా పండుకొన్నారు. మమ్మందరిని ఏ నట్టేటిలో గలిపి పోతావని ఏడ్చారు. కాని ఆమె ధైర్యంతో వాళ్ళమీదిగా నడిచి కాన్వెంటుకు వెళ్ళిపోయింది. తరువాత విజిటేషన్ మఠసభను స్థాపించింది. పునీత పట్టంగూడ పొందింది. గొప్ప ప్రేషితుల కార్యదీక్ష అలా వుంటుంది.

3. ఈనాడు ఒక్క మదర్ తెరేసా ఎంతసేవ చేసింది! ఆనాడు ఒక్క ఫ్రాన్సిస్ జేవియర్ ఎంతకృషి చేసాడు! భక్తీ ఆసక్తీగల ప్రేషితులుంటే ఎంత పనైనా జరుగుతుందిగదా! ఆసక్తీలేని గురువులూ మఠకన్యలూ మేలుకుమారుగా కీడుచేస్తారు.

4. ప్రేషితులకు ఉదారగుణంలో ప్రజలకు సేవలుచేయాలన్న కోరిక చాలముఖ్యం. ఇగ్నేషృసు ఈ యౌదార్యంకోసం ఈలా ప్రార్థించాడు:

"ప్రభో!
గాయాలను లెక్కించకుండా పోరాడేలాగా
విశ్రాంతిని కోరుకోకుండా పరిశ్రమ చేసేలాగా
బహుమతిని ఆశించకుండా కృషిచేసేలాగా
నీ సేవలో నాకు ఔదార్యాన్ని ప్రసాదించు".

# 7. నిగ్రహం

ప్రేషితులు ఇతరులకు దివ్యజీవాన్ని ప్రసాదించేవాళ్ళు. కాని మనం మొదట దివ్యజీవితం జీవించందే వేరేవాళ్ళు ఆలాంటి జీవితం జీవించేలా చేయలేం. ఇక, మనం దివ్యజీవితం జీవించాలంటే నిగ్రహం అవసరం. ఈ యధ్యాయంలో నిగ్రహాన్ని గూర్చి కొన్ని సంగతులు తెలిసికొందాం.

## 1. గోదుమగింజ

"గోదుమగింజ భూమిలోపడి నశించనంతకాలం ఒంటిగానే వుంటుంది. నశించినంక విస్తారంగా ఫలిస్తుంది" - యోహా 12, 24. గోదుమగింజ నేలలోపడి చివికిపోనంతకాలం ఎండిపోయి ఓ రాతిముక్కలా వుంటుంది. దానిలో ప్రాణమున్నట్లే కన్పించదు. కాని ఓమారు భూమిలోపడి చివికిపోయినంక అది మొలకెత్తినూరంతలుగా ఫలిస్తుంది.. ఒక గింజకుమారుగా నూరు గింజలౌతుంది.ఆలాగే మనంకూడ మన పాపజీవితానికి చనిపోవాలి. మనలోని స్వార్థం చివికిపోవాలి. మనలోని తొలిరూపం నశించి క్రీస్తురూపం ఏర్పడాలి. అప్పుడు మనలో క్రొత్తజీవం నెలకొంటుంది. మనమూ నూరంతలుగా ఫలిస్తాం. విశ్వాసుల హృదయాల్లో వరప్రసాదం పెంపొందిస్తాం. ఇక్కడ స్వార్థానికి చనిపోవడమే మన నిగ్రహం అనుకోవాలి.

## 2. ద్రాక్షతీగ

"ఫలించే ప్రతికొమ్మా మరీ యెక్కువగా ఫలించేందుకై నా తండ్రి దానిని కత్తిరించివేస్తాడు" - యోహా 15,2. ద్రాక్ష కొమ్మలను కత్తిరించివేస్తారు. ఈలా కత్తిరించడం ద్వారా ఆ కొమ్మలు ఏపుగా గుబురుగాపెరిగి గుత్తులుగుత్తులుగా కాయలు కాస్తాయి. ఈలా కత్తిరింపువేయకపోతే కొమ్మ మొద్దుబారిపోతుంది. సరిగా కాపుకాయదు. ఈలాగే మనలోని పనికిమాలిన గుణాలు కూడ కత్తిరింపుపడాలి. స్వార్థం సమసిపోవాలి. అప్పుడుగాని మనం దివ్యగుణాలతో నిండిపోం, విశ్వాసులకు మేలుచేయలేం. కొమ్మ విలువంతాగూడ తల్లితీగతో ఐక్యం గావడంలోనేవుంది. అది తల్లితీగలోని సారాన్నే కాయలుగా మార్చుకోవాలి. మన గొప్పంతాగూడ క్రీస్తుతో ఐక్యంగావడంలోనే వుంది. మనం అతని సారాన్ని, అనగా అతని వరప్రసాదాన్ని, సత్కార్యాలుగా మార్చుకోవాలి. ఇక్కడ స్వార్థానికి కత్తిరింపుబడ్డమే మన నిగ్రహం అనుకోవాలి.

## 3. ప్రసవించే తల్లి

"ప్రసవకాలం వచ్చినపుడు స్త్రీ బాధపడుతుంది. కాని బిడ్డ పుట్టగానే శిశువును కన్నానుగదా అని తన బాధకాస్త మరచిపోతుంది" - యోహా 16,21. స్త్రీకి ప్రసవవేదనం తప్పదు. కాని ఆవేదనే తర్వాత సంతోషంగా మారిపోతుంది. ఆమె ప్రసవవేదన అనుభవించకపోతే గొడ్రాలుగానే వుండిపోతుంది. మనంకూడ స్వార్థానికి చచ్చిపోయేపుడు బాధగానే వుంటుంది. కాని ఈబాధే తర్వాత సంతోషంగా మారిపోతుంది. ఈ బాధ ననుభవింపకపోతే మనంకూడ గొడ్రాలైన స్త్రీలాగే నిష్ప్రయోజకులమై పోతాం. ఇక్కడ వేదనలు అనుభవించడమే మన నిగ్రహం అనుకోవాలి.

పైమూడు ఉపమానాల్లోను భావం ఒకటే. మనలోని స్వార్థం సమసిపోవాలి. స్వార్థాన్ని అణచుకోవాలంటే ఎంతో బాధగా వుంటుంది. కాని ఈ బాధద్వారానేగాని క్రీస్తు జీవాన్ని పొందలేం. మొదట మనం ఈ జీవాన్ని పొందితేనేగాని తర్వాత దాన్ని తోడిజనానికి అందీయలేం.

## 4. ప్రార్థనా భావాలు

1. కురేనియా సీమోను సిలువను మోయడంలో ప్రభువుకి తోడ్పడ్డాడు - మత్త 27,32. ప్రభువుకి మన సహకారం అవసరం. పంటను సేకరించడానికి కోతగాళ్ళు కావాలి. తీగలోని సారాన్ని పండ్లుగా మార్చుకోవడానికి కొమ్మలుకావాలి. బిడ్డను లోకంలోకి ప్రవేశపెట్టడానికి తల్లికావాలి. అలాగే ప్రభువు ప్రారంభించిన రక్షణ ఉద్యమాన్ని కొనసాగించడానికి ప్రేషితులమైన మనంకావాలి. మనం దేవునితో సహకరించడానికీ, అతనితో కలసి పనిచేయడానికీ ఎన్నుకోబడినవాళ్లం. ఇది చాల గొప్ప పిలుపు. ఐనా ఆత్మ నిగ్రహంలేందే ఈ పిలుపు ఫలితమీయదు.

2. పౌలు కొరింతీయులకు రెండవజాబు వ్రాస్తూ "యేసుజీవం మాలో నెలకొనేందుకై మాదేహంలో నిత్యం ప్రభుమరణాన్ని అనుభవిస్తున్నాం. మామరణం మీకు జీవాన్ని సంపాదించి పెడుతుంది" అని చెప్పాడు- 2కొ 4, 10-12. పౌలు క్రీస్తు జీవాన్ని పొందడానికై ఆత్మనిగ్రహం అవలంబించాడు. నానా యాతనలూ అనుభవించాడు. కాని పౌలు బాధలద్వారా అతని విశ్వాసులకు వరప్రసాదం లభించింది. అలాగే మనంకూడ సొంతజీవితానికి చనిపోతేనేగాని యేసుజీవితం మనలో బలపడదు. ఈలా బలపడిన యేసు జీవితమే మననుండి వేరేవాళ్లను చేరుతుంది. కనుక మనం రోజురోజుకీ మన సొంతరూపాన్ని మార్చుకొని క్రీస్తు రూపాన్ని పొందుతూండాలి.

3. అంతియోకయ మేత్రాణులైన యిన్యాసివారు రెండవ శతాబ్దిలో వేదసాక్షిగా మరణించారు. ఆ భక్తుణ్ణి రోములోని సింహాలకు మేతగావేయగా ఆ వన్యమృగాలు అతన్ని పెళపెళవిరుచుకొని తిన్నాయి. ఆ సమయంలో ఆయన "నేను స్వామి కొరకు ఉద్దేశింపబడిన గోదుమధాన్యాన్ని. ఈ వన్యమృగాల కోరల్లో పిండిపిండిగా నలిగి క్రీస్తుయొక్క అప్పంగా మారిపోతాను" అనిచెప్పుకొన్నాడు. క్రీస్తుకోసం శ్రమలనుభవించడమంటే యిది. పూజలో అప్పరసాలు ప్రభు శరీరరక్తాలుగా మారిపోతాయి. ఈ యప్పరసాలు నిగ్రహానికీ శ్రమజీవితానికీ చిహ్నాలు. మనం పూజను సమర్పించి ప్రభుని ఆరాధించుకొనేపుడెల్లా ఈ నిగ్రహమనే భాగ్యాన్ని అడుగుకొంటూండాలి.

4. ట్రేజన్ అనే అతని ఓ రోమను చక్రవర్తి. అతడు రాజ్యవ్యవహారాలన్నీ వదలివేసి తూనీగలను బట్టుకొంటూ కాలక్షేపం చేసేవాడట. కొంతమంది గురువులూ మఠకన్యలూ

ఈ చక్రవర్తిలాగే నిరర్థకజీవితం గడుపుతూంటారు. మనం చేయవలసిన సత్కార్యాలు ఎన్నైనావున్నాయి. ప్రజలకు ఎన్నోవిధాల మేలుచేయవచ్చు. ఐనా అర్థంలేని వ్యర్థజీవితంతో కాలక్షేపం చేస్తూంటాం.

# 8. మోక్షభాగ్యం ధ్రువం

ప్రభువు మనలను పిల్చాడుగదా! ఆ పిలుపుకు తగినట్లుగా జీవించేవాళ్లకు మోక్షభాగ్యమిస్తానని ప్రభువు చాలావాక్యాల్లో ప్రమాణంచేసాడు. ఆలాంటి వాక్యాలను మూడింటిని పరిశీలిద్దాం.

## 1. ఇక్కడ నూరంతలూ, అక్కడ నిత్యజీవమూ

"నా నిమిత్తం ఇల్లూవాకిలినీ సోదరీసోదరులనూ తల్లిదండ్రులనూ పొలమూపుత్రానూ పరిత్యజించినవాళ్లు నూరురెట్లు పొందుతారు, నిత్యజీవానికీ అర్హులౌతారు" - మత్త 19,29.

1. సందర్భం. ధనికయువకుడు అటు తన ఆస్తిని వదలుకోలేకా ఇటు క్రీస్తుని అనుసరించలేకా దిగులుతో వెళ్లిపోయాడు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని ప్రభువు ధనవంతుడు మోక్షాన్ని చేరుకోవడంకంటె ఒంటె సూదిబెజ్జంగుండా దూరిపోవడం సులభమని చెప్పాడు. అపుడు పేత్రు మేము సర్వం పరిత్యజించి నిన్ననుసరించాం గదా, మరి మాకేమి లాభం కలుగుతుందో చెప్పమన్నాడు. దానికి ప్రభువు చెప్పిన జవాబే పైవాక్యం.

2. నియమం. మనకు ప్రియమైన వాటినన్నిటినీ ప్రభువు కోసం వదలివేయాలి. అనగా క్రీస్తురాజ్యంకోసం బంధువులనూ ఆస్తిబాస్తులనూ పరిత్యజించాలి. ఈలా వదలివేసినవాటిని మళ్లా ఆసించగూడదు, యూదాలాగ.

3. భావం. వాళ్లు వదలింది బంధువులనూ ఆస్తిబాస్తులనూ. కాని వీటికి బదులుగా వాళ్లు పొందేవిమాత్రం చాలావున్నాయి. ఇక్కడ నూరంతలుగా పొందుతారు. ఒక్క కుటుంబాన్ని వదలివేసినందుకై ప్రపంచంలోని జనమంతా మనకుటుంబమే ఔతారు. ఇంటివద్ద ఆస్తిబాస్తులను వదలివేసివచ్చినా మనకు గురుజీవితంలోను కన్యాజీవితంలోను కూడూగుడ్డా యిల్లూవాకిలీ కరువైపోవు. ఇది కాక, ప్రభువుకోసం త్యాగంజేసినవాళ్లు అక్కడ నిత్యజీవం పొందుతారు. నిత్యమరణాన్ని తప్పించుకొంటారు.

4. అన్వయం. ప్రభువు ఆనాడు అపోస్తలులకు చెప్పిన వాక్యమిది. వాళ్ల పనిని కొనసాగించే మనకుగూడ ఈనాడు ఈవాక్యం అక్షరాల వర్తిస్తుంది. మనంమాత్రం చేసిన త్యాగానికి భంగం కలిగించగూడదు. ఆ వదిలివేసినవాటిని మళ్లా ఆసించగూడదు. మనం మనత్యాగాన్ని నిలుపుకొంటే, దేవుడు తన ప్రమాణాన్ని నిలుపుకొంటాడు.

## 2. నాతండ్రియెదుట నేనూ అంగీకరిస్తాను

"ప్రజలయెదుట నన్ను అంగీకరించేవాణ్ణి పరలోకంలోని నా తండ్రియెదుట నేనూ అంగీకరిస్తాను" - మత్త 10,32.

1. సందర్భం. ఇక్కడ ప్రభువు వేదహింసలనుగూర్చి మాటలాడుతూన్నాడు. హింసల్లోగూడ మనం ప్రభుని అంగీకరించాలి. అప్పుడు ప్రభువు మనలను అంగీకరిస్తాడు.

2. నియమం. ఇక్కడ మనం ప్రభుని అంగీకరించడం ప్రధానం. ఇప్పుడు హింసలు లేవుగదాంటే రోజురోజు ప్రభుని అంగీకరించేవాళ్లకు, అహింసలు వచ్చినపుడు వాటిల్లోగూడ అతన్ని అంగీకరించేభాగ్యం లభించదా? లేని హింసలను మనం సృజించలేంగదా? కనుక మనతరపున మనం రోజు అతన్ని అంగీకరిస్తేచాలు.

3. భావం. మన చేయవలసింది, ఈ జీవితంలో ప్రభుని అనుసరించడమూ అతన్ని అంగీకరించడమూను. అతడు చేసేది, పితయెదుట మనలను అంగీకరించడం. అనగా అతడు మోక్షంలో పిత సమక్షాన మనలను నిలుపుకొంటాడని భావం.

4. అన్వయం. మన యీ గురుజీవితమంతా, మఠజీవితమంతా, ప్రభుని అంగీకరించడమేగదా! ప్రభువుపట్ల మనం జూపే ఈ యంగీకారం మోసమైందికాదనీ యథార్థమైందేననీ ఆశిద్దాం. ఈ పట్టున మనకొరతలనూ లోపాలనూ సవరించేదిగూడ ఆ ప్రభువే.

## 3. నేనూ మీకు రాజ్యాన్నిస్తాను

"నా శ్రమల్లో నాకు తోడుగా వున్నవాళ్లు మీరే. నా తండ్రి నాకు రాజ్యమిచ్చినట్లే నేనూ మీకు రాజ్యమిస్తున్నాను. మీరు నారాజ్యంలో నాతోపాటు విందారగిస్తారు. సింహాసనంమీద కూర్చుండి పండ్రెండు గోత్రాల యిస్రాయేలీయులకూ తీర్పులు తీరుస్తారు" - లూకా 22, 28-30.

1. సందర్భం. అపోస్తలులకు తమలో ఎవరు గొప్పవాళ్లు అన్న వివాదం పుట్టింది. అందుకు ప్రభువు వాళ్లను మందలించి, గొప్పవాళ్లు కాగోరేవాళ్లు ఇతరులకు సేవకులు కావాలి అన్నాడు. తానూ పితకు సేవకుణ్ణేనని చెప్పాడు. ఈ సేవకులే తర్వాత రాజ్యం చేస్తారనిగూడ చెప్పాడు.

2. నియమం. మనం ప్రభువుకి సేవచేస్తూ అతనితో వుండిపోవాలి. శిష్యులు తన్ను అంటిపెట్టుకొని వుండడాన్నిజూచి ప్రభువు సంతృప్తిచెందాడు.

3. భావం. శిష్యులతరపున శిష్యులు ప్రభుని సేవించాలి. ప్రభువుతరపున ప్రభువు ఈ సేవకులకు రాజ్యాన్ని ప్రసాదిస్తాడు. తనతోపాటు వాళ్లూ విందులో పాలుపొందేలా చేస్తాడు. ఇక్కడ విందు అంటే మోక్షమే. యూదులు మోక్షాన్ని ఓ వివాహపు విందుగా భావించేవాళ్లని చెప్పాం. ప్రభువు తనతోపాటు శిష్యులనుగూడ తీర్పరులను చేస్తాడు. అనగా మంచిసేవకులు ప్రభువుతోపాటు శాశ్వతంగా మోక్షపాలన జేస్తూ ఆనందిస్తారని భావం.

4. అన్వయం. మనమూ నిత్యం ప్రభువుని అంటిపెట్టుకొని వుంటూంటాం. రోజూ అతన్ని సేవిస్తూంటాం. మన పనులన్నీ అతని సేవకొరకే. కనుక ప్రభువు ఆయపోస్తుల కిస్తానన్న మోక్షభాగ్యం మనకూ యిచ్చితీరుతాడు.

## 4. ప్రార్థనాభావాలు

1. ప్రభువు పలికిన పై వాక్యాలు మనకు భయాన్నీ నమ్మికనూ గూడ కలిగించాలి. భయమెందుకంటే "తొలుత నరుడు భగవంతుణ్ణి విడనాడితేనేగాని భగవంతుడు నరుణ్ణి విడనాడడు". కనుక మనం ప్రభుని విడనాడగలం. చాలామంది ఆలా చేసారుగూడ. మనకూ ఈ దుర్గతి పట్టవచ్చు. ఇక నమ్మిక దేనికంటే, మనం తన ప్రేమయందు స్థిరంగా నిలిచేలా చేసేది ఆ ప్రభువే - 2 తెస్స 1, 12. ప్రభువు తన్ను చిత్తశుద్ధితో సేవించేవాళ్లను చేయివిడువడు.

2. వివేకవతులైన కన్యలు ప్రభువుకోసం ఎదురుచూస్తూన్నారు. ప్రభువు రాగానే ఈ కన్నెలు దివ్వెలు వెలిగించుకొని అతనితోపాటు వివాహశాలలోనికి ప్రవేశించారు - మత్త 26, 6-10. యూదులు మోక్షాన్ని వివాహపువిందుగా భావించేవాళ్లని చెప్పాం. ఈ కన్నెల్లాగే మనంకూడ ఈ జీవితయాత్రలో ప్రభువుకోసం వేచివుండాలి. అతన్ని భక్తిభావంతో సేవిస్తూండాలి. అప్పుడు ప్రభువు విజయంచేసి మనలను తనతోపాటు మోక్షానికి తీసికొని వెళ్తాడు.

3. ఆగ్నెస్‌కన్య మూడవశతాబ్దిలో వేదసాక్షిగా మరణించింది. మరణానికి ముందు ఆమె యీలా పలికింది. "ఆ ప్రభువుని తెలిసి కొన్నాను. తెలిసికొని ప్రేమించాను. ప్రేమించి అతన్నే వరించాను. వరించి అతనిమీదనే భారంవేసాను. ఇక నా కన్యాత్వాన్ని కాపాడేనాథుడు అతడే". ఇవి చాలా భక్తిమంతమైన వాక్యాలు. గురువులంగా మఠకన్యలంగా మనం ఎన్నుకుంది ఆ ప్రభువునే. మనలను రక్షించి కాపాడేదీ, కాపాడి మోక్షానికి తీసికొనివెళ్లేదీ ఆ ప్రభువే.

4. అగస్తీను భక్తుడు "ప్రభో! మా హృదయాలను నీ కొరకే సృజించావు. నీయందు విశ్రమించిందాకా వాటికి విశ్రాంతి అంటూ లేదు" అని నుడివాడు. ఈ ప్రపంచంలోని ధనమూ, అధికారమూ, సుఖభోగాలూ కీర్తి ప్రతిష్ఠలూ కొంత తృప్తినిస్తాయి. కాని అవేవీ మన హృదయానికి పూర్ణతృప్తినీయలేవు. ఎందుకు? మన హృదయం దేవునికొరకు సృజింపబడింది. అతన్ని పొందితేనేగాని దానికి పూర్ణతృప్తి అంటూలేదు. ఇక, కన్యాజీవితమూ గురుజీవితమూ దేవుణ్ణి ప్రేమించి సేవించే జీవితం. అతన్నిపొందే జీవితం. కనుక ఈ సేవాజీవితంద్వారా మన హృదయం పూర్ణానందాన్నీ పూర్ణశాంతినీ పొందుతుంది. దేవునికి పోలికగా కలిగింపబడిన నరునికి ఆ దేవుణ్ణి పొందడంకంటె గొప్పభాగ్య మేముంటుంది?

# 10. కుటుంబ జీవితం

బైబిలు భాష్యం - 34

విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. | వివాహ బంధం | 205 |
| 2. | భార్యాభర్తలు | 207 |
| 3. | సంతానం | 209 |
| 4. | కుటుంబ ధర్మాలు | 211 |
| 5. | ప్రేషితులుగా గృహస్థులు | 218 |


## 1. వివాహ బంధం

### 1. వివాహబంధం దేవుడే నిర్ణయించాడు

నరులను సృజించింది దేవుడే. "దేవుడు మానవజాతిని సృజించాడు. తనకు పోలికగా మానవుని చేసాడు. ఆ మానవుని స్త్రీ పురుషులనుగా సృజించాడు" - ఆది 1,27.

ఈలా తాను సృజించిన స్త్రీ పురుషులను భార్యాభర్తలను చేసింది గూడ ఆ ప్రభువే. అతడు ఓ వైద్యుని లాగ ఆదాము ప్రక్కటెముకను తీసి దానిని ఓ స్త్రీగా మలచాడు. ఆమే ఏవ - 2,22. ఈ యేవ ఆదాము లాంటిది, అతని కోవకు చెందింది. అతని యెముకలూ శరీరమూ హృదయమూ ఆమెలో వున్నాయి. కనుక ఆమె పురుషుని వైపు బలంగా ఆకర్షింపబడుతూంటుంది. ఇక ఆదాము తనతరుపున తాను "ఈమె నా యెముకల్లో యెముక నా శరీరంలో శరీరం" అనుకొని ఆమెవైపు ఆకర్షింపబడుతూంటాడు. ఆమె అతనికి తోడుగా వుంటుంది. ఆదాము నాటి నుండి ప్రతి పురుషుడూ తల్లిదండ్రులను గూడ విడనాడి తన ఆలికి హత్తుకొనిపోతున్నాడు. వాళ్ళిద్దరూ ఒక్కరై కూడ ఏకశరీరులు, ఏకవ్యక్తి అన్నంత సన్నిహితంగా ఐక్యమైపోతారు-2,23. ఈ యైక్యత వల్లనే స్త్రీ పురుషులు బిడ్డలను కని వ్యాప్తి చెందుతారు- 1,28. ఈలా భగవంతుడు స్వయంగా ఐక్యపరచిన భార్యాభర్తలను ఏ నరుడూ వేరుపరుపకూడదు. అది పవిత్రబంధం - మత్త 19,6. కనుక వివాహ జీవితం గడిపేవాళ్లు ఆ జీవితం పట్ల పవిత్రమైన భావాలు పెంపొందించుకోవాలి.

### 2. లైంగిక జీవితం పవిత్రమైంది

భగవంతుడే నిర్ణయించింది గనుక లైంగిక జీవితం పవిత్రమైందని భావించింది పూర్వ వేదం. నూత్న వేదం ప్రకారం గూడ భార్యభర్తల లైంగిక జీవితం పరమ పవిత్రమైంది.

పౌలు భార్యాభర్తల ప్రేమను శ్రీసభకూ క్రీస్తుకూ వుండే ప్రేమతో పోల్చాడు. క్రీస్తు శ్రీసభను ప్రేమించి ఆ సభ కోసం ప్రాణాలు ఒడ్డినట్లే భర్తకూడ భార్యను ప్రేమించి ఆమెకోసం ప్రాణాలు అర్పించాలి - ఎఫె 5,25. "వాళ్లిద్దరూ ఏక వ్యక్తిగా ఐక్యం కావాలి" అనే ఆదికాండవచనం క్రీస్తుకీ శ్రీసభకీ వర్తిస్తుంది - 5,31-32.

ఇక్కడ శ్రీసభ అంటే క్రైస్తవ సమాజం, క్రైస్తవ భక్తులమైన మనం. క్రీస్తుకి క్రైస్తవ ప్రజల పట్లగల ప్రేమను భర్తకి భార్యపట్ల వుండే ప్రేమతో పోల్చాడు పౌలు. భార్యా భర్తల ప్రేమ, వాళ్ల లైంగిక జీవితం, పవిత్రమైంది కాకపోయినట్లయితే పౌలు దాన్ని క్రీస్తు ప్రేమతో పోల్చివుండేవాడేనా? కనుక లైంగిక జీవితం పరిశుద్ధమైంది. కావుననే దాన్ని మనం కామభావాలతో, జంతుదృష్టితో అమంగళపరచగూడదు.

## 3. భార్యాభర్తల విశ్వసనీయత

వివాహాన్ని లైంగిక జీవితాన్ని భగవంతుడే నిర్ణయించాడు అన్నాం. కనుక భార్యాభర్తలు ఒకరిపట్ల ఒకరు విశ్వసనీయంగా ప్రవర్తించాలి. అలా ప్రవర్తించకపోతే వాళ్లు పరస్పరం ద్రోహం చేసికోవడం మాత్రమే కాదు, వివాహకర్తయైన దేవునికి గూడ ద్రోహం చేస్తారు.

బాబిలోనియా దేశంలో యొవాకిం భార్యయైన సూసన్న భక్తురాలిని ఇద్దరు వృద్ధులు పాపానికి ప్రేరేపించారు. ఆమె వారితో "దేవుడు చూస్తుండగా ఈలాంటి పాడుపని ఏలా చేసేదీ" అంది - దాని 13,23. దైవభీతి వలన సూసన్న పాప కార్యానికి పాల్పడలేదు. ఇది పూర్వవేద భక్తి.

ఇక, నూత్నవేదంలో వివాహం ఓ సంస్కారం. అది క్రీస్తుకీ క్రైస్తవ సమాజానికీ మధ్య వుండే ప్రేమకు చిహ్నంగా వుంటుంది అని చెప్పాం. కనుక భార్యాభర్తలు ఒకరికొకరు వివాహ ద్రోహం చేసికొన్నపుడు క్రీస్తుకే ద్రోహం చేసినట్లు అవుతుంది.

పౌలు వివాహ జీవితాన్ని గూర్చి వ్రాస్తూ భార్యాభర్తల దేహదానాన్ని పేర్కొన్నాడు. భర్త భార్యకీ, భార్య భర్తకీ వివాహ ధర్మాన్ని నిర్వర్తించాలి. భార్య శరరం మీద భర్తకీ, భర్త శరీరం మీద భార్యకీ అధికారం వుంది. కనుక వాళ్ళిద్దరు ఒకరికొకరు దేహదానం కావించుకోవాలి. అనగా ఒకరు కోరినపుడొకరు కలయికకు అనుమతించాలి. దంపతులు కొంతకాలం ప్రార్థనలో గాని భక్తికృత్యాల్లో గాని గడపదల్చుకొంటే పరస్పర ఒప్పందం మీద కొన్ని దినాల పాటు ఒకరి కొకరు ఎడంగా వుండవచ్చు. కాని అటుపిమ్మట మళ్లా పరస్పర దేహదానం కావించుకోవాలి 1కొరి 7,3-5. వివాహ బంధం పెట్టుకొన్న వాళ్లకి పౌలు పేర్కొన్న ఈ ధర్మం చాల ముఖ్యమైనది. కనుక భర్త తరపున భర్తా, భార్య తరపున

భార్యా నేను ఈ ధర్మాన్ని చక్కగా నిర్వర్తిస్తున్నానా లేదా అని పరిశీలించి చూచుకోవాలి. విశేషంగా భార్య ఈ విషయంలో చాల మెలవకువతో ప్రవర్తించాలి. ఆమె లైంగిక క్రియ అసహ్యమైంది అన్నట్లుగా ప్రవర్తించగూడదు. తన రూపంలో నైతేనేమి చేతల్లో నైతేనేమి పెనిమిటికి అనాకర్షణీయంగా కన్పించి అతని మనసు మరో స్త్రీ మీదికి పోయేలా చేయకూడదు. భార్య దేహదానాన్ని నిరాకరిస్తే ఇక ఆ కుటుంబంలో కలహాలు కొనితెచ్చుకొన్నట్లే. సినిమాలు ప్రకటనలు మొదలైన ప్రచార సాధనాలతో నిండిపోయిన ఆధునిక ప్రపంచంలో భార్యభర్తల దాంపత్య జీవితాన్ని భగ్నం చేసే శోధనలు ఎన్నైనా ఎదురౌతాయి. కనుక క్రైస్తవ దంపతులు ఈ రంగంలో చాల చిత్తశుద్ధితో ప్రవర్తించాలి.

# 2. భార్యాభర్తలు

## 1. భార్యాభర్తల ప్రేమ

భార్యాభర్తల మధ్య పరస్పర ప్రేమ వుండాలి. ఈ ప్రేమ లేందే కుటుంబాలు నిలవ్వు. దావీదు కథే దీనికి నిదర్శనం. దావీదు సౌలు కొమార్తెయైన మీకాలును పెండ్లియాడాడు. కొంతకాలం పాటు వాళ్లిద్దరు పరస్పర ప్రేమతో జీవించారు. సౌలు దావీదును చంపడానికి కుట్ర పన్నగా మీకాలు అతని ప్రాణాలు కాపాడింది కూడ - 1సమూ 19,11-12. కాని క్రమేణ వారి దాంపత్యప్రేమ చల్లారిపోయింది. ఓమారు దావీదు దైవమందసాన్ని యెరూషలేముకు తరలించుకొని వస్తూ భక్తిభావంతో దాని ముందు నాట్యంచేసాడు. కాని ఆ నాట్యాన్ని చూచి మీకాలు దావీదుని పరిహసించింది. కోణంగిలా వున్నావని యెగతాళి చేసి అతన్ని చిన్నచూపు చూచింది. దానితో దావీదుకు ఆమె మీద విరక్తి పుట్టింది. మీకాలుకు మాత్రం చనిపోయే వరకు దావీదు వలన బిడ్డలు కలుగనే లేదు-2 సమూ 6,16-22. ఈ విధంగా ఈ దంపతులిద్దరూ పరస్పర గౌరవమూ ప్రేమా కోల్పోయారు. క్రైస్తవ దంపతులు ఈలా ప్రవర్తించగూడదు. అతడు క్రీస్తుకీ ఆమె శ్రీ సభకీ పోలికగా వున్నవాళ్లు కనుక పరస్పర గౌరవమర్యాదలతోను ప్రేమాదరాలతోను జీవించాలి.

నాబాలు ఆబీగాయిలు అనే దంపతులు వుండేవాళ్లు. నాబాలు ధనవంతుడు. కాని వట్టి మూర్ఖుడు, మొరటువాడు. అతని భార్య అబీగాయిలు తెలివైనది, యోగ్యురాలు. దావీదు ప్రవాసంలో వుండి ఆకటి వలన బాధపడుతూ నాబాలు నొద్దకు సేవకులను పంపి తనకు కొన్ని ఆహారపదార్థాలు ఈయవలసిందిగా కోరాడు. కాని మూర్ఖుడైన నాబాలు దావీదు సేవలకులను అవమానించి పంపాడు. దావీదు నాబాలుని చంపడానికి

బయలుదేరాడు. ఈ సంగతి పసికట్టిన అబీగాయిలు వలసినన్ని భోజనపదార్థాలు సిద్ధం చేసికొని వెళ్లి త్రోవలో దావీదుని కలసికొని అతని కోపాన్ని చల్లార్చింది. భర్త ప్రాణాలు కాపాడింది. -1 సమూ 25. ఈ యబీగాయిలు తన భర్త మూర్ఖుడయినా అతన్నంగీకరించి, గాఢంగా ప్రేమించింది. సంసార జీవితంలో ఈలాంటి ప్రేమ అవసరం. లేకపోతే భార్యాభర్తలకు పొందిక యేర్పడదు. కుటుంబం కొనసాగదు.

ఎల్కానా అనే అతనికి అన్నా పెనిన్నా అని యిద్దరు భార్యలు. పెనిన్నాకు సంతానం కలిగింది గాని అన్నా గొడ్రాలుగా వుండిపోయింది. సవతికి బిడ్డలు కలిగి తనకు కలగక పోవడం చూచి అన్నా దేవాలయానికి వెళ్లి బోరున ఏడుస్తూ కూర్చుంది. అన్నపానీయాలు కూడ మానివేసింది. అప్పుడు ఎల్కానా "అన్నా! ఈ యేడ్పు ఈ దిగులు దేనికి? నీవు అన్నం మానివేయడం దేనికి? నేను నీకు పదిమంది కుమారుల పెట్టు కాదా." అని భార్యను ఓదార్చాడు -1సమూ 1,8. పదిమంది కుమారులు కలిగిందానికంటె గూడ భర్తను ఒక్కణ్ణి చూచుకొని అన్నా అమితానందం చెందేదిట. అనగా అతని మీద అంత గాఢప్రేమ వుండేదని భావం. భార్యాభర్తల మధ్య వుండవలసిన పవిత్ర ప్రేమ ఈలాంటిది. క్రైస్తవ కుటుంబాల్లో దంపతులు ఈలాంటి ప్రేమను పెంపొందించుకొంటుండాలి.

## 2. మన్నింపు

హోషేయ ప్రవక్త. అతని భార్య గోమెరు. వాళ్లకు ముగ్గురు పిల్లలు పుట్టారు. హోషేయ గోమెరును గాఢంగా ప్రేమించాడు. కాని చంచలబుద్ధి గల గోమెరుకు మాత్రం అతని మీద మనసు కుదరలేదు. ఆమె వ్యభిచారిణియై భర్తను విడిచిపెట్టి వెళ్లిపోయింది. కొంత కాలమయ్యాక గోమెరు బుద్ధితెచ్చుకొని మళ్లా హోషేయ వద్దకు తిరిగివచ్చింది. తన్ను స్వీకరింపమని బతిమాలింది. హోషేయ కరుణతో ఆమెను మళ్లా చేపట్టాడు. మొదట అతని అభిమానం అడ్డుతగిలినా ఆ ప్రవక్త హృదయములోని గాఢప్రేమ భార్య ద్రోహాన్ని క్షమించేలా చేసింది.

గోమెరు భర్తను పరిత్యజించి నట్లే యిస్రాయేలు ప్రజలు కూడ యావేను విడనాడి అన్య దేవతలను కొలుస్తున్నారు. ఇది ప్రభువుకి బాధ కలిగించింది. ఐనా ప్రభువు కరుణతో యిస్రాయేలు తప్పిదాలను క్షమించాడు. ఆ ప్రజల విగ్రహారాధనను గోమెరు వ్యభిచారంతో పోల్చి చెప్పాడు ప్రభువు. హోషేయ ప్రవచన గ్రంథంలోని ముఖ్యాంశం ఇదే. ఈలా ఆ ప్రవక్త తన గ్రంథంద్వారా మాత్రమే గాక తన జీవితంద్వారా కూడ ప్రేమ తత్వాన్నీ క్షమాధర్మాన్నీ బోధించాడు.

క్రైస్తవ దంపతుల మధ్య తరచుగా తగాదాలు మనస్పర్థలు వస్తుంటాయి. ఐనా మన అపరాధాలు గోమెరు అపరాధమంత ఘోరమైనవి కానే కావు. కనుక క్రైస్తవ దంపతులు ఒకరినొకరు సులభంగా క్షమించుకొంటుండాలి. విపరీతమైన అభిమానము, నామాటే నెగ్గాలి అనే పట్టుదలా వుంటే కుటుంబాలు నడవ్వు.

# 3. సంతానం

## 1. సంతాన వాంఛ

ఇప్పటి మన నాగరికత ప్రకారం ముగ్గురు బిడ్డలు చాలులే అనికొంటూంటాం. కొందరు ఒక బిడ్డతోనే సరిపెట్టు కొంటూంటారు. అసలు పిల్లలే వద్దు అనుకొనే తల్లిదండ్రులు కూడ లేకపోలేదు. కాని ప్రాచీన కాలంలో ఈలాంటి భావాలు వుండేవి కావు. అన్ని ప్రాచీన జాతులూ సంతానాన్ని కోరుకొన్నాయి. హిందూ దేశీయులూ, చైనా దేశీయులూ, ఐగుప్తీయులూ, యిస్రాయేలీయులూ సంతానాన్ని మక్కువతో వాంఛించారు. విశేషంగా హీబ్రూ ప్రజలు సంతానాన్ని దేవుని దీవెన గాను నిస్సంతానాన్ని దేవుని శాపంగాను ఎంచారు.

దేవుడు అబ్రాహాముతో "నీ సంతానం ఆకాశంలోని చుక్కల్లాగ సముద్ర తీరంలోని యిసుక రేణువుల్లాగ అసంఖ్యాకంగా వృద్ధి చెందుతుంది" అని వాగ్దానం చేసాడు - ఆది 22,17. రిబ్కాను సేవకుని వెంట అబ్రాహాము ఇంటికి పంపుతూ ఆమె తోబుట్టువులు "తల్లీ! నీవు మా సోదరివి. నీకడుపు పండి గంపెడు పిల్లలను కందువుగాక" అని దీవించారు - ఆది 24,60. కీర్తనకారుడు "నీ లోగిట నీ భార్య ఫలించిన ద్రాక్షలతలా వుంటుంది. భోజనపు బల్ల చుట్టు నీ పిల్లలు ఓలివు పిలకల్లా కనబడతారు" అంటాడు - 128,3-4. హీబ్రూ ప్రజలకు సంతానం మీద గల గౌరవం ఈలాంటిది.

ఇక, సంతానం లేకపోవడం దైవ శాపానికి నిదర్శనం. అందుకే గొడ్రాలైన రాహేలు "నీవు నాకు పిల్లలను పుట్టిస్తావా లేక ఏ గొయ్యో నుయ్యో చూచుకొని నన్ను చావమంటావా?" అని యాకోబును పీడించింది-ఆది 30,2. సారను చెరపట్టినందుకు శిక్షగా దేవుడు అబీమెలకు కుటుంబంలోని ప్రతి స్త్రీని గొడ్రాలినిగా చేసాడు - ఆది 20,18.

యిస్రాయేలీయులు సంతానాన్ని పరమ పవిత్రంగాను దేవుడిచ్చే దీవెనగాను భావించారు అనిచెప్పాం. కనుకనే క్రీస్తు కూడ చిన్నబిడ్డల పట్ల ఎంతో ఆదరం చూపాడు. ఓమారు కొందరు తల్లులు చిన్న బిడ్డలను తీసుకొని క్రీస్తు చెంతకురాగా శిష్యులు వాళ్లను కసిరికొట్టారు. కాని ప్రభువు శిష్యులను మందలించి ఆ తల్లులను తన దగ్గరకు చేరబిలిచాడు. ఆ బిడ్డల మీద చేతులు చాచి వాళ్లను దీవించాడు. బిడ్డలు తల్లిదండ్రుల మీద ఆధారపడి

జీవించినట్లే శిష్యులు కూడ దేవుని మీద ఆధారపడి జీవించాలని బోధించాడు- మార్కు 10,13-16.

ఇది బైబులు సంస్కృతి. ఈ దృక్పథంతోనే క్రైస్తవ తల్లిదండ్రులు కూడ బిడ్డలను గాఢంగా వాంఛించాలి. దేవుడు తమకు ప్రసాదించిన బిడ్డలను ఆదరంతో అంగీకరించాలి. వాళ్లను ఎంతో విలువతో చూచుకొని ఆప్యాయంగా పెంచిపెద్దచేయాలి.

## 2. సంతానం దైవవరం

ఆదాము ఏవను కూడాడు. ఆమె గర్భవతియై బిడ్డను కని "దేవుని తోడ్పాటుతో నేను మగబిడ్డను ప్రసవించాను" అని అనుకొంది - ఆది 4,1. ఆ బిడ్డ ఆమెకు భర్త వలనా పుట్టాడు, దైవానుగ్రహం వలనా పుట్టాడు. నరుల్లో ప్రధానమైంది ప్రాణం. అదే ఆత్మ. దేవుడే ఈ ప్రాణాన్ని నరుల్లో ప్రవేశ పెడుతూంటాడు - ఆది 6,3. భార్యాభర్తలు కలుసుకొన్నాక భార్య గర్భంలో ఏర్పడే పిండంలోకి ప్రభువు తన ప్రాణాన్ని ప్రవేశపెడతాడు. తర్వాత ఆపిండమే మనుష్య శిశువుగా జన్మిస్తుంది. ఈ విధంగా ప్రభువు తల్లిదండ్రుల ద్వారా బిడ్డలను కలిగిస్తుంటాడు. భూమి మీద మనుష్య ప్రాణులను కొనసాగిస్తూంటాడు. దేవుడు తల్లిదండ్రులకిచ్చే వరం బిడ్డలు.

బైబుల్లో ఎంతోమంది తల్లిదండ్రులు బిడ్డలు లేక బాధపడిపోతారు. ప్రభువు వాళ్ళ వేడికోలు ఆలకించి ఓ పుత్రుణ్ణి ప్రసాదిస్తానని వాగ్దానం చేస్తాడు. ఆ ప్రమాణం ప్రకారం తర్వాత బిడ్డడు పుడతాడు. తల్లిదండ్రులు కూడ అలా పుట్టిన బిడ్డణ్ణి దేవుని వరంగా భావిస్తారు. దేవుని వాగ్దానం ప్రకారం అబ్రాహాము సారాలకు ఈసాకు పుట్టాడు - ఆది 17,15-21. మనోవా దంపతులకు సంసోను జన్మించాడు - న్యాయాధి 13,2 5. ఎల్కానా అన్నాలకు సమూవేలు ఉద్భవించాడు- 1సమూ 1,9-20. ఈ యీసాకు సంసోను, సమూవేలు లాంటి అసంఖ్యాక శిశువులందరు తల్లిదండ్రులకు భగవంతుడు అనుగ్రహించిన వరాలే.

139వ కీర్తన వ్రాసిన భక్తుడు తాను శిశువుగా తల్లి గర్భంలో దాగివున్న కాలాన్ని తలంచుకొని విస్తుపోయాడు :

"నా యెముకలన్నీ నేర్పుతో అమర్చి
మాతృగర్భంలో నన్ను పొందుపరచింది నీవే
నన్నెంత విచిత్రంగా, భయంకరంగా, సృజించావు
నీ లీల లెంత ఆశ్చర్యకరమైనవి :
కావున ప్రభో! నీనే నిన్ను సన్నుతిస్తాను"

అని వాకొన్నాడు - 139, 13-14. తల్లిదండ్రులకు తమ పిల్లల పట్ల ప్రేమ, గౌరవం ఆశ్చర్యభావం కలగాలి. వాళ్ళను దేవుని వరాలుగా భావించాలి.

సువిశేషంలో ఓ కథ విన్పిస్తుంది. యాయీరు కొమార్తె చనిపోయింది. ఆ బాలికకు పండ్రెండేండ్లు. తల్లిదండ్రులు ఆ బిడ్డను తలంచుకొని శోకిస్తున్నారు. ప్రభువు ఆ బాలిక చేయిపట్టి పైకి లేవమనగా ఆ బిడ్డ మరల జీవంతో లేచింది - మార్కు 5, 41-42. ప్రభువు అనుగ్రహం వల్లనే ఆ బిడ్డ మరల మేల్కొంది. పైకి లేచింది, అడుగులు వేసింది, అన్నం తింది. అలా బ్రతికిన కొమార్తెను చూచి యాయీరు అతని భార్య ఎంతో సంతోషించి వుండాలి. క్రైస్తవ దంపతులు ప్రేమతో ఒకరినొకరు కలసికొన్నపుడు, అనురాగ భావంతో వాళ్ళ శరీరాలు ఐక్యమైనపుడు, ఆ ప్రేమను దీవించేది ప్రభువే. అలా దీవించి దాంపత్య ప్రేమను సంతానంగా మార్చేది కూడ ఆయనే క్రీస్తు స్వర్గంలోను, శ్రీసభలోను, దివ్య సత్ప్రసాద మందసంలోను మాత్రమే వుండేవాడు కాదు. క్రైస్తవ కుటుంబంలో కూడ నెలకొని వుండేవాడు. దంపతుల ప్రేమను తన ప్రేమతో మిళితం చేసి వాళ్ళకు బిడ్డలను ప్రసాదించేవాడు. ఎందుకంటే వాళ్ళు క్రీస్తు నందు వివాహం చేసికొన్న సతీపతులు. కనుక క్రైస్తవ దంపతులు ఆ తొలితల్లి ఏవలాగే దేవుడు తమ కిచ్చిన బిడ్డల కొరకు అతనికి కృతజ్ఞత తెలియజేయాలి.

### 3. పిల్లలను నడిపింపవలసిన తీరు

అబ్రాహాము స్వదేశమైన పదనారామును వీడి కనాను మండలానికి వచ్చాడు. అచ్చట అతనికి ఈసాకు జన్మించాడు. అతడు తన కుమారునికి కనానీయుల పిల్లను పెండ్లి చేయదలచుకోలేదు. కనానీయులు కొలిచే దేవుడు వేరు. వాళ్ళ పిల్లను పెండ్లి చేసికొంటే ఈసాకు తన తండ్రి దేవుడైన యావే ప్రభువుని పూజింపలేడు. కనుక తన కుటుంబం నుండే ఈసాకునకు వధువును తీసికొని రావటానికై అబ్రాహాము సేవకుని పదనారాముకు పంపాడు. ఆ సేవకుడు త్రోవ వెదక్కుంటూ దైవవశాత్తు రిబ్కా యింటికే వెళ్ళాడు. రిబ్కా ఈసాకుని పెండ్లియాడ్డానికి ఇష్టపూర్తిగా సమ్మతించింది. తల్లిదండ్రులు కూడా ఆమెకు అడ్డు చెప్పలేదు. తర్వాత సేవకుడు రిబ్కాను కానాను మండలానికి తీసికొని రాగా ఈసాకు ఆమెను పెండ్లి యాడాడు - ఆది 24. ఈవిధంగా తల్లిదండ్రులు పిల్లలను మంచిమార్గంలో నడిపిస్తుండాలి. పిల్లల స్వేచ్ఛకు అడ్డుపడకుండా వాళ్ళకు హితోపదేశం చేస్తుండాలి. వాళ్ళను ఓ యింటివాళ్ళను చేయాలి.

## 4. కుటుంబ ధర్మాలు

### 1. దైవ కుటుంబం

యిస్రాయేలు ప్రజలకు కుటుంబ జీవితం పరమ పవిత్రమైనది. కుటుంబమంతా కలసి ప్రభువుని ఆరాధించుకొనేది. కుటుంబంలోని పెద్దలు పిల్లలకు తమ పూర్వ

సంప్రదాయాలు బోధించేవాళ్లు. ప్రభువు మోషే నాయకత్వాన తమ పితరులను ఐగుప్తు నుండి ఏలా తరలించుకొని వచ్చాడో తెలియజెప్పేవాళ్లు. ఈ పిల్లలు మళ్ళా తమ పిల్లలకు గూడ ఈ యంశాలు బోధించేవాళ్లు. యూదుల కుటుంబ జీవితం మఠజీవితం లాంటిది. భక్తిశ్రద్ధలతో కూడింది. ప్రవక్త యిర్మీయా "యిస్రాయేలు కుటుంబాలన్నిటికీ ప్రభువు దేవుడు. వాళ్ళంతా అతని ప్రజలు" అని వాకొన్నాడు - 31,1. ఈ భావాన్ని మనసులో పెట్టుకొనే నూత్నవేద రచయితలు క్రైస్తవ ప్రజను "దైవ కుటుంబం" అని పేర్కొన్నారు - 1 పేత్రు 4,17. అంటే క్రైస్తవులమైన మనం దేవునికి చెందిన ప్రజలం, భక్తి భావంతో అతన్ని పూజించే ప్రజలం అని భావం. మనకు తల్లీ దండ్రీ నాథుడూ సర్వస్వమూ ఆ ప్రభువేనని అర్థం. నేటి క్రైస్తవులకు భగవంతుని పట్ల ఈలాంటి భక్తి భావాలు లోపించడం శోచనీయం.

## 2. తల్లీ తండ్రీ పిల్లలూ

పౌలు ఆనాటి క్రైస్తవులకు కుటుంబ ధర్మాలు కొన్ని గుర్తుచేసాడు. కుటుంబంలో తల్లీ తండ్రీ బిడ్డలూ ప్రధానవ్యక్తులు.

కుటుంబానికి యజమానుడూ దాన్ని పోషించేవాడూ తండ్రి. ప్రతి తండ్రీ పరలోకం లోని తండ్రికి పోలికగా వుంటాడు - ఎఫె 3,15. క్రీస్తు శ్రీసభను ప్రేమించినట్లే అతడూ తన భార్యను ప్రేమించాలి - ఎఫే 5,25. పిల్లలను చక్కగా పెంచాలి. వాళ్ళకు శిక్షణ గరపి ప్రభువును గూర్చి బోధించాలి - 6,4. అతనికెవరైనా సేవకులుంటే తనకూ ఆ పనివాళ్ళకూ గూడా ఒకే యజమానుడున్నాడని గుర్తించి వాళ్ళ పట్ల దయతో ప్రవర్తించాలి - 6,9.

తండ్రి తరువాత కుటుంబంలో ప్రముఖ వ్యక్తి తల్లి. శ్రీసభ క్రీస్తుకిలాగే తానూ భర్త అధికారానికి లొంగివుండాలి - 5,24. ఆమెకు సంతానం ముఖ్యమే. కాని సంతానం కంటె గూడ అధికంగా భర్త ముఖ్యం. స్త్రీకి బిడ్డలకంటె కూడా ప్రముఖమైంది, భర్తతో గూడి ప్రేమభావంతో జీవించగల్గడం - 1కొ 11,8. కుటుంబ జీవితంలో పిల్లల కంటె ముందు వచ్చేవాళ్లు భార్యాభర్తలు గదా! ఐనా ఆమె పిల్లలను గూడ అనురాగంతో పెంచగలిగి వుండాలి.

కడపట పిల్లలు. పిల్లల పుట్టువు తల్లిదండ్రుల నుండి గదా! కనుక వాళ్లు తల్లిదండ్రులకు విధేయులై యుండాలి - ఎఫె 6,1-3. తల్లిదండ్రుల నుండి వేదవిద్యను నేర్చివుండాలి - 6,4. ఆ తల్లిదండ్రుల్లో దేవుణ్ణి చూడగలిగి వుండాలి. అమ్మా నాన్నా వృద్ధులై నిస్సహాయస్థితిలో వున్నపుడు వాళ్ళను పోషించాలి - 1తిమొ 5,4.

కుటుంబ సభ్యులు పౌలు పేర్కొన్న ఈ ధర్మాలను భక్తిభావంతో మననం చేసికొంటే సంసారపు బెడదలను కొంతవరకైనా తొలగించుకోవచ్చు.

## 3. కుటుంబ సభ్యులు

ఎలీమెలెకు బేత్లెహేము వాసి. అతడు కరవు కారణంగా తన భార్యయైన నవోమిని తీసికొని మోవాబు దేశానికి వలస పోయాడు. అక్కడ వాళ్లకు మహ్లోను కిల్యోను అనే కుమారులు కలిగారు. వాళ్లిద్దరూ రూతు, ఓర్పా అనే మోవాబు ఆడపడుచులను పెండ్లి చేసికొన్నారు. అటుతరువాత తండ్రీ కొడుకులు చనిపోయారు. అత్తాకోడళ్లు మాత్రం అక్కడే మిగిలిపోయారు. అప్పుడు నవోమి జన్మదేశమైన బేత్లెహేము మండలానికి తిరిగి వెళ్లిపోవాలనుకుంది. కోడళ్లు గూడ ఆమెతో తిరిగి రాగోరారు. అత్త ప్రోద్బలంపై చిన్న కోడలైన ఓర్పా మోవాబు దేశంలోనే ఆగిపోయింది. అక్కడ మరెవ్వరినో పెండ్లి చేసికొంది. కాని పెద్ద కోడలైన రూతు మాత్రం అత్త వద్దన్నా వినకుండా ఆమె వెంట బేత్లెహేముకు తిరిగివచ్చింది. రూతుకు నవోమి అంటే పరమ గౌరవం. నవోమికి గూడ రూతంటె అమిత ప్రేమ. నవోమి రూతును బేత్లెహేము వాసీ తన దగ్గరి బంధువూ ఐన బోవసుకిచ్చి పెండ్లి చేసింది. వాళ్ళకు కలిగిన బిడ్డణ్ణి తాను దత్తు తీసికొంది. ఈలా కుటుంబ సభ్యులందరినీ ప్రేమ భావంతో అలరించిన అమృతమూర్తి నవోమి. ఆమెను చూచి క్రైస్తవ కుటుంబసభ్యులు కూడ ఒకరి పట్ల ఒకరు ఒద్దికగా మెలగుతూ అనురాగంతో ప్రవర్తించడం నేర్చుకోవాలి.

## 4. అత్తాకోడళ్లు

నవోమి కోడళ్ళను సొంత కూతుళ్ళను లాగ చూచుకొంది. కొడుకులు చనిపోగానే ఆ కోడళ్లు మరలా పెండ్లి చేసికొని సుఖించాలనే ఆమె కోరిక. కోడళ్ళ తరపున కోడళ్లు గూడ ఆమెను సొంత తల్లిలాగే చూచుకొనేవాళ్లు. ఆమె కోడళ్లు మోవాబు దేశంలోనే వుండిపోవాలనీ తన వెంట బేత్లెహేముకు తిరిగి రాకూడదనీ చెప్పగా రూతు "నన్ను నీవెంట రావద్దని వారించవద్దు. నీవు పోయేకాడికే నేనూ వస్తాను. నీవు వుండే కాడే నేనూ వుంటాను. నీ బంధువులే నా బంధువు లౌతారు. నీ దేవుడే నా దేవు డౌతాడు. నీవు చనిపోయే కాడే నేనూ చనిపోతాను. నిన్ను పాతిపెట్టినకాడే నన్నూ పాతిపెడతారు" అంది-రూతు 1,16-17. ఇవి పూర్వవేదంలోని అతి ప్రశస్త వాక్యాలకు చెందినవి. నవోమి రూతు ఆదర్శవతులైన అత్తా కోడళ్లు. ఈ యాదర్శ మహిళలను చూచి చీటికిమాటికి కీచులాడుకొనే మన కుటుంబాల్లోని అత్తాకోడళ్లు పాఠం నేర్చుకోవాలి.

## 5. ఆతిథ్యం

అబ్రాహాము తన కుమారునికి వధువును తీసికొని రావడానికై ఎలియసేరు అనే సేవకుని పంపాడు. అతడు ఒంటెలతో వెళ్ళి సాయంసమయాన నాహోరు పట్టణాన్ని

చేరుకొన్నాడు. అప్పుడే అబ్రాహాముని తమ్ముడగు నాహోరుని మనుమరాలును బెతూవేలు పుత్రికయునగు రిబ్కా కడవ చంకన బెట్టుకొని బావికి నీళ్ళకు వచ్చింది. సేవకుడు అడిగిందే తడవుగా ఆ యమ్మాయి అతనికి దాహం తీర్చుకోవడానికి నీళ్ళిచ్చింది. అతని ఒంటెలకు గూడ నీళ్లు తోడిపోసింది. అటుతరువాత ఆ బాలిక యన్నయైన లాబాను వచ్చి యెలియసేరుని ఇంటికి తీసికొనిపోయాడు. అతనికి చక్కని ఆతిథ్యమిచ్చాడు. ఎలియసేరు యజమానుని బంధువుల యిల్లు చేరుకొన్నందుకు ఎంతో సంతోషించాడు. అబ్రాహాము తమ్ముని మనుమరాలైన రిబ్కాను ఈసాకునకు వధువుగా కుదుర్చుకొన్నాడు - ఆది 24.

కనాను మండలంలో వున్నపుడు అబ్రాహాము మమ్రే అనే తావులో సిందూరవనంలో వసిస్తూన్నాడు. ఒకనాడు ఎండకాసే వేళ అబ్రాహాము గుడారం చెంత కూర్చొని వుండగా అకస్మాత్తుగా ముగ్గురు నరులు దాపులో కనిపించారు. వెంటనే అబ్రాహాము వారిని ఆహ్వానించి ఆతిథ్యమిచ్చాడు. అప్పుడే కాల్చిన రొట్టెలతో, దూడమాంసంతో, పాలుపెరుగుతో వారికి భోజనం పెట్టాడు. వాళ్లు భుజిస్తూండగా తాను వడ్డెన చేస్తూ వారి ప్రక్కన నిలబడ్డాడు. కడన ఆ వచ్చిన ముగ్గురు అతిథులు నరరూపంలో వున్న దేవదూతలు (లేక దేవుడు) అని తేలింది. వాళ్ళు అప్పటిదాక గొడ్రాలుగా వున్న సారాకు ఓ యేడాది లోనే బిడ్డడు పుడతాడని చెప్పి వెళ్ళిపోయారు - ఆది 18, 1-15.

ఇవి పూర్వవేదపు ఆతిథ్య ధర్మాలు. మన క్రైస్తవ కుటుంబాల్లో గూడ ఈ ధర్మాన్ని అత్యవసరంగా పాటించాలి. "నా శిష్యుల్లో అత్యల్పులైనవాళ్ళకి మీరు మేలుచేసినప్పుడు ఆ మేలును నాకు చేసినట్లె భావిస్తాను" అన్న ప్రభువాక్యం కూడ వుంది- మత్త 25,40. కుటుంబ సభ్యులు మొదట ఒకరినొకరు ప్రేమాదరాలతో చూచుకోవాలి. అటుపిమ్మట తమ యింటికి వచ్చిన పరాయివాళ్ళను కూడ గౌరవమర్యాదలతో చూడాలి. మంచివాళ్ళు ఈ ప్రపంచంలోని జనులంతా తమ కుటుంబానికి చెందినవాళ్లేనని భావిస్తూంటారు.

## 6. దేవుని మీద నమ్మిక

స్త్రీ పురుషులను సృజించి వారికి వివాహ బంధాన్ని కలిగించిన దేవుడే వారి కుటుంబ జీవితానికి గూడ కర్త. జీవితంలోని కష్టసుఖాల్లో ఆ ప్రభువుని నమ్మి అతని మరుగు చొచ్చిన వాళ్ళను అతడు తప్పకుండా ఆదుకొంటాడు. తోబీతు కథే దీనికి తార్కాణం. తోబీతు గలిలయలోని యూద భక్తుడు. అతని భార్య పేరు అన్న. కుమారుని పేరు తోబియా. అస్సిరియా రాజులు పాలస్తీనా దేశాన్ని జయించి యూదులను చెరగొనిపోయారు. అలా బందీలుగా వెళ్ళినవాళ్ళల్లో తొబీతు కుటుంబం కూడ ఒకటి. అతడు ప్రవాసిగా నీనివే పట్టణంలో వసిస్తూ చాల బాధలు అనుభవించాడు. కంటిచూపు కూడ పోయింది. ఇక పని చేయలేకపోయాడు. అన్నా కూలినాలి చేసి కుటుంబాన్ని పోషిస్తూండేది. రాగేసు

పట్టణంలో గబాయేలు అనే మిత్రుడు తోబీతుకు కొంతసొమ్ము బాకీపడి వున్నాడు. వెళ్ళి ఆ సొమ్ము తీసికొని రమ్మని అతడు కుమారుణ్ణి పంపాడు. ముక్కూ మొగమూ తెలియని రఫాయేలనే వ్యక్తి తోబియాకు త్రోవచూపరిగా కుదిరాడు. అతడు దేవదూతని తోబియాకు తర్వాత తెలిసింది. ఈ ప్రయాణంలో తోబియా ఓ మడుగులో చేపను పట్టి దాని గుండెను తీసాడు. అది తర్వాత తండ్రి గ్రుడ్డితనాన్ని పోగొట్టడానికి ఔషధంగా ఉపకరించింది. ఇంకా అతడు ఎక్బటానా అనే నగరంలో సార అనే యువతిని పెండ్లి చేసికొన్నాడు. కుమారుడు వెళ్ళి చాలా రోజుల వరకు తిరిగి రాకపోయే సరికి ఇంటి దగ్గర ముసలి తల్లి దండ్రులు అతని క్షేమాన్ని గూర్చి ఆందోళనం చెందారు. ఇంతలో బాకీ సొమ్ముతో భార్యతో సురక్షితంగా తిరిగి వచ్చిన కుమారుణ్ణి చూచి తోబీతుఅన్నాలు ఎంతో సంతోషించారు. ప్రభువుకి వందనాలు అర్పించారు. దేవుణ్ణి నమ్ముకొన్న భక్తుల్ని ప్రభువు తప్పక ఆదరిస్తాడనే సత్యాన్ని ఈ తోబీతు కథ చాటి చెప్తుంది.

కుటుంబ జీవితంలో బోలెడన్ని ఇక్కట్లు వస్తూంటాయి. ఒకోమారు సంసారం గడవదు, పస్తులుండవలసి వస్తుంది. దైవ సహాయం కూడ మన మనుకొన్నంత త్వరలో లభించదు- పై తోబీతు కథలో లాగ. అలాంటప్పుడు దేవునియందు నమ్మికా ఓపికా వుండాలి. ఆ ప్రభువు తను నమ్మిన భక్తులను చేయి విడిచేవాడు కాదు. కనుకనే కీర్తనకారుడు "కొందరు రథాలనూ గుర్రాలనూ నమ్ముకొన్నారు. మేమైతే ప్రభువుని నమ్ముకొన్నాం అన్నాడు- 20,7. రథబలాన్ని నమ్మిన ఐగుప్తీయులు సముద్రంలో మునిగిపోయారు. ప్రభువుని నమ్మిన యిస్రాయేలీయులు ఒడ్డు చేరుకొన్నారు.

## 7. భగవంతుని మీద నిష్ఠ

బైబులు భక్తులు ప్రప్రధానంగా భగవంతుని మీద నిష్ఠ చూపినవాళ్లు. అబ్రాహాముకి లేకలేక ముసలి ప్రాయంలో ఈసాకు పుట్టాడు. అతడు ఆ బాలుణ్ణి అల్లారుముద్దుగా పెంచుకొంటున్నాడు. కాని ప్రభువుకి అబ్రాహాముని పరీక్షించాలనే బుద్ధి పుట్టింది. కనుక అతని యేకైక కుమారుణ్ణి మోరీయా కొండ మీద తనకు బలిగా అర్పించమని అడిగాడు. అప్పుడు అబ్రాహాము హృదయంలో ఏలాంటి తుఫాను చెలరేగి వుండాలి? ఆ ముసలి ప్రాయంలో ఆ కుమారుడు గతిస్తే ఇక మళ్లా తనకు బిడ్డడు పుడతాడు అనే నమ్మకం లేదు. మరి యిప్పుడు అతన్ని కోల్పోతే జీవితంలో ఇక తనకు మిగిలేదేమిటి? తాను కొలిచే దేవుడు అంత రాతిగుండె గలవాడా? అతన్ని నమ్మి తన సొంత దేశాన్ని కూడా వదలి ఈ దిక్కుమాలిన కనాను గడ్డకు వచ్చి తాను పాముకొందేమిటి? ఈలాంటి నిరాశా భావాలెన్నో యెదలో మెదలి వుండాలి. ఐనా అబ్రాహాము మహాభక్తుడు. అనన్యచిత్తంతో యావేనే సేవించేవాడు. కనుక పిల్లవాణ్ణి బలి ఈయడానికి మోరీయా

కొండకు బయలుదేరాడు. దారిలో బుడతడు "నాన్నా! మనం నిప్పు కట్టెలూ తీసుకొని వెళ్తున్నాం గాని బలి ఈయడానికి గొర్రెపిల్ల యేదీ?' అని అడిగాడు. ఆ మాటలకు ఆ తండ్రి గుండెలు తరుగుకొనిపోయి వుండాలి. సరే, అబ్రాహాము కొండమీద కట్టెలు పేర్చి కుమారుణ్ణి బంధించి బలిగా సమర్పించడానికి సిద్ధమయ్యాడు. ఆ భక్తుడు కత్తి పైకెత్తగానే దేవదూత అతని చేయిపట్టుకొని "ఓయి! చిన్నవానిని చంపద్దు. నీవు నీ యేకైక కుమారుణ్ణి నాకు బలియీయడానికి వెనుకాడలేదు. దీనిని బట్టి నీవు దైవభీతి కలవాడవని రుజువయింది" - అన్నాడు - ఆది 22. ఈ యబ్రాహాము ఎంత చిత్తశుద్ధి కలవాడై యుండాలి !

క్రైస్తవ భక్తునికి అత్యవసరంగా కావలసింది ఈ భగద్భక్తే. హృదయాన్ని ఆ ప్రభువుకి అర్పించుకొని అతన్ని నమ్మి జీవించేవాడు మహానుభావుడు గదా! ఆ ప్రభువే తల్లీ తండ్రీ అని నమ్మి అతని మీద భారం వేసి బ్రతికేవాడు యధార్థమైనభక్తుడు. ఓ కీర్తన కారుడు.

"ప్రభువు తల్లి పక్షిలా నిన్ను తన రెక్కలతో కప్పుతాడు
అతని రెక్కల క్రింద నీవు సురక్షితంగా వుండిపోతావు"

అన్నాడు-91,4. అలాగే మరో కీర్తనకారుడు.

"ప్రభువు నాకు దీపం వెలిగిస్తాడు
నా త్రోవలోని చీకటిని తొలగిస్తాడు"

అని పల్కాడు - 18,28. ఈలాంటి భావాలను అనుభవానికి తెచ్చుకొని క్రైస్తవ కుటుంబీకులు కష్టసుఖాల్లో కూడ ఆ భగవంతుని మీదనే ఆధారపడి జీవించాలి.

## 8. దేవునికి ఊడిగం

పూర్వనూత్న వేదాల సంధికాలంలో జీవించిన వృద్ధ దంపతులు జెకరియా యెలిసబేత్తులు. ఈ పుణ్య దంపతులు దేవుడిచ్చే బహుమానాల కోసంగాక దేవుడి కోసమే దేవుణ్ణి సేవించినవాళ్లు. వాళ్ళిద్దరూ దేవుని సృష్టిలో నీతిమంతులు. ఆయన ఆజ్ఞలను తూచ తప్పకుండ పాటించినవాళ్లు - లూకా 1,6. దేవుడు భక్తిమంతులను సంతానంతో దీవిస్తాడని పూర్వవేద ప్రజల నమ్మకం. ఐనా ఈ భార్యాభర్తలకు పిల్లలు లేరు. వాళ్ళిద్దరూ ఏళ్లు చెల్లిన వృద్ధులు. కనుక ఇక బిడ్డలు పుడతారనే ఆశకూడ లేదు. అలాంటి నిరాశాపరిస్థితుల్లో గూడ జెకరియా యెలిసబేత్తులు ప్రభువుని గాఢభక్తితో సేవించారు. వాళ్ల గొప్పతనమంతా ఈ నిస్స్వార్థ భక్తిలోనే వుంది. ఇక వుదార గుణంలో నరుడు భగవంతునికి తీసిపోయేవాడు కాదుగదా! కనుక ప్రభువు ఆ యాలుమగలకు ఓ బిడ్డడు పుడతాడని గబ్రియేలు దూత ద్వారా కబురు పంపాడు. ఆ బిడ్డడడే స్నాపక యోహాను - లూకా 1,12.

అసలు బిడ్డలు లేకపోయినా బాధే. బిడ్డలు అమితంగా వున్నా వాళ్ళను పోషించలేకా బాధే. పిల్లలు నిష్ప్రయోజకులైనా బాధే. ఈలాంటి కుటుంబపు గొడవలతో సతమతమై పోయేపుడు పై పుణ్యదంపతులు జెకరియా యెలిసబేత్తులు గుర్తుకి వస్తారు. ఈ యిద్దరు భగవంతుడు మన సేవలు అందుకోవడానికి యోగ్యుడని గుర్తించి అనన్యచిత్తంతో అతన్ని కొలిచారు. ఆ ప్రభువు మన కేవో బహుమతులు ఇస్తాడన్న పేరాసతో గాదు. అతనికోసమే అతన్ని సేవించారు. కాని తరచుగా మన భక్తిలో కొండంత స్వార్థం నిండి వుంటుంది. మనం దేవుని వద్దనుండి అవీయివీ కోరతాం. మన కోరికలు తీరకపోతే అతన్ని విడనాడతాం. దూషిస్తాం గూడ. "మ్రొక్కిన వరమీయని వేల్పుని గ్రక్కున విడువంగవలయు గదరా సుమతీ!" అన్నాడు ఓ తెలుగు కవి. ఈ మనస్తత్వం మనందరిలోను వుంటుంది. కాని ఇది పద్ధతి కాదు. నిస్వార్థ బుద్ధితో ఆ ప్రభువుకి ఊడిగం చేసేవాళ్ళని అతడు కరుణిస్తాడు. అలాంటివాళ్ళను అతడు పై జకరియా యెలిసబేత్తులను లాగ తలవని తలంపుగా దీవించి ఆశ్చర్యచకితులను చేస్తాడు.

## 9. ప్రార్థనం

రఫాయేలుతో ప్రయాణం కట్టిన తోబియా ఎక్బటానా నగరంలో తన బంధువైన రగూవేలు కూతురు సారాను పెండ్లి చేసికొన్నాడు. కాని ఓ పిశాచం సారాను పూని వుండేది. అంతకుముందే ఆమెను ఏడ్గురు వరులు పెండ్లియాడారు. వాళ్ళందరినీ ఆ దయ్యం చంపివేసింది. కనుక తోబియాకు కూడా అదే గతి పడుతుందేమోనని సారా బంధువులు బయపడ్డారు. పెండ్లి నాటి రేయి తోబియా సారా గదిలోకి వెళ్ళాడు. అతడక్కడ ఏమిచేయాలో రఫాయేలు ముందుగానే ఉపదేశమిచ్చాడు. అతని సలహా ప్రకారం తోబియా తాను పట్టిన చేప గుండెను కాల్చి పొగవేసాడు. ఆ పొగకు పిశాచం పారిపోయింది. అటుపిమ్మట తోబియా సారాను తన దగ్గరకి పిలిచి ఈలా ప్రార్థన చేసాడు: "ప్రభో! నీవు భూమ్యాకాశాలను సృజించావు. నీవు ఆదామును సృజించి అతనికి తోడుగా ఏవను ప్రసాదించావు. ఆ దంపతుల నుండే మానవ జాతి ఉద్భవించింది. ప్రభో! నీవు నరుడు ఒంటరిగా ఉండడం మంచిదికాదు అతనికి సాటియైన సహాయకురాలిని చేయాలి అని అనునకొన్నావు. కనుక నేడు నేను కామతృప్తి కోసం గాక చిత్తశుద్ధితో ఈమెను భార్యగా స్వీకరిస్తున్నాను. ఈమెనూ నన్నూ కరుణించు. ముసలి ప్రాయం వరకు మేమిద్దరం కలసి జీవించేలా చేయి." ఆ ప్రార్థనాంతంలో సారా ఆమెన్ అని జవాబు చెప్పింది. ఆ పిమ్మట తోబియా సారాను కూడాడు. ఆ దంపతులకు పిశాచ పీడ సోకలేదు. మరునాడు సజీవుడై యున్న తోబియాను చూచి సారా తల్లిదండ్రులు విస్తుపోయారు. దేవునికి వందనాలు అర్పించారు – తోబీతు 8.

ఇక్కడ ఈ నూత్న వధూవరులను కాపాడిన శక్తి యేమిటి? ఆ దంపతులు ప్రభువుని నమ్మారు. తమ్ము కాపాడమని ప్రభువుకి మనవి చేసారు. ఆ ప్రార్థనాబలమే పిశాచ పీడనుండి వాళ్ళను కాపాడింది. దైవబలమే లేకపోయినట్లయితే సారాను పెండ్లియాడిన ఆ మొదటి ఏడ్గురు వరులవలె తోబియాకూడ నశించేవాడే. కనుక దైవభక్తీ ప్రార్థనా ఆ దంపతులనూ వారి దాంపత్య ప్రేమనూ రక్షించింది. వారికి సంతానాన్ని కూడ ప్రసాదించింది.

స్త్రీ పురుషులను దాంపత్య జీవితంలో జతగూర్చే ప్రభువే వాళ్ళ కుటుంబాలను కూడ కాపాడుతూంటాడు అని చెప్పాం. సభ్యులంతా కూడి ప్రార్థన చేసే కుటుంబం కలసి మెలసి వుంటుంది. "ఎక్కడ నా పేరు మీదుగా ఇద్దరుముగ్గురు సమావేశమౌతుంటారో వాళ్ళ మధ్య నేనూ నెలకొనివుంటాను" అన్న ప్రభువాక్యం కూడా ఉంది-మత్త 18,20. కనుక గృహస్థులు రోజురోజు కుటుంబ ప్రార్థనం చేసికోవడానికి అలవాటు పడాలి. సంసారజీవితం గడిపేవాళ్ళకి కుటుంబజపం ఓ బలంమందులా పనిచేస్తుంది.

# 5. ప్రేషితులుగా గృహస్థులు

## 1. గృహాలే దేవాలయాలు

మొదటి శతాబ్దంలో క్రైస్తవమతం బాగా వ్యాప్తి చెందుతూ వచ్చింది. క్రీస్తు ఉత్థానమైనాకే అపోస్తులులూ శిష్యులూ ప్రభువుని గూర్చి బోధిస్తుండేవాళ్ళు. భక్తులు పశ్చాత్తాపపడి క్రీస్తుని అంగీకరించి జ్ఞానస్నానం పొందుతూండేవాళ్లు. పరిశుద్ధాత్మను స్వీకరిస్తూండేవాళ్లు. ఆ తొలిరోజుల్లో ఇంకా దేవాలయాలు అంటూ లేవు. ఆయా క్రైస్తవ గృహాల్లోనే భక్తులు ప్రోగౌతూండేవాళ్లు. అక్కడే పూజా ప్రార్థనలూ ఉపదేశాలూ జరుగుతూండేవి.

అక్విల అతని భార్య ప్రిస్కిల్ల క్రైస్తవ మతంలో చేరిన యూద దంపతులు. పౌలులాగే వీళ్లూ గుడారాల బట్టలు కుట్టుకొని బ్రతికేవాళ్లు. కనుక వీళ్లు పౌలుకి మంచి స్నేహితులయ్యారు. చాల కాలం పాటు అతడు ఈ పుణ్యదంపతుల యింట తలదాచుకొన్నాడు. ఓమారు ఏదో ఆపద రాగా ఆ భార్యాభర్తలు తమ ప్రాణాలు కూడ అర్పించి పౌలును కాపాడారట. ఆ రోజుల్లో కొరింతులో వున్న వీళ్ళ యిల్లు ఓ గుడిలాగ పనిచేసింది. భక్తులు వీళ్ళ యింటిలో సమావేశమై ప్రార్థనలు జరిపేవాళ్లు. వేద గ్రంథం చదివి వ్యాఖ్య చెప్పేవాళ్లు. పూజ చేయించేవాళ్లు. ఈ దంపతులను గూర్చి పౌలు తన జాబుల్లో చాలాసార్లు ప్రస్తావించాడు. "అక్విలా ప్రిస్కిల్లాయు వారి యింటిలో సమావేశమయ్యే

దైవ సమాజమూను మిమ్ము కుశలమడుగుతున్నారు" అని వ్రాసాడు- 1కొ 16,19, రోమా 16,3-5.

ఈ దంపతులు ఎఫెసు పట్టణంలో వసిస్తూండగా అపోల్లో అనే బోధకుడు వారి వూరికి వచ్చాడు. ఈ యపోల్లో అప్పుడే క్రైస్తవ మతంలో చేరినవాడు. క్రీస్తుని గూర్చి అంతగా తెలియనివాడు. కాని అతడు మహావక్త. పూర్వవేదం క్షుణ్ణంగా తెలిసినవాడు. అతడు ఎఫెసు క్రైస్తవ సమాజంలో క్రీస్తుని గూర్చి అనర్గళంగా బోధిస్తూండగా అక్విలా దంపతులు విన్నారు. వెంటనే వాళ్లు అపొల్లోను తన యింటికి ఆహ్వానించారు. అతనికి క్రీస్తుని గూర్చి యింకా లోతుగా బోధించారు. ఆబోధ అపోల్లోకు చాల లాభించింది. అతడు గ్రీసు దేశంలోని ఆయా పట్టణాల్లో బోధచేసి యేసే మెస్సీయా అని నిరూపించాడు. తన్ను ఎదిరించడానికి వచ్చిన యూదుల నోళ్లు మూయించాడు. ఈలా అపొల్లోను ప్రోత్సహించినవాళ్లు అక్విలా ప్రిస్కిల్లా - అచ 18,24-28. వీళ్లు సంసార జీవితం జీవించిన గృహస్థ ప్రజలు. కాని ఆ తొలిరోజుల్లో వాళ్లు శ్రీసభ వ్యాప్తికి తోడ్పడ్డారు. ప్రేషితులుగా పనిచేసారు. మతవ్యాప్తికై కృషిచేసారు.

నేడు ప్రొటెస్టెంటు సమాజాల్లో చాలమంది గృహస్థులు ప్రేషితులుగా, బైబులు బోధకులుగా పని చేస్తూంటారు. కాని మన క్యాతలిక్ సమాజంలో ఈ పద్ధతి అరుదు. మన సమాజంలో మత సేవంతా గురువులూ మఠకన్యలూ చేస్తూంటారు. గృహస్థులు ఈ కార్యానికి ముందుకు రారు. ఒకవేళ వచ్చినా వీళ్ళను ప్రోత్సహించేవాళ్లూ వుండరు. ఇది మన సమాజంలో వున్న ఓ పెద్ద లోపం. మన గృహస్థులు కూడ మతసేవ చేయాలి. క్రీస్తులోనికి జ్ఞానస్నానం పొందినవాళ్లంతా అతనిలాగే ప్రేషితులౌతారు. "నా తండ్రి నన్ను పంపినట్లే నేనూ మిమ్ము పంపుతున్నాను" అన్న యోహాను 20,22 వాక్యం గురువులకూ మఠకన్యలకూ మాత్రమే కాదు, సంసార జీవితం జీవించేవాళ్ళకు కూడ వర్తిస్తుంది. కనుక మన ప్రజలు కూడ ప్రేషితులుగా మెలగడం నేర్చుకోవాలి.

ఇంకా మన ప్రజలు ఆయా గృహాల్లో సమావేశమై ప్రార్థనలు జరుపుకోవడం గూడ నేర్చుకోవాలి. ఆయా సందర్భాల్లో ఒక వాడ లేక వీధిలోని వాళ్లంతా ఒక యింటిలో సమావేశమై వేదగ్రంథం చదువుకొని ప్రార్థనం చేసికొంటే ముచ్చటగా వుంటుంది. కొన్ని ప్రాంతాల్లో మన జనానికి కుటుంబ జపమాల చెప్పుకొనే అలవాటుంది. ఇది మంచి పద్ధతి. కాని ఇది చాలదు. దీనితో పాటు కుటుంబ బైబులు సమావేశాలు కూడ జరుపుకొని ప్రార్థనలు చేసికోవాలి. కుటుంబ భక్తిని పెంపొందించుకోవడానికి ఇది వో వుత్తమ మార్గం.

## 2. బాలలకు మతవిద్య.

చిన్న పిల్లలకు మతాంశాలూ బైబులూ ఏలా బోధించాలి అన్న అంశంపై నేడు ఎన్నో చర్చలు జరుగుతూన్నాయి. ఏదియేమైనా, పిల్లలకు మొదటి ఉపాధ్యాయులు

తల్లిదండ్రులే. తల్లిదండ్రుల నుండి మతసత్యాలు నేర్చుకొని దైవభక్తి అలవర్చుకొన్న బాలలు భావి జీవితంలో తప్పక బాగుపడతారు. తిమొతి వృత్తాంతమే ఇందుకు సాక్ష్యం.

తిమొతి తల్లి యూనికే. అమ్మమ్మ లోయి. తండ్రి గ్రీకు మతస్థుడు. యూదుల ఆచారం ప్రకారం చిన్ననాడే జరగవలసిన సున్నతి అతనికి జరుగనే లేదు. ఐనా యూనికే చాల భక్తిమంతురాలు. ఆమె పిల్లవానిచేత చిన్ననాటి నుండే హీబ్రూ పూర్వవేదం చదివించింది. ఆ బాలుడు అమ్మమ్మ లోయి వొడిలో కూర్చుండి పూర్వవేదం చదువుకొని వుంటాడు. పౌలు ఈ కుటుంబానికి ఆప్తమిత్రుడు. కనుక తిమొతి సహజంగానే తర్వాత పౌలుకి శిష్యుడయ్యాడు. పౌలు తాను చనిపోవడానికి కొన్నాళ్లకు ముందు వ్రాసిన రెండవ తిమొతి జాబులో ఆ శిష్యుని బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకొన్నాడు. "మీ యమ్మమ్మ లోయి, మీ యమ్మ యూనికే విశ్వాసవతులు. వాళ్ల విశ్వాసమే నీకూ సంక్రమించింది" అని అతన్ని భూషించాడు-1,5. తిమెతికి గల బైబులు జ్ఞానాన్ని ప్రస్తావిస్తూ "నీవు చక్కగా నేర్చుకొని గాఢంగా విశ్వసించిన వేదగ్రంథసూత్రాల ప్రకారం నడుస్తూండు. ఆ గ్రంథాలు నీకెవరు బోధించారో నీకే తెలుసు. చిన్ననాటి నుండే మీయమ్మ నీకు పరిశుద్ధ గ్రంథాలు బోధిస్తూ వచ్చింది. అవి నీకు క్రీస్తు నందు విశ్వాసం పుట్టిస్తాయి, రక్షణ మార్గాన్ని బోధిస్తాయి" అని అతన్ని ప్రోత్సహించాడు-3,14-15.

పై వాక్యాల ప్రకారం తిమొతికి మొదటి గురువు తల్లే. ఆమె కుమారునికి పూర్వవేదం నేర్పింది. యూదమత భక్తి అంతా బోధించింది. ఆ భక్తురాలి విశ్వాసాన్నీ బైబులు ఆసక్తినీ, మతబోధనీ పౌలు అంతటివాడే మెచ్చుకొన్నాడు. తిమొతి తర్వాత పౌలు శిష్యుడై నూత్నవేద బోధ ప్రారంభించినపుడు పూర్వం తల్లి నేర్పిన పూర్వవేద జ్ఞానం అతినికి బాగా ఉపకరించింది. అతడు చదువుకొన్న పాఠశాల యిల్లే. అతని ఉపాధ్యాయురాలు తల్లే. ఆ రోజుల్లో యూదుల్లో ధనిక కుటుంబాల వాళ్లు విద్య కోసం తమ పిల్లలను ప్రార్థనా మందిరాలకు పంపేవాళ్లు. అక్కడ రబ్బయిలు ఆ పిల్లలకు చదువు చెప్పేవాళ్లు. కాని యూనికే తన బిడ్డను రబ్బయిల చేతికి అప్పగించలేదు. తానే స్వయంగా కొడుక్కి ఉపాధ్యాయురాలైంది. ఆమె గొప్పతనం అదే.

తిమొతి విద్యావిధానమే ఇంచుమించు క్రీస్తుకి గూడ అబ్బి వుండాలి. అతడు ఏరబ్బయి దగ్గర విద్య నేర్చుకోలేదు. యేసు బాల్యాన్ని గూర్చి ప్రస్తావిస్తూ లూకా సువిశేషం "యేసు నజరేత్తుకు వచ్చి తల్లిదండ్రులకు విధేయుడయ్యాడు. అతడు జ్ఞానం లోను ప్రాయంలోను వృద్ధి చెందాడు. దేవుని అనుగ్రహాన్ని ప్రజల మన్ననమా పొందాడు" అని చెప్తుంది. - 1,52-52. ఆ బాల్య ప్రాయంలో అతడు ఇంటివద్ద తల్లిదండ్రులకు విధేయుడై

వాళ్లు చెప్పినపనులు చేసికొంటూ పోతూండగా అతని జ్ఞానం ఏలా వృద్ధి చెందింది? అతనికి ఎవరు బోధించారు? యోహాను 7,15 ప్రకారం యేసు బోధిస్తూండగా చూచిన యూదులు ముక్కుమీద వ్రేళ్లు వేసికొని "విద్యాశిక్షణ లేని యీతనికి యింత జ్ఞానం ఏలా అలవడింది? అని విస్తుపోయారట. మరి ఏరబ్బియి బోధించకుండానే క్రీస్తు అంత మతపరిజ్ఞానం ఏలా సంపాదించాడు? మరియ మాతే క్రీస్తు బాలునికి పూర్వవేదం బోధించి వుంటుంది. ఆ బాలునికి గ్రంథంపట్ల అపారమైన భక్తిని కలిగించి వుంటుంది. బాల్యంలోనే అతడు దేవాలయంలోని వేదశాస్త్రుల బోధలను శ్రద్ధగా విన్నాడు. ఆ గ్రంథంలోని ఆయా అంశాలను గూర్చి వాళ్లను ప్రశ్నలు కూడ అడిగాడు - లూకా 2,46. రుజువు చేయడానికి మనకు ఖచ్చితమైన ఆధారమేమి లభించదు గాని, ఈ బైబులు జ్ఞానమంతా అతనికి మరియమాత వల్లనే సిద్ధించి వుంటుంది. బైబులు తల్లులు తమ పిల్లలకు వేదసత్యాలు నేర్పినతీరు అలాంటిది.

చెప్పవచ్చిందేమిటంటే, మన పిల్లలకు మతవిద్య తల్లిదండ్రులే ప్రారంభించాలి. ఆ విద్య కూడ బైబులు గ్రంథంతోనే ఆరంభం కావాలి. మన యిల్లే పిల్లలకు మొదటి పాఠశాల కావాలి. బిడ్డకు భగవంతుణ్ణి గురించి బోధించే మొదటి గురువుల తల్లిదండ్రులే కావాలి. మొదట ఇంటి వద్ద తల్లిదండ్రుల నుండి భక్తిని అలవర్చు కోని పిల్లలు, తర్వాత బళ్లో ఉపాధ్యాయులు చెప్పే మతసత్యాలను అంతగా నేర్చుకోలేరు.

ఇంకా మన కుటుంబాల్లో తప్పకుండా బైబులు గ్రంథం వుండాలి. స్వరూపాలను లాగే దాన్ని కూడ ఇంటిలో ప్రముఖమైన తావులో వుంచాలి. మనం స్వరూపాలకు చూపే భక్తినే దానికి గూడ చూపుతూండాలి. బాల్యప్రాయం నుండే మన పిల్లలకు ఆ పుస్తకం పట్ల గౌరవభావం ఏర్పడాలి. చిన్ననాటి నుండే పిల్లలకు బైబులు చదివి విన్పిస్తూండాలి. దానిలోని కొన్ని వాక్యాలు వాళ్ల చేత కంఠస్థం చేయించాలి. మొదటి సత్ప్రసాదం తీసికొనేప్పుడే మన పిల్లలకు ఓ సొంత బైబులు కూడ కొనిపెట్టాలి. ఈ కృషంతా ఇంటిలో అమ్మా నాన్నే చేయాలి.

ఇండియాకు మొదటి కార్డినలు ఐన వలేరియన్ గ్రేష్యస్ గారు సెప్టెంబరులో చనిపోయారు. వీరికి బాల్యప్రాయంలోనే తండ్రి గతించాడు. కాని వీరి తల్లి క్యారోలెట్ చాలా భక్తిమంతురాలు. ఆమె ఆ బిడ్డకు చిన్నతనంలోనే మతసత్యాలు నేర్పించి భక్తి పుట్టించింది. గ్రేష్యస్ గారు తన్ను గూర్చి చెప్పుకొన్నపుడల్లా తన ఉన్నతికి తల్లే కారణమని ఆమెను చాల ప్రశంసిస్తూండేవాళ్లు. ఈలాంటి తల్లులూ తండ్రులూ పుష్కలంగా వుంటే మన పిల్లలు గురువులూ మఠకన్యలూ ఎందుకు కారు?

### 3. దైవ సేవ

అన్నా ఎల్కానా భార్య. ఆమె గొడ్రాలు. బిడ్డకోసం చాలకాలం ప్రభువుని ప్రార్థించింది. నాకొక మగబిడ్డను ప్రసాదించావంటే వాణ్ణి నీకే కానుకగా అర్పించుకొంటాను అని మ్రొక్కుకొంది. ప్రభువు అన్నా మొర ఆలించి ఆమెకొక మగకందును ప్రసాదించాడు. ఆ బిడ్డను చూచి అన్నా మురిసిపోయింది. అతనికి సమూవేలు అని పేరు పెట్టుకొంది.

బిడ్డకు పాలు మాన్పించినంక అన్నా ఆ బాలుణ్ణి తీసుకొని షిలో నగరంలోని దైవమందిరానికి వచ్చింది. ఒక కోడె దూడను తోలించుకొని, తూమెడు గోదుమ పిండితో, తిత్తెడు ద్రాక్షసారాయంతో పయనమై వచ్చింది. అవన్నీ దేవునికి కానుకలు. దూడను దేవునికి బలిగా అర్పించి కుమారుణ్ణి యాజకుడైన యేలీవద్దకు తీసికొనిపోయింది. "అయ్యా! మునుపు నేను బిడ్డకొరకు ప్రార్థిస్తే ప్రభువు వీణ్ణి నాకు దయచేసాడు. కనుక ఈ పసికందును మళ్లా ప్రభువుకే కానుక పెడుతున్నాను. ఈ బిడ్డడు జీవితాంతం ప్రభువుకే ఊడిగం చేస్తాడు" అని చెప్పింది. అన్నా భక్తిని మెచ్చుకొని ప్రభువు తరువాత ఆమె కింకా ఐదుగురు బిడ్డలను ఇచ్చాడు. సమూవేలు ఆ బాల్య ప్రాయంలోనే యాజకులు ధరించే నారబట్టలు తాల్చి దేవాలయంలో ప్రభువుకి సేవ చేయడం మొదలుపెట్టాడు. తర్వాత ఇతడు మహాప్రవక్తా న్యాయాధిపతీ అయ్యాడు. తొలిరాజులైన సౌలునీ, దావీదునీ అభిషేకించింది గూడ ఇతడే - 1 సమూ 1.

బైబులు తల్లులు తమ బిడ్డలను ఆదరంతో దైవ సేవకు అర్పించారు. ప్రభువు కూడ ఆ మహాతల్లులను దీవించాడు. ఆ యన్నాలాగే క్రైస్తవ తల్లిదండ్రులు గూడ తమ పిల్లలను భగవత్సేవకు అర్పిస్తూండాలి.

# 11. కీర్తనల వివరణం

## మనవి మాట

113, 115,117 నంబర్లు గల సంచికలు కీర్తనల భావాన్ని వివరిస్తాయి. కీర్తనల గ్రంథంలో 150 కీర్తనలున్నాయి. ఇవన్నీ భక్తులు స్వయంగా చేసికొన్న ప్రార్థనలు. వీటిల్లో అమూల్యమైన భక్తిభావాలున్నాయి. మన ప్రజలకు ఈ కీర్తనలను పరిచయం చేయాలన్న ఉద్దేశంతో ఈ వివరణను తయారు చేసాం.

ఈ వివరణంలో మూడంశాలు పాటించాం. మొదట ఒక్కో కీర్తన పుట్టిన సందర్భాన్ని తెలియజేసాం. అటుపిమ్మట కీర్తనలోని ప్రధాన భావాన్ని వివరించాం. కడన ఆ కీర్తన ఈనాడు మన ప్రార్థనకు ఏలా వుపయోగ పడుతుందో తెలియజేసాం.

పాఠకులు మొదట ఒక్కో కీర్తనమీద వివరణను చదువుకోవాలి. తర్వాత బైబుల్లో నుండి ఆ కీర్తనను నిదానంగా చదువుకొని దాని భావాలను అర్థంజేసికోవాలి. అటు పిమ్మట ఆ కీర్తనను ప్రార్థన చేసికోవాలి. కీర్తనల ధ్యానం ద్వారా భగవంతునికి భక్తితో ప్రార్థనం జేసికొనే విధానాన్ని నేర్చుకోవచ్చు.

## 1. రెండు త్రోవలు

ఈ మొదటి కీర్తనం విజ్ఞాన కీర్తనల వర్గానికి చెందింది. ఇది ప్రభువు ధర్మశాస్త్రాన్ని పాటించమని హెచ్చరిస్తుంది. రెండు త్రోవలను పేర్కొంటుంది. అవి సజ్జనుల త్రోవ, దుర్జనుల త్రోవ. ఇరుకైన త్రోవ, విశాలమైన త్రోవ. ఈ త్రోవలు నరుల జీవితవిధానాన్ని సూచిస్తాయి. సజ్జనుల త్రోవను ప్రభువు కాచికాపాడతాడు. దుర్జనుల త్రోవ నాశమైపోతుంది. సజ్జనుడు మంచిపండ్లు కాసిన చెట్టులా వుంటాడు. క్రీస్తు చెప్పినట్లు, మంచి చెట్టు మంచి పండ్లు కాస్తుంది. పండునుబట్టి చెట్టు ఎలాంటిదో తెలిసికొంటాం. ఇక, దుర్జనుల త్రోవ కళ్ళంలోని పొట్టులా ఎగిరిపోతుంది. మనం త్రొక్కే త్రోవ మంచిదా లేక చెడ్డదా అని పరిశీలించి చూచుకోవాలి. మన తరపున మనం సజ్జనుల త్రోవలో నడిచే భాగ్యం కొరకు వేడుకొందాం.

## 2. ప్రభువు అభిషేకించిన రాజు

ఇది రాజకీర్తనల వర్గానికి చెందింది. ఓ యిస్రాయేలురాజు మీద చెప్పిన కీర్తన. ఈ రాజు తండ్రి చనిపోగా సామంతులు ఇతనిమీద తిరుగుబాటు చేసారు. ఈ రాజు

వాళ్ళను అదుపులో పెట్టుకొంటాడు. ఈ రాజు పట్టాభిషేక దినాన కీర్తనకారుడు ఈ పాటకట్టి విన్పించి వుంటాడు. దీనిలో మూడంశాలు ఉన్నాయి. 1. రాజు యావే ప్రభువు కుమారుడు. 2. ఈ రాజు తన పరిపాలనంద్వారా దేవుని పరిపాలనంలో పాల్గొంటాడు. 3. అతడు తిరుగుబాటుదారులను అణచివేసి వారిమీద పరిపాలనం చేస్తాడు. మొదట ఓ సామాన్య రాజునిగూర్చి చెప్పిన యీ కీర్తనను తర్వాత నూత్నవేద రచయితలు క్రీస్తుకి అన్వయింపజేసారు. నేడు క్రీస్తు ప్రభువే మనకు రాజు. అతని రాజ్యం మన హృదయాల్లో నెలకొనాలి. అది నీతి ప్రేమ శాంతి సత్యాలతో కూడిన రాజ్యం. ప్రభువు మనకు ఎల్లవేళల రాజుగా వుండాలని వేడుకొందాం.

## 3. హింసితుని ప్రాతఃకాల ప్రార్థన

ఈ కీర్తన చెప్పిన భక్తుని శత్రువులు బాధించారు. ఇరుగుపొరుగువాళ్ళు దేవుడు నిన్ను పట్టించుకోడు అని చెప్పి అతన్ని నిరుత్సాహపరచారు. ఐనా ఆ భక్తుడు అధైర్యపడలేదు. విశ్వాసంతో దేవుణ్ణి నమ్మి అతన్ని శరణువేడాడు. ప్రభువు తన్ను కాచికాపాడతాడని నమ్మాడు. దేవుని అండాదండా తనకుంటాయి కనుక తాను నిర్భయంగా నిద్రపోయి మళ్ళా సురక్షితంగా మేల్కొంటానని చెప్పుకొన్నాడు. ఈ భక్తునిలాగే మనంకూడ కష్టాల్లో దేవుని నమ్మి అతని సహాయాన్ని అడుగుకోవాలి. యుద్ధంలో డాలు సైనికుణ్ణి కాపాడినట్లుగా ఆ ప్రభువు మనలను కాపాడాలని మనవిచేద్దాం.

## 4. సాయంకాల ప్రార్థన

ఇది విశ్వాస కీర్తన. ఈ పాట కట్టిన భక్తుడు ప్రభువు తన్ను నిరంతరం సంరక్షిస్తాడని నమ్మాడు. దేవుడు తన మొర వింటాడనీ తనకు సాయంచేస్తాడనీ విశ్వసించాడు. భక్తిలేనివాళ్ళు కొందరు అతని నమ్మకానికి అతన్ని ఎగతాళిచేసారు. ఐనా అతడు తన విశ్వాసాన్ని కోల్పోలేదు. ప్రభువుకి అంటిపెట్టుకొని వుండడం మాననూలేదు. మనం సురక్షితంగా జీవించేలా చేసేది ప్రభువే. కనుక ఎల్లవేళల అతన్ని అనుసరించే భాగ్యం కొరకు ప్రార్థిద్దాం.

## 5. ఉదయకాల ప్రార్థన

ఈ కీర్తనంలో భక్తుడు వేకువజామున దేవళంలో ప్రార్థించాడు. ప్రభువు తనకు సహాయమూ వెలుగూ దయచేయాలని అడుగుకొన్నాడు. తనకు శత్రువులనుండి ప్రమాదం వుంది. అపాయంవుంది. కనుక ప్రభువు తన్ను నడిపించాలనీ తన మార్గం నిరపాయం చేయాలనీ వేడుకొన్నాడు. అతని భక్తి గొప్పది. కనుకనే ప్రభువు కృపాతిశయంవల్ల తనకు దేవళం ప్రవేశించే భాగ్యం కలిగిందని చెప్పుకొన్నాడు. మనం దేవుణ్ణి ప్రేమించకముందే

ఆ ప్రభువు మనలను ప్రేమిస్తాడు. అతని దయవల్లనే మనకు అతనిమీద భక్తి పుడుతుంది. కనుక మనం అతన్ని స్తుతించి కీర్తించాలి. ఈ కీర్తనకారుల్లాగే మనంకూడ ఈ జీవితయాత్రలో ప్రభువు మనలను నడిపించాలని వేడుకొందాం. సకలాపదలనుండీ మనలను కాపాడాలని అడుగుకొందాం.

## 6. శ్రమల్లో ప్రార్థన

ఈ పాట వ్యాధిగావున్న ఓ భక్తుని విలాపగీతం. అతడు తన పాపంవల్లనే దేవుడు తనకు ఈ రోగశిక్షను పెట్టాడని భావించాడు. దేవుడు తనమీద కోపించి తన్ను రోగంపాలుచేసి చీవాట్లు పెడుతున్నాడని అనుకొన్నాడు. ఐనా అతడు ప్రభువుని నమ్మి తన్ను మన్నింపమని కోరుకొన్నాడు. నేను చనిపోయి పాతాళలోకం చేరుకొంటే అక్కడ నిన్నెవ్వరు స్తుతిస్తారు? అందుచే నన్ను ఈ భూమిమీదనే బ్రతికి వుండనీయి. అప్పుడు నిన్ను స్తుతించే భక్తుడు ఒక్కడయినా మిగిలివుంటాడు అని చెప్పుకొన్నాడు. ఇది నిష్కల్మషమైన భక్తిభావం. అతడు తన వ్యాధిబాధలను భరించలేక ప్రభూ! ఈ వేదన ఎన్నాళ్ళు అని దీనంగా అరిచాడు. దేవుడు అతని వేడుకోలు విని అతని వ్యాధిని తొలగించాడు. కనుక అతడు దేవుడు నా రోదనాన్ని ఆలించాడని ఉత్సాహంగా చెప్పుకొన్నాడు. దేవళానికి వచ్చి భక్తసమాజంముందు తన పూర్వచరిత్రను వెల్లడిచేసికొని కృతజ్ఞతాస్తుతులు చెల్లించాడు. ఈలా పుట్టింది ఈ కీర్తన. ఈ రచయితలాగే మనంకూడ మన వేదనల్లో "నీవు శీఘ్రమే విచ్చేసి నన్ను కాపాడు" అని దేవునికి మనవిచేసికోవాలి.

## 7. హింసితుని ప్రార్థన

ఈ కీర్తన చెప్పిన భక్తునిమీద ఏవో అపదూరులు వచ్చాయి. దుష్టులు అతడు చేయని పాపాలను అతనికి అంటగట్టారు. కనుక అతడు బాధపడ్డాడు. ఐనా ప్రభువు నీతిమంతుడనీ దుష్టులను శిక్షిస్తాడనీ అతనికి బాగా తెలుసు. దేవుడు అన్యాయాన్ని ఓడించి సత్యాన్ని గెలిపిస్తాడని అతనికి నమ్మకముంది. కనుక దుర్మార్గుల అన్యాయమైన నిందలనుండి తన్ను కాపాడమని దేవుణ్ణి వేడుకొన్నాడు. న్యాయాధిపతియైన దేవుడు పాపులను శిక్షించాలనీ, వాళ్ళు తాము త్రవ్విన గోతిలో తామే కూలాలనీ కోరుకొన్నాడు. నేను నిజంగా పాపం చేసినట్లయితే నాకు పలానా శిక్షలు ప్రాప్తించునుగాక అని ఒట్టువేసికొన్నాడు. శత్రువుల నిందారోపణల నుండి ప్రభువు అతన్ని రక్షించాడనే అనుకోవాలి. జీవితంలో అప్పుడప్పుడు మన మీదికి కూడ నిందలు వస్తాయి. మనం తప్పుడు పనులు చేయకపోయినా చేసామని విరోధులు పుకార్లు పుట్టిస్తారు. ఆలాంటి సందర్భాల్లో మనంకూడ పై కీర్తనకారునిలాగే "ప్రభూ! నేను నిన్ను శరణువేడుతున్నాను. నన్ను వెన్నాడే శత్రువులనుండి నన్ను కాపాడు" అని ప్రార్థించాలి.

## 8. దేవుని మహిమ, నరుని ఘనత

ఇది స్తుతిగీతం. దీన్ని వ్రాసిన భక్తుడు రాత్రిపూట ఆకాశం వైపు చూచాడు. అంతరిక్షంలోని నక్షత్రాలనూ చంద్రుణ్ణీ దర్శించి పులకించిపోయాడు. ప్రభువు మాహాత్మ్యం ఆకాశం వరకు కీర్తింపబడుతూంది అని వాకొన్నాడు. ప్రకృతిలో దర్శనమిచ్చే ప్రభువుని స్తుతించాడు. అద్దంలో ప్రతిబింబంలాగ ప్రకృతిలో దేవునిరూపం కన్పిస్తుంది అనుకొన్నాడు. ఇంతలో అతనికి మరో ఆలోచన తట్టింది. దేవుడు చేసిన ప్రాణులన్నిటిలోను నరుడు గొప్పవాడు. అతడు దేవుడంతటివాడు, నేలమీది ప్రాణులన్నిటినీ ఏలేవాడు. దేవుడు విశ్వానికి అధిపతి. కాని అతడు తనకు బదులుగా నరుణ్ణి భూమిమీద అధిపతిగా నియమించాడు. నేడు మనం ఈ భూమిమీది ప్రతి ప్రాణిలోను, ప్రతివస్తువులోను దేవుణ్ణి చూడ్డం నేర్చుకోవాలి. విశేషంగా నరుళ్ళో అతని రూపాన్ని చూడాలి. "మా దేవుడవైన ప్రభూ! నీ మాహాత్మ్యం ఈ ప్రపంచమంతటా కన్పిస్తుంది" అని అతన్ని పొగడాలి.

## 9. న్యాయాన్ని జరిగించే దేవునికి కృతజ్ఞత

ఇది కృతజ్ఞతా స్తుతులను తెలియజేసే కీర్తన. ఒక భక్తుని శత్రువులు పీడించారు. వ్యాధిబాధలు కూడ క్రుంగదీసాయి. అతడు దేవునికి మొరపెట్టగా ఆ ప్రభువు అతన్ని ఆర్తినుండి కాపాడాడు. అతడు దేవళానికి వచ్చి ప్రభువుకి వందనాలు అర్పించాడు. అతనికి దేవునిమీదగల నమ్మకం గొప్పది. దేవుడు అక్కరలో వున్న వారిని మరచిపోడు, పీడితుల ఆశలను వమ్ముజేయడు అని నమ్మాడు. అతనిలాగే మనం కూడ కష్టాల్లో వున్నపుడు ప్రభువుని నమ్మి అతనికి మొరపెట్టాలి. అతడు బాధార్తులను జ్ఞప్తికి తెచ్చుకొని వారి మొర వింటాడు అని నమ్మాలి.

## 10. ఆపదలో ప్రార్థన

ఈ కీర్తన చెప్పిన భక్తునికి శత్రువులనుండి ఏదో ఆపద వాటిల్లింది. తన కష్టాల్లో ప్రభువు తనకు దూరంగా వున్నాడనిపించింది. ఐనా అతడు ప్రభువునందు విశ్వాసం కలవాడు. దేవుడు అనాథులనూ అభాగ్యులనూ తప్పక ఆదుకొంటాడు అనే నమ్మకం కలవాడు. కనుక ఆ ప్రభువుకి మనవి చేసి అతనినుండి సహాయం పొందాడు. జీవితంలో కష్టాలు వచ్చినపుడు మనకు కూడ దేవుడు దూరంగా వున్నాడు అన్పిస్తుంది. ఐనా మనం నిరాశపడకుండా దేవునికి విన్నపం జేయాలి. "ప్రభూ! నీవు మేలుకో! పీడితులను విస్మరించకు" అని ప్రార్థనం జేయాలి.

## 11. దేవునిపట్ల నమ్మకం

లోకంలో దుష్టత్వం ప్రబలిపోయింది. దుర్మార్గుల దుష్కార్యాల వలన కీర్తనకారునికి గూడ ప్రమాదం కలిగింది. స్నేహితులు నీవు ఇంటినుండి పారిపొమ్మని సలహాయిచ్చారు. కాని అతడు ఆలా పారిపోలేదు. దుర్మార్గులనూ వారి దుష్క్రియలనూ అణచివేసే ప్రభువు ఒకడున్నాడని నమ్మి ధైర్యంగా వుండిపోయాడు. ఈ భక్తునిలాగే మనం కూడ కష్టాల్లో ప్రభుని శరణువేడాలి. అతని సహాయం కొరకు ఓపికతో వేచివుండాలి.

## 12. దుష్టుల నుండి రక్షణం కొరకు ప్రార్థనం

ఈ కీర్తన కట్టిన కవికి తన నాటి సమాజంలో ప్రజల పోకడలు నచ్చలేదు. వారివన్ని ఇచ్చకాలు, అబద్ధాలు. వారి ప్రవర్తనం వల్ల అతనికి శ్రమకూడ కలిగింది. కనుక, అతడు దేవళంలోకి వెళ్ళి ప్రభువుకి మొరపెట్టుకొన్నాడు. అక్కడ ప్రవక్త ప్రభువు పేరిట ప్రవచనం చెప్పాడు. "పీడితులను ఆదుకోవటానికీ, ఆర్తిలో వున్న వారికి సహాయం చేయడానికీ నేను శీఘ్రమే వస్తాను. నా వలన నీకు భద్రత కలుగుతుంది" అని పలికాడు. ఆ పలుకులకు కీర్తన కారుడు ఊరట చెందాడు. ప్రభువు వాక్కు పుటం వేసిన వెండిలాగా శ్రేష్ఠమైందని నమ్మాడు. శ్రమలు మనలను పీడించినపుడు మనం కూడ ఈ రచయితలాగే ప్రభువుని వేడుకోవాలి. అప్పుడు అతడు "నేను శీఘ్రమే వస్తాను, నా భక్తులకు భద్రతను దయచేస్తాను" అని సమాధానం చెప్తాడు.

## 13. దైవసహాయం కొరకు మనవి

ఇది విలాప గీతం. ఈ గీతం చెప్పిన భక్తుడు వ్యాధిగా పడివున్నాడు. అతనికి ప్రభువు తన్ను పూర్తిగా మరచిపోయినట్లుగా తోచింది. పగవాళ్ళు కూడ అతన్ని గేలి చేసారు. ఈలాంటి పరిస్థితుల్లో అతడు ప్రభువువైపు మళ్ళి దీనంగా మొరపెట్టుకొన్నాడు. తన్ను ఆదుకొమ్మని మనవి చేసికొన్నాడు. దేవుడు తన్ను ఆదుకొన్నాడని నమ్మి వందనాలు చెప్పుకొన్నాడు. ఈ కవిలాగే మనంకూడ వేదనలకు చిక్కినపుడు "ప్రభూ! నీవు నన్నెంతకాలం విస్మరిస్తావు?" అని నమ్మకంతో వేడుకోవాలి.

## 14. దేవుణ్ణి నమ్మనివాళ్లు

ఇది ప్రవచన కీర్తనం. దీనిలో కీర్తనకారుడు తన నాటి లౌకిక వాదులను హెచ్చరించి మందలిస్తున్నాడు. కొందరు యిస్రాయేలీయులు పూర్తిగా లోకవ్యామోహాల్లో మునిగిపోయారు. వాళ్ళు దేవుడు లేడో అన్నట్లుగా ప్రవర్తిస్తున్నారు. అతన్ని పూజించడం

మానివేసారు. మంచి కార్యాలకు మారుగా దుష్కార్యాలు చేస్తున్నారు. పేదసాదలకు కీడుజేసి వారిని భోజనంలా మ్రింగేస్తున్నారు. కాని ప్రభువు వారిని శిక్షించి తీరతాడు. వాళ్ళు భయంవాతపడతారు. కడన రచయిత యిస్రాయేలు ప్రజల కొరకు ప్రార్థనంచేసి కీర్తనను ముగించాడు. మనం కూడ కొన్ని సారులు దేవుడు లేడో అన్నట్లుగా ప్రవర్తించి దుష్టకార్యాలకు పూనుకొంటాం. పేదసాదలను పీడించి భోజనంలా మ్రింగివేస్తాం. కాని ఈలా చేయకూడదు.

## 15. యావే మందిరంలో అతిథి

ఇది యాత్రిక కీర్తన. కొందరు యాత్రికులు యెరూషలేము దేవాలయానికి వచ్చారు. దేవళంలో ప్రవేశించి అక్కడజరగబోయే దైవారాధనలో పాల్గొనాలంటే ఏలాంటి అర్హతలుండాలని దేవాలయ యాజకుణ్ణి అడిగారు. అతడు దేవళంలో ప్రవేశించడానికి ఉండవలసిన యోగ్యతలను వివరించి చెప్పాడు. దైవభక్తి వుండాలి. తోడివారికి కీడు చేయకూడదు. అబద్ధమాడకూడదు. లంచాలు వడ్డీలు పుచ్చుకోగూడదు. ఈ కీర్తన పేర్కొనే నియమాలను జాగ్రత్తగా మననంజేసికొంటే నేడు మనకుగూడ భక్తి పుడుతుంది. అప్పుడు మన ప్రవర్తనను చక్కదిద్దుకొని అవసరమైన మార్పులు చేసికొంటాం.

## 16. ప్రభువే నాకు వారసభూమి

ఈ కీర్తన చెప్పిన భక్తుడు లేవీయుడు. దేవళంలో పరిచారకుడు. పూర్వం యోషువా 11గోత్రాల ప్రజలకు వాగ్దత్త భూమిని పంచియిచ్చాడు. లేవీ గోత్రానికి మాత్రం భూమిని ఈయలేదు. ప్రభువే మీకు వారసభూమి ఔతాడని చెప్పాడు. అనగా వాళ్లు దేవళంలో ప్రభువుని సేవించి అక్కడ భక్తులు సమర్పించే కానుకలు ఆరగించి బ్రతకాలి. ఈ భావాన్ని మనసులో పెట్టుకొనే కీర్తనకారుడు ఈ పాట వ్రాసాడు. ప్రభువే నాకు వారసభూమి, పానపాత్రం అని వాకొన్నాడు. అనగా అతనికి అన్నపానీయాలు కూడ ప్రభువే అని భావం. అన్యులు పరదైవాలను కొల్చినా తాను మాత్రం యావేను మాత్రమే సేవిస్తాడు. ప్రభువు నిరంతరం అతని కన్నుల యెదుట మసలుతూంటాడు. రాత్రిలో నిద్రించేపుడుకూడ అతడు దైవసాన్నిధ్యాన్ని విస్మరింపడు. ఇది చాల భక్తిగల కీర్తన. ఈ భక్తునితోపాటు మనంకూడ ప్రభువే నాకు వారసభూమి, నా యాస్తి అని చెప్పుకొంటే ఎంత బాగుంటుంది!

## 17. నిర్దోషి ప్రార్థనం

ఇది విలాప కీర్తనం. కీర్తనకారునికి ఏదో ఆపదవచ్చింది. దీనిలో దుష్టుల హస్తంకూడ వుంది. అతడు ప్రభువు నెదుట తన బాధను సవిస్తరంగా తెలియజేసికొన్నాడు. తాను నిర్దోషినని ప్రమాణం చేసాడు. తన్ను హింసించే శత్రువులను శిక్షించమని

మనవిచేసికొన్నాడు. నన్ను నీ కంటిపాపనువలె కాపాడమని దేవునికి విన్నవించుకొన్నాడు. మన కంటిపాపను మనం జాగ్రత్తగా కాపాడుకొంటాం. ప్రభువుకూడ మనలను అంత జాగ్రత్తగా కాపాడతాడు. మన జపంలో ఈ నమ్మకం వుండాలి.

## 18. విజయగీతం

ఇది రాజకీర్తనం. దావీదు వంశపు రాజొకడు శత్రువులమీద విజయం సాధించినపుడు పాడినపాట. ఈ రాజు శత్రువులవలని ఆపదలోవుండి దేవునికి మొరపెట్టగా దేవుడు అతనికి సాయం చేసాడు. కవి ఈ సాయాన్ని తుఫానుతో పోల్చాడు. ఈ తుఫానుతో దేవుడు శత్రువులను హతమార్చి రాజును కాపాడాడు అని చెప్పాడు. రాజు ధర్మాన్ని పాటించాడు కనుక ప్రభువు అతన్ని రక్షించాడు. నీతిమంతులెవరో దుర్మార్గులెవరో దేవునికి బాగా తెలుసు. ఎవరిని శిక్షించాలో ఎవరిని రక్షించాలోకూడ ఆయనకు తెలుసు. దేవుడు రాజుకి చీకటిలో దీపం వెలిగించాడు. ఆయనతప్ప భక్తులను కాపాడే నాథుడెవడూ లేడు. కనుక రాజు దేవునికి వందనా లర్పించాడు. ఆపదలో మనం ప్రార్థనంజేస్తే దేవుడు మన వేడికోలు గూడ వింటాడు. ఆ ప్రభువు ఎల్లవేళల మనకు దుర్గం, డాలు, ఆశ్రయస్థానం.

## 19. నీతి సూర్యుడైన ప్రభువు

ఈ కీర్తనలో రెండు భాగాలున్నాయి. మొదటిభాగంలో ప్రకృతి దైవసాన్నిధ్యాన్ని తెలియజేస్తుంది అనే అంశాన్ని చెప్పాడు. అద్దంలో మన మొగం కన్పిస్తుంది. ఆలాగే సృష్టిలో దైవరూపం గోచరిస్తుంది. భక్తులు ప్రకృతిలోగూడ భగవంతుణ్ణి దర్శించి ఆరాధించారు. ఇక్కడ కీర్తనకారుడు విశేషంగా సూర్యుణ్ణీ అతని ప్రతాపాన్నీ వర్ణించాడు. అతడు ఆకాశమనే పెండ్లిపందిరినుండి ఓ వరునిలాగ వెలువడతాడని చెప్పాడు. మనం కూడ ఈ విశ్వసృష్టి దేవుని మహిమను చాటుతుందని గమనించాలి.

కవి రెండవ భాగంలో ధర్మశాస్త్రాన్ని వర్ణించాడు. అదంటే యూదులకు పరమ ప్రీతి, పరమ గౌరవం. ధర్మశాస్త్రమంటే ప్రభువు ఆజ్ఞలు. అవి మేలిమి బంగారం లాంటివి, స్వచ్ఛమైన తేనెలాంటివి. కీర్తనాంతంలో రచయిత తనతప్పులను మన్నించవలసినదిగా ప్రభువుకి వినతి చేసాడు. మనకు కూడ ప్రభువు కట్టడలపట్ల గౌరవం, పాపభీతి వుండాలి.

## 20. రాజు విజయంకొరకు ప్రార్థనం

ఇది రాజకీర్తనం. ప్రభువు యుద్ధంలో రాజుకి సహాయంచేసి అతన్ని కాపాడాలని ఈ గీతం కోరుకొంటుంది. ఈజిప్టు ప్రజలు అశ్వబలాన్ని రథబలాన్ని నమ్మారు. కాని యిస్రాయేలీయులు దైవబలాన్ని నమ్మారు. కీర్తనకారుడు యిస్రాయేలు నాయకుడైన రాజు

కొరకు ప్రార్థించినట్లే నేడు మనం తిరుసభ నాయకుల కొరకు ప్రార్థించాలి. పోపుగారు బిషప్పులు గురువులు మఠకన్యలు ఉపదేశులు మొదలైన నాయకులను దేవుడు దీవించాలని వేడుకోవాలి.

## 21. రాజు విజయానికి కృతజ్ఞత

ఇది కూడ రాజకీర్తనం. దేవుడు రాజుకి యుద్ధంలో విజయం దయచేసినందుకు అతనికి కృతజ్ఞతాస్తుతిగా పాడిన పాట. ఈ స్తుతిని గాయకులు దేవాలయంలో పాడి విన్పించారు. మన కష్టాల్లో ప్రభువు మనలను చేయివిడువడు. భక్తులు దైవబలాన్నీ దైవసహాయాన్నీ నిరంతరం గానంచేయాలి.

## 22. పుణ్యాత్ముని శ్రమలు

ఇది విలాప కీర్తనం. ఈ కీర్తనను కట్టిన భక్తుడు శత్రుపీడనానికీ బాధకూ అవమానానికీ గురయ్యాడు. దేవునికి దీనంగా మొరపెట్టుకొన్నాడు. నేను ఆపదలోవున్నాను. నీవు నాకు దూరంగా ఉండవద్దు. నన్ను ఆదుకొనేవా డెవడూలేడు అని వేడుకొన్నాడు. ప్రభువు అతని మొర విని అతన్ని కాపాడాడు. కనుక భక్తుడు దేవునికి కృతజ్ఞతా స్తుతులు చెల్లించాడు. క్రీస్తు సిలువమీద చనిపోతూ ఈ కీర్తనను జపించాడు. నూత్నవేద రచయితలు ఈ గీతాన్ని క్రీస్తు శ్రమలకు అన్వయించి చూపించారు. మన కష్టాల్లో మనంకూడ నాదేవా! నాదేవా! నన్నేల చేయి విడిచావని జపించాలి.

## 23. మంచికాపరి

ఇది దేవునిపట్ల నమ్మకాన్ని వెల్లడిజేసే కీర్తన. దీనిలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగంలో భక్తుడు భగవంతుణ్ణి గొర్రెల కాపరితోను తన్ను గొర్రెతోను పోల్చుకొన్నాడు. దేవుడంతటి కాపరి కాపాడుతూంటాడు గనుక తనకే భయమూ లేదని చెప్పుకొన్నాడు. రెండవ భాగంలో భగవంతుణ్ణి ఆతిథేయునితోను తన్ను అతిథితోను పోల్చుకొన్నాడు. దేవళంలో ప్రభువే తనకు అన్నపానీయాలు దయచేస్తాడని చెప్పుకొన్నాడు. ఇది బైబుల్లోని గొప్ప కీర్తనల్లో వొకటి. భగవంతుణ్ణి బాగా అనుభవానికి తెచ్చుకొన్న భక్తుడు చెప్పినపాట. అతనిలాగే మనంకూడ ప్రభువేనాకు కాపరి, ఇక యే కొదవా లేదు అని చెప్పుకోవాలి. ప్రభువుని పూర్ణంగా విశ్వసించాలి.

## 24. ప్రభువు దేవాలయ ప్రవేశం

ఈ కీర్తనలో భక్తులు మందసంతో దేవాలయం చుట్టూ ప్రదక్షిణం చేసారు. సృష్టికర్తయైన దేవుని స్తుతించారు. వాళ్ళు దేవాలయ ద్వారం దగ్గరికి వచ్చి దైవమందిరంలో

ప్రవేశించడానికి ఏమి యర్హతలు కావాలని యాజకులను ప్రశ్నించారు. యాజకులు ఆ యర్హతలను వివరించి చెప్పారు. ఆ పిమ్మట భక్తులు మందసాన్ని దేవళంలోనికి కొని తెచ్చారు. ప్రభువు మందసం మీద ఆసీనుడై మహారాజులాగా దేవళంలోకి ప్రవేశిస్తున్నాడు కనుక దేవాలయపు తలుపులు తెరచుకోవాలని ఆజ్ఞాపించారు. యాజకులు ఆ ప్రభువు ఎవరని ప్రశ్నింపగా భక్తులు అతడు సైన్యాలకు అధిపతియైన ప్రభువని వాకొన్నారు. దానితో అతడు యావే ప్రభువని తెలిసిపోయింది. ఈలా ఈ కీర్తన అంతాగూడ నాటకీయ శైలిలో నడిచింది. సైన్యాలకు అధిపతీ, మహిమాన్వితుడూ ఐన ప్రభువుని మనం కూడ స్తుతించి కీర్తించాలి.

## 25. ఆపదలో ప్రార్థన

ఇది విలాపగీతం. ఈ పాటను కట్టిన భక్తుడు ఇక్కట్టుల్లో వున్నాడు. తాను పూర్వం జేసిన పాపాలే తనకు శ్రమలు తెచ్చి పెట్టాయనిగూడ భావించాడు. కనుక అతడు ప్రభువుకి ప్రార్థన చేసాడు. తన పాపాలను మన్నించి శ్రమలను తొలగించమని వేడుకొన్నాడు. తాను యౌవనంలో తెలిసీతెలియక చేసిన పాపాలను క్షమించమని అడుగుకొన్నాడు. ఇంతవరకు నీవు నాపట్ల చూపుతూ వచ్చిన కరుణను విస్మరించవద్దని వేడుకొన్నాడు. ఈ పుణ్యాత్మునిలాగే మనకుకూడ ఆపదలు వస్తాయి. అప్పుడు మనంకూడ వినయంతో ప్రభువుకి ప్రార్థన చేసికోవాలి. దేవా! నేను నిన్ను నమ్మాను అని చెప్పుకోవాలి.

## 26. నిర్దోషి ప్రార్థనం

ఇది కూడ విలాపగీతం. ఈ పాటను కట్టిన కవి ఇక్కట్టుల్లో వుండి ప్రభువు సహాయం అడుగుకోవడానికి దేవళానికి వచ్చాడు. తాను నిర్దోషిననీ తన ఆపదను తొలగించమనీ ప్రభువుని అడుగుకొన్నాడు. తన నిష్కల్మషత్వాన్ని నిరూపించుకోవడానికి దేవళంలో చేతులు కడుగుకొన్నాడు. దేవుణ్ణి స్తుతిస్తూ బలిపీఠంచుట్టూ ప్రదక్షిణం చేసాడు. ప్రభువు వసించే దేవళమంటే అతనికి ఎంతో యిష్టం, ఎంతో గౌరవం. ఈ భక్తునిలాగే మనం కూడ ఆపదలో ప్రభుని శరణువేడాలి. అతని దేవళానికి వెళ్లాలి. దేవా నీవు నన్ను కరుణతోజూడు అని అడుగుకోవాలి.

## 27. దేవుని అండదండలు

ఇది నమ్మకాన్ని తెలియజేసే కీర్తన. ఏదో కష్టంవచ్చి భక్తుడు ప్రభువు దేవళంలోకి వచ్చాడు. దేవుని పట్ల తనకున్న నమ్మకాన్ని ఆ ప్రభువు ముందట వెల్లడి చేసికొన్నాడు. ప్రభువే తనకు దీపం, కోట అని చెప్పుకొన్నాడు. తాను బ్రతికినన్నాళ్ళు ప్రభువు మందిరంలోనే వసించాలని తన కోరిక అని నుడివాడు. సొంత తల్లిదండ్రులు తన్ను

విడనాడినా ప్రభువుమాత్రం తన్ను చేరదీస్తాడని విశ్వసించాడు. అతడు భవిష్యత్తులో తనకేదైన కీడు కలగవచ్చునని భయపడ్డాడు. కనుక తన్ను సురక్షితమైన మార్గంలో నడిపించమని దేవుణ్ణి వేడుకొన్నాడు. ఈ భక్తునిలాగే మనం కూడ ప్రభూ! నీ దివ్యముఖాన్ని నానుండి దాచుకోవద్దు అని వేడుకోవాలి. ప్రభువేనాకు కోట, ఇక నేనెవరికీ భయపడను అని చెప్పుకోవాలి.

## 28. మనవి, కృతజ్ఞత

ఇది విలాప కీర్తనం. భక్తునికి శత్రువుల వలన ఏదో కష్టం వచ్చింది. వాళ్ళు బయటికి స్నేహం ఉట్టిపడినట్లుగా మాట్లాడుతున్నారు. వారి హృదయంలో మాత్రం దుష్టత్వం గూడుగట్టుకొని వుంది. భక్తుడు ఆ దుర్మార్గులకు దడిసి ప్రభువుని శరణువేడాడు. దేవుడు అతనికి సాయం చేసాడు. అతన్ని ఆపదలోనుండి ఒడ్డుకి జేర్చాడు. కనుక కీర్తనకారుడు ప్రభువుకి వందనాలు చెప్పాడు. ప్రభువే నాకు బలం, డాలు అని పాడాడు. మనంకూడ ఇబ్బందుల్లో మనకు రక్షణదుర్గమైన ప్రభువుని ఆశ్రయించాలి.

## 29. తుఫానులో దేవుడు

ఈ కీర్తన యిస్రాయేలు దేశంలో సంభవించిన ఓ పెద్ద తుఫానును వర్ణిస్తుంది. ఆ తుఫానులో మెరపులూ పిడుగులూ చూపట్టాయి. ప్రజలందరూ భీతిజెందారు. ప్రభువు కలిగించిన తుఫాను అతని అనంత శక్తినీ మహిమనీ వెల్లడి చేసింది. ప్రకృతి బీభత్సంలో ఆ ప్రభువు దర్శనమిచ్చాడు. అతడు భయంకరుడు. ఐనా తన ప్రజలను శాంతి సమాధానాలతో కాచికాపాడేవాడు. ఈ కవిలాగే మనం కూడ ప్రకృతి శక్తుల్లో భగవంతుని హస్తాన్ని దర్శించాలి.

## 30. ఆపద తప్పగా కృతజ్ఞతాస్తుతి

ఈ పాట కట్టిన రచయిత వ్యాధివాతబడి మృత్యువు కోరల్లో చిక్కుకొన్నాడు. ఐనా అతడు నమ్మకంతో దేవునికి ప్రార్థన చేసాడు. ప్రభువు అతన్ని మృత్యుపాశాల నుండి విడిపించాడు. కనుక కవి నీవు నా శోకాన్ని నాట్యంగా మార్చావు. నేను తాల్చిన గోనెను తొలగించి నాకు ఆనందకరమైన బట్టలు కట్టబెట్టావు అని చెప్పుకొన్నాడు. భగవంతుడు తన దాసులమీద క్షణకాలం కోపిస్తాడు. అతని అనుగ్రహం మాత్రం జీవితాంతం వుంటుంది. ఈ పుణ్యచరితునిలాగే మనం కూడ చాలసార్లు వ్యాధిబాధల నుండి బయటపడ్డాం. కనుక మనం కూడ "ప్రభువైన దేవా! నేను నీకు వందనాలు అర్పిస్తాను అని చెప్పుకోవాలి.

## 31. ఆపదలో ప్రార్థన

ఇది విలాపగీతం. ఆపదలో వున్న భక్తుడు తన వేదనలను భగవంతునికి నివేదించుకొన్నాడు. నరులు తన్ను చచ్చినవాణ్ణి మర్చిపోయినట్లుగా మర్చిపోయారు. పనికిరాని వస్తువునులాగ మూలన పడవేసారు. కనుక అతనికి దుఃఖం కలిగింది. అతడు తన్ను కాపాడమని ప్రభువుని వేడుకొన్నాడు. దేవుడు మంచివాడు కనుక అతని ఆర్తిని తొలగించాడు. ఆ పుణ్యశీలుడు దేవునికి వందనాలు అర్పించాడు. ఆ పుణ్యాత్మునిలాగే మనం కూడ కష్టాల్లో ప్రభుని శరణు వేడాలి. ప్రభూ! నన్ను నేను నీ చేతుల్లోనికి అర్పించుకొంటున్నాను అని చెప్పాలి.

## 32. పాపాన్ని ఒప్పుకోవడం

పాపం వ్యాధిని తెచ్చిపెడుతుందనీ, పాపపరిహారం వలన వ్యాధి తొలగిపోతుందనీ యిస్రాయేలు ప్రజల నమ్మకం. ఈ కీర్తన చెప్పిన కవి వ్యాధి వాతబట్టాడు. అతడు వినయంతో దేవుని యెదుట తన పాపాన్ని ఒప్పుకొన్నాడు. దానితో అతనిరోగం తొలగిపోయింది. స్వీయానుభవంతో అతడు భావితరాలవారికి ఉపదేశం చేసాడు. పాపం చేయవద్దనీ, పాపం చేసిన దుష్టులు పెక్కువేదనలు అనుభవిస్తారనీ హెచ్చరించాడు. పాప భారంవలన క్రుంగిపోయినపుడు మనంకూడ ఈ ధర్మవర్తనుని లాగే నేను దేవుని యెదుట నా పాపాలను వొప్పుకొంటాను, నా అపరాధాలను దాచను అని చెప్పుకోవాలి. పాపభారం వదలించుకొన్నవాడు ఉల్లాసంచెంది ఆనందిస్తాడు.

## 33. సృష్టికర్త

ఈ కీర్తన కృతజ్ఞతాస్తుతి. ప్రభువు తనకు ఏదో ఉపకారం చేసినందులకు ఈ స్తోత్రకారుడు అతనికి వందనాలు అర్పిస్తున్నాడు. ప్రభువు సృష్టికర్త. అతని వాక్కు కూడ సృష్టి చేసేదే. అతడు ఒక్క పలుకు పలకగానే లోకం పుట్టింది. దేవుడు కలిగించిన యీ లోకంలో అతని సాన్నిధ్యం నెలకొని ఉంటుంది. ఈ లోకమంతా అతని ప్రేమతో నిండివుంది. ఈ పుణ్యశీలుని లాగే మనం కూడ దేవునినుండి ఉపకారం పొందినవాళ్ళం. కనుక మన తరపున మనంకూడ అతన్ని స్తుతించి కీర్తించాలి. ప్రభూ! మేము నిన్ను విశ్వసించినట్లే, నీ కరుణకూడ సదా మమ్ము ఆవరించి వుండునుగాక అని చెప్పుకోవాలి.

## 34. దేవుని మంచితనం

ఇదికూడ కృతజ్ఞతాస్తుతే. తనకు ఏదో ఉపకారం చేసినందులకు భక్తుడు దేవళంలో ప్రభువుని స్తుతించాడు. అచటి భక్తులకు ఉపదేశంకూడ చేసాడు. మీరే పరిశీలించి చూడండి,

ప్రభువు ఎంత మంచివాడో మీకే తెలుస్తుంది అన్నాడు. భగవంతుని మంచితనాన్ని అనుభవానికి తెచ్చుకొన్నవాడు అతన్ని ప్రేమించకుండా వుండలేడు. అతన్ని పదిమందికి చాటిచెప్పకుండా వుండలేడు. ఈ భక్తునిలాగే మనంకూడ ప్రభువు కృపను అనుభవానికి తెచ్చుకోవాలి. అతనిమీద భారంవేసి జీవించాలి.

## 35. కష్టాల్లో వేడికోలు

ఈ కీర్తన చెప్పిన కవికి శత్రువుల బాధ మిక్కుటమైంది. కనుక ఆ దుర్మార్గులు పెట్టే బాధలనుండి తన్ను రక్షింపమని ప్రభుని వేడుకొన్నాడు. ఆ శత్రువులు పూర్వం అతనినుండి ఉపకారాలు పొందారు. ఐనా ఇప్పుడు అతన్ని బాధిస్తున్నారు. కనుక అతని వేదన ఇంకా యెక్కువైంది. ఈ తీవ్రవేదనతోనే అతడు ప్రభుని తనకు సాయం చేయమని వేడుకొన్నాడు. శీఘ్రమే వచ్చి తన్ను కాపాడమని మొరపెట్టుకొన్నాడు. ఈలాంటి సంఘటనలు మన జీవితంలోకూడ అప్పుడప్పుడు పొడచూపుతుంటాయి. అప్పుడు మనంకూడ ప్రభూ! నీవు నాకు న్యాయం చెప్పు. నా పక్షాన వాదించు అని వేడుకోవాలి.

## 36. పాపి దుష్టత్వం, దేవుని మంచితనం

ఈ గీతాన్ని చెప్పిన భక్తుడు పాపి దుష్టత్వాన్ని తలంచుకొని విలాపగీతం వ్రాసాడు. పాపం అతని హృదయంలో మంత్రాలోచన చేస్తూంటుంది. పాపి దేవుణ్ణి లెక్కచేయక దుష్కార్యాలు చేస్తాడు. ఐనా ప్రభువు మంచివాడు. అతడు పాపాన్ని క్రమేణ అణచివేస్తాడు. దుష్టులకుగూడ మంచిబుద్ధిని దయచేస్తాడు. మంచివాళ్ళను ఇంకా అధికంగా ఆదరిస్తాడు. ఎల్లరికీ తన కృపను ప్రేమను దయచేస్తాడు. కట్టకడన నరుల దుష్టత్వం అంతరిస్తుంది. దేవుని మంచితనం మాత్రమే మహాపర్వతాల్లాగ స్థిరంగా నిలుస్తుంది. లోకంలో చెడుగు మంచిని జయించలేదు. ఈ గీతాన్ని చెప్పిన పుణ్యశీలునితోపాటు మనం కూడ ప్రభువుతో "నీవు జీవపు చెలమవు, నీ వెలుగు వలననే మేమూ వెలుగు చూస్తాం" అని చెప్పుకోవాలి.

## 37. దుష్టుల గతి, సజ్జనుల గతి

దుష్టుడు వృద్ధిలోకి వస్తున్నారెందుకా అని యిస్రాయేలీయులు చాలమంది విస్తుపోయేవాళ్ళు. వాళ్ళపట్ల అసహనం చూపేవాళ్ళు. ప్రభువు వాళ్ళను శీఘ్రమే అణచివేయాలని కోరుకొనేవాళ్లు. ఈ కీర్తనం చెప్పిన భక్తుడు దుర్మార్గుల అభివృద్ధిని చూచి వికలమనస్కులు కావద్దనీ, కోపం తెచ్చుకోవద్దనీ హెచ్చరించాడు. దుష్టుల విజయం తాత్కాలికమైంది. వాళ్ళు మహా వృక్షంలా ఎదిగినా పెల్లగిల్లి పడిపోతారు. ఒకసారి పడిపోతే మళ్లా లేవరు. దేవుని ఆజ్ఞలు పాటించే సత్పురుషుడు మాత్రం స్థిరంగా నిలుస్తాడు. వెలుగులా ప్రకాశిస్తాడు. అతని బిడ్డలకు అడుక్కొని తినే గతి పట్టదు. కనుక మనకు

ఆదర్శం సత్పురుషుడుకాని దుర్మార్గుడు కాదు. మనం ప్రభువుమీద భారంవేసి అతన్ని నమ్మితే అతడు మన కార్యాలన్నీ నెరవేరుస్తాడు.

## 38. బాధల్లో ప్రార్థనం

ఇది విలాపగీతం. దీన్ని వ్రాసిన భక్తుడు ఘోరమైన వ్యాధితో బాధపడుతున్నాడు. అతని గుండె దడదడ కొట్టుకొంటూంది. సత్తువ ఉడిగిపోయింది. కండ్లల్లో కాంతి అంతరించింది. స్వీయ పాపాలవలననే తాను ఈ వ్యాధికి చిక్కాననికూడ అతనికి తోచింది. ఇరుగుపొరుగువాళ్ళు కూడ అతని వ్యాధికి విపరీతార్థాలు కల్పించి గేలిచేసారు. ఈలాంటి పరిస్థితుల్లో ఆ పుణ్యశీలుడు దేవునికి మొరపెట్టాడు. తన తప్పిదాలను క్షమించి ఆరోగ్యదానం దయచేయమని వేడుకొన్నాడు. ఈ సజ్జనునిలాగే మనం కూడ వ్యాధిబాధలకు గురౌతాం. కష్టాలవాత పడతాం. అప్పుడు ఆ ప్రభువుకి ప్రార్థన చేసికోవాలి, “నా రక్షకుడవైన ప్రభూ! నీవు నన్ను ఆదుకోవడానికి శీఘ్రమే విచ్చేయి” అని మనవి చేసికోవాలి.

## 39. నరుని అల్పత్వం

ఈ కీర్తన వ్రాసిన రచయిత తీవ్రవ్యాధితో బాధపడుతూన్నాడు. అతడు తన్ను శ్రమలపాలు చేసిన దేవుని మంచితనాన్ని గూర్చి ప్రశ్నించాలనుకొన్నాడు. కాని తన ఫిర్యాదులు విని దుష్టులు దేవుని పట్ల పూర్తిగా భక్తి కోల్పోతారేమోనని దడిసి మౌనంగా వుండిపోయాడు. పాపం అతని బాధ మిక్కుటమైంది. అతనికి నరజీవితం స్వల్పకాలికమైంది అన్పించింది. జీవితంలో ఈ యార్భాటమంతా ఎందుకా అనిపించింది. ఈలాంటి నిర్వేదంతో అతడు తన్ను ఆదుకొమ్మని ప్రభువుకి మనవిచేసాడు. ఒకోసారి మనంకూడ దేవునిమీద తప్పుబట్టపోతాం. ఈ లోకంలో మనకెదురయ్యే కష్టాలను భరించలేక దేవుడు మనకేదో ద్రోహంచేసాడని వాపోతాం. ఈలాంటి మనస్తత్వానికి గురికాకుండావుండే భాగ్యాన్ని దయచేయమని ఆ ప్రభువునే అడుగుకొందాం.

## 40. దైవస్తుతి, మనవి

ఈ కీర్తనలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగంలో రచయిత ప్రభువుకి కృతజ్ఞతా స్తుతులు చెల్లించాడు. రెండవభాగం విలాప కీర్తన. ఈ భాగంలో అతడు ప్రభువు తన తప్పిదాలను మన్నించి తన ఆపదలను తొలగించాలని వేడుకొన్నాడు. ఆ రోజుల్లో అందరూ దేవళంలో జంతుబలులు అర్పించేవాళ్లు. ఈ బలులవల్ల ప్రభువు వరప్రసాదాన్ని పొందుతామని నమ్మేవాళ్ళు. కాని ఈ యాచారం ఈ కీర్తనకారునికి నచ్చలేదు. అతడు పశుబలులు సమర్పించడంకంటె దేవుని చిత్తాన్ని పాటించడం మేలు అని చెప్పాడు. దేవుని ఆజ్ఞలప్రకారం జీవించడం శ్రేయస్కరమని వాకొన్నాడు. ఎందుకంటే ఆరాధనం

సులువుగా కర్మకాండ ఔతుంది. మన ఆరాధనంలో కూడ తరచుగా కర్మకాండలో పడిపోతాం. చిత్తశుద్ధి లోపిస్తుంది. ఈలాంటి సందర్భంలో మనం దేవునిఆజ్ఞలను ఎంతవరకు పాటిస్తున్నామా అని పరిశీలించి చూచుకోవాలి. మన జీవితంలో ఎల్లప్పుడు దేవుని చిత్తప్రకారం జీవించే భాగ్యాన్ని దయచేయమని అడుగుకొందాం.

## 41. రోగి ప్రార్థనం

ఈ కీర్తన చెప్పిన భక్తుడు వ్యాధివాతబడ్డాడు. అతని స్నేహితులు అతన్ని విడనాడారు. విరోధులు అతన్ని ఎగతాళిచేసారు. ఇతనికి మాయదారి రోగంపట్టుకొంది. ఇక మంచంమీదినుండి లేవడు అని చెప్పుకొన్నారు. కాని ఈ పుణ్యపురుషుడు మాత్రం ప్రభువుని నమ్మి అతనికి మొరపెట్టుకొన్నాడు. అతని కృపవలన తన ఆపద తొలగిపోతుందని నమ్మాడు. ఈ విశుద్ధవర్తనునిలాగే మనంకూడ ఆపదల్లో ప్రభుని శరణువేడాలి.

## 42. ప్రవాసంలోని లేవీయుని ప్రార్థనం

ఈ కీర్తన చెప్పిన భక్తుడు లేవీయుడు. అతడు దేవళానికి దూరంగా ఎక్కడో ప్రవాసంలో వున్నాడు. దేవళానికి వెళ్ళి దేవుణ్ణి దర్శింపలేకపోతినే అని బాధపడ్డాడు. దప్పిక గొనిన దుప్పి సెలయేటి నీళ్ళకులాగె తన హృదయం ప్రభువు కొరకు తపించిపోతుందని చెప్పుకొన్నాడు. ప్రభువు దివ్యముఖ్యాన్ని ఎప్పుడు దర్శిస్తానోగదా అని ఉవ్విళ్లూరి పోయాడు. పూర్వం అతడు భక్త బృందాన్ని దేవాలయానికి నడిపించుకొని పోయేవాడు. ఆ సంఘటన జ్ఞప్తికి వచ్చినపుడు అతని హృదయం ద్రవించిపోయింది. ఆ పుణ్యచరితుడు దేవాలయారాధనంలో భగవంతుణ్ణి బాగా అనుభవానికి తెచ్చుకొన్నవాడు. ఆతని భక్తి మనకుగూడ అలవడితే ఎంతబాగుంటుంది! అతనిలాగే మనంకూడ దేవళంలో ప్రభువుని ఎప్పుడెప్పుడు సందర్శిస్తామా అని ఉవ్విళ్ళూరిపోవాలి. ఆ ప్రభువు దయకు నోచుకోవడం మహాభాగ్యమని యెంచాలి.

## 43. ప్రవాసంలోని భక్తుని ప్రార్థనం

ఇది విలాప కీర్తనం. ఈ కీర్తనకారుడు దేవళానికి దూరంగా ఎక్కడో దిక్కులేని తావులో వున్నాడు. అక్కడ శత్రువులు అతన్ని పీడించారు. అతడు శీఘ్రమే దేవళానికి వెళ్ళి ప్రభువుని దర్శింపగోరాడు. దేవా! నీ వెలుగు నీ సత్యాన్నీ పంపు, అవి నన్ను నీ మందిరానికి తోడ్కొని వస్తాయి అని విన్నవించుకొన్నాడు. కీర్తనలు చెప్పిన భక్తులకు దేవాలయంపట్ల అపారమైన భక్తివుండేది. దేవాలయ భక్తి అంటే ప్రభు భక్తే. వాళ్ళ ప్రభువు దివ్యముఖాన్ని దర్శించాలని తపించిపోయేవాళ్లు. నేడు వారి కీర్తనలు చదివి మనంకూడ దేవాలయ భక్తిని అలవర్చుకోవాలి. ప్రభువు సన్నిధిలోనికి వెళ్లాలని ఉబలాటపడాలి.

## 44. శ్రమల్లో ప్రజల ప్రార్థనం

ఇది విలాపకీర్తనం. యిస్రాయేలీయులకు ఏదో యుద్ధంలో అపజయం కలిగింది. వాళ్ళకు ప్రభువే తమ్ము శత్రువుల చేతికి అప్పగించాడనే తలంపుకూడ కలిగింది. కనుక ఆ ప్రజలు దేవళంలోకి వచ్చి దేవునికి మనవి చేసారు. దేవా! నీవు మోషే యోషువాల కాలంలో మాకీ గడ్డ నిచ్చావు. నీవే మా శత్రువులను అణచివేసావు. ఇప్పుడు మాత్రం మమ్ము అనాదరంజేసి విరోధుల వశంజేసావు అని విన్నపం చేసారు. ప్రభువు శీఘ్రమే తమకు సాయంజేయాలని వేడుకొన్నారు. మనంకూడ మన శ్రమల్లో "ప్రభూ లే! మమ్మాదుకోవడానికి శీఘ్రమే విచ్చేయి" అని మనవి చేసికోవాలి.

## 45. రాజ వివాహ గీతం

ఇది ఓ యిస్రాయేలు రాజు వివాహ సందర్భములో పాడిన పాట. దీనిలో మూడు భాగాలున్నాయి. మొదటి భాగంలో కవి రాజుని స్తుతించాడు. అతనికి విజయం కలగాలనీ కీర్తిప్రతిష్ఠలు అబ్బాలనీ ఆశీర్వదించాడు. రెండవ భాగంలో రాజవధువుకి స్వాగతం చెప్పాడు. కుమారీ! ఇక నీవు నీ పుట్టింటిని మరచిపోయి ఈ రాజు అండదండల్లో వుండిపొమ్మని చెప్పాడు. మూడవ భాగంలో రాజుకి సంతానం కలగాలని దీవించాడు. పూర్వవేద భావాల ప్రకారం దేవుడనే వరుడు యిస్రాయేలు అనే వధువును భార్యగా స్వీకరించాడు. కనుక ఇది క్రమేణ మెస్సియాకు పూర్వవేద ప్రజలకు వర్తించే కీర్తనగా మారిపోయింది. ఇపుడు నూత్నవేదకాలంలో ఈపాట క్రీస్తుకీ తిరుసభకీ వుండే ప్రేమబంధాన్ని సూచిస్తుంది. ఇంకా, భగవంతునికీ ప్రతి భక్తునికీవుండే సంబంధాన్నిగూడ తెలియజేస్తుంది. కనుక ఇప్పుడు ఈ గీతాన్ని పలువిధాలుగా మన ప్రార్థనకు వాడుకోవచ్చు.

## 46. దేవుడే తన ప్రజలకు ఆశ్రయణీయుడు

ఇది సియోను గీతం. సియోను అంటే యెరూషలేం. ప్రభువు సియోనున వసిస్తున్నాడు కనుక శత్రువులు దాన్ని జయించలేరు. భూకంపం, ఉప్పెన మొదలైన ప్రకృతి వైపరీత్యాలు కూడా దాన్ని నాశం జేయలేవు. ప్రభువు ఆ నగరంలో శాంతిని నెలకొల్పుతాడు. సియోను నగరం తిరుసభకు చిహ్నం. సియోనును యావే ప్రభువులాగే తిరుసభను క్రీస్తు కాపాడి రక్షిస్తుంటాడు. దేవుడు మనకు ఆశ్రయణీయుడు. ఆపదల్లో మనలను ఆదుకొంటాడు. ఆ ప్రభువుని నమ్మితే చాలు మనం సురక్షితంగా వుండిపోతాం.

## 47. యిస్రాయేలు రాజు లోకనాయకుడునైన ప్రభువు

ఇది యావే రాజు అని చెప్పే కీర్తన. ప్రభువు విశ్వధాత్రికి రాజు. రాజులందరూ, జాతులన్నీ అతనికి లొంగి వుండవలసిందే. ఈ ప్రభువు వైభవంతో అభిషేకం పొందుతాడు.

సింహాసనాన్ని అధిరోహించి అన్ని జాతులను పరిపాలిస్తాడు. యావే ప్రభువులాగే క్రీస్తుకూడా రాజు. ఐనా అతడు లౌకిక రాజు కాదు. ఆధ్యాత్మికరాజు. ఒకే మందా, ఒకే కాపరీ ఒకే రాజు వుండే శుభదినం కొరకు మనం ప్రార్థించాలి. విశ్వలోకానికి రాజైన ప్రభువు మన హృదయానికి కూడ రాజు కావాలి. దైనందని జీవితంలో దైవరాజ్యాన్ని గూర్చిన విలువలు మనలను నడిపిస్తుండాలి. రాజాధిరాజైన ప్రభువుకి మనం నిరంతరం మ్రొక్కుతుండాలి.

## 48. దేవుని పర్వతమైన సియోను

ఇది సియోను కీర్తన. ప్రభువు సియోనులో వసిస్తుంటాడు. అది లోకానికంతటికీ ఆనందాన్ని చేకూర్చే నగరం. ప్రభువే దాన్ని కాపాడుతుంటాడు కనుక శత్రువులు దాన్ని జయించలేరు. సియోను చుట్టు తిరిగి దాని వైభవాన్ని గమనించమని కీర్తనకారుడు యాత్రికులను కోరాడు. తాము చూచినదానిని తమ బిడ్డలకు కూడ తెలియజేయమని ఆదేశించాడు. సియోను తిరుసభకు, మన హృదయానికీ గూడ చిహ్నంగా వుంటుంది. ప్రభువు సియోనులోలాగ మన హృదయంలో కూడ వసించాలని కోరుకొందాం.

## 49. సంపదలు అశాశ్వతాలు

ఇది జ్ఞానకీర్తనం. కీర్తనకారుడు ఇహలోక సంపదలను గూర్చి మననం చేసికొని తన భావాలను ఈలా వివరించాడు. మనం ఈ లోకంలోకి వస్తూ సంపదలను తీసికొని రాలేదు. ఇక్కడినుండి వెళ్తు వాటిని వెంటబెట్టుకొనిపోము. వాటిని ఇతరులకు వదలి పోవలసిందే. సంపదలు మనలను చావునుండి కాపాడలేవు. నరులందరూ వధకు గురైన మృగల్లాగ చావవలసిందే. కాపరి గొర్రెలను తోలుకొని పోయినట్లుగా మృత్యువు మనలను పాతాళలోకానికి తోలుకొని పోతుంది. కనుక సొత్తుని నమ్ముకొనేవాడు చెడతాడు. ప్రభువుని నమ్మి అతన్ని పూజించేవాడు బాగుపడతాడు. ప్రభువు మన ప్రాణాలను కాపాడి మనలను తన దగ్గరికి చేర్చుకొంటాడు. కనుక ఈ లోకసంపదలు కాక ప్రభువే మనకు అండా దండా కావాలని ప్రార్థిద్దాం.

## 50. నిజమైన ఆరాధనం

ఇది హెచ్చరిక కీర్తన. ఇది చిత్తశుద్ధిలేని దేవాలయారాధననూ కర్మకాండనూ నిరసిస్తుంది. యిస్రాయేలీయులు దేవళంలో జంతుబలులు సమర్పించేవాళ్లు. కాని దేవుడు ఈ బలులతోనే సంతృప్తి చెందదు. అతడు ఎడ్ల మాంసం తినడు, మేకల నెత్తురు త్రాగడు. ప్రభువు కోరేది చిత్తశుద్ధికల ఆరాధనం, కృతజ్ఞతావందనం. దైవచిత్త ప్రకారం జీవించడం. దేవుని ఆజ్ఞలు పాటించడం. తన ఆజ్ఞలను పాటించనివాణ్ణి దేవుడు అంగీకరించడు. కనుక ప్రభువు కట్టడలను పాటించి అతని చిత్తప్రకారం జీవించే భాగ్యాన్ని అడుగుకొందాం.

## 51. పాపక్షమకై ప్రార్థనం

ఇది విలాప కీర్తనం. గొప్ప పశ్చాత్తాప భావాలు కలది. ఈ పాట చెప్పిన భక్తుడు తన పాపజీవితాన్ని రోసి భగవంతుని ముందు చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడ్డాడు. నా పాపాలను తుడిచివేయ, నన్ను కడిగి శుద్ధిచేయి అని వేడుకొన్నాడు. నేను నీకే ద్రోహంగా పాపం చేసాను అని చెప్పుకొన్నాడు. నాలో నిర్మల హృదయాన్ని సృజించు అని మనవి చేసికొన్నాడు. బలిపశువునిగాక పశ్చాత్తాప పూరితమైన హృదయాన్ని నీ కర్పిస్తున్నానని వాకొన్నాడు. ఈ భక్తునిలాగా మనం కూడ మన పాపాలకు పశ్చాత్తాపపడాలి. ఆ పశ్చాత్తాపాన్ని దేవునికి కానుకగా సమర్పించాలి. ఆ ప్రభువు మననుండి కోరేది వినయమూ, పశ్చాత్తాపం. ఈ భాగ్యాలను దయచేయమని ప్రభువునే అడుగుకొందాం.

## 52. దుష్టుడికి పట్టే దుర్గతి

ఇది హెచ్చరిక కీర్తన. ఎవడో దుష్టాధికారి ఓ నియంతలాగ రచయితను పీడించాడు. రచయిత రెచ్చిపోయి ఈ కీర్తన చెప్పాడు. నీవు దౌష్ట్యంతో విర్రవీగనేల అని అతడు ఈ నియంతను మందలించాడు. ప్రజలను నాశంజేసే నిన్ను ప్రభువే నాశం జేస్తాడని హెచ్చరించాడు. మనం ధనబలం, అధికార బలం, కులబలం చూచుకొని పేదలను పీడిస్తాం. దీనివలన ప్రభువు శిక్షను కొనితెచ్చుకొంటాం. కనుక మన జీవితంలో పరపీడనానికి పాల్పడిన సందర్భాలను తలంచుకొని పశ్చాత్తాపపడదాం. తరచుగా ఇతరులు మనకు కీడు చేసారని వాపోతాం. కాని మనం ఇతరులకు ఎన్నిసార్లు కీడు చేసామో ఆలోచించనే ఆలోచించం.

## 53. దేవుని నమ్మనివాళ్లు

యూదులంతా ఆస్తికులే. వారిలో నాస్తికులు ఎవరూ లేరు. కాని దేవుడున్నాడని నమ్మినా కొందరు యూదులు మాత్రం దేవుడు లేడో అన్నట్లుగా పాపకార్యాలకు ఒడిగట్టేవాళ్లు. దేవుడు తమ్ము పట్టించుకోడులే అన్నట్లు బరితెగించి దుష్కార్యాలు చేసేవాళ్లు. భక్తుడు ఈ కీర్తనలో ఈలాంటి పాపులను పేర్కొన్నాడు. పాపకార్యాలను మానుకొమ్మని తన నాటి ప్రజలను హెచ్చరించాడు. పేదసాదలకు కీడు చేయవద్దని మొరపెట్టాడు. మనం కూడా కొన్ని పర్యాయాలు దేవునిపట్ల భక్తిజూపం. ఆధ్యాత్మిక విషయాల్లో పట్టీపట్టనట్లుగా వుండిపోతాం. అసలు దేవుడు లేడో అన్నట్లుగా పాపకార్యాలకు పూనుకొంటాం. ఈలాంటి తప్పిదాలకు పశ్చాత్తాప పడదాం.

## 54. న్యాయవంతుడైన దేవునికి విన్నపం

ఇది విలాప కీర్తనం. ఈపాట కట్టిన భక్తునికి శత్రుపీడనం ఎదురైంది. కనుకనే గర్వితులు నామీదికి ఎత్తివస్తున్నారు. క్రూరులు నా ప్రాణాలు తీయగోరుతున్నారు అని చెప్పుకొన్నాడు. ఐనా తాను ప్రభువుని నమ్మిన భక్తుడు. ప్రభువు తన విరోధులను మన్ను గరిపించి తన్ను కాపాడాలని వేడుకొన్నాడు. కడన దేవుడు శత్రువులను చీకాకుపరచి తన్ను రక్షించినట్లుగానే భావించి వందనాలు అర్పించాడు. మనం కూడ దేవుడు సాయం చేస్తాడని నమ్మి అతన్ని శరణువేడుదాం.

## 55. హింసల్లో ప్రార్థనం

ఇది కూడ విలాప కీర్తనమే. ఈ కీర్తనకారునికి తన స్నేహితుడే ద్రోహం చేసాడు. అది అతనికి భరింపరాని బాధఐంది. అతడు రేయింబవళ్లు దుఃఖానికి గురయ్యాడు. ఐనా, నామట్టుకు నేను దేవునికి మొరపెట్టుకొంటాను. అతడు శత్రువుని శిక్షించి నా బాధను తొలగిస్తాడు అనుకొన్నాడు. ఇతనిలాగే మనం కూడా కష్టాల్లో దేవునికి విన్నపం చేయాలి. దేవా! నామొర విను, నా విన్నపాన్ని పెడచెవిని పెట్టుకు అని అడుగుకోవాలి. మనకు మనమే నమ్మకంతో ఓయి! నీ భారాన్ని ప్రభువుమీద మోపు, అతడు నిన్ను భరిస్తాడు అని చెప్పుకోవాలి.

## 56. దేవుని నమ్మడం

ఇది కూడ విలాపకీర్తనం. ఈ కీర్తనకారునికి శత్రుపీడనం ఎదురైంది. అతడు దేవళానికి వెళ్లి తన బాధను ప్రభువుతో చెప్పుకొన్నాడు. పూర్వం కూడ అతడు ఆపదల్లో అనేకసార్లు ప్రభువుని ఆశ్రయించి సహాయం పొందివున్నాడు. కనుక ఈ కష్టకాలంలో ప్రభువు తన్ను ఆదరించి కాపాడతాడనే నమ్మకం అతనికుంది. కావుననే నీవు నా వేదనను గుర్తించావు. నా అశ్రుబిందువులను నీ సీసాలో పోసివుంచావు. వాటిని గూర్చి నీ గ్రంథంలో లిఖించి వుంచావు అని చెప్పుకొన్నాడు. ఈ పుణ్యపురుషునిలాగే మనం కూడ ఇక్కట్టుల్లో ప్రభువుని ఆశ్రయించాలి. దేవుని నమ్మి భయాన్ని విడనాడతాను, మానవ మాత్రులు నన్నేమి చేయగలరు అనుకోవాలి.

## 57. శత్రువుల నడుమ చిక్కుకోవడం

ఇది కూడ విలాపకీర్తనమే. కీర్తనకారుణ్ణి కష్టాలు చుట్టుముట్టాయి. అవి సింగాల్లాగ, కత్తుల్లాగ, ఉరుల్లాగ, గోతుల్లాగ అతన్ని బాధిస్తున్నాయి. కనుక అతడు ప్రభుని శరణువేడాడు. అతడు తన అద్భుతశక్తితో మింటికి పైగాలేని ధాత్రినంతటిని తన తేజస్సుతో నింపి, తన

మాహాత్మ్యంతో వచ్చి తన్ను కాపాడాలని వేడుకొన్నాడు. ఈ సత్పురుషుని లాగే మనం కూడ ప్రభునినమ్మి అతని సహాయాన్ని అడుగుకొందాం.

## 58. న్యాయాధిపతులకు న్యాయాధిపతి

అన్యాయపు న్యాయాధిపతులమీద మండిపడి కీర్తనకారుడు ఈ పాట చెప్పాడు. న్యాయాన్ని చెరిచే న్యాయాధిపతులను కసిదీర తిట్టాడు. వారికి పాముకువలె విషముంది అన్నాడు. ఎల్లరికీ న్యాయాధిపతియైన దేవుడు వారి మూతిపండ్లు రాలగొట్టాలని కోరాడు. వాళ్ళు కాలిక్రిందపడి నలిగిపోయిన గడ్డిలాగ ఎండి పోవాలని తిట్టాడు. గర్భస్రావం చెందిన పిండంలాగ నాశం కావాలని దూషించాడు. ఇతని కోపమూ తిట్లూ తీవ్రస్థాయిని చేరుకొన్నాయి. కనుకనే భక్తులు ఈ కీర్తనను తిరుసభ ప్రార్థనలో చేర్చలేదు.

## 59. దుష్టుల బారినుండి రక్షించమని ప్రార్థనం

ఇది విలాప కీర్తనం. భక్తుని శత్రువులు పీడిస్తున్నారు. వారి పోరుపడలేక అతడు ప్రభువుని ఆశ్రయించాడు. యిస్రాయేలు దేవుడవైన ప్రభూ! నీవులే నన్నాదుకో! నాయగచాట్లు నీవే చూడు అని మనవి చేసికొన్నాడు. నా రక్షణ దుర్గానివి నీవే, నన్ను కాపాడు అని విన్నపం చేసాడు. కడన ప్రభువు తన్ను ఆపదనుండి తప్పించాడని నమ్మి అతనికి వందనాలు అర్పించాడు. ప్రభువుతో ప్రతి ఉదయం నీ కరుణను కీర్తిస్తాను అని చెప్పుకొన్నాడు. ఈ కీర్తనకారునిలాగే మనం కూడ ఆపదల్లో ప్రభుని శరణు వేడాలి. మన ఆపద ఎంత తీవ్రమైందో అంత అధికంగా ప్రభువుకి మనవి చేసికోవాలి.

## 60. యుద్ధంలో ఓడిపోయి విలపించడం

యిస్రాయేలీయులు యుద్ధంలో ఓడిపోయారు. వాళ్ళు మూకుమ్మడిగా దేవళానికి వచ్చి ప్రభువుకి ప్రార్థన చేసారు. కీర్తనకారుడు ఈ పాటలో ఆ భక్తులను ఓదార్చాడు. ఈ పాటతో అతడు ప్రజలకు దేవునిపట్ల నమ్మకం పుట్టించి వారిని ప్రోత్సహించాడు. దేవానీవు మామొర విను, నీ బలంతో మమ్ము కాపాడు అని ప్రార్థించాడు. "దేవుడు మన పక్షాన వుంటే మనం శౌర్యంతో పోరాడతాం. అతడు మన శత్రువులనెల్ల నలగద్రొక్కుతాడు" అని చెప్పాడు. ఈ భక్తుని లాగే మనం కూడ ఇక్కట్టుల్లో ప్రభువుని నమ్మి అతనికి మనవి చేయాలి.

## 61. ప్రవాసంలోని భక్తుని ప్రార్థనం

ఈ పాట చెప్పిన భక్తుడు యెరూషలేముకి దూరంగా ప్రవాసంలో వున్నాడు. అక్కడి బాధలకు తట్టుకోలేక ప్రభువుకి వేడుదల చేసాడు. ప్రభూ! నీవు నా ఆక్రందనాన్ని

విను, నా వేడికోలును ఆలించు అని మనవి చేసాడు. నేను నీ మందిరాన వసిస్తాను, నీ రెక్కల మరుగున తలదాచుకొంటాను అని భక్తితో చెప్పుకొన్నాడు. యిస్రాయేలు ప్రజలకు రాజంటే గౌరవం. కనుక అతని కొరకు విజ్ఞాపనం చేసాడు. ప్రభువు మనం ఎక్కలేని ఉన్నత పర్వతాన్ని ఎక్కిస్తాడు. అతని కరుణే మనకు రక్ష. మనకు కూడ దేవాలయ భక్తిని దయచేయమని ఆ లోకనాథుని అడుగుకొందాం.

## 62. భగవంతునిపై కోర్కె

ఇది భగవంతునిపట్ల మొక్కవోని నమ్మకాన్ని చూపే కీర్తన. దేవుడు మాత్రమే నాకు విశ్రాంతిని దయచేస్తాడని భక్తుడు నమ్మకంతో చెప్పుకొన్నాడు. నేను ప్రభువుని మాత్రమే నమ్ముతాను అని దృఢవిశ్వాసంతో వాకొన్నాడు. బలమూ ప్రేమా ప్రభువుకే చెందుతాయి అన్నాడు. జనులారా మీరు ఎల్లవేళల ప్రభువుని నమ్మండి, మీగోళ్ళు అతనికి విన్నవించుకోండి అని తోడివారిని హెచ్చరించాడు. దేవునిపట్ల ఈ భక్తునికి వున్న నమ్మకం మనకు కూడ వుంటే ఎంత బాగుంటుంది!

## 63. దేవునిమీద కోర్కె

ఇది భగవంతునిమీద కోరికా ప్రేమా తెలిపే పాట. భక్తుడు దేవా నేను నీకొరకు ఉబలాటం చెందుతున్నాను అన్నాడు. నీళ్ళులేక మాడివున్న నేలలాగ నా ప్రాణం నీ కొరకు దప్పికగొంటూంది అని పల్కాడు. నీ ప్రేమ దీర్ఘాయువు కంటెగూడ మెరుగైంది అన్నాడు. ఈ భక్తుడు భగవత్సాన్నిధ్యాన్ని అనుభవించినవాడు. దానికెంతో విలువనిచ్చినవాడు. కనుకనే నీ సాన్నిధ్యమనే విందును ఆరగించి నా యాత్మ సంతృప్తిని చెందుతుంది అని చెప్పుకొన్నాడు. పగలేగాక రాత్రికూడ ప్రభువుని ధ్యానించుకొని పులకించిపోయాడు. నా పడక మీద నిన్ను స్మరించుకొంటాను. రేయి నాల్గుజాములు నిన్ను ధ్యానించుకొంటాను అని అనుభవపూర్వకంగా చెప్పుకొన్నాడు. ఈ పుణ్య పురుషునిలాగా మనంకూడ దేవా! నేను నీకు అంటిపెట్టుకొని నడుస్తాను అని చెప్పుకొందాం. దైవభక్తి కొరకు ప్రార్థిద్దాం.

## 64. నిందలు మోపినవారికి శిక్ష

శత్రువులు పరుషవాక్కులతో కీర్తనకారుని నొప్పించారు. అతనిపై అపదూరులు మోపారు. ఆ సందర్భంలో చెప్పిన విలాప కీర్తన యిది. విరోధులు తమ దుష్టవాక్కులను కత్తులవలె, బాణాలవలె కీర్తనకారుని మీదికి విసిరారు. అతనికి ఎంతో బాధ కలిగింది. కాని శత్రువులు తనమీద బాణాలు రువ్వితే, దేవుడు ఆ శత్రువుల మీద బాణాలు రువ్వుతాడు అనుకొని అతడు సంతృప్తి చెందాడు. రోజువారి జీవితంలో నాలుకతో ఇతరులు మనలను

బాధిస్తారు. మనమూ ఇతరులను బాధిస్తాం. కనుక మన నాలుకనూ దాని నుండి వెలువడే పరుషవాక్కులనూ అదుపులో పెట్టుకొనే భాగ్యంకొరకు ప్రభుని వేడుకొందాం.

## 65. వందన సమర్పణం

ఇది ప్రభువు వానలు కురిపించి పంటలు సమృద్ధిగా పండించినందులకు కృతాజ్ఞతాస్తుతి. ఈశ్వరుడు కుండపోతగా వాన కురిపించి పొలాన్ని తడుపుతాడు. వానవలన పైరెదిగివచ్చి పంటలు బాగా పండుతాయి. ప్రభువు తన మంచితనం వల్ల సంవత్సరాన్ని పంట అనే కిరీటంతో అలంకరిస్తాడు. అనగా విస్తారమైన పంటను దయచేస్తాడు. అతడు నడచే తావులన్నిటా ధాన్యసమృద్ధి నెలకొంటుంది. పంట సర్వేశ్వరుడు పెట్టే భిక్ష కదా! పచ్చిక పట్టుల్లో గొర్రెల మందలు, లోయల్లో గోదుమపైరు కన్నుల పండువుగా కన్పిస్తుంటాయి. మన దేశంలో ఎప్పుడూ అనావృష్టి బాధ. అప్పుడప్పుడూ అతివృష్టి బాధకూడ. కనుక సకాల వర్షాలతో అనువైన పంటలతో మనదేశాన్ని దీవించమని ప్రభువుని వేడుకొందాం. అతడు దయచేసిన ధాన్యలక్ష్మికి వందనాలు అర్పిద్దాం.

## 66. ప్రభుని స్తుతించండి

ఇది కృతజ్ఞతా కీర్తన. ప్రభువు జరిగిపోయిన కాలంలో యిస్రాయేలీయులకు మేలు చేసాడు. వారిని సముద్రం గుండా నడిపించుకొనిపోయాడు. యోర్దాను నదిని దాటించి కనాను దేశాన్ని చేర్చాడు. శత్రువులు యిస్రాయేలీయులను నానా శ్రమలకు గురిచేస్తే ప్రభువు ఆ బాధలన్నిటి నుండి వారిని కాపాడాడు. ఈ వుపకారాలన్నిటికి భక్తుడు ప్రభువుకి వందనాలు చెప్పాడు. ఇంకా దేవుడు కీర్తనకారునికి వ్యక్తిగతంగా ఉపకారాలు చేసాడు. కనుకనే అతడు కృతజ్ఞతాభావంతో "ప్రభువు నాకు చేసిన మేలును మీ కందరికి విన్పిస్తాను" అన్నాడు. భగవంతుడు మనకు కూడ ఎన్నో మేళ్లు చేసాడు. ఎన్నో ఆపదల నుండి మనలను కాపాడాడు. దీనికి మనం అతనికి ఎల్లవేళల కృతజ్ఞత తెలపాలి.

## 67. కోతకాలపు పాట

ఇది రైతులు పంటను కోసికొనేపుడు పాడే పాట. యవలు, గోదుమలు, ద్రాక్షలు, ఓలివులు యిస్రాయేలీయుల ముఖ్య పంటలు. దేవుడు వానలు కురిపించి ప్రజలను దీవించాడు. వాళ్ళ పొలం చక్కగా పండింది. ఇందుకు వాళ్లు దేవుణ్ణి స్తుతించారు. అన్యజాతులు కూడ అతన్ని స్తుతించాలని కోరుకొన్నారు. నేడు మన పొలాలను పండించేది కూడ ఆ సర్వేశ్వరుడే. మనకు కూడు గుడ్డ యిల్లు వాకిలి దయచేసేది అతడే. కనుక

మనలను ఎల్లవేళల కరుణింపమని ఆ దయామయుని అడుగుకోవాలి. మా మీద కరుణ జూపి మమ్ము దీవించు. నీ ముఖకాంతిని మా మీద ప్రకాశింపనీయి అని అతన్ని అడుగుకోవాలి. ప్రభువు ఈ వరకే దయచేసిన పంటలకు అతనికి వందనాలు అర్పించాలి.

## 68. విజయగీతం

ప్రభువు సాధించిన విజయాలకు అతన్ని స్తుతించే కీర్తన యిది. ఈ పాటలో దేవుడు సీనాయినుండి విచ్చేసి సియోను కొండనెక్కి దేవాలయం ప్రవేశించినట్లుగా వర్ణించాడు కీర్తనకారుడు. అతడు అనాథులకు తండ్రి, వితంతువులకు ఆదరువు. అనగా కరుణ గల దేవుడు. అతడు దినదినమూ మన భారాన్ని మోస్తాడు. మనకు రక్షణాన్ని ప్రసాదిస్తాడు. కనుక అతనికి సదా స్తుతులు చెల్లిద్దాం.

## 69. శోకగీతం

ఇది విలాపగీతం. ఈ కీర్తనకారునికి వచ్చిన ఆపద యేమిటో మనకు తెలియదు. అది వ్యాధో పరనిందో శత్రుపీడనమో ఐయుంటుంది. అతనికి దేవాలయం పట్ల వున్న భక్తే అతనికి తిప్పలు తెచ్చిపెట్టింది. ఆ భక్తుడు తీవ్రబాధలు అనుభవిస్తున్నా అతనికి సానుభూతిగాని ఓదార్పుగాని లభించలేదు. కనుక అతడు నా మట్టుకు నేను దీనుణ్ణి బాధామయుణ్ణి అయ్యాను అని చెప్పుకొన్నాడు. ప్రభూ! నీ రక్షణంతో నన్ను ఉద్ధరించు అని వేడుకొన్నాడు. కష్టాలు అందరికీ వస్తాయి. బాధల్లో అందరమూ క్రుంగిపోతాం. కనుక ఆపదల్లో ప్రభువు మనలను కాచి కాపాడాలని అడుగుకొందాం.

## 70. ఆర్తనాదం

ఈ కీర్తన చెప్పిన భక్తుడు ఏదో ఆపదలో ఉన్నాడు. కనుక అతడు ప్రభువు శీఘ్రమే వచ్చి తనకు సాయం చేయాలని ప్రార్థించాడు. దేవుడు తన్నాదుకోవడానికి వస్తే తన శత్రువులు అవమానంతో తలదించుకొంటారని చెప్పాడు. ప్రభువు చెంతకు వచ్చి అతన్ని ఆశ్రయించేవాళ్లు పరమానందం చెందుతారని వాక్రుచ్చాడు. నేను దరిద్రుణ్ణి, దీనుణ్ణి, శీఘ్రమే వచ్చి నన్నాదుకో అని మనవి చేసాడు. ఇతని లాగే మనం కూడ ఆపదరాగానే ప్రభువు సాయం అడుగుకొందాం.

## 71. వృద్ధుని ప్రార్థనం

ఇది విలాప గీతం. ఈ కీర్తన చెప్పినవాడు వృద్ధుడు. ఈ ముసలి భక్తుని విన్నపాలు మన హృదయాన్ని కదిలిస్తాయి. ముసలితనంలో దిక్కూమొక్కూ లేకుండా వున్నపుడు అతనికేదో ఆపదవచ్చింది. ఆ కీడునుండి తన్ను రక్షించమని అతడు ప్రభుని వేడుకొన్నాడు.

చిన్నప్పటి నుండి నీవు నన్ను రక్షిస్తూవచ్చావని దేవునికి మొరపెట్టుకొన్నాడు. నేను జన్మించినప్పటి నుండి నేను నిన్ను ఆశ్రయిస్తు వచ్చానని దేవునికి మొరపెట్టుకొన్నాడు. నా బలం ఉడగిన తరుణంలో నీవు నన్ను చేయి విడువకు. ఇప్పుడు నేను తలనరిసిన ముదుసలినై యుండగా నీవు నన్ను విడనాడవద్దు అని దీనంగా మొరపెట్టుకొన్నాడు. మనం ముసలివాళ్లం అయ్యే కొద్దీ శక్తి సన్నగిల్లిపోయి నిస్సహాయుల మౌతాం. ఆ తరుణంలో ప్రభువుని ఇంకా అధికంగా ఆశ్రయించాలి. నిస్సహాయులకు సహాయుడు అతడే.

## 72. కాబోయే రాజుకొరకు ప్రార్థనం

ఇది రాజకీర్తన. దావీదు వంశంలోపుట్టి రాజ్యానికి రానున్న ఓ నూత్న రాజును గూర్చి చెప్పినపాట. దావీదు వంశంలో రాజులు నూత్నంగా పరిపాలనం చేపట్టినపుడల్లా ప్రజల ఆశలు చిగురించేవి. వాళ్లు శాంతినీ నీతినీ ధర్మాన్నీ స్థాపిస్తారని ప్రజలు కలలు కనేవాళ్లు. ఆ రాజులు నీతియుక్తంగా పరిపాలిస్తారనీ, పేదలను న్యాయసమ్మతంగా ఏలుతారనీ ఆశించేవాళ్లు. కాని తరచుగా యిస్రాయేలీయుల ఆశలు అడియాసలయ్యేవి. ఆ రాజులు దుష్టులైపోయేవాళ్లు. ఐతే నీతి యుక్తంగాను శాంతియుతంగాను పరిపాలనంచేసే రాజు ఒకడున్నాడు. అతడే క్రీస్తు. ఆ ప్రభువు మనలను సదా పరిపాలించాలని వేడుకొందాం.

## 73. న్యాయమే గెలుస్తుంది.

ఇది న్యాయ కీర్తనం. దీనిని చెప్పిన భక్తుడు గొప్ప ఆధ్యాత్మికమైన మార్పుని చెందాడు. అతడు మొదట దుర్మార్గులు వృద్ధిలోకి రావడం చూచి అసూయ చెందాడు. నేనుగూడ వాళ్లలాగ దుండగాలు చేసి సొమ్ము సంపాదించుకొంటే బాగుంటుంది కదా అనుకొన్నాడు. నే నొక్కణ్ణి విశుద్ధుణ్ణిగా జీవిస్తే మాత్రం లాభమేమిటి అనుకొన్నాడు. ఈలా ఆలోచిస్తుండగా ఓ దినం అతనికి దైవరహస్యం బోధపడింది. అది యిది. దుష్టుల అభివృద్ధి కొలది కాలం మాత్రమే నిలుస్తుంది. వాళ్లు త్వరలోనే అడపొడ కానరాకుండపోతారు. దీనితో అతనికి జ్ఞానోదయం కలిగింది. అతడు ఆమీదట దుర్మార్గుల వృద్ధిని చూచి అసూయ పడలేదు. పరమభక్తిభావంతో ప్రభువుకి అంటిపెట్టుకొని వుండాలనుకొన్నాడు. దేవుని చెంత వుండడమే నాకు క్షేమకరం, నేను ప్రభువైన దేవుని ఆశ్రయించాను అని చెప్పుకొన్నాడు. ప్రభువునుండి వైదొలగేవాడు చస్తాడు అనుకొన్నాడు భక్తితో పులకించిపోయి స్వర్గంలో నీవు దప్ప ఇంకెవరున్నారు? ఈ భూమి మీద నీవు దప్ప ఇంకొకంటి నాకు రుచించదు అని వాకొన్నాడు. ఈ భక్తుని చూచి మనంకూడ జ్ఞానం తెచ్చుకోవాలి. దుర్మార్గులు వృద్ధిలోకి వచ్చి సుఖభోగాలు అనుభవించినా మనం వాళ్లను అనుకరించ గూడదు. నిష్ఠతో ప్రభువుకి అంటిపెట్టుకొని వుండాలి.

## 74. దేవాలయ విధ్వంసాన్ని గూర్చి శోకగీతం

ఇది శత్రువులు యెరూషలేము దేవాలయాన్ని నాశంచేసినప్పుడు వ్రాసిన శోకగీతం. భక్తులు కొందరు ధ్వంసమైన దేవాలయ శిథిలాలను సందర్శించి శోకంతో విలపించారు. దేవాలయం నాశంకావడమంటే ప్రభువు యిస్రాయేలీయులపై కోపించి వారిని చేయి విడవడమే. కాని పూర్వం ఎన్నో రక్షణ కార్యాలను నిర్వహించిన ప్రభువు ఇప్పుడు శత్రువుల బారినుండి యిస్రాయేలీయులను కాపాడలేడా? తప్పక కాపాడగలడు. కనుకనే కీర్తనకారుడు నీ పావురాన్ని డేగపాలు చేయకు. పీడితులైన నీ ప్రజలను సదా విస్మరించకు అని మనవిచేసాడు. మనం కూడ పాపం చేసి దైవశిక్షకు గురైనపుడు చిత్తశుద్ధితో పశ్చాత్తాపపడాలి. దేవా! నీవు మమ్ము శాశ్వతంగా విడనాడకు అని ప్రార్థించాలి.

## 75. దేవుడు న్యాయాధిపతి

ఈ కీర్తన ప్రభుని న్యాయాధిపతినిగా వర్ణిస్తుంది. యావే దుష్టులకు తీర్పు చెప్పి వారిని ఖండిస్తాడు. వాళ్ళు తమ శిక్షను పానపాత్రంలోని ద్రాక్షరసాన్నిలాగ త్రాగుతారు. ప్రభువు దుష్టులను శిక్షిస్తాడు. సత్పురుషులకు మాత్రం ఏహాని కలుగదు. అతడు వాళ్ళబలాన్ని హెచ్చిస్తాడు. నేడు మన తరుపున మనం పాపం చేసి దేవుని శిక్షను కొనితెచ్చుకోగూడదు. పుణ్యజీవితం గడిపి అతనినుండి బహుమతిని పొందాలి.

## 76. భయంకరుడైన దేవుడు

ఈ కీర్తన ప్రభువు విజయాన్ని వర్ణిస్తుంది. అతడు శత్రువులతో పోరాడి విజయాన్ని సాధించాడు. అతడు భీకరుడు. శత్రువులను మట్టుపెట్టి గెలుపును చేపట్టేవాడు. ఆ దేవుణ్ణి కొల్చే భక్తులకు కూడ గెలుపు సిద్ధిస్తుంది. అతన్ని నమ్మినవాళ్లు నాశమైపోరు.

## 77. యిస్రాయేలు పూర్వచరిత్ర ధ్యానం

ఇది విలాపగీతం. ఈ కీర్తనను చెప్పిన భక్తుడు ఏదో ఆపదలో చిక్కాడు. నిరుత్సాహపడ్డాడు. యావే మీద నమ్మకాన్ని కోల్పోయాడు. ప్రభువు తన్ను చేయి విడిచాడు అనుకొన్నాడు. మహోన్నతుని శక్తి సన్నగిల్లిపోయింది అనుకొని బాధ చెందాడు. ఆపిమ్మట అతడు సర్వేశ్వరుడు పూర్వంచేసిన అద్భుత కృత్యాలనూ రక్షణ కార్యాలనూ జ్ఞప్తికి తెచ్చుకొన్నాడు. అతడు యిస్రాయేలీయులను ఈజిప్టునుండి ఎలా నడిపించుకొని వచ్చాడో స్మృతికి తెచ్చుకొన్నాడు. యావే యిస్రాయేలీయులను సముద్రగర్భం గుండా నడిపించుకొని వచ్చాడు. మోషే అహరోనులనే నాయకుల సహాయంతో వారిని ఓ మందనులాగ తోలుకొని

వచ్చాడు. సర్వేశ్వరుడు చేసిన ఈ యద్భుత కార్యాలను తలంచుకొన్నపుడు కీర్తనకారునికి నిరాశపోయి విశ్వాసం పుట్టింది. అతడు ప్రభువుని నమ్మి చిత్తశాంతిని పొందాడు. మనకు కూడ జీవితంలో నిరాశా నిస్పృహలు కలుగుతాయి. దేవునిమీద నమ్మకం పోతుంది. అపుడు సర్వేశ్వరుడు పూర్వం మనకు చేసిన ఉపకారాలను స్మరించుకోవాలి. అలా స్మరించుకొంటే దేవునిపట్ల మళ్లా నమ్మకం చిగుర్చుతుంది.

## 78. యిస్రాయేలు చరిత్ర నేర్పే పాఠాలు

ఇది చారిత్రక కీర్తన. పూర్వం దేవుడు చేసిన మహాకార్యాలను యిస్రాయేలీయులకు తెలియజెప్పేది. యూదులు తమ పిల్లలకు కూడ ఈ పాటను విన్పించి వారికి తమ పూర్వ చరిత్రను తెలియజేసేవాళ్లు. ఈలాంటి గీతాలద్వారా బాలబాలికలు చిన్ననాటినుండే యావేపట్ల భక్తిని పెంచుకొనేవాళ్లు. ప్రభువు యిస్రాయేలీయులను ఈజిప్టునుండి తోడ్కొని వచ్చాడు. సముద్రం గుండా నడిపించుకొని వచ్చాడు. ఎడారిలో వారికి అద్భుతంగా అన్నపానీయాలు దయచేసాడు. దారిలో వారి శత్రువులను మట్టుపెట్టాడు. కడన వారిని వాగ్దత్త భూమికి చేర్చాడు. ఇన్ని వుపకారాలు చేసినా యూదులు తలబిరుసుతనంతో ఎప్పుడూ దేవునిమీద తిరుగుబాటు చేసేవాళ్లు. అన్య దైవాలను పూజించేవాళ్లు. అందుకు శిక్షగా ప్రభువు వారిని బాబిలోనియా ప్రవాసానికి పంపాడు. విశేషంగా ఉత్తర రాష్ట్రంవాళ్లు యావేమీద తిరుగుబాటు చేసారు. కనుక ప్రభువు ఉత్తర తెగలను విడనాడి దక్షిణాన వున్న యూదా తెగను మాత్రమే తన ప్రజనుగా ఎన్నుకొన్నాడు. ఈ తెగకు యెరూషలేము కేంద్రమైంది. ఈ తెగలోనివాడే దావీదు. ఇతడు ప్రభువు ప్రత్యేకంగా ఎన్నుకొన్న భక్తుడు. ఈ దావీదు వంశంనుండే మెస్సీయా పుడతాడు. ఇది ఈ కీర్తన చెప్పే యూదుల చరిత్ర. నేడు మనకు కూడ వ్యక్తిగతమైన రక్షణ చరిత్ర వుంది. దేవుడు ఒక్కొక్కరిని ఒక్కో తీరులో రక్షిస్తాడు. అతడు మనకు కావించిన రక్షణ కార్యాలను తలంచుకొని ప్రేరణం పొందుదాం.

## 79. జాతీయ విలాపం

ఇది యిస్రాయేలీయులు బాబిలోనియులకు ఓడిపోయినప్పుడు చెప్పిన విలాపగీతం. శత్రువులు యెరూషలేమును నాశం చేసారు. దేవాలయాన్ని నేల మట్టం చేసారు. మీ దేవుడు ఏడీ? ఉంటే వచ్చి ఆదుకొనమనండి చూద్దాం అని యూదులను గేలిచేసారు. యూదులు దిగులుతో, పశ్చాత్తాప భావంతో ప్రభువుని ఆశ్రయించారు. ఆపదలో వున్నపుడు వారికి దేవుని అవసరం బాగా తెలియవచ్చింది. నేడు మనకు కూడ ఇంతే. సుఖాల్లో దేవుడు గుర్తుకిరాడు. కష్టాల్లో అతని అవసరం బాగా తెలుస్తుంది. జీవితంలో ఎదురయ్యే కష్టాలను భరించే శక్తికొరకు ప్రార్థిద్దాం.

## 80. యిస్రాయేలు ఉద్ధరణం కొరకు ప్రార్థనం

ఇది కూడ విలాప కీర్తనే. యూదులు బాబిలోనియులకు ఓడిపోయిన తర్వాత చెప్పింది. కీర్తనకారుడు యిస్రాయేలీయులను ద్రాక్షతీగతో పోల్చాడు. యావే ఈజిప్టు నుండి ఆ తీగను కొనివచ్చి కనాను దేశంలో నాటాడు. అది మూడు పూవులు ఆరుకాయలుగా వృద్ధి చెందింది. కాని అది మదంతో యావేను విడనాడింది. అన్యదైవాలను కొల్చింది. ప్రభువు కోపించి దాన్ని సర్వనాశం చేశాడు. ఈలా నాశమైన యిస్రాయేలీయులు బుద్ధితెచ్చుకొని పశ్చాత్తాపపడి ప్రభుని శరణువేడారు. దేవా నీవు మమ్ము ఉద్ధరించు. నీ ముఖకాంతిని మామీద ప్రకాశింప జేస్తే మేము మళ్లా రక్షణం పొందుతాం అని ప్రార్థించారు. ఆధ్యాత్మిక జీవితంలో మన చరిత్ర కూడ ఈలాగే వుంటుంది. దేవుని కరుణవల్ల భక్తితో జీవించినన్నాళ్లు మనం కూడ ద్రాక్షతీగలా ఎదుగుతాం. కాని పాపం చేసినప్పుడు స్వీయనాశం తెచ్చుకొంటాం. ప్రభువు దయే మళ్లా మనలను ఉద్ధరించాలి. ఈ గీతం పశ్చాత్తాప ప్రార్థనలో వాడుకోదగింది.

## 81. గుడారాల పండుగకు గీతం

ఇది యాత్రిక కీర్తనం. దేవళంలో గుడారాల పండుగ జరుగుతుంది. యాత్రికులు భక్తిభావంతో పాల్గొంటున్నారు. అప్పుడు ఓ ప్రవక్త హఠాత్తుగా దైవప్రేరితుడై ఈ పాట చెప్పాడు. అతడు ప్రజలను హెచ్చరించాడు. పూర్వం పితరులు ప్రభువునుండి ఎన్నో వుపకారాలు పొందినా వాటిని లక్ష్యం చేయకుండా అతనిపై తిరుగబడ్డారు. దాని ఫలితంగా దేవుని శిక్షను కొని తెచ్చాకొన్నారు. ఇప్పుడు మనం కూడ దేవునిపై తిరుగబడకూడదు. అతని ఆజ్ఞలు మీరకూడదు. అతనికి విధేయులమై నడవాలి - ఇది ఆ ప్రవక్త హెచ్చరిక. దేవునికి విధేయులమై యుండాలి అనేది బైబుల్లో మళ్లామళ్లా వచ్చే అంశం. ఈ భాగ్యం కొరకు వేడుకొందాం.

## 82. అన్యాయపు న్యాయాధిపతులకు శిక్ష

దేవుడు అన్యాయపు న్యాయాధిపతులకు శిక్ష విధిస్తాడని చెప్పాడు ఈ కీర్తనలో ప్రవక్త. వాళ్లు దుష్టులకు పక్షపాతం చూపి పేదలకు అన్యాయం చేస్తే దేవుడు సహించడని నుడివాడు. న్యాయాధిపతులు గొప్పవాళ్లయినా అందరిలాగే వాళ్లుకూడ చస్తారు. కనుక వాళ్లు వళ్లు దగ్గర బెట్టుకొని పనిచేయాలి. అధికారంలో వున్నవాళ్లు దుండగాలకు పూనుకోగూడదు.

## 83. శత్రుపరాజయానికి ప్రార్థనం

ఈ కీర్తన దేవుడు శత్రువులను నిర్దయతో శిక్షించాలని కోరుకొంటుంది. వారి మీద శాపాలను కురిపిస్తుంది. ఎదోమీయులు, యిష్మాయేలీయులు మొదలైన దుష్టులవలె

వాళ్లుకూడ నాశమైపోవాలని కోరుకొంటుంది. వారికి కలకాలం అపకీర్తి భీతి ప్రాప్తించాలని అభిలషిస్తుంది. ఈలా విరోధులమీద పగతీర్చుకోవడాన్ని నూత్నవేదం అంగీకరించదు. కనుక ఈ గీతాన్ని తిరుసభ ప్రార్ధనలో చేర్చలేదు.

## 84. దేవాలయం మీద కోర్కె

యిస్రాయేలీయులు భక్తితో ఉత్సాహంతో యెరూషలేము దేవళానికి యాత్ర చేసేవాళ్లు. యాత్రిక కీర్తనలు చాలా వున్నాయి. వాటిల్లో ఇదీ వొకటి. కీర్తనకారునికి దేవళాన్ని దర్శించాలనే ఉబలాటం మెండు. ఆ మందిరంలో వాసం చేసేవాళ్లంటే అతనికి మాలావు గౌరవం. మామూలు ఇండ్లల్లో వేయిదినాలు జీవించినదాని కంటె దేవళంలో ఒక్కరోజు గడిపింది మేలు. దుష్టులతో కలసి వారి యిండ్లల్లో వసించినదానికంటె దేవాలయ ద్వారం వద్ద పడివుండడం మెరుగు. మనం కూడా దేవాలయ భక్తిని అలవర్చుకోవాలి. దేవుణ్ణి దర్శించాలన్న ఆశతో దేవాలయానికి వెళ్లాలి. దేవుణ్ణి పూజించడం మహాభాగ్యమని యెంచాలి.

## 85. శాంతికొరకు ప్రార్ధనం

ఇది ఉత్సాహ భావాలతో కూడిన కీర్తన. యూదులు బాబిలోనియా ప్రవాసం నుండి తిరిగి వచ్చాక చెప్పింది. ప్రవాసం నుండి తిరిగి వచ్చినవారికి ప్రభువు అనుగ్రహం వలన పాపక్షమ, శాంతి ప్రేమ లభించాలని కోరాడు కీర్తనకారుడు. ప్రభువు దయవల్ల ప్రజలు తిరిగివచ్చారు. వాళ్లు మళ్లా పిచ్చిపనులకు పాల్పడకూడదు. దేశంలో ప్రభువు సాన్నిధ్యం నెలకొంటుంది. ప్రేమ, విశ్వసనీయత, న్యాయం రాజ్యం చేస్తాయి. నేల చక్కగా పంటలు పండుతుంది. మనం భక్తితో జీవిస్తే చాలు, దేవుడు అన్ని వరాలు దయచేస్తాడు.

## 86. విపత్తులో ప్రార్ధన

ఈ కీర్తన చెప్పిన భక్తుడు ఏదో ఆపదలో వున్నాడు. కనుక అతడు ప్రభువుకి మొరపెట్టుకొన్నాడు. తన్ను కాపాడమని వేడుకొన్నాడు. ప్రభూ! నీ మార్గాలను నాకు బోధించు, నీ చిత్తాన్ని నాకు తెలియజేయి అని మనవి చేసాడు. నన్ను ఆదుకొని నాకు ఉపశాంతిని దయచేయి అని అడుగుకొన్నాడు. బాధల్లో వున్నపుడు మనమూ ఈలాగే ప్రార్థించాలి.

## 87. సియోను అన్నిజాతులకు తల్లి

ఇది యాత్రిక కీర్తన. సియోను లేక యెరూషలేము నగరమంటే యూదులకు అపారమైన భక్తి. ఆ సియోనును కీర్తించడానికి వ్రాసిన కీర్తన యిది. సియోను నగరం

విశ్వాసులందరికీ తల్లి. అన్యజాతుల ప్రజలకు గూడ తల్లి. ఎల్ల ప్రజలు తమ భాగ్యాలకు ఆ నగరమే ఆధారమని చెప్పుకొంటారు. యూదులకు సియోనులాగా మనకు తిరుసభ తల్లి. ఆ సభకు చెందివున్నందుకు మనం సంతోషించాలి.

## 88. శోకగీతం

ఇది గొప్ప శోకగీతం. కీర్తనలన్నిటిలోను విషాద పూరితమైంది. దీన్ని చెప్పిన కవి చాలకాలం శ్రమలు అనుభవించి చివరికి అవసానదశలో వున్నాడు. ఐనా ప్రభువుపట్ల నమ్మకాన్ని కోల్పోకుండ అతన్ని శరణు వేడాడు. అతడు తన పేరు చనిపోయిన వారి జాబితాలోకి ఎక్కిందని బాధపడ్డాడు. చనిపోయినవాళ్లు దేవుణ్ణిస్తుతించలేరు కనుక తన్ను ఈ భూమిమీదనే బ్రతికి వుండనీయమని వేడుకొన్నాడు. నేను బాల్యంనుండి శ్రమలు అనుభవిస్తునే వున్నాను అని చెప్పుకొన్నాడు. కనుక అతడు జీవితాంతం కడగండ్లకు గురైనవాడు అనుకోవాలి. కష్టకాలంలో నా స్నేహితులంతా నన్ను విడనాడారు, ఇప్పుడు చీకటి మాత్రమే నాకు చెలికాడైంది అనివాకొన్నాడు. ఇది గొప్ప శోకాన్ని తెలియజేసే వాక్యం. ఇంతటి విచారంలో కూడ అతడు ప్రభువుపట్ల విశ్వాసాన్ని కోల్పోలేదు. కనుకనే నేటికీ భక్తకోటికి ఆదర్శంగా వుండిపోయాడు. కష్టాల్లో ఓర్పుని దయచేయమని ప్రభువుని అడుగుకొందాం.

## 89. విశ్వసనీయుడైన ప్రభువు

ఇది విలాపగీతం. దీనిలో రెండు భాగాలున్నాయి. మొదటి భాగం 37వ చరణం వరకు. ఈ మొదటి భాగం దావీదు రాజును గూర్చి. ప్రభువు అతన్ని రాజునుగా ఎన్నుకొని అతనితో నిబంధనం చేసికొన్నాడు. అతన్ని తనకు జ్యేష్ఠపుత్రునిగా చేసికొన్నాడు. అతని సింహాసనం సూర్యచంద్రులు ఉన్నంతకాలం ఉంటుందని మాటయిచ్చాడు. రెండవ భాగం 38వ చరణంనుండి చివరివరకు. ఈ భాగంలో దావీదు వంశానికి చెందిన ఓ రాజు తనకు కలిగిన అవమానాన్ని తలంచుకొని ప్రభువు సమక్షంలో బాధపడుతున్నాడు. ఇతనికి యుద్ధంలో అపజయం కలిగింది. అతని కిరీటం నేలమీద పడిపోయింది. దావీదు వంశపురాజు ఓడిపోయాడు అంటే పూర్వం ప్రభువు దావీదుతో చేసికొన్న నిబంధనం ఏమైనట్లు? ప్రభువు పూర్వం దావీదుకి చూపిన ప్రేమ, అతనికి చేసిన ప్రమాణాలూ మర్చిపోయాడా? ఈలా ఆరాజు తనకు కలిగిన అవమానాన్ని భరించలేక దేవుని ముందట మొరపెట్టాడు. ఈ రాజులాగే మనంకూడ కొన్ని సార్లు ప్రభువు కృపను కోల్పోతాం. అపుడు నమ్మకంతో ప్రభువునే ఆశ్రయించాలి. ప్రభువుకి మనపట్లగలప్రేమ శాశ్వతమైందే. మరి మనకు అతనిపట్ల వుండే ప్రేమ?

## 90. హ్రస్వకాలికమైన నరజీవితం

ఈ గీతం చెప్పిన కవి భగవంతుని శాశ్వత జీవితాన్ని నరుని అల్పాయుస్సుతో పోల్చాడు. ఆ అల్పాయుస్సును తలంచుకొని బాధపడ్డాడు. ప్రభువు నిత్యుడు. అనాదికాలం నుండి ఎల్లకాలం వరకు ఉండేవాడు. అతనితో పోలిస్తే నరజీవితం ఏపాటిది? దేవుడు నరులతో మీరు మన్నయి పొందని పల్కుతాడు. నరజీవితం డెబ్బయి లేక ఎనుభైయేండ్లు మాత్రమే. ఈ కొద్దిపాటి జీవితంగూడ బాధావిచారాలతో నిండివుంటుంది. క్షణ కాలంలో ముగుస్తుంది. నరులు తమ ఆయుష్కాలం ఎంత స్వల్పమైందో గ్రహిస్తే విజ్ఞులౌతారు. కాలాన్ని వ్యర్థం చేసికోగూడదు. దేవుడు మనకు దయచేసిన హ్రస్వజీవితాన్ని సద్వినియోగం చేసివాకొని ఈ లోకంలో వుండగానే పరలోకాన్ని సంపాదించుకోవాలి. లేకపోతే మోసపోతాం. మన కాలాన్ని మనం ఏలా వాడుకొంటున్నాం?

## 91. దేవుని రక్షణం

ఇది విజ్ఞాన కీర్తనం. ప్రభువు తన్ను నమ్మిన భక్తుణ్ణి తప్పక కాపాడతాడు. దేవుడు అతనికి రక్షణ దుర్గమౌతాడు. భక్తుణ్ణి తన రెక్కల మాటున వుంచి కాపాడుతాడు. అతనికి డాలుగాను రక్షణాయుధంగాను వుంటాడు. తన దేవదూతలద్వారా అతనికి రక్షణం కల్పిస్తాడు. సకాలాపదలనుండి అతన్ని కాపాడతాడు. అన్ని విధాల అతనికి రక్షణాన్ని దయచేస్తాడు. భక్తుడు మాత్రం ప్రభువునినమ్మి జీవించాలి. రాత్రి పండుకోకముందు ఈ కీర్తనను చదువుకొంటే ప్రశాంతంగా నిద్రపోవచ్చు. అన్ని రక్షణలకంటె దైవరక్షణం గొప్పదికదా!

## 92. పుణ్య పురుషుని ఆనందం

ఈ కీర్తన కృతజ్ఞతాస్తుతి. వారాంతంలో విశ్రాంతి దినాన జపించేది. దీనిలో కీర్తనకారుడు ప్రభువు తనకు చేసిన ఉపకారాలకు అతనికి వందనాలు చెప్పాడు. మూర్ఖులకు ప్రభువు మేలి కార్యాలు తెలవ్వు. వాళ్లు దేవునికి వందనాలు అర్పించరు. కనుక వాళ్ల తరపున గూడ భక్తుడే దేవునికి వందనాలు చెప్పాడు. భగవంతుని కరుణకార్యాలను గూర్చి ఆలోచించుకోగా భక్తునికి తట్టిన భావం ఇది. దుష్టులు నాశమైపోతారు. సత్పురుషులు మాత్రం ఖర్జూర వృక్షంలా వృద్ధిచెందుతారు. భగవంతుడు మనకు కూడ ఎన్నో వుపకారాలు చేసాడు. వాటికి మనం ప్రభువుకి నిరంతరం వందనాలు అర్పించాలి. మనకున్నవన్నీ దేవుడు ఇచ్చినవేకదా!

## 93. దేవుని ప్రాభవం

ఇది ప్రభువు రాజత్వాన్ని కీర్తించేపాట. దేవుడు మహారాజు, మహాబలవంతుడు. అతడు సృష్టిని చేసాడు. ఆ సృష్టికి రాజై ఒప్పుతున్నాడు. అతని ఆజ్ఞలకు తిరుగులేదు.

ఎల్ల ప్రాణులు అతని శాసనాలను పాటించవలసిందే. ప్రభు మందిరంలో భక్తులు అతన్ని రాజాధిరాజునిగా, దేవాధిదేవునిగా గుర్తించి ఆరాధిస్తారు. ఆ మందిరం పరమ పవిత్రమైంది. నూత్నవేదంలో క్రీస్తు మనకు రాజు. ఆ రాజాధిరాజుని మనం పరమ భక్తి భావంతో ఆరాధించాలి.

## 94. దేవుడు న్యాయాధిపతి

ఈ కీర్తనకారుడు ప్రభుని న్యాయాధిపతినిగా వర్ణించాడు. అతడు లోకంలోని పాపాన్నీ దుష్టత్వాన్నీ చూచి వ్యాకులం చెందాడు. నరులు దేవుడు లేడో అన్నట్లుగా పాపాలు చేస్తున్నారు. కాని ప్రభువు వారి దోషాలన్నిటినీ గమనిస్తాడు. ఎవడు దైవశిక్షను తప్పించుకోలేడు. ఇతరుల పాపకార్యాలను చూచి వ్యాకులంచెందే భక్తులకు దేవుడే చిత్తశాంతిని దయచేస్తాడు. ఇతరులు దుష్కార్యాలు చేస్తున్నా మనతరపున మనం ప్రభువుని నమ్మి సత్కార్యాలే చేయాలి. ఒక రోజు వచ్చినపుడు ఎల్లరికి తీర్పు తీర్చే న్యాయాధిపతి ఉండనే వున్నాడు.

## 95. దైనందిన ప్రార్థనం

కొందరు భక్తులు దేవళానికివచ్చి ప్రభుని ఆరాధిస్తున్నారు. ఆ ప్రభువు సృష్టికర్త, యిస్రాయేలు జాతిని ఎన్ను కొన్నవాడూను. కనుక రండి, శిరంవంచి మనలను సృజించిన ప్రభువు ముందట మోకరిల్లుదాం అని వాకొన్నారు. అతడు మనకు దేవుడు, మనం అతడు కాచికాపాడే ప్రజలం అని చెప్పుకొన్నారు. అంతలో ఓ ప్రవక్త వచ్చి మీరు కూడ పితరుల్లాగ అవిధేయులు కావద్దని హెచ్చరించాడు. ప్రభువు పితరుల అవిధేయతను చూచి వారిని వాగ్దత్త భూమిలో అడుగుపెట్టనీయలేదు. మనం కూడ వారిలా కాగూడని మందలించాడు. ఇప్పుడు ఈ కీర్తన తిరుసభ ప్రార్థనలో మొదట వస్తుంది. పితరులవలె మీరుకూడ హృదయాలను కఠినం చేసికోవద్దని హెచ్చరిస్తుంది. భగవంతుడు మననుండి కోరేది విధేయత, దైవచిత్తాన్ని పాటించడం.

## 96. రాజూ న్యాయాధిపతీ ఐన ప్రభువు

దేవుడు రాజు, న్యాయాధిపతీ. అతని రక్షణ కార్యాలకు క్రొత్త పాటతో అతన్ని స్తుతించాలి. అన్యజాతులు కూడ అతన్ని కీర్తించాలి. దేవుడు తన భక్తులను సందర్శించడానికి విచ్చేస్తున్నాడు. కనుక ప్రకృతి శక్తులన్నీ సంతోషంతో అతన్ని స్తుతించాలి. పరమాత్ముడు కంటికి కన్పించకపోయినా ప్రకృతిలో మనకు దర్శనమిస్తాడు. అతన్ని ఎల్లపుడు వందించాలి.

## 97. ప్రభువు విజయం

రాజైన ప్రభువు చాల విజయాలు సాధించాడు. సర్వేశ్వరుడు మళ్లా తన ప్రజలను సందర్శించడానికి వస్తున్నాడు. అతడు పూర్వం సీనాయి కొండమీద దర్శనమిచ్చిన ప్రభువులాగ భయంకరుడుగా కన్పిస్తాడు. మన దేవుడు దయా, శక్తి కలవాడు. మనం అతన్ని తలంచుకొని ఆనందించాలి.

## 98. లోకానికి న్యాయాధిపతి

ప్రభువు రాజుగా, రక్షకుడుగా, న్యాయాధిపతిగా వేంచేయనున్నాడు. యిస్రాయేలీయులు క్రొత్త పాటతో ప్రభువుని ఆహ్వానించాలి. భూమి, సముద్రం, నదులు, పర్వతాలు మొదలైన ప్రకృతి శక్తులన్ని కూడ అతన్ని ఆహ్వానించాలి. యావే ప్రభువులాగే క్రీస్తుకూడ రక్షకుడుగా వేంచేస్తాడు. భక్తులు అతన్ని ఆనందంతో ఆహ్వానించాలి.

## 99. నీతిమంతుడూ పవిత్రుడూ ఐన దేవుడు

ప్రభువు పవిత్రుడైన రాజు. అతడు దేవదూతల బొమ్మలుకల మందసంపై, సింహాసనం మీద రాజులాగ ఆసీనుడయ్యాడు. యిస్రాయేలీయులు అతన్ని ఆరాధించాలి. పూర్వం మోషే, అహరోను, సమావేలు అనే భక్తులు అతనికి ప్రార్థన చేసారు. అతనిలోని ఓ గొప్పగుణం పవిత్రత. అలాంటి మహాప్రభువుని మనం కూడ వందించాలి.

## 100. దేవుని స్తుతించడానికి రండి

ఓ యాత్రిక బృందం ప్రభుని స్తుతించడానికి దేవాలయానికి వచ్చింది. వాళ్లు స్తుతికీర్తనలతో దేవాలయంలో ప్రవేశించారు. సృష్టికర్త, నిబంధన కారుడూ ఐన దేవుణ్ణి కొనియాడారు. అతని ప్రేమ విశ్వసనీయత కలకాలం వుంటాయని కీర్తించారు. ప్రభువు కల్యాణ గుణాలు కలవాడు. అతని గొప్పతనానికి అతన్ని ఎల్లవేళల వినుతించాలి.

## 101. ఆదర్శంతుడైన రాజు

ఈ కీర్తనలో ఒకానొక యిస్రాయేలురాజు తాను భక్తిగా జీవించి ప్రజలను న్యాయసమ్మతంగా పరిపాలిస్తానని దేవుని యెదుట బాసచేస్తున్నాడు. అతనిబాస యిది. తాను విశుద్ధుడుగా జీవిస్తాడు. చెడ్డను అంగీకరింపడు. కపటాత్ములను పొగరుబోతులను కల్లలాడువారిని తరిమికొడతాడు. మంచివారిని మాత్రమే తన కొలువులో సేవలు చేయనిస్తాడు. దుర్మార్గులను దేశంనుండి వెళ్లగొడతాడు. ఈ కీర్తనకారునిలాగే మనం కూడ ఓ ప్రవర్తన నియమావళిని రూపొందించుకొని దాని ప్రకారం జీవిస్తే ఎంత బాగుంటుంది!

## 102. కష్టాలలో ప్రార్థన

ఇది విలాప కీర్తన. కష్టాలలో జిక్కిన భక్తుని మొర. ఈ భక్తుని వెతలు ఎలా వున్నాయంటే, అతడు బూడిద తింటున్నాడు. పానీయంలో తన కన్నీళ్లు కలుపుకొని త్రాగుతున్నాడు. అతని ఆయుస్సు సాయంకాలపు నీడలాగ తరిగిపోయింది. అతడు మొదట తన బాధలను గూర్చి దిగులుపడ్డాడు. తర్వాత యెరూషలేము నాశాన్నీ దేవాలయ విధ్వంసాన్నీ జ్ఞప్తికి తెచ్చుకొని శోకించాడు. సియోనును కనికరింపమని ప్రభువుకి మనవి చేసాడు. ఆ పిమ్మట ప్రభువు మహాశక్తినీ శాశ్వతత్వాన్నీ గుర్తుకి తెచ్చుకొన్నాడు. దేవుడు చేసిన భూమ్యాకాశాలు గతిస్తాయి. పాతబట్టలా చినిగిపోతాయి. కాని ప్రభువుకి నాశం లేదు. అతడు ఎల్లవేళల ఒకే రీతిగా వుంటాడు. మన కష్టాల్లో మనలను ఆదుకొనే శక్తిమంతుడైన ప్రభువు ఒకడున్నాడు. అతన్ని శరణు వేడితే మనకు మేలు కలుగుతుంది. కనుక “నీ మొగాన్ని నా నుండి మరుగుజేయకు” అని ఆ ప్రభువుని అడుగుకొందాం.

## 103. దేవుడు ప్రేమమయుడు

ఇది ప్రభువు కరుణను ప్రేమను కొనియాడుతూ వ్రాసిన స్తుతి కీర్తన. బైబుల్లోని మంచి కీర్తనల్లో వొకటి. భక్తుడు మొదట ప్రభువు తనకు చేసిన ఉపకారాలకు వందనాలు చెప్పాడు. దేవుడు అతని పాపాలను మన్నించి అతని వ్యాధులను నయం చేసాడు. అతన్ని గరుడపక్షిలాగ శక్తిసంపన్నుణ్ణి చేసాడు. అటుపిమ్మట ప్రభువు ఈజిప్టులో బానిసలైయున్న యూదులకు చూపిన కరుణను వర్ణించాడు. ప్రభువు కరుణామయుడు, దీర్ఘశాంతుడు. మన పాపాలకు తగినట్లుగా మనలను శిక్షింపడు. అతని ప్రేమ ఆకాశమంత యెత్తు. తండ్రి కుమారులమీదలాగే అతడు మనమీద జాలిజూపుతాడు. మనం దుర్బలులమైన మట్టిమానుసులమని అతనికి బాగా తెలుసు. ఈలాంటి దేవుణ్ణి మనం కీర్తించి స్తుతించాలి. ఈ భక్తునిలాగే మనం కూడ “నా యాత్మమా ప్రభువు ఉపకారాలను వేటినీ మరువకు” అని చెప్పుకోవాలి.

## 104. సృష్టిలోని వింతలు

ఇది లోకసృష్టిని వర్ణించే స్తుతికీర్తన. ఆదికాండంలోని తొలి రెండధ్యాయాలను జ్ఞప్తికి తెచ్చేది. చాల గొప్పకీర్తన. ప్రభువు భూమ్యాకాశాలనూ సముద్రాలనూ సృష్టించాడు. నీళ్ళలో, నేలమీద, ఆకాశంలో సంచరించే ప్రాణికోటినంతటినీ కలిగించాడు. ఈ విశ్వం అతడు చేసిన ప్రాణులతో క్రిక్కిరిసి వుంది. ఈ జీవరాశినంతటినీ అతడు సకాలంలో తిండిపెట్టి పోషిస్తుంటాడు. అతడు ఊపిరితీస్తే ప్రాణులు చస్తాయి. ఊపిరి పోస్తే, నూత్న ప్రాణులు పుడతాయి. అతడు రోజు భూమికి నూత్న జీవాన్ని ప్రసాదిస్తుంటాడు. మన తరపున మనం సృష్టిని గౌరవించాలి. అద్దంలో ప్రతిబింబంలాగ సృష్టిలో భగవంతుని రూపం గోచరిస్తుంది. పర్యావరణాన్ని ధ్వంసం చేయకూడదు. నరుల పాపం దేవుడు

చేసిన సుందర సృష్టిని పాడుచేస్తుంది. కనుక మనం పాపానికి దూరంగా వుండాలి. సృష్టికర్తను స్తుతించాలి. అతడు చేసిన ప్రకృతినిగాంచి ఆనందించాలి.

## 105. యిస్రాయేలు చరిత్ర

యాజకులు, ప్రవక్తలు యెరూషలేము దేవాలయానికి వచ్చిన భక్తులకు యిస్రాయేలు చరిత్రను విన్పించేవాళ్ళు. ఇది అలాంటి చారిత్రక కీర్తన. ప్రభువు అబ్రాహామును ఎన్నుకొని అతనికి రెండు వాగ్దానాలు చేసాడు. అవి అతనికి కనాను దేశాన్ని దయచేయడమూ, విస్తారమైన సంతతిని ప్రసాదించడమూను. రెండు ప్రమాణాలు నెరవేరాయి. కనానులో కరవురాగా అబ్రాహాము సంతతి ఈజిప్టుకి వలసవెళ్ళింది. అక్కడ యోసేపు ప్రధాన మంత్రియై యిస్రాయేలీయులకు మేలుచేసాడు. కాని అతని తర్వాత రాజ్యమేలిన ఈజిప్టు రాజులు యిస్రాయేలీయులను పీడించారు. అహరోను మోషే అనే నాయకులు పది అద్భుతాలు చేసి ప్రజలను ఈజిప్టు నుండి వెడలించుకొని వచ్చారు. ఇది యీ కీర్తన చెప్పే రక్షణ చరిత్ర. మన వ్యక్తిగత జీవితంగూడ రక్షణ చరిత్రలో ఓ భాగమే. ప్రభువు ఆనాటి యిస్రాయేలీయులను వలె నేటి క్రైస్తవులనూ, స్వయంగా మనలనూ, నడిపిస్తూంటాడు. మనం మాత్రం ఆ ప్రభువు నడిపించినట్లుగా నడవాలి. నేడు అతడు మనకిచ్చే నాయకులను అంగీకరించాలి.

## 106. యిస్రాయేలు పశ్చాత్తాపం

ఈ కీర్తన కూడ యిస్రాయేలు చరిత్రను తెలిపేదే. ఎడారికాలంలో ఆ ప్రజలు చాలసార్లు దేవునిమీద తిరుగబడ్డారు. ఎద్దును ఆరాధించారు. మోషేను ఎదిరించారు. అన్యజాతి ప్రజలతో కలసిపోయారు. కనాను దేశం చేరి అక్కడ స్థిరపడిన పిదప బాలుదేవతను కొల్చారు. ఫలితంగా ప్రవాసానికి వెళ్ళారు. ఐనా ఆ ప్రజలు పశ్చాత్తాపపడగానే ప్రభువు దయగలవాడు కనుక తాను చేసిన నిబంధనను స్మరించుకొని వారి తప్పులను మన్నించాడు. ఆ యిస్రాయేలీయుల్లాగే నేడు మనం కూడ మాటిమాటికి పాపం చేస్తుంటాం. ఐనా దేవుడు తేపతేపకు మనలను మన్నిస్తుంటాడు. మన పశ్చాత్తాపంవల్ల దయగల దేవుడు మనలను రక్షిస్తూంటాడు. మన పశ్చాత్తాపం చిత్తశుద్ధితో కూడి వుండాలని వేడుకొందాం.

## 107. ఆపదల్లో ఆదుకొనే ప్రభువు

పూర్వం దేవుడు నాల్గు బృందాల ప్రజలను ఆపదలనుండి కాపాడాడు. ఆ నాల్గు బృందాలవాళ్ళు దేవళంలో అర్పించిన కృతజ్ఞతాస్తుతులే ఈ కీర్తన. ఒక బృందం వాళ్ళు ఎడారిలో చిక్కి అలమటిస్తూంటే దేవుడు వారిని కాపాడాడు. మరో బృందం వారు చెరలో చిక్కుకొనగా దేవుడు వారిని విడిపించాడు. ఇంకో ముఠావాళ్ళు అంటురోగం

వాతబడగా ప్రభువు వారిని కాపాడాడు. నాల్గవ గుంపువాళ్లు సముద్రయానం చేస్తూ తుఫానులో చిక్కుకోగా యావే వాళ్ళను గట్టు చేర్చాడు. అతడు ఆ నాల్గు వర్గాలవాళ్ళ కష్టాలు తొలగించి వాళ్ళ జీవితం సుఖమయం చేసాడు. పై నాల్గువర్గాలవాళ్ళు తమ శ్రమల్లో దేవునికి మొరపెట్టినట్లుగా నేడు మనం కూడ మన యిక్కట్టుల్లో అతన్ని వేడుకోవాలి.

## 108. ఆపత్కాల ప్రార్థన

ఈ కీర్తనలో భక్తుడు మొదట దేవుణ్ణి స్తుతించాడు. ప్రభూ! వివిధ జాతుల నడుమ నేను నిన్ను స్తుతిస్తాను అని చెప్పుకొన్నాడు. ఆ పిమ్మట నీ భక్తులను రక్షించమని దేవునికి విన్నపం చేసాడు. ఏదో యుద్ధానికి ముందు చేసిన మనవి యిది. కీర్తనకారుడు కోరినట్లే ప్రభువు ప్రజలకు యుద్ధంలో సాయం చేసాడు. దేవుడు మన పక్షానవుంటే మనం జీవిత సమస్యలనే యుద్ధాల్లో శౌర్యంతో పోరాడవచ్చు, వాటినుండి బయటపడవచ్చు గూడ.

## 109. శత్రువులమీద ఫిర్యాదు

భక్తుడు తన శత్రువులమీద ఫిర్యాదుచేస్తూ దేవునికి చేసిన ప్రార్థన యిది. తనకు కీడు తలపెట్టిన ప్రధానశత్రువు సర్వనాశం కావాలని అతడు దేవునికి మొరపెట్టాడు. అతని మీద శాపాలు కురిపించాడు. తనకు సహాయం చేయమని దేవుణ్ణి వేడుకొన్నాడు. శత్రువుని ద్వేషించవద్దనే నూత్నవేద బోధకు వ్యతిరేకంగా పోతుంది కనుక ఈ కీర్తనను దైవార్చనలో చేర్చలేదు.

## 110. రాజూ యాజకుడూ ఐన మెస్సీయా

ఇది దావీదు వంశంలోని ఒకానొకరాజు పట్టాభిషేకానికి వ్రాసిన గీతం. కనుక రాజకీర్తన. మెస్సీయాకు గూడ వర్తించేది. ఈ గీతంలో కవి రాజుకి రాజు, యాజకుడు, న్యాయాధిపతి అనే మూడు బిరుదాలు వాడాడు. అతడు అభిషేకం పొందిన దినాన్నే యావే అతన్ని తన కుమారునిగా స్వీకరించాడు. దేవునికి యిస్రాయేలు రాజుకీ మధ్య తండ్రీ కొడుకుల సంబంధం వుండేది. అతడు రాజుగా యావే కుడిప్రక్కన ఆసీనుడయ్యాడు. ఆ రాజు లేవీ వంశక్రమంలో గాక మెల్కీసెడెకు క్రమంలో యాజకుడు. నూత్నవేద రచయితలు ఈ రాజకీర్తనను క్రీస్తుకి అన్వయించారు. క్రీస్తు ఉత్థానమై తండ్రి కుడిపార్శ్వాన ఆసీనుడైన రాజు. మెల్కీసెడెకు క్రమంలో యాజకుడు. లోకాంతంలో న్యాయాధిపతిగా విచ్చేసేవాడు. ఆ ప్రభువుకి మనం జోహారులర్పించాలి.

## 111. ప్రభువు కళ్యాణగుణాలు

ఈ కీర్తన ప్రభువు నెరవేర్చిన రక్షణ కార్యాలనూ అతని కళ్యాణగుణాలనూ కీర్తిస్తుంది. ప్రభువు తాను చేసిన నిబంధనకు కట్టుబడి వుండేవాడు. కనుక నమ్మదగినవాడు.

నమ్మదగినతనమే అతని ముఖ్యగుణం. ఇంకా, అతడు న్యాయబుద్ధి, దయ కలవాడు. రక్షణను దయచేసేవాడు. పరమపవిత్రుడు. అతని యెదుట మనం భయభక్తులతో మెలగాలి. దైవభీతికలవాడే వివేకి. ఈ గీతంలో కవి పేర్కొన్న దైవకార్యాలు, దైవగుణాలు మనం కూడ అనుభవానికి తెచ్చుకోవాలి.

## 112. సత్పురుషుని స్తవం

ఇది జ్ఞానకీర్తనం. కవి దీనిలో సత్పురుషుని స్తుతించాడు. దేవుని ఆజ్ఞలు పాటించి అతనిపట్ల భయభక్తులు చూపేవాడు సత్పురుషుడు. అతని బిడ్డలు వృద్ధిలోకి వస్తారు. అతనికి చీకటిలో గూడ వెలుగు ప్రకాశిస్తుంది. దేవుని ఆజ్ఞలు పాటించని దుష్టులు నాశమౌతారు. సజ్జనుడు మాత్రం వృద్ధిలోకి వస్తాడు. అతడు ఎల్లవేళల మనకు ఆదర్శంగా వుంటాడు.

## 113. మహోన్నతుడూ కరుణామయుడూ

ఇది స్తుతిగీతం. దేవుని గొప్పతనాన్ని జాలినీ వర్ణిస్తుంది. ప్రభువు మహోన్నత స్థానంలో వసించేవాడు. ఐనా క్రిందికి వంగి భూమిమీది దీనులను గూడ పరికిస్తాడు. వారిని పట్టించుకొంటాడు. అతడు యోబుని బూడిద ప్రోవుమీది నుండి పైకి లేపాడు. యోసేపుని ఈజిప్టులో మంత్రిని చేసాడు. గొడ్రాలైన అన్నాకు బిడ్డల నిచ్చాడు. కనుక అతడు దీనబాంధవుడు. ఈ కీర్తన వర్ణించినట్లే క్రీస్తు కూడ దీనులను ఆదరించాడు. అతడు దీనజనప్రియుడు. నేడు మనం కూడ దీనులను నెనరుతో చూడాలి. అసలు మనం దీనుల వర్గానికి చెందివుండాలి. దీనజన సంరక్షకుడైన ప్రభువుని నిరంతరం కొనియాడాలి.

## 114. పాస్క తిరునాళ్ళ పాట

ఈ కీర్తనం యిస్రాయేలీయులు రెల్లు సముద్రాన్నీ యోర్దాను నదినీ దాటడాన్ని వర్ణిస్తుంది. భీకరుడైన ప్రభువు తన ప్రజలను నడిపించుకొని వస్తూండగా రెల్లు సముద్రం భయపడి పారిపోయింది. ఆలాగే యోర్దాను నది కూడ పారిపోయింది. చుట్టుపట్ల వున్న కొండలు పొట్టేళ్ళవలె దూకుతూ పారిపోయాయి. ఇవి కవి వాడిన ఉత్ప్రేక్షలు. యిస్రాయేలీయులను నడిపించుకొని వచ్చిన ప్రభువు మహాశక్తిమంతుడు. అతడు ఎడారిలో కఠినశిల నుండి నీటిపాయలను పుట్టించాడు. యూదులు పాస్క తిరునాళ్ళలో ఈ పాటను పాడుకొనేవాళ్ళు. నూత్న వేదంలో క్రీస్తు మనలను పాపదాస్యంనుండి విడిపించేవాడు. అతని వుత్థానమే పాస్క. కనుక నేడు మనం క్రీస్తుని స్తుతిస్తూ ఈ గీతాన్ని జపించవచ్చు.

## 115. నిక్కమైన దేవుడు ఒక్కడే

ఈ కీర్తనను యూదులు ప్రాయశ్చిత్త దినాన పాడేవాళ్ళు. దేవుడు తమ పాపాలకు తమ్ము దండించాడనీ, ఆ దండనం ఉచితమైనదేననీ ఒప్పుకొని దేవుణ్ణి స్తుతించేవాళ్లు. నరులను రక్షించేది దేవుడొక్కడే. విగ్రహాలకు ఆ శక్తి లేదు. అవి వట్టి బొమ్మలు, నిర్జీవ ప్రతిమలు, శక్తిరహితాలు. నరమాత్రులకుగాని విగ్రహాలకుగాని మహిమ తగదు. సర్వశక్తిమంతుడైన ప్రభువు కొక్కడికి మహిమ తగుతుంది. అతడొక్కడే నిక్కమైన దేవుడు.

## 116. వందన సమర్పణం

దేవుడు భక్తుణ్ణి మరణాపాయం నుండి కాపాడాడు. భక్తుడు దేవళానికి వచ్చి ఆరాధన సమాజం ముందు ప్రభువుని స్తుతించాడు. ఆ స్తుతే ఈ కీర్తన. ప్రభువు జాలి కలవాడు. కనుక కీర్తనకారుని విన్నపాన్ని ఆలించాడు. అతన్ని మృత్యువునుండి కాపాడాడు. కనుక భక్తుడు అతన్ని మనసార స్తుతించి కీర్తించాడు. ఇది హాలెల్ కీర్తనల వర్గానికి చెందింది. ఈ పాటలు ప్రధానంగా దేవుణ్ణి స్తుతించేవి. కీర్తనకారుడు పీఠం ముందు ద్రాక్షసారాయాన్ని ధారగాపోసి దేవుణ్ణి మరీ స్తుతించాడు. భక్తిమంతుల మరణాన్ని ప్రభువు అంగీకరించడని నమ్మకంతో చెప్పుకొన్నాడు. భక్త్యావేశంతో అయ్యా! నీవు నన్ను చావునుండికాపాడావు. నేను నీ దాసుణ్ణి, నీ దాసురాలి కుమారుణ్ణి. నీకు వందనాలు - అని యెలుగెత్తి అరచాడు. ఇది భక్తిగల కీర్తన. దేవుడు మనకు చేసిన ఉపకారాలకు అతన్ని స్తుతించాలి. భక్త సమాజంలో ఆ వుపకారాలను వివరించి చెప్పడం గూడ మంచిది.

## 117. ప్రభువుకి స్తుతి

ఇది స్తుతిగీతం. 150 కీర్తనల్లోను చిన్నది. దీనిలో భక్తుడు అన్యజాతి ప్రజలను ప్రభుని స్తుతించడానికి రమ్మని ఆహ్వానిస్తున్నాడు. ఈ స్తుతికి కారణాలు రెండు. మొదటిది, దేవునికి నరులపట్ల వుండే ప్రేమ మిక్కుటమైంది. రెండవది, దేవుడు తాను చేసిన నిబంధన ప్రమాణాలకు కట్టువడివుండేవాడు. అనగా నమ్మదగినవాడు. ఈలాంటి దేవుణ్ణి స్తుతించి కీర్తించడం నరుల బాధ్యత. నూత్నవేదంలో క్రీస్తుని పంపడం ద్వారా దేవుడు తన ప్రేమనూ నమ్మదగినతనాన్నీ రుజువుచేసికొన్నాడు.

## 118. రక్షణానికి వందనగీతం

ఇది కృతజ్ఞతాస్తుతి. దేవుడు భక్తుణ్ణి ఘోరాపద నుండి తప్పించాడు. కనుక అతడు కృతజ్ఞతా భావంతో దేవళానికి వచ్చాడు. దేవాలయ ద్వారం వద్ద ప్రభుని స్తుతించి కీర్తించాడు. ద్వారపాలకుడు అతనికి తలుపు తెరచాడు. భక్తుడు అతని మిత్రులు దేవళంలోకి ప్రవేశించారు. పాటలు పాడుకొంటూ ప్రదక్షిణ చేస్తూ పోయి బలులర్పించే పీఠాన్ని చేరారు. ఇది యీ పాటలోని ఇతివృత్తం. కీర్తనకారుడు ఉత్సాహంతో నేను చనిపోను, బ్రతికివుండి

ప్రభుని స్తుతిస్తాను అన్నాడు. నరమాత్రులను నమ్మడం కంటే దేవుణ్ణి నమ్మడం మేలు అన్నాడు. దేవుడు మనకు దయచేసిన భాగ్యాలకు అతనికి వందనాలు చెప్పుకొందాం.

## 119. ధర్మశాస్త్ర స్తవం

ఇది కీర్తనలన్నిటిలోను పెద్దది. దీనిలోని అంశం ధర్మశాస్త్ర స్తుతి. ధర్మశాస్త్ర మంటే ప్రభువు ఆజ్ఞలు, అతని వాక్కు. ఆ వాక్కును పాటించేవాళ్ళు నిజమైన భక్తులు దేవునిపట్ల మనకుండే ప్రేమను అతని ఆజ్ఞలను పాటించడం ద్వారా రుజువుచేసికోవాలి. దేవుని ఆజ్ఞలను మీరడమే పాపం. మనం ఈ పాపానికి దూరంగా వుండాలి. ఈ కవి చెప్పినట్లు ప్రభువు వాక్యం వెండి బంగారాలు, నిధి, తేనె, దీపం. మన వాక్యభక్తి ఏపాటిది? మనం పవిత్ర గ్రంథాన్ని ఎంత ప్రీతితో చదువుతాం? ఈ కీర్తన చెప్పినట్లుగా "ప్రభూ! నీవు నా కన్నులు తెరువు, నేను నీ ధర్మశాస్త్రంలోని అద్భుత విషయాలను గ్రహిస్తాను" అని ప్రార్థిద్దాం.

## 120. శాంతికి శత్రువులు

ఈ కీర్తనను చెప్పిన భక్తుడు ఏదో సందర్భంలో అన్యజాతి ప్రజల నడుమ వసించాడు. వాళ్ళు దుష్టులు, కలహప్రియులు. కనుక అతనికి ఆ ప్రవాస జీవితం భారమనిపించింది. అతడు నేను ఎప్పుడెప్పుడు యెరుషలేము చేరి ప్రభుని దర్శించి శాంతిని పొందుతానా అని ఉవ్విళ్లూరి పోయాడు. మనం ఈ లోకమనే ప్రవాసంలో వున్నాం. శాంతి నిలయమైన మోక్షాన్ని చేరుకొనేదాకా మనకు విశ్రాంతిలేదు.

## 121. యిస్రాయేలుని కాపాడేవాడు

120-134 వరకు వచ్చేవి యాత్రిక కీర్తనలు. యూదులు యెరూషలేముకి యాత్ర చేసేపుడు పాడేవి. ఈ గీతం కూడ భక్తుడు పవిత్ర నగరానికి యాత్ర చేస్తూ పాడిందే. త్రోవలో ప్రభువే అతన్ని కాచి కాపాడతాడు. ఆ ప్రభువు భక్తులకు కాపలా కాసేవాడు, గొర్రెల కాపరిలాంటివాడూను. అతడు ఏనాడు కునికిపాట్లు పడడు, ఏనాడు నిద్రపోడు. అతడు కీర్తనకారుణ్ణి సురక్షితంగా యెరుషలేముకి తీసికొనిపోతాడు. మళ్ళా భద్రంగా యింటికి తీసికొనివస్తాడు. మన తరపున మనం ఈ లోకం నుండి పరలోకానికి యాత్ర చేస్తుంటాం. మన రాకపోక లన్నిటిలోను ప్రభువు మనలను కాపాడాలని అడుగుకొందాం.

## 122. యెరుషలేముకి శుభం

ఈ యాత్రిక కీర్తనలో భక్తుడు యెరుషలేములో వున్నాడు. అక్కడి నుండి మళ్ళీ ఇంటికి తిరిగిరాబోతున్నాడు. తాను యెరుషలేముకి రాకముందు తన గ్రామంలోని జనం "మనం ప్రభుమందిరానికి యాత్ర వెళ్గాం" అని పల్కారు. ఆ పలుకులు జ్ఞప్తికి రాగానే

అతనికి ఎంతో ఆనందం కలిగింది. అతడు నగరాన్ని వీడి ఇంటికి వెళ్ళకముందు దానికి శాంతీ శుభమూ కలగాలని ప్రార్థించాడు. అతని బంధుమిత్రులు ఆ పట్టణంలో వసిస్తున్నారు. వారిని మనసులో పెట్టుకొని గూడ ఆ నగరానికి మేలు కలగాలని కోరాడు. అన్నిటికంటే ముఖ్యంగా దేవళాన్ని స్మరించుకొని యెరుషలేముకి శుభం కలగాలని జపించాడు. కీర్తనకారునికి పవిత్ర నగరమూ దేవాలయమూ అంటే యెంత భక్తో ఈ కీర్తన తెలియజేస్తుంది. మన దేవాలయం పట్ల మనకున్న భక్తి ఏపాటిది? మనం ఎంత కోరికతో గుడికి వెళ్తుంటాం?

## 123. పీడితుల ప్రార్థనం

ఇది బృంద విలాపం. యూదులు పీడకుల బాధకు గురైనపుడు చెప్పిన గీతం. సేవకులు సేవికలు తమ యజమానుని కరుణకొరకు కాచుకొని వుంటారు. అలాగే భక్తులు కూడ దేవుని దయకొరకు కాచుకొని వుంటారు. విడుదల ప్రభువునుండి మాత్రమే లభిస్తుంది. ఆ ప్రభువు దీనులను ఆదుకొనితీరతాడు. మనం కూడ ఈలాంటి నమ్మకంతోనే ఆపదల్లో దేవునికి మొరపెట్టాలి.

## 124. యిస్రాయేలు రక్షకుడు

యిస్రాయేలు చిన్న రాజ్యం. ఈజిప్టు, బాబిలోనియా, పర్షియా, గ్రీసు, రోము లాంటి పెద్దరాజ్యాలు శతాబ్దాల పొడుగునా దాన్ని ఏలాయి. దేవుడు కాపాడబట్టి యూదులు నిల్చారు కాని లేకపోతే ఏనాడో అణగారిపోయేవాళ్ళే. అంతమంది పీడకులకు చిక్కినా యూదులు నాశమైపోకుండడం చరిత్రకారులకే ఆశ్చర్యం కలిగించింది. ఈ కీర్తనలో "దేవుడు మనపక్షాన వుండకపోతే శత్రువులు మనలను మింగివేసేవాళ్ళే" అని భక్తుడు కృతజ్ఞతా భావంతో విన్నవించుకొన్నాడు. యిస్రాయేలు జనం పక్షుల్లాగ శత్రువులు పన్నిన ఉచ్చులో చిక్కుకొన్నారు. కాని దేవుడు ఆ వుచ్చును త్రెంచి వాళ్ళు తప్పించుకొని పోయేలా చేసాడు. ఆపదలు ప్రమాదాలు గొడవలు మొదలైన వాటినుండి బయటపడినప్పుడు మనం కూడ దేవుడే సహాయం చేసాడని నమ్మి కృతజ్ఞతాభావంతో ఈ గీతాన్ని జపించవచ్చు.

## 125. భక్తులను కాచే ప్రభువు

సియోను అంటే యెరూషలేము. సియోను కొండమీదనే యెరూషలేము పట్టణాన్నీ దేవాలయాన్నీ కట్టారు. యెరూషలేము చుట్టూ చిన్న కొండలు వ్యాపించి వున్నాయి. అవి ఆ నగరానికి రక్షగా వుంటాయి. కొండలు యెరూషలేముని కాపాడినట్లే దేవుడు యిస్రాయేలుని కాపాడతాడు. కనుక వాళ్ళకు ముప్పులేదు. మన జీవితంలో గూడ దేవుడు కొండంత అండగా వుంటాడు. కనుక అతనికి వందనాలు అర్పిద్దాం.

## 126. ప్రవాస విముక్తుల పాట

ప్రవాసం నుండి తిరిగివచ్చాక క్రీ.పూ. 520 ప్రాంతంలో యూదులు తమ దేవాలయాన్నీ నగరాన్నీ పునర్నిర్మించుకోవడం ప్రారంభించారు. వాళ్ళకు ప్రవాసకాలం బాధనీ ఈ విడుదల కాలం సంతోషాన్నీ కలిగించాయి. ప్రవాసం ముగిసాక విడుదల కాలంలో చెప్పిన గీతం ఇది. కీర్తనకారుడు పూర్వబాధనూ ప్రస్తుత సంతోషాన్నీ తలంచుకొంటున్నాడు. అతడు ఎండిపోయిన యేరు వాననీటితో నిండినట్లుగా మమ్ము మళ్ళా సంతోషచిత్తులను చేయమని దేవుణ్ణి అడిగాడు. దుఃఖంతో వెదవెట్టిన వాళ్ళు సంతోషంతో పంట కోసికొంటారని చెప్పాడు. కష్టాలు తొలగి సుఖాలు ప్రాప్తించినపుడు చెప్పుకోదగిన ప్రార్థన యిది.

## 127. దేవునిపై నమ్మకం

ఇది జ్ఞాన కీర్తనం. దీనిలో రెండంశాలున్నాయి. మొదటిది, ప్రభువు ఇల్లు కట్టకపోతే ఇల్లు లేవదు. అతడు పట్టణాన్ని కాపాడకపోతే పట్టణం నిలువదు. మన ఆందోళనం వల్ల మనమేమీ సాధించలేం. ప్రభువు తోడ్పాటువల్ల సాధిస్తాం. కనుక ప్రభువు సాయం అవసరం. రెండవది, బిడ్డలను దయచేసేవాడు ప్రభువే. అతడు ప్రసాదించిన బిడ్డలు ఎదిగివచ్చి తల్లిదండ్రులను ఆదుకొంటారు. మనం దేవుని తోడ్పాటు కొరకు వేడుకోవాలి. దేవుడిచ్చిన బిడ్డలను చూచి సంతోషించాలి. ఈ రెండు భాగ్యాల కొరకు ప్రార్థిద్దాం.

## 128. భక్తిమంతుల కుటుంబాలకు దీవెనలు

ఇది కుటుంబ జీవితాన్ని ప్రశంసించే కీర్తన. ప్రభువు ఆజ్ఞల ప్రకారం జీవించే భక్తిమంతుడు పెద్ద కుటుంబంతో అలరారుతాడు. అతని యింటిలో భార్య బిడ్డలను చంకకెత్తుకొని పండ్లగుత్తులు కాసిన ద్రాక్షతీగలా వుంటుంది. అతని బిడ్డలు భోజనం బల్లచుట్టు తిరుగుతూ ఓలివుచెట్టు పిలకల్లా వొప్పుతారు. అతడు మూడు తరాలవరకు తన బిడ్డలను చూస్తాడు. యెరూషలేము జనసంఖ్య పెరగడం కూడ గమనిస్తాడు. ప్రాచీనకాలపు జనులందరూ సంతానాన్ని జనసంఖ్యనీ దేవుని దీవెనగా భావించారు. గృహాలను సందర్శించి కుటుంబాలను దీవించేపుడు ఈ కీర్తనను జపించడం మంచిది.

## 129. శత్రుపరాజయం కొరకు ప్రార్థనం

శత్రుపీడనం నుండి యిస్రాయేలును కాపాడమని ఈ కీర్తనంలో కవి దేవునికి మనవి చేసాడు. విరోధులు యూదులను బాధించారు. వారి వీపుని పొలాన్నిలాగదున్నారు. ఐనా వాళ్ళను ఓడించలేకపోయారు. ప్రభువే విరోధుల బారినుండి వారిని కాపాడాడు. నేడు సమాజంలో

ఎంతోమంది పరపీడనకు గురౌతున్నారు. ఈ పేదసాదలనూ దీనులనూ రక్షించడానికి ప్రభువు మనలను వినియోగించుకొంటాడు. మనద్వార పేదలకు విమోచనం కలిగిస్తాడు. మన తరపున మనం సమాజంలోని అన్యాయాలను ఎదిరించడానికి సిద్ధంగా వుండాలి.

## 130. హృదయాంతరాళం నుండి

ఇది పశ్చాత్తాపాన్ని తెలియజేసే విలాపగీతం. ఈ కీర్తనలో భక్తుడు తన పాపాలను మన్నించమని దేవునికి మొరపెడుతున్నాడు. రాత్రివేళ మేల్కొని వున్న కావలివాళ్ళు వేకువజాము కొరకు కనిపెట్టుకొని వుంటారు. అలాగే కీర్తనకారుడు దేవుని రక్షణం కొరకు కనిపెట్టుకొని వున్నాడు. ప్రభువు తన్ను మాత్రమేగాక యిస్రాయేలీయులందరినీ పాపం నుండి రక్షించాలని ఈ పుణ్యాత్ముని కోరిక. నేడు ఈ కీర్తనను మృతుల పూజలో జపిస్తాం. ప్రభువు చనిపోయినవారి పాపాలను పరిహరించాలని వేడుకొంటాం. నూత్న వేదంలో మన పాపాలకు పరిహారం చేసి మనకు రక్షణాన్ని ప్రసాదించేవాడు క్రీస్తు. ఆ ప్రభువు నుండి మనం నిరంతరం రక్షణాన్ని అడుగుకోవాలి.

## 131. పసిబిడ్డ వాలకం

ఈ కవి నేను గొప్పవాణ్ణి కావాలి అనుకొన్నాడు. గొప్ప కోరికలు పెట్టుకొన్నాడు. గొప్ప ప్రయత్నాలు కూడ చేసాడు. కాని విఫలుడయ్యాడు. అప్పుడు వినయాన్ని అలవర్చుకొన్నాడు. దేవునిమీద ఆధారపడి జీవించడం మొదలుపెట్టాడు. దేవునిపట్ల పసిబిడ్డలా మెలగడం నేర్చుకొన్నాడు. దీనితో అతని హృదయం కోరికలన్నీతీరి శాంతిని పొందింది. అతడు పాలు మాన్పించిన శిశువు తల్లిరొమ్ముమీద ప్రశాంతంగా పండుకొని వున్నట్లే నేనూ దేవుణ్ణి నమ్మాను అని చెప్పుకొన్నాడు. ఇతడు "హనవిం" అనబడే దీనుల వర్గానికి చెందినవాడు. ఇతన్ని చూచి మనం కూడ అహంకారాన్ని విడనాడాలి. దేవునిపట్ల చిన్న బిడ్డలంగా దీనులంగా మెలగడం నేర్చుకోవాలి. చిన్న తెరేసమ్మ చిన్నమార్గం ఇదే.

## 132. మందసాన్ని సియోనుకి కొనిరావడం

దావీదు యెరూషలేములో ప్రభువుకి దేవాలయం కట్టించాలనుకొన్నాడు. మందసాన్ని వైభవంగా నగరానికి కొనివచ్చాడు. కాని ప్రభువు అతనితో నీవు కాదు నీ కుమారుడు దేవాలయాన్ని కడతాడని చెప్పాడు. అతడు సియోనుని తన నివాసంగా ఎన్నుకొన్నాడు. ఇక్కడే తర్వాత సొలోమోను దేవళం కట్టాడు. ఇక్కడే దావీదు రాజవంశజులు పరిపాలనం చేసారు. తర్వాత మెస్సీయా దావీదు కుటుంబం నుండే వచ్చి ఈ పట్టణంలోనే ఆత్మార్పణం చేసికొన్నాడు. ఈ విధంగా యెరూషలేము రక్షణ కేంద్రమైంది. నేడు ప్రభువు తిరుసభలో వసిస్తుంటాడు. మనందరి హృదయాల్లోను నెలకొని వుంటాడు. మన హృదయమందిరంలో వసించే ఆ దివ్యమూర్తిని వందిద్దాం.

## 133. సోదర ప్రేమ

ఇది ఐకమత్యాన్ని కొనియాడే కీర్తన. పాస్క పండుగను జరుపుకోవడానికి యూదులు పలుదేశాల నుండి యెరూషలేముకి వచ్చేవాళ్ళు. ఆ తిరునాళ్ళలో పట్టణంజనంతో క్రిక్కిరిసి వుండేది. నగరంలో ప్రోగయిన జనాన్ని చూస్తే, ప్రధాన యాజకుని అభ్యంగన సమయంలో పరిమళతైలం సువాసనలు ఒలికినట్లుగా ఆనందకరంగా వుండేది. సియోనున మంచు కురిసి వేడిమిని తగ్గించినట్లుగా ఆహ్లాదంగా వుండేది. చాలమంది కలసిమెలసి జీవించడం కష్టం.ఐనా బృందజీవితం ఆనందకరమైంది. క్రీస్తు మనం కలసివుండాలనే కోరుకొన్నాడు. ఎప్పుడు కూడ ఐక్యం భగవంతుని నుండి, విభజనం పిశాచం నుండీ వస్తాయి.

## 134. రాత్రికాల గీతం

యెరూషలేముకి యాత్ర వచ్చిన భక్తులు రేయి దేవళంలో సేవలు చేసే యాజకులనూ లేవీయులనూ దీవించారు. ఆ యాజకులు సృష్టికర్తయైన దేవుడు మిమ్ము దీవించునుగాక అని యాత్రికులను ఆశీర్వదించారు. ఈ గీతం రాత్రి పండుకోవడానికి ముందు జపించడానికి అనువైంది.

## 135. స్తుతిగీతం

ఇది ప్రభుని కీర్తించమని చెప్పే స్తుతిగీతం. అతడు సృష్టి చేసినవాడు. చారిత్రకంగా యిస్రాయేలును రక్షించిన వాడు. విగ్రహాలతో పోలిస్తే అతడు మహా శక్తిమంతుడు. అవి శక్తి చాలనివి. అలాంటి దేవుణ్ణి కొనియాడవద్దా? ఆతడు నేడు మనలను కూడ సృష్టించాడు. రక్షించాడు. అలాంటి మహా ప్రభువుని మనం కూడ వినుతిద్దాం.

## 136. వందన గీతం

ఇది బృందగీతం. దేవాలయంలో లేవీయులు చరణాలు పాడగా భక్తసమాజం "అతని ప్రేమ కలకాలం వుంటుంది" అని పల్లవి పాడేవాళ్ళు. ఇది హాలెల్ గీతం. ఈ గీతాలు ప్రభుని స్తుతిస్తాయి. కీర్తనకారుడు దేవుడు సృష్టి చేసినందుకూ యిస్రాయేలుని రక్షించినందుకూ అతన్ని కీర్తించాడు. నేడు మన జీవితానికి గూడ ఈ రెండంశాలు వర్తిస్తాయి. మనపట్ల గూడ అతని ప్రేమ కలకాలం వుంటుంది. మనం కూడ అతన్ని భక్తితో స్తుతించాలి.

## 137. ప్రవాస గీతం

ఇది విలాపగీతం. 587లో యిస్రాయేలీయులు బాబిలోనియాకు ప్రవాసులుగా వెళ్ళారు. అక్కడ ఆ దేశీయులు యూదులను మీ సియోను గీతం ఒకటి పాడి విన్పించండని అడిగారు. కాని వాళ్ళు పాడలేదు. ఈ కీర్తన కట్టిన భక్తుడు పరాయి గడ్డమీద ప్రభుగీతం

పొడ్డం మహా ద్రోహంగా యెంచాడు. అట్లని యూదులు యెరూషలేముని మర్చిపోలేదు. ఆ పుణ్య నగరాన్ని విస్మరిస్తే తన చేయి చచ్చుపడాలనీ, తన నాలుక అంగిటికి అతుక్కొని పోవాలనీ ఈ భక్తుడు శాపనార్థాలు పల్కాడు. తమ శత్రువులైన బాబిలోనీయులు నాశమైపోవాలని కోరుకొన్నాడు. మనం కూడ రక్షణదాతయైన ప్రభువుని ఏనాడు విస్మరించకూడదు.

## 138. స్తుతి గీతం

ఈ పాట కట్టిన భక్తుణ్ణి ప్రభువు ఏదో ఆపదనుండి కాపాడాడు. కనుక అతడు దేవళానికి వచ్చి ప్రభువుకి కృతజ్ఞతాస్తుతి అర్పించాడు. నేను కష్టకాలంలో వున్నపుడు నీవు నన్ను కాచి కాపాడావు అని చెప్పుకొన్నాడు. ప్రభువు దయ ఎంత గొప్పది అనగా అతడు మహోన్నత స్థానంలో వుండి కూడ నేలమీది దీనులను గమనిస్తూంటాడు. అలాంటి ప్రభువుని మనం కూడ కొనియాడదాం.

## 139. సర్వజ్ఞుడైన ప్రభువు

ఇది నీతిబోధకమైన కీర్తన. బైబుల్లోని గొప్ప కీర్తనల్లో వొకటి. దేవునికి అన్నీ తెలుసు. అతడు మన హృదయంలోని ఆలోచనలు కూడ గమనిస్తూంటాడు. ఆ ప్రభువు అంతటా వుంటాడు. తూర్పు పడమరలందూ, పైన క్రిందా, చీకటిలో గూడ వుంటాడు. అతడు సర్వశక్తిమంతుడు. మనం మాతృగర్భంలో పిండంగా ఏర్పడినపుడే మనలను గమనించేవాడు. మొదటి నుండి మన స్వభావం బాగా తెలిసినవాడు. మన భవిష్యత్తు మనకు తెలియకపోయినా అతని బాగా తెలుస్తుంది. మనం నరులను మోసగించవచ్చుగాని దేవుణ్ణి మోసగించలేం. మనలను గూర్చి మనకు తెలిసినదానికంటే అతనికి అధికంగా తెలుసు. కనుక మనలను మనం నమ్మకంతో అతని చేతుల్లోకి అర్పించుకొందాం.

## 140. దుష్టుల నుండి రక్షణం

ఈ పాట కట్టిన భక్తుణ్ణి దుష్టులు బాధించి బెదిరించారు. కనుక అతడు ప్రభువు మరుగుజొచ్చి నన్ను కాపాడమని మనవిజేసికొన్నాడు. దేవుడు పేదలకోపు తీసికొనేవాడనీ, దీనులకు న్యాయం చేకూర్చి పెట్టేవాడనీ అతడు పూర్ణంగా నమ్మాడు. కనుకనే ప్రభుని శరణువేడాడు. ప్రభువు రోజూ దేశంలో పేదలకు జరిగే అన్యాయాలను చక్కదిద్దాలని వేడుకొందాం.

## 141. ప్రలోభం నుండి తప్పుకోవడం

ఈ పాట చెప్పిన భక్తుడు పేదవాడు. అతడు బలవంతులూ ధనవంతులూ ఐన దుష్టులతో కలసిపోయి వారి దుష్కార్యాల్లో పాల్గొనే ప్రమాదం ఏర్పడింది. ఈ ప్రలోభం నుండి తన్ను కాపాడమని ప్రభువుని వేడుకొన్నాడు. దుర్మార్గుల మన్నన తనకు అక్కరలేదన్నాడు. దుష్టులు తన కొరకు పెట్టిన బోనునుండి తన్ను కాపాడమన్నాడు. తన ప్రార్థన దేవాలయంలో వేసే సాంబ్రాణి పొగలాగ, సాయంకాలం దేవాలయంలో అర్పించే

బలిలాగా దేవునికి ప్రీతిపాత్రం కావాలని కోరుకొన్నాడు. ఇవన్నీ పవిత్రమైన భావాలు. ఈ సజ్జనుని భక్తీ, నిజాయితీ మనకు కూడ అలవడాలని వేడుకొందాం.

## 142. ఆపదనుండి తప్పుకోవడానికి ప్రార్థన.

ఇది విలాప కీర్తన. భక్తుని శత్రువులు బాధించారు. అతన్ని పట్టుకోవడానికి బోను పెట్టారు. ఇరుగుపొరుగు వాళ్ళల్లో అతన్ని కాపాడేవాడు ఎవడూ లేడు. కనుక అతడు ప్రభుని శరణు వేడాడు. ఈ నేలమీద నీవు తప్పితే నన్నాదుకొనేవాడు ఎవడూ లేడని వచించాడు. నీవు నన్ను కాపాడు, నీ భక్త సమాజం ముందు నేను నీ వుపకారాలను చాటి చెప్తానని పల్కాడు. మనం కూడ ఆపదల్లో నమ్మకంతో ప్రభుని ఆశ్రయించాలి.

## 143. దైవసహాయం కొరకు ప్రార్థన

ఇది ఆపదలో చిక్కిన భక్తుని విలాపగీతం. శత్రువు అతన్ని పీడించడం మొదలెట్టాడు. అతడు మిగుల క్రుంగిపోయాడు. తన వేదనలో పూర్వం ప్రభువు తనకు చేసిన ఉపకారాలను జ్ఞప్తికి తెచ్చుకొని అతనిపట్ల నమ్మకం పెంచుకొన్నాడు. ఎండిన నేల వాన చినుకులకులాగ తానూ ప్రభు దర్శనం కొరకు దప్పిక గొన్నాడు. అతని సహాయాన్ని కోరుకొన్నాడు. తాను నడవవలసిన త్రోవను చూపించమని వేడుకొన్నాడు. దేవుని ఆత్మ తన్ను తిన్నని మార్గంలో నడిపించాలని మనవిచేసికొన్నాడు. మన కష్టాల్లో మనం కూడ ఇదే రీతిగా ప్రభువుకి ప్రార్థన చేసికోవాలి.

## 144. విజయ గీతం

ఈ కీర్తన చెప్పిన రాజు మొదట ప్రభువు తనకు యుద్ధంలో విజయం దయచేసినందుకు అతనికి వందనాలు చెప్పాడు. దేవుడు తనకు ఆశ్రయస్థానం, దుర్గం, డాలు అని వాకొన్నాడు. తర్వాత నరుని, అల్పత్వాన్ని వర్ణించాడు. సకలాపదల్లోను దేవుడు తన్ను కాపాడాలని కోరుకొన్నాడు. కడన తనకూ తన ప్రజలకూ సిరిసంపదలూ శుభాలూ కలగాలని వేడుకొన్నాడు. యువతీయువకులు బలంగా ఎదగాలి. పొలాల్లో పంటలు బాగా పండాలి. పశుగణం విస్తరిల్లాలి. ఇవి అతని కోర్కెలు. మనకు కూడ ప్రభువు దీవెనలు లభించాలని వేడుకొందాం.

## 145. రాజైన ప్రభువుకి స్తుతిగీతం

ఈ కీర్తన దేవుణ్ణి రాజుగా ఎంచుతుంది. అతడు చేసిన అద్భుత కార్యాలనూ సృష్టినీ వర్ణిస్తుంది. అతని ప్రాణిపోషణా చాతుర్యాన్ని కొనియాడుతుంది. అతని మంచితనాన్ని స్తుతిస్తుంది. ప్రభువు అద్భుత కార్యాలు అందరు కొనియాడతారు. అతని రాజ్యం శాశ్వతంగా నిలుస్తుంది. అతడు పడిపోయినవారిని లేవనెత్తే దయామయుడు. అమ్మా నాన్నలాగ ప్రాణికోటికి తిండిపెట్టి వాటి ఆకలి తీర్చేవాడు. తనకు మొరపెట్టేవారికి చేరువలోనే వుండి వారి అక్కరల తీర్చేవాడు. ఈలాంటి దయామయుడైన ప్రభువుని మనం కూడ స్తుతించాలి.

## 146. సహాయుడైన దేవునికి స్తుతి

ఇది స్తుతిగీతం. కీర్తనకారుడు నరమాత్రులను నమ్మవద్దనీ వారిమీద ఆధారపడవద్దనీ హెచ్చరించాడు. అల్పాయుష్కుడైన నరుడు మనకేమి సాయం చేస్తాడు? మనం సృష్టికర్తా సర్వశక్తిమంతుడు ఐన దేవుని మీద ఆధారపడాలి. ప్రభువు దయగలవాడు. ఆకలిగొన్నవారికి అన్నం పెట్టేవాడు. క్రుంగిపోయినవారిని లేవనెత్తేవాడు. పరదేసులు వితంతువులు అనాథశిశువులు మొదలైన బలహీన వర్గాలను ఆదరించేవాడు. అలాంటి ప్రభువుని మనం కూడ స్తుతించాలి, శరణువేడాలి.

## 147. మహోన్నతుడైన ప్రభువు

ఇది స్తుతిగీతం. దేవుడు మంచివాడు. బాబిలోనియాకు ప్రవాసులుగా వెళ్ళిన యిస్రాయేలు ప్రజలను మళ్ళా స్వీయదేశానికి తీసికొనివచ్చాడు. వారి గాయాలకు కట్టుగట్టి వారి బాధలు తొలగించాడు. ప్రభువు ప్రాణిపోషకుడు. సకాలంలో వానలు కురిపించి పంటలు పండించి ప్రాణులను కాపాడేవాడు. కావుకావుమని అరచే కాకిపిల్లలకు తిండిపెట్టేవాడు. మన బలాన్నీ గొప్పతనాన్నీ అతడు మెచ్చుకోడు. ఆజ్ఞలు పాటిస్తూ తనపట్ల భయభక్తులు చూపేవారంటే అతనికి ఇష్టం. అతడు యిస్రాయేలుకు ఆజ్ఞలు ప్రసాదించాడు. అతని కట్టడల ప్రకారం జీవించే భాగ్యాన్ని అడుగుకొందాం.

## 148. విశ్వం దేవుని స్తుతించాలి

ఈ కీర్తనలో భక్తుడు విశ్వాన్నంతటినీ దేవుణ్ణి స్తుతించడానికి ఆహ్వానిస్తున్నాడు. అతడు మొదట దేవదూతలను స్తుతికి ఆహ్వానించాడు. తర్వాత సూర్యచంద్రులు ఆకాశం ప్రకృతివస్తువులు నదులు మొదలైన వాటిని దైవస్తుతికి ఆహ్వానించాడు. ఈ కీర్తనలోని ప్రధానాంశం దైవస్తుతి. భూమ్యాకాశాలు నరులు దేవుణ్ణి స్తుతించడానికే వున్నాయి. స్తుతి ప్రార్థన, ఆరాధన కూడ. మన జీవితమంతా ఎడతెగని దైవస్తుతి కావాలి.

## 149. విజయగీతం

ఈ కీర్తనలో భక్తుడు, ప్రభువు యిస్రాయేలును రక్షించినందుకు అతన్ని స్తుతించమని చెప్పాడు. ప్రభువు దీనులైన యిస్రాయేలును ఈజిప్టు బానిసం నుండి కాపాడాడు. ఆలాంటి దేవుణ్ణి ఎల్లరూ కొనియాడాలి.

## 150. అంత్యస్తుతి

ఈ కీర్తనలో భక్తుడు నరులెల్ల దేవుణ్ణి స్తుతించాలని చెప్తున్నాడు. విశేషంగా భక్తులు దేవాలయారాధనలో అతన్ని స్తుతించాలి. సంగీత వాద్యాలతో, పవిత్ర నాట్యంతో అతన్ని వందించాలి. భగవంతుడు ఎల్లరి స్తుతికీ పాత్రుడు. అతన్ని కొనియాడ్డమే మన ప్రధానధ్యేయం.

***



**ఫాదర్ పూదోట జోజయ్య, S.J.** గారు, పూదోట మరయ్య, చిన్నమ్మ దంపతులకు 1931వ సం|| ఫిబ్రవరి 15న, గుంటూరు జిల్లాలోని కనపర్రు గ్రామంలో జన్మించారు. ఈయన ప్రాథమిక విద్యను కనపర్రులో, ఉన్నతవిద్యను ఫిరంగిపురంలో అభ్యసించారు. మద్రాసు లొయోలాలో కళాశాల విద్యను పూర్తిచేసి, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో **M.A.** (సాహిత్యం) లో పట్టా పుచ్చుకున్నారు.

1955లో తమిళనాడులోని దిండిగల్ నందు యేసుసభలో చేరిన జోజయ్యగారు, అటుపిమ్మట కొడైకెనాల్‌లో తత్వశాస్త్రాన్ని, కర్సియాంగ్‌లో వేదాంతశాస్త్రాన్ని నిశిత పరిశీలనా దృష్టితో క్షుణ్ణంగా అధ్యయనం గావించారు. 1965, మార్చి 27న బిషప్ ముమ్మడి ఇగ్నేష్యస్ గారి చేతుల మీదుగా ఫిరంగిపురంలో గురుపట్టం పొందారు.

రోమునగరంలోని బిబ్లికల్ ఇన్‌స్టిట్యూట్‌లో బైబులు విద్యనభ్యసించిన జోజయ్యగారు ఆ తర్వాత తనదైన విశిష్టశైలిలో బైబులు సాహిత్యానికి ఎనలేని సేవ చేసారు. లొయోలా కళాశాలలో 2 సంవత్సరములు ఉపన్యాసకునిగా విద్యార్థులకు చక్కని శిక్షణను అందించారు. పుస్తకరచన, బైబులుబోధ, విద్యార్థులకు నాయకత్వ శిక్షణ వీరి ముఖ్య కార్యక్రమాలు.

**సాహిత్యరంగంలో వీరు నిర్వహించిన కొన్ని బృహత్తర కార్యక్రమాల వివరాలు :**

1. అనువాదకునిగా : అకుంఠిత దీక్షతో 17 సం||లు అవిరళకృషిసల్పి క్యాథలిక్ బైబులులోని పూర్వవేదాన్ని జనరంజకంగా తెలుగులోనికి అనువదించారు.
2. ఆధ్యాత్మికవేత్తగా : ఆధ్యాత్మిక చింతనకు పెద్దపీట వేస్తూ ఆయన నడిపే బైబులు భాష్యం పత్రిక, బైబులు గ్రంథమాల ఆయన ఆధ్యాత్మికరంగంలో నిత్యకృషీవలుడని చెప్పకనే చెబుతాయి.
3. విద్యార్థి బాంధవునిగా : విద్యార్థిలోకాన్ని ఉత్తేజపరచడానికి, వారిలో నవచైతన్యం నింపడానికి ఆయన నడిపే చైతన్యవాణి పత్రిక, విద్యార్థిహిత గ్రంథమాల, విద్యార్థిలోకానికే నిర్దేశకాలు.
4. వక్తగా : ఆంధ్రరాష్ట్రమంతటా తిరిగి విద్యార్థులకు, ఉపాధ్యాయులకు, ఉపదేశకులకు సామాన్యప్రజానీకానికి వందలకొలది సదస్సులు నిర్వహించి, వారిలో నవ్యోత్సాహాలను నింపారు.